శ్రీః

ఓన్నమశ్శివాయ

# చిద్గగనచన్ద్రికా

మహాకవి కాళిదాస విరచితా

(ప్రథమ ద్వితీయ విమర్శౌ)

విశ్వలహరీ వ్యాఖ్యా

(ఆంధ్ర ప్రతిపదార్థ–తాత్పర్య–విశేషములు)

దోర్బల విశ్వనాథశర్మా




ప్రకాశకులు

**సాధన గ్రంథ మండలి, తెనాలి**

శ్రీః

**చిద్గగనచన్ద్రికా**

మహాకవి కాళిదాస విరచితా

విశ్వలహరీ వ్యాఖ్యా

(ఆంధ్ర ప్రతిపదార్థ–తాత్పర్య–విశేషములు)

దోర్బల విశ్వనాథశర్మా


ప్రథమముద్రణ :–15.01.2004 – స్వభాను – సంక్రాంతి పర్వదినం

ప్రతులు : 1000

పేజీలు : 288

వెల రూ. : 100–00





D.No.: 5-74,
Ramayampet - 502 101
Medak District.

2. రావి మోహనరావు

4-103, I.L.T.D. Colony Extn.,
Kothapet, Chirala - 523 157, Prakasam Dist. A.P.
Ph.No.: 08594 - 234054

3. సాధన గ్రంథ మండలి – తెనాలి – 522 201.



DTP by

**VIKRAM GRAPHICS**
Opp. M.R.O. Office
CHIRALA - 523 155
Ph.: 08594 - 237658

Printed at

# శ్రీః

# శాక్తేయ తంత్రములో కాళీ క్రమ దర్శనము

కాశ్మీర దేశంలో పూర్తిగా వేదము మీదనే ఆధార పడకపోయినా వేదానికి వేదోక్తమైన అద్వైత సిద్ధాంతానికి బాగా పోలిక కలిగిన శైవం ఒకటి క్రీస్తు శకారంభంలో అభివృద్ధి చెందింది. ఆ శైవంలోని విభాగాలలో ఒకటి త్రికశైవం. అందులో నుండి ప్రత్యభిజ్ఞావాదం, స్పందవాదం లాంటి వాదాలు రూపొందాయి. వానిలో ప్రాకృత భాషలో కొన్ని మౌలికాంశాలతో కూడిన మహార్థ సంప్రదాయం, క్రమ సంప్రదాయం, కుల సంప్రదాయం వంటివి కులదర్శన గ్రంథాలుగా రూపొందింపఁబడ్డాయి. సుమారు వేయి సంవత్సరాల తరువాత కూడా వానికి సంబంధించిన గ్రంథాలు సంస్కృత భాషలో కూడా వెలువడుతూ వచ్చాయి. ప్రధానంగా ఇవి అక్కడి శైవానికి సంబంధించిన సిద్ధాంతాలను అంగీకరించినా అవి ప్రధానంగా శాక్తానికి సంబంధించినవి.

మహానయ ప్రకాశం అనే పేరుగల గ్రంథాలు బౌద్ధంలో వలె శాక్తేయంలో కూడా వచ్చాయి. ఈ శాక్త సంప్రదాయం కులదర్శనం క్రమదర్శనంగా కూడా పేర్కొనబడడం జరిగింది. కవికుల తిలకుడు, సంస్కృత సాహిత్యానికి విశ్వసాహిత్యం లోనే సముచిత స్థానాన్ని సంపాదించిపెట్టిన కాళిదాసు పేరనే ఒకటి రెండు సంస్కృత స్తోత్ర గ్రంథాలు దర్శన వాఙ్మయంలో చేర్చబడదగినవి వచ్చాయి. వానిలో ఒకటి చిద్గగన చంద్రిక అనుపేరుగల మూడువందల శ్లోకాలకు పైగా ఉన్న గ్రంథం ఒకటి ప్రసిద్ధిని పొందింది. అన్ని దర్శనాల్లో వలె ఈ దర్శనంలో జ్ఞానానికి ఉపాసనకు సముచిత స్థానం ఈయబడింది. జ్ఞేయతత్త్వానికి అద్వైతంలో వలె ఇందులో కూడా నామరూపాలు లేకున్నా ఉపాస్యముగా కూడ ఉన్న ఆ తత్త్వానికి పుంలింగ కాలశబ్దం, స్త్రీలింగ కాళీ శబ్దం వాచకంగా ప్రయోగింపఁబడినా, లింగాతీతమైన ఆ తత్త్వానికి వాచకమైన కాళీ శబ్దానికి గల ప్రాచుర్యాన్ని బట్టి అది శాక్తదర్శనంలో ఒక ప్రత్యేక విభాగంగా గురుకుల క్రమాన్ని కూడా ఏర్పఱచుకొంది.

శంకరాద్వైతంలో మిథ్యగా భావింపబడ్డ నామరూపాల్లో నామానికి రూపంకన్నా అధిక ప్రాధాన్యం ఉన్నట్లే ఈ క్రమసంప్రదాయంలో నామరూపాల పర్యాయాలైన వాగర్థాల్లో వాక్కునకే అధిక ప్రాధాన్యం ఉంటుంది. నామరూపాలకువలె వాగర్థాలకు వాచక వాచ్యభావం (వాచ్య వాచక భావం) ఉందనడంలో విప్రతిపత్తి లేదు.



జ్ఞేయతత్త్వానికి వాచ్యత్వం వాస్తవంగా లేకపోయినా అద్వైతంలో బ్రహ్మాత్మాది శబ్దాలవలె ఈ సంప్రదాయంలో కాళీ (కాల) శబ్దము ప్రచురంగా ఉన్నందున కాళీతంత్రంగా కూడా దీన్ని కొందఱు పేర్కొన్నా సాంప్రదాయికులు దీన్ని ప్రధానంగా పఞ్చవాహ మహార్థ క్రమంగా పేర్కొంటారు.

శాక్త శాక్తేతర సాధారణాలైన పూర్వదక్షిణ పశ్చిమోత్తర ఊర్ధ్వానుత్త రామ్నాయాల్లో ఈ క్రమాన్ని అనుత్తరామ్నాయానికి చెందిన దాన్నిగా భావిస్తారు. ఈ ఆమ్నాయానికి చెందిన సిద్ధాంతాన్ని అనుత్తర సిద్ధాంతంగా పేర్కొంటారు. దేశకాలవస్తు పరిచ్ఛేదాలకు అతీతమైన ఏతత్సిద్ధాంత రూపమైన తత్త్వము కాల (కాళీ) శబ్దాభిధేయమైనదిగా భావింపబడుతుంది. పరిచ్ఛేద హేతువైన కాలానికి వాచకమైన కాలశబ్దం ఇట బ్రహ్మతత్త్వం ఈశ్వరతత్త్వం ఆత్మతత్త్వం అని పేర్కొనఁబడే తత్త్వానికి వాచకమయ్యే యోగ్యత (ఏ శబ్దానికి కూడా అది ఉండదు) లేకపోయినా వాచకంగా వ్యవహరించఁబడింది. లేదా భావింపఁబడింది. ఆ తత్త్వాన్ని అనాఖ్యంగా అంటే పేరులేనిది అని పేర్కొన్నా అదే పేరుగాక తప్పదు గదా. అందుకే ఈ సంప్రదాయంలోని ఆ తత్త్వాన్ని స్త్రీలింగ శబ్దమైన అనాఖ్య అనే పేరుతో వ్యవహరించడం జరిగింది. అంటే ఆ తత్త్వాన్ని అనాఖ్య శబ్దము యొక్క స్త్రీలింగ రూపమైన అనాఖ్యా అనే శబ్దంతో పేర్కొంటారు.

ఈశ్వరుడు అంటే జగమును పుట్టించేవాడు. నిలిపేవాడు అనగా కొంతకాలం బ్రతుకునట్లు చేసేవాడు. చివఱకు చంపేవాడు అని తైత్తిరీయోపనిషత్తు సగుణబ్రహ్మ అని వ్యవహరింపఁబడే ఈశ్వరుని నిర్వచించింది. ఈ ప్రపంచము యొక్క జన్మస్థితిలయాలకు హేతువైన ఆ సగుణ బ్రహ్మ లేక ఈశ్వరుడు కాముడు అని తంత్రాంతరంలో కామశబ్దం ఈశ్వరునికి రూఢం గాకపోవడంచేత కామ శబ్దాన్ని క+అ+మ=(కామ) అని విభజించి, క అనగా పుట్టించే బ్రహ్మ (చతుర్ముఖుడు), కాపాడే విష్ణువు, సంహరించే మహేశ్వరుడు అని ఆ మూడు కర్మలు చేసే రజస్సత్త్వ తమోగుణియైన ఈశ్వరుడు అని యౌగికమైన అర్థాన్ని సాధించిన విధంగా ఈ తంత్రంలో కాల శబ్దాన్ని క+అ+ల అని విభజించి అదే విధంగా యౌగికార్థం చెప్పే వీలున్నది. మకారార్థము మహేశ్వరుడైనప్పుడు లయార్థక లకారం లయకర్తయైన మహేశ్వరుని బోధించడాన్ని వ్యతిరేకించ నక్కఱలేదు. పైగా తజ్జ బ్రహ్మ తల్ల మహేశ్వరుడు, తదన్ విష్ణువు అనే గుణత్రయమూర్తి వాచకంగా తజ్జలాన్ అని ఉపాసింపవలెను అని చెప్తూ ఉపనిషత్తు 'ల' కారాన్ని లయ కర్తృవాచకంగా అంగీకరించిది

గూడా! కావున కాల శబ్దం రజోగుణాన్ని ఆశ్రయించి ప్రపంచాన్ని పుట్టించి, సత్త్వగుణాన్ని ఆశ్రయించి కాపాడి, తమోగుణంతో సంహరించే త్రిగుణిమైన ఈశ్వరుని బోధిస్తుంది, అని చెప్పడంలో ఉపనిషదంగీకార యోగ్యత అనే ఔచిత్యం కూడ విరాజిల్లుతోంది.

కాల శబ్దాన్ని బ్రహ్మ వాచకంగా పేర్కొన్నట్లు తదభిన్న తచ్ఛక్తిని కాళీ శబ్దంతో పేర్కొనడంలో ఏ విప్రతిపత్తి కనిపించదు. పరిచ్ఛేద హేతువైన కాలము యొక్క క్రమం వస్తుగత సర్వక్రియల్లో కనిపిస్తుంది. దాన్నిబట్టే ఆ క్రియ భూతమనో, వర్తమానమనో, భవిష్యమనో చెప్పబడుతుంది. కాలశబ్ద నిష్పత్తికి మూలమైన కాలధాతువు కలనాన్ని బోధిస్తుంది. కలిః కామధేనుః అని పెద్దలు పేర్కొనడంలో ఆ ధాతువు సర్వక్రియా బోధకమనే భావం స్ఫురిస్తుంది. అది అట్లా ఉంచితే కలిధాత్వర్థమైన కలనం సంఖ్యాగణనాన్ని బోధిస్తుంది. అనేది సుప్రసిద్ధం. కలనగణితం అనే వ్యవహారం గణితశాస్త్ర ప్రసిద్ధం కూడా!

ఈ విధంగా కాలశబ్దం అనేకమైన అనంతమైన సంఖ్యల కలనం గల ప్రపంచాన్ని, ఆ సంఖ్య యొక్క బహుత్వాన్ని దానికి మూలమైన ఏకత్వాన్ని, ప్రపంచమూల మైన ఈశ్వరత్వాన్ని కూడ బోధించడంచేత పరతత్త్వాన్ని చెప్పడానికి కాలశబ్దానికి మించిన యోగ్యశబ్దం ఏది నాకు కనిపించలేదు. ఈ కలిధాతువునుండే పూర్ణమైన బ్రహ్మతత్త్వం యొక్క సర్వములైన అంశములనే చెప్పు **కలా** శబ్దం ఏర్పడుతంది. ఇందులోని లకారం వర్ణాలలోని అంతిమ ళకారంతో అభేదం కలిగి ఉన్న కారణంచేత అది ఇంచుమించు సర్వార్థ ప్రపంచాంశాలకు ప్రత్యాహార న్యాయంతో వాచకమౌతుంది. ఇలాంటి న్యాయంతో వర్ణక్రమంలో ప్రత్యాహారాలను కల్పించి వ్యవహరించడం తంత్రాల్లో కనిపిస్తుంది.

వాస్తవానికి తంత్రశబ్దం సర్వశాస్త్ర (దర్శన) వాచకమైన ముఖ్యంగా స్త్రీ దేవతోపాసనా ప్రాధాన్యంగల దర్శనాలకు వాచకంగా ప్రసిద్ధమై ఉంది. అందుచేత ఈ కాళీ దర్శనాన్ని తంత్రంగా కూడా వ్యవహరిస్తారు. అదేవిధంగా ఇది క్రమదర్శనంగా కూడ వ్యవహరింపఁబడుతుంది.

క్రమశబ్దం కూడా ఆ శబ్దంలోని లకారాభిన్న రేఫం రుద్రవాచకంగా భావింపఁ బడినప్పుడు వెనుక చెప్పఁబడిన కామ కాల శబ్దాలవలె ఈశ్వరవాచక మౌతుంది. ఈ విధంగా కుల శబ్దంలోని ఉకారాన్ని విష్ణువాచకంగా స్వీకరించి కులశబ్దాన్ని కూడా ఈశ్వరవాచకంగా భావించవచ్చు. అది కరగృహిణి అనే అర్థంలో గృహం అనే శబ్దాన్ని వ్యవహరించినట్లే కులాంశ అనే అర్థంలో కులశబ్దాన్ని ప్రయోగించవచ్చు. అందుచేతనే



కులం అనే వ్యవహారం శాక్తేయ తంత్రాలకు రూఢమైంది. విస్తారార్థకమైన తన్ అనే ధాతువునకు ష్ట్రన్ ప్రత్యయము చేర్చబడగా ఏర్పడిన తంత్ర శబ్దం స్త్రీ దేవతోపాసనాన్ని కూడ బోధిస్తుంది. ఏతావతా క్రమతంత్రం, క్రమదర్శనం, కులతంత్రం, కులదర్శనం అనే శబ్దాలు ఇంచుమించు ఏకార్థాలు అని స్పష్టమౌతుంది.

బాహ్యదేవతారాధన మొదలుగా గల దేవతోపాసన మధ్యమంగా గల ఆ దేవతతో తాను (సాధకుడు) అభిన్నుడననే జ్ఞానం అంతమందు గలిగిన క్రమాన్ని బోధించడం చేత కూడ ఈ దర్శనం క్రమదర్శనమని వ్యవహరింపఁబడుటకు తగినదైయున్నది.

ఏకకాలమందు ఒకే వస్తువునందు బహుక్రియలు జరుగవు. ప్రదర్శితాలు కూడా కావు. అందుచేత క్రియలలో క్రమముంటుందని వెనుక చెప్పడం జరిగింది. కావున బాహ్యారాధనాది క్రమాన్ని బోధించే దర్శనం క్రమదర్శనం అని వ్యవహరించడం ఔచిత్య పూర్ణంగా కూడ ఉంటుందనేది గమనార్హం. ఏకమైన బ్రహ్మ అనేకత్వాన్ని (అనంతత్వాన్ని) పొందడంలో క్రమముంటుంది. వస్తుగతములైన ఉత్పత్తి స్థితిలయాలకు క్రమముంటుంది. అనంతత్వాన్ని పొందిన క్రమానికి అనగా సృష్టిక్రమానికి విలోమంగా లయక్రమము కూడా ఉంటుంది. అయితే ఈ క్రమాన్ని పాటించవలెననే నియమమేదీ ఈశ్వరునకు నియతం కాదు.

కావున సృష్టి వాదాల్లో యూగపత్సృష్టివాదం కూడా ఒకటి నిర్దిష్టమై ఉన్నది. అట్లే సోకామయత అనే కామంతో మొదలయ్యే సృష్టి జీవభోగకాల సమాప్త్యనంతరం దీనినంతా లయంచేసికోవాలనే కామంతోనే ప్రపంచలయం జరిగిపోతుంది. ఈ క్రమం నియతం కాకపోవడం చేత బ్రహ్మ అక్రమమని కూడా చెప్పఁబడింది. ఈ విధంగా క్రమాక్రమ శబ్దాల ద్వారా బ్రహ్మమే చెప్పఁబడుతుంది. ఉపనిషత్తులలో సో2కామయత ఇత్యాది వాక్యాలలో పేర్కొనఁబడిన కామమే తంత్రాలలో ఇచ్ఛాశక్తిగా పేర్కొనఁబడింది. ఇది జ్ఞానశక్తి యొక్క ఒక పార్శ్వం కాగా, దాని యొక్క మరొక పార్శ్వం క్రియాశక్తి ఔతుంది. జ్ఞానశక్తి యొక్క వ్యాప్తి ఇచ్ఛాక్రియాశక్తి ద్వయంలో కూడ అవశ్యంగా ఉంటుంది. అందుచేతనే ఇచ్ఛాక్రియలు వ్యక్తంకాని స్థితిలోని బ్రహ్మ **నిర్గుణం** అని వ్యవహరించడం జరుగుతుంది. అయితే ఆ బ్రహ్మ జ్ఞానహీనమని ఎక్కడా చెప్పఁ బడలేదు. పైగా జ్ఞానమే బ్రహ్మ స్వరూపం అని సత్యం జ్ఞానమనంతం విజ్ఞానమానందమ్ ఇత్యాది బ్రహ్మ స్వరూప బోధకములైన ఉపనిషద్వాక్యాలలో బ్రహ్మకు జ్ఞానము స్వరూపమని చెప్పఁబడింది. అది ఆనంద స్వరూపమని, కాబట్టి ఆనందాభిలాషులకు

తత్స్వరూపజ్ఞానం అనివార్యమని అద్వైతదర్శనం స్పష్టం చేస్తుంది. శూన్యం కూడా అనుభవింపఁబడితేనే దాని సత్త వ్యవహార్యమౌతుంది. అంటే దానికి అధిష్ఠానం కూడ జ్ఞానమే అయి ఉండడం భ్రమ కూడా నిరధిష్ఠానంగా కలుగదు, అనే హేతువాదం చేతనే బౌద్ధుల శూన్యవాదం అద్వైతులచే ఖండింపఁబడింది. ఏమీలేదు అనే శూన్యవ్యవహారం ఆ అనుభవం లేనిదే ఉండదు కూడా. సర్వ వ్యవహారాలకు అనుభవమే ఎట్లు మూలమో అట్లే శూన్యవ్యవహారానికీ కూడ అనుభవమే హేతువు మూలము అని చెప్పవలె అని చెప్పినప్పుడు శూన్య మూలము శూన్యాధిష్ఠానము జ్ఞానము అని స్పష్టమౌతుంది. అంతఃకరణ విషయాధిష్ఠాన చైతన్యముల సమావేశమే శూన్యం అనేది అనుభూతం అయిందంటే బ్రహ్మ యొక్క సత్త దానియందు గోచరమయిందనే అంగీకరించాలి. ఆ శూన్యం యొక్క అనుభవం ససాక్షికం అయినప్పుడే ప్రమాణ మౌతుంది. అనగా నమ్మదగిన దౌతుంది. నిస్సాక్షికమైన ఏ అనుభవం నమ్మదగింది కాదు. ఆ సాక్షి ఆత్మయే. అది లేకపోతే ప్రమాణం ఉండదు. ప్రమేయ ప్రమాణ వ్యవహారం కూడా ఉండదు. అందుచేత ఆ సాక్షి చైతన్యమే ఆత్మగా పేర్కొనఁబడుతుంది. శూన్యాత్మవాదం ప్రతిహతమై అనగా శూన్యమై సాక్ష్యాత్మవాదం ప్రమాణమై విశ్వసనీయతను సంతరించు కొంటుంది. అనేది స్థూలంగా శూన్యవాద తిరస్కార వాదం ఔతుంది. అస్తు.

క్రమదర్శనంలో వర్ణక్రమము యొక్క ప్రాధాన్యం అధికం. వర్ణక్రమములో మొదటిదైన 'అ', వర్ణ క్రమంలో (చివరి లకారాన్ని ళకారాభిన్నంగా భావించినందువల్ల), చివరిది 'హ' అనుకొన్నప్పుడు ఆ రెండు వర్ణాల ప్రత్యాహారమహం ఔతుంది. 'అహం' అనే ప్రత్యాహారంలో అన్ని వర్ణాలు, ఆ వర్ణాల నుండి ఏర్పడే పదాలు, వాని వలన ఏర్పడే పదాలు, వాని వలన ఏర్పడే వాక్యాలు ఇత్యాది వాగ్వ్యవహారం చేరుతుంది. అట్లే వ్యవహార్యమైన సమస్త ప్రపంచము కూడ అహమర్థమే. అంటే అహమర్థమైన ఆత్మకంటే భిన్నం కాజాలదు. ఈ అహంతానుభవాన్ని తంత్రాల్లో అహంత అని అంటారు. స్వయం ప్రకాశమైన ఆత్మ బ్రహ్మ లేక శివుడు ప్రకాశం అనీ, ఆయన స్వానుభవరూపమైన అహంతను విమర్శ అని అంటారు. అందుచేత ఈ విమర్శ కాళి, క్రమం, అహంత, హృదయం, ఉద్యమం, బుద్ధి, చిత్, చిచ్ఛక్తి, స్పన్దము, శక్తి, ఇచ్ఛ, క్రియ, అనాఖ్య, కులం ఇత్యాది బహుశబ్దాలతో తంత్రాలలో వ్యవహరింపబడుతూ ఉంటుంది.

నేనెవడను అని ఆరంభమైన ఈ విమర్శ నేను కానిదేది లేదు, అంతా నేనే



అనే పూర్ణతానుభవంతో అనగా పూర్ణాహంతతో ముగుస్తుంది. తొలుత నేనెవడను అను జిజ్ఞాస కలిగిన జీవుడు క్రమంగా అసంఖ్యాకములైన భిన్నభిన్న భ్రమలతో స్థూలశరీరంగా ఇంద్రియంగా అంతఃకరణంగా అజ్ఞానంగా తనను భావించుకొని దుఃఖియై గురుకరుణతో స్వస్వరూపమైన పూర్ణాహంతానుభవంతో అనగా శివత్వానుభవంతో దుఃఖవిముక్తుడై మిథ్యాకాలాన్ని మిథ్యామృత్యువును జయించి మృత్యుంజయుడై శివయోగియై శివస్వరూపుడై దుఃఖగంధరహిత స్వస్వరూపా నందానుభవ పరిపూర్ణుడౌతాడు. అప్పుడు క్రమం అక్కఱలేనిదై అక్రమమవుతుంది. తొలుత తాను శివుడననే పూర్ణాహంతలో శివాభిన్నయైన కాళి అనగా శక్తి పరగా, ఆ శక్తి తన స్వాతంత్ర్యం చేత స్వేచ్ఛగా స్వతంత్రగా పేర్కొనఁబడుతుంది. జీవులతో అభేద భేదాలను అనుభవిస్తూ పరాపర అని వ్యవహరింపఁబడుతుంది. శివాభిన్నత్వాన్ని అనుభవిస్తూ అపరగా వ్యవహరింపఁబడుతుంది. వ్యవహారమెట్లున్నా ఆమె పరతత్త్వాన్ని అనగా శివాభిన్నత్వాన్ని ఎప్పుడు వీడి ఉండదు. అంటే ఆమెకు పరత్వమే స్వభావ సిద్ధము, నిత్యమూ అయిన స్వరూపం.

తంత్రాల్లో క్రమం అక్రమం అని రెండు విధాలుగా వ్యవహరింపబడ్డ బ్రహ్మా కభిన్నంగా వ్యవహరింపబడేశక్తికి సృష్టించేటపుడు సృష్టిక్రమము, సంహరించేటపుడు సంహారక్రమము రెండూ ఉంటాయి. కాని కొందఱు సంహార క్రమాన్నే అక్రమం అని వ్యవహరిస్తారు. సృష్టించేప్పుడు ఆ శక్తి సృష్టికి మూలమై ప్రకృతి అని వ్యవహరింపఁబడుతుంది. క్రమంగా సృజించఁబడిన ప్రపంచం అంతా తిరిగి ఉపసంహరింపఁబడే వఱకు వికృతి అని పిలువబడుతుంది. వికృతిభావం తిరస్కారానికి, ప్రకృతిభావం పురస్కారానికి చిహ్నాలు. కావున శక్తి ప్రపంచాన్ని ఉపసంహరించేటప్పుడు తాను వికృతికి దూరమై స్వాభావిక స్వాత్మభావరూపమైన ప్రకృతిభావాన్ని పొందుతున్నాను, అనే సంతోషంతో సంహార క్రమాభిలాషిణి అయ్యే కారణం చేత సంహారక్రమాన్ని శివభేదరూప ద్వైతాన్ని విడచి శివాభేద రూపాన్ని పొందబోతున్నాననే సంతోషంచేత ఎక్కువగా ఇష్టపడు కారణం చేత కాళి అనే నామంపట్ల ఎక్కువ మక్కువను ప్రదర్శిస్తూ ఆ పేర తనను స్తుతించే వానిని అధికంగా అనుగ్రహిస్తుంది.

కల (ళ) కాళీ (ళీ) శబ్దాలు సర్వార్థ ప్రపంచాంశాలను అనగా కల (ళ) లను తమలో కలుపుకొని ఉన్నాయని ఇదివఱకు సూచించడం జరిగింది. తంత్రాల్లో వర్ణక్రమం యొక్క ప్రాధాన్యాన్ని కూడ సూచించడం జరిగింది. అర్థ ప్రపంచం అంతా చివఱి శకారాన్ని లకారాభిన్నంగా భావించి చివఱి హకారాన్ని అకారంతో కలిపి

ప్రత్యహరించి అహం శబ్దంలో అంతర్భవిస్తుందని చెప్పడం కూడా జరిగింది. కకారం మొదలుకొని హల్లులన్ని తత్త్వముల మూలాలు అని తాంత్రికులు భావిస్తారు. అంతేకాకుండా తత్త్వ సంఖ్యను కూడా వర్ణక్రమంలోని హల్లుల సంఖ్య(36)సూచిస్తుంది, అని కూడ భావిస్తారు.

## శాక్తేయ తత్వాలు-వర్ణజనితాలు :-

సాంఖ్యులు ప్రకృతి ఒక్కటే, 'అ' వికృతిగా నిత్యంగా ఉండేదయినా అది ఏడు ప్రకృతి వికృతులుగా పదునారు వికృతులుగా పరిణమిస్తుంది, అని ప్రవచిస్తారు. కావున ప్రకృతిమయ తత్త్వాల సంఖ్య (1+7+16 = 24) మొత్తము ఇరువది నాలుగు పురుష బహుత్వాన్ని, అంగీకరించినా తాత్త్వికంగా ఒకటేయైన పురుషతత్త్వాన్ని కలుపుకొని తత్త్వాల సంఖ్య ఇరువుదియైదు అని అంటారు. యోగులు వీనికి పురుష విశేషరూపమైన ఈశ్వరతత్త్వాన్ని కలిపి తత్త్వములు మొత్తం అనగా ప్రకృతి పురుష తత్త్వాలు మొత్తం ప్రకృతి తత్త్వాలు, 24 + పురుషతత్త్వ జీవేశ్వరతత్త్వాలు 2=26 మొత్తం ఇరువది ఆరు అని అంటారు. శైవులు, శాక్తేయులు శివుడు శక్తి శుద్ధవిద్యా సదాశివ మాయారాగ కాలనియతి .... ఇత్యాది తత్త్వాలు పదింటిని అదనంగా చేర్చి మొత్తం తత్త్వాలు ముప్పదియాఱు అని అంటారు. ఆయా హల్లులు ఆయా తత్త్వాలను సంకేతరూపంగా సూచిస్తాయని కూడా తాంత్రికులు భావిస్తారు. ఇదంతా చెప్పడంలో అర్థం కంటే శబ్దాన్ని ప్రధానంగా తాంత్రికులు భావిస్తారు అని చెప్పడం కోసం మనుస్మృతిలో అనాదినిధనా నిత్యా వాగు త్సృష్టా స్వయంభువా అని చెప్పఁబడింది. అంటే వైదికులు శబ్దార్థ ప్రపంచం నిత్యమని అంగీకరించినా వేదశబ్దాలు నిత్యాలు అని అంగీకరిస్తారు. కాబట్టి వైదికులు శబ్దార్థాల్లో అర్థానికంటే శబ్దాన్ని (వేదాన్ని) అనాదినిధనంగా భావిస్తారు, అని పై స్మృతి వాక్యం స్పష్టం చేస్తుంది. వైదికులు సంధ్యోపాసనంలో 'అసావాదిత్యో బ్రహ్మ' అని రూప (ఆదిత్య) ప్రతీకమైన బ్రహ్మోపాసనానికి ఎంత ప్రాధాన్యమిచ్చారో ఆ వెంటనే **ఓమిత్యేకాక్షరం బ్రహ్మ అగ్నిర్దేవతా బ్రహ్మ ఇత్యార్షం గాయత్రం ఛందం పరమాత్మం సరూపం సాయుజ్యం వినియోగం** అంటూ ఓంకారము అనే శబ్దం ప్రతీకంగా చేయబడే నామ (నాద) ప్రతీకమైన ఓంకారోపాసనానికీ, అంతకంటే ఎక్కువ ప్రాధాన్యాన్ని ఇచ్చారని సూచిస్తుంది. ఈ ఉపాసనాఫలం సాయుజ్యం అనికూడ స్పష్టం చేస్తూ అంతకంటే అధిక ప్రాధాన్యాన్ని ఇచ్చారు అని గమనింపవలసిఉన్నది.

యజ్ఞానాం జపయజ్ఞోస్మి అని గీతలో శబ్దావృత్తి రూపమైన జపాన్ని యజ్ఞంగా



మాత్రమే గాక సర్వయజ్ఞ శ్రేష్ఠయజ్ఞంగా తన విభూతిగా శ్రీకృష్ణుడు పేర్కొనడం కూడ ద్రవ్య యజ్ఞాద్యర్థ యజ్ఞాలకంటే శబ్దానికి (శబ్దమయమైన జపయజ్ఞానికి) ఇచ్చిన ప్రాధాన్యాన్ని వైదికుల మతంలో శబ్దానికి అర్థానికన్న అధిక ప్రాధాన్యం ఇచ్చారనే విషయాన్ని స్పష్టం చేస్తుంది. కాబట్టి తాంత్రికులు భావించే అర్థానికన్న శబ్దానికిచ్చిన ప్రాధాన్యం వైదిక సిద్ధాన్తానుగుణమే అని స్పష్టమౌతుంది. ఉపసంహారంలో భువనాధ్వం తత్త్వాధ్వంలో, తత్త్వాధ్వం కలాధ్వంలో లీనమౌతుంది. ఈ మూడు అర్థాధ్వలు వర్ణాది వాగధ్వత్రయంలో లీనమౌతాయి. మొత్తం ఈ షడధ్వాలు షడధ్వాతీతమైన పరతత్త్వంలో లీనమౌతాయి.

ఈ విధంగా లయంలో క్రమదర్శనం అవుతూనే ఉంది. దానిలో వర్ణక్రమం సృష్టిక్రమంలోనే అంతర్భవిస్తుంది. శబ్దం నుండే అర్థ సృష్టి అనే క్రమదర్శన సిద్ధాంతంలో శబ్దం అంటే శబ్దానికి పదవాక్యరూప శబ్దానికన్న సూక్ష్మమైన వర్ణరూప శబ్దమే అర్థసృష్టి హేతువను తాంత్రక సిద్ధాంతమే యుక్తి సంగతముగా ఉంటుంది. 'ఓం' అను ఏకాక్షర బ్రహ్మోపాసనాన్ని అంగీకరించే వైదిక సిద్ధాంతానికి ఈ తాంత్రక సిద్ధాంతం ఏమాత్రం విభేదించక పోగా అనుగుణ్యాన్నే కలిగి ఉంటుంది.

అచ్చులు, హల్లులు అను రెండు విధాలైన వర్ణాలు కాలీ కాల శబ్ద ప్రతిపాద్య తత్త్వార్థ రూప బ్రహ్మ యొక్క వివర్తమో పరిణామమో అయిన ప్రపంచ పదార్థాల మూలాలైన అచ్చులు శాక్తాలు, హల్లులు శైవాలు అని కొందఱు తాంత్రికులు భావిస్తుండగా, మరికొందఱు దానికి వ్యత్క్రమంగా భావించడం కూడా ఉంది. ఈ విధంగా క్రమదర్శనంలో వర్ణక్రమ ప్రాధాన్యం స్పష్టమౌతుంది. ఈ దర్శనంలో వర్ణక్రమంతో పాటు ధామక్రమం సంవిత్క్రమ బృందక్రమం వర్ణింపఁబడి ఉంటాయి. వర్ణక్రమం కథనక్రమంలో అంతర్భవించినట్లు పూజనాక్రమంలో కూడా అంతర్భవిస్తుంది. ఈ విధంగా వర్ణధామ సంవిత్తులు పరస్పరం కథన పూజన సంక్రమణాల్లో అంతర్భవిస్తాయి.

## కుండలిని-కాళీ రూపాంతరమే :-

కుండలిని యొక్క ఆవర్త పంచక ప్రణవాకారోల్లాసమే పంచాత్మక ప్రపంచమున వ్యాపించి కణ్ఠ, నాభి, హృద్, వక్త్ర, భ్రూమధ్య పంచక వికాసము గాన ప్రథమముగా కలిగిన స్పన్దమే ధామ క్రమము. మూలాధారము మొదలు సహస్రారము వఱకు ఊర్ధ్వగామియైన కణ్ఠనాభిహృద్ వక్త్ర భ్రూమధ్యములను ధామపంచకమును క్రమముగా దాటి కుండలిని సహస్రారము చేరును. కుండలిని పరా పశ్యంతీ మధ్యమా

వైఖరీ రూపముల క్రమ పరిణామము నొందును. బహిర్గతమైన వైఖరి శ్రోత్ర భ్రూమధ్య లలాటకముల క్రమమున తిరిగి పరగా మారి సహస్రారము చేరును. వక్త్ర ద్వారమున బహిర్గతము కానపుడు కంఠనాభి హృద్వక్త్ర భ్రూమధ్య ద్వారమున నిశ్వాస రూపమున బహిర్గతమగును. తిరిగి ఉచ్ఛ్వాస రూపమున లోనికేగి సమస్త నాడీమండలమును ఆప్యాయిత మొనర్చును. ఈ బహిర్గమనాగమనములు వాగ్వాయురూపముల ధరించిన కుండలిని క్రియాశక్తి ఆవిష్కారములు. యోగాభ్యాసబలమున ప్రాణకుండలిని నిరాటంకముగా సహస్రారముదాకచేరి కాళీరూపమున కాలశివుని సంగమమున అమృతమును స్రవింపఁజేసి శరీరమును త్యజింపనిచ్చగించని యోగిని ప్రలయ పర్యంతజీవిగా గూడ నొనరించును.

## కుండలిని-వాక్పంచక రూపిణి :-

ఈ కుండలిని 'క' అనగా శివుని అలాతి = సంపూర్ణముగా స్వీకరించు కారణమున కాళీ నామమును పొందును. 'క' అనగా శివునికి ఆలీ = సఖియై నందున కాళీనామమునొందును. పై ధామముల పంచకమునందును విభిన్న నామ రూపముల ధరించిన శివునితో తానును విభిన్న నామ రూపముల ధరించి విహరించును. శ్రీశంకరులు సౌందర్యలహరిలో ఈ అయిదింటిలోనే గాక మూలాధార సహస్రారములందు గూడ శివశక్తుల విహారమును రమణీయముగా వర్ణించినారు. మూలాధారమున సంవిద్రూప పరాశక్తితో కలిపి పరాది చతుర్విధ వాగ్రూపముల లెక్కించినచో పరాది పఞ్చకసిద్ధి కలుగును.

ఆది పర సంవిద్రూప, నిత్య వాక్చతుష్టయమున మొదటిదైన పర వివక్షావాయు సహకారమున ఉత్పన్నమయి పశ్యంత్యాది పరిణామముల నొందును. 1) సంవిద్రూప పర, 2) వాక్ప్రథమావతార పర, 3) పశ్యంతి, 4) మధ్యమ, 5) వైఖరి అను పఞ్చ భేదముల ద్వారమున ప్రపంచావిర్భావ హేతువగును.

మూలాధార స్వాధిష్ఠానము లంధకారమయములు కావున అట శక్తి నుపాసింపరాదని సమయాచారులు భావించి మణిపూరమున ప్రత్యక్షయగుటచే పశ్యంతీ అను సార్థకనామము ధరించిన వాగ్దేవికి పాద్యాది నైవేద్యాంతోపచారముల భావనా రూపమున సమర్పించెదరు. అనాహతమున పశ్యంతికి వైఖరికి మధ్యన నుండుటచే మధ్యమ యను సార్థక నామము ధరించిన వాగ్దేవికి తాంబూలోపచారమును సమర్పించెదరు. ఆజ్ఞాచక్రమును చేరిన ఆ కుండలినీశక్తిని నేత్రద్వయ దీప నీరాజనోపచారమును సమర్పించెదరు. ఆ తరువాత సహస్రారమును చేరిన కుండలిని



శివు సంగమించు కాలము సమీపింపగా ప్రతివేశి (ప్రక్కింటి) గృహమున కొంత కాలము తలదాచుకొని శివసంగమానంతరము కుండలిని స్వస్థానమైన మూలాధారము చేరిన పిదప తన యథా స్థానమును భావనా రూపమున సమయసాధకులు చేరుకొందురు. సమయాచారులచే నిందింపఁబడే కౌలాచారులు మూలాధార స్వాధిష్ఠానాలలో కూడ అమ్మవారిని మానసికంగా పూజిస్తారు. కాలారాధ్య కాళి, సమయారాధ్య సమయ ఏకరూపాలని ఆ శబ్దాలే స్పష్టం చేస్తాయి.

మూలాధారమున చిరకాలము సుప్తయైన కుండలిని స్వాధిష్ఠానము దాటువఱకు వివిధ ధ్వనుల నొనరించును. **యత్కుమారీ మంద్రయతే** అని శ్రుతి చెప్పిన ఆ మంద్ర ధ్వనిని అత్తగారింటికి పోవు కొత్త పెండ్లికూతురు ఏడ్పుగా తాంత్రికులు వర్ణించినారు. కుండలినీ యోగు లాసాధనచేయుచున్న సమయమున సమీపముననున్న ఇతరులకు ఆ ధ్వని వినిపించునని ఆ అనుభవమును పొందినవారు చెప్పగా వినియున్నాను. క్షుధితయైన కుండలిని తీవ్రవేగమున సహస్రార చంద్ర మండలమును గట్టిగా కరచినప్పుడమృత పూర్ణమైన ఆ సహస్రారము నుండి అమృతము స్రవించి సమస్త నాడీమండలము నాప్లావితమును నాప్యాయితమును గావించుననుట తద్యోగి వ్యవహారము. అట్లు సహస్రారకమలమునందు 'ఇయంవావసరఘా' అను శ్రుతి ననుసరించి తేనెటీగగా కుండలిని పేర్కొనబడినది. 'క' అనగా సహస్రారమున, 'అలి' అనగా తేనెటీగ అను రెండు శబ్దముల యోగమున సిద్ధించిన హ్రస్వాంత కాలి శబ్దము కాళిదాసాది నామములలో కనిపించు ననుట యొక పక్షము. లేక సంజ్ఞయందు దీర్ఘమైన ఈకారము హ్రస్వభావము నొందినందున కాలియను రూపము సిద్ధించిన దనుట వైయాకరణ సాధారణాంగీకృతము అయిన మరొక పక్షము.

విశుద్ధము షోడశదళము. పదునాఱు అచ్చులే ఆ దళములు. అనాహతము ద్వాదశ దళము. డాదిఫాంత దశవర్ణములే ఆ దశ దళములు. స్వాధిష్ఠానము షడ్దళము. బాది లాంత షడ్వర్ణములే ఆ షడ్దళములు. మూలాధారము చతుర్దళము. వాది సాంత చతుర్వర్ణములే ఆ చతుర్దళములు. ఆజ్ఞాచక్రము ద్విదళము. హళలే ఆ రెండు దళములు. సహస్రారము సర్వవర్ణోప శోభితము. క్షకారము సహస్రార దళము. కకార సకార యోగమున సకారము షత్వమునొందిన కకార షకార యోగము క్షవర్ణము, క్షవర్ణముతో కలిపి మొత్తము వర్ణములు ఏబది ఒకటి. అమ్మవారికేబది వర్ణములు పీఠములని చెప్పిన నామము పఞ్చాశత్పీఠ రూపిణీ అనునది. వైఖరి విఖరవాయు ప్రేరణమున వర్ణములకు ఇతరులు వినదగిన ధ్వని ఏర్పడినందున కుండలిని యొక్క

క్రియాశక్తి రూపముగా భావింపబడినది. వైఖరీ నామము కూడా ఈ విధముగనే వాక్కు యొక్క చతుర్థము చివరిదియైన క్రియాశక్తి కేర్పడియున్నదని గ్రహింపదగినది.

వైఖరి మాత్రమే గాక తక్కిన పశ్యంతీ మధ్యమా పరా వాక్కులును వర్ణరూపములే అనగా ప్రతివర్ణము తొలుత పరావాక్కే. దాని యొక్క చివఱి పరిణామము వైఖరి. ఈ వైఖరియే వాక్ప్రపంచముగా పేర్కొనదగినది. ఏలననగా వర్ణములనుండియే పదములు పదముల నుండి వాక్కులు ఏర్పడును. వ్యవహారమంతయు వర్ణమూలకమే. పరాసంవిత్, పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ రూప పంచధా ప్రసరమే వర్ణక్రమము.

శ్రోత్రాదీంద్రియ పఞ్చక ప్రసరమే సంవిత్ప్రసరము. బ్రహ్మ విష్ణు రుద్రేశ్వర సదాశివ రూప బ్రహ్మపంచక ప్రసరమే సంవిత్క్రమము. శబ్దాది విషయ పఞ్చక ప్రసరమే అర్థక్రమము. ఈ విధముగా అంతయు సంవిద్ధామక్రమమే. సృష్టియంతయు వర్ణముల నుండియే యేర్పడిన దగుటచే పైన పేర్కొనబడిన సర్వక్రమ ప్రకారము సృష్టిక్రమమున అంతర్భవించునదే.

దీని తర్వాతిది స్థితిక్రమము. ఖగేన్ద్రనాథ, కూర్మనాథ, శేషనాథ, మచ్ఛన్దనాథు లను నల్వురు జ్ఞానసిద్ధులు జాగ్రత్స్వప్న సుషిప్తి తుర్యములనెడి నాలుగు అవస్థలను స్పర్శ రూప రస గన్ధములను వ్యాపించి పూర్ణస్వాతంత్ర్య వైభవము గలవారై లోకయాత్రను ప్రవర్తింపజేస్తారు. నిర్వహిస్తారు. దాటిస్తారు కూడా.

వెనుక చెప్పబడినట్లు పరా పరాపరా అపరా అను త్రిభేదములు గలిగిన శక్తి జ్ఞానక్రియాద్వైవిధ్యమున ఆఱువిధములు కలదిగా వ్యవహరింపబడును. **యరలవశషసహళక్ష** అను పది వర్ణములు అః (షోడశస్వరము) అనుదానితో కలిపి పదునొకండు వర్ణముల క్రమము సంహారక్రమ రూపమై సంవిత్క్రమాన్తర్గతమేయగును. అదిగాక ఇచ్ఛా జ్ఞాన క్రియాశక్తి ప్రసారము ప్రపంచమున్నంత వఱకు జరుగుచునే యుండును. అట్లే సృష్టి స్థితి లయ క్రియలు ప్రపంచమున్నంత కాలము నుండును. ప్రపంచమున సృష్టి స్థితి లయ క్రియలకు భూత వర్తమాన భవిష్య కాల సంబంధులనుట ప్రాయోవాదమే. వానియొక్క నైరంతర్య ప్రవర్తనమే ప్రపంచమున నుండును. అనగా విత్తునుండి మొక్క వచ్చుటలో సృష్టి యొక్క క్రియ మాత్రమే ఉన్నదనరాదు. విత్తు నశించనిదే లేక లయించనిదే అంకురము రాదు. మొక్క మొలచినది అనగా విత్తు నశించనిదే అనగా అంకురమున లీనము గానిదే సాధ్యము కాదు. సృష్టి లయల పౌర్వాపర్యం మారినా క్రమం ఉండకపోదు. కావుననే వెనుక క్రమము క్రమరాహిత్యము



రెండును చోటు చేసుకుంటాయని క్రమదర్శనమున పేర్కొనబడినాయి. అంటే క్రమరాహిత్యమున్నదని అనుకొనేచోట సూక్ష్మదృష్టికి క్రమం కనిపించవచ్చు. స్థూల క్రమము గోచరమయినంతగా సూక్ష్మక్రమము సాధారణ దృష్టికి గోచరము గాదు. కావున ఈ దర్శనము అక్రమదర్శనము, అని పేర్కొనబడరాదు. వస్తు (బ్రహ్మ) స్థితి లేక సత్తయందు లయము సృష్టి, సృష్టి లయము అనే ద్వంద్వముల క్రమము అతిసూక్ష్మమై క్రమము లేదేమో అని స్థూలదృష్టులకు తోచును. దానినే స్థూలదృష్టితో క్రమరాహిత్యం అని పేర్కొనటం జరుగుతుంది.ఇదంతా క్రియా సాతత్యంలోని క్రమానికి సంబంధించిన విషయమే కాని నిష్క్రియ బ్రహ్మలో క్రమం ఉంటుందనటం సరికాదు. కాబట్టి క్రమాక్రమ వ్యవహారం క్రమ దర్శనంలో అనివార్యము.

అనాఖ్యా శబ్దమే (పేరులేనిది అనే శబ్దమే) పేరుగా గల ఆదిదేవి (ఆదిశక్తి) సృష్టిస్థితి సంహారములను తనలో ప్రవిలాపనం చేసికొని మూలధామంలో సామరస్యాన్ని పొందుతుంది. అంటే స్వయంగా ఏ విభాగాలు లేనిదే అయినా విభాగక్రమాన్ని పొంది చివఱకు సమస్త భేద ప్రవిలాపనం ద్వారా సామరస్యాన్ని పొంది మహార్థమని ప్రసిద్ధిని పొందియున్నది. ఆదిదేవి యొక్క ఈ స్వరూప ప్రతిష్ఠాపనమే మహాసంహారక్రమముగా కూడా పేర్కొనబడుతుంది. పరాకాశోదితయై కలనను పొంది (సాధకులచే) సాక్షాత్కరించుకొనబడి చివఱకు భాసా క్రమముగా భాసిస్తుంది. భాసాక్రమం కూడా ధామమయమై చివఱకు నిర్ధామతను పొందుతుంది. నిర్ధామమైన బ్రహ్మ సత్తయందే సృష్టి ప్రలయములు లేక ప్రలయసృష్టులు అనుగతములౌతూ వుంటాయి.

భాసాక్రమము సకలాసకల నిష్కలానిష్కల పరనామములతో క్రమ (మహాక్రమ)మును భాసింపజేయును. తేజో విశేషమున సర్వము సంభవమే.

## ఖండకాలమే అవచ్ఛేదకం-అవచ్ఛేద్యం :-

యౌగికంగా **క్రమ కాల** శబ్దములు పర్యాయాలైనా క్రమశబ్దానికున్నంత ప్రాచుర్యము కాలశబ్దమునకు లేదు. అఖణ్డమైన కాలము కలా కాష్ఠా లవ విఘటికా ఘటికా దిన మాసర్తు వత్సర యుగ కల్పపరాదిరూపమైన ఔపాధికభేదమున ఖండాఖండముగా వ్యవహరింపబడుతున్నది. ద్రవ్యమున మిక్కిలి చిన్నభాగము అణువు పరమాణువు పీలువు అను పేర్లతో పిలువబడినట్లే కాలము యొక్క అత్యల్ప భాగము కూడా అణువు లవము అని వ్యవహరింపబడుతుంది. క్రమముగా వాని సంఖ్యను ఇది ఒకటవ లవము, ఇది రెండవ లవము అని లెక్కింపవలెనన్న ఆ రెంటి మధ్యన వ్యవధానముండవలెను. అన్ని లవముల మధ్య అన్ని వ్యవధానములుండవలెను. ఆ

వ్యవధానములను, ఆ లవములను తనలో నిలుపుకున్న యొక అఖండ వస్తు వుండవలెను. అది శూన్యము కాదని ఈ వఱకే చెప్పబడినది. వ్యవధానమునే శూన్యము అని చెప్పినను దాని యధిష్ఠానము మాత్రము శూన్యము కాదు. శూన్యమునకు శూన్యమధిష్ఠానము కాజాలదు. లేకపోవుటయే శూన్యము కదా. అధిష్ఠానము కన్న భిన్నముగాని శూన్యము అనునది అధిష్ఠానరూపమే యగును. అధిష్ఠాన సత్తయే ఆధేయముల సత్తావ్యవహారమునకు హేతువు. ఆధేయము సత్తుగాని, అసత్తు (శూన్యము)గాని మిథ్యయే, అనిర్వచనీయమే. సర్వాధిష్ఠానము చైతన్యమే. అఖండమైన దానియందె సర్వవ్యవధానములు వ్యవహితములు. సద్వ్యవహారమును పొందుచున్నవి. వ్యవధానమన్నను వ్యవహితమన్నను ఆ అధిష్ఠానమున గోచరించు దాని భిన్న రూపములే. ఆ వ్యవధానము వస్తు వస్తు భేదకము. లేక వస్త్వవచ్ఛేదకము. అవచ్ఛేదము లేనిదే అవచ్ఛేద్యముండదు. వస్త్వవచ్ఛేదకత దానియందు భాసించు ధర్మము. అది కూడా ఆ భాస రూపమే. వ్యవహితము యొక్క భిన్నత నాశ్రయించి అవచ్ఛేదకమునకు అవచ్ఛేదకత, అవచ్ఛేద్యమునకు అవచ్ఛేద్యత ఏర్పడును. కావున అవచ్ఛేదకత అవచ్ఛేద్యతయు లేని అధిష్ఠానము అఖండ చైతన్యము. అది (బ్రహ్మము), కాలనామక మని, అది బ్రహ్మ, విష్ణు మహేశ్వరుల సృష్టి, స్థితి లయముల మూలము అని కూర్మ పురాణము చెప్పుచున్నది.

## అఖండకాలం-చైతన్యమే:-

అఖండకాలమునందు కాలఖండములు వ్యవహరింపబడుచున్నవి. ఏ భిన్న వ్యవహారమునను భేదక భేద్యతల వాస్తవములే ఆఖండ చైతన్యమే సదసద్వ్యవహారమునకు వ్యవధాన వ్యవహిత వ్యవహారమునకు ఇతర భిన్న వ్యవహారముల కన్నిటికిని హేతువగును. ఈ హేతువగుటయు భిన్నదర్శకుల దృష్టితోడనే. భేదమును దర్శింపని వారికంతయు అఖండ చైతన్యమే అంతట అన్ని కాలములలోను భాసించును. ఆ భాసము లేక మిథ్యాదర్శనము ఆ అఖండ చైతన్యము యొక్క స్వప్రకాశమున అనగా సాక్షియందు భాసించనిదే. ఆ అఖండ చైతన్యమే భానము, భాసము, జ్ఞానము అను పర్యాయములతో పేర్కొనబడును. దానికి కాలమను మరొక పర్యాయమును క్రమదర్శన మందించుచున్నది. స్త్రీ లింగమున అదియే కాలియనబడును. కే అనగా స్వస్వరూప సుఖమున ప్రాణి సమూహమును ఆలాతి సంపూర్ణముగా స్వీకరించును అనగా కలిపికొనును. కావున కాలియని ఆ పదమునకు వ్యుత్పత్తి చెప్పవచ్చును.

తంత్రములో మిథ్యాశబ్ద వ్యతిరేక స్థానమున విలాసశబ్దము ప్రయోగింపబడు



చుండును. చిద్వివర్తః ప్రపంచోయమనునది మిథ్యావాదము. చిద్విలాసః ప్రపంచోయ మనుట విలాసవాదము. వివర్తవాదము ఏకత్వానుభూతికి, విలాసవాదము ఉపాసనమునకు ఉపకరించును. ఇది స్థూలముగా విలాస వివర్త వాదముల ప్రయోజనము. శాక్తదర్శనముపాసనా ప్రధానము. బ్రహ్మ (అద్వైత) దర్శనము జ్ఞాన ప్రధానము. ఉపాసనము సాలోక్యాది సగుణముక్తి ద్వారమున కైవల్య హేతువు. జ్ఞానము సాక్షాత్కైవల్య హేతువు.

అవచ్ఛేదక కాలము వాచ్యాధ్వత్రయమున మొదటిదైన కలాధ్వము నుండి పుట్టినది. పుట్టుక చావులు లేని అఖండ కాలము (కాలి) చైతన్య స్వరూపము నిత్యము అని ఈ వఱకే చెప్పబడినది.

## కలా-కాల శబ్దాలు - కలి ధాతుజాలు :

ధాతుపాఠమున కల ధాతువు నాలుగుసార్లు విభిన్న భ్వాది చురాది గణములలో కనబడుచున్నది. వానిలో కలశము అనగా గణన మొకటి ఈవఱకే చెప్పబడినది. కలధాతువు నుండి వాచ్యాధ్వత్రయమున మొదటి దానికి వాచకమైన కలాశబ్ద మేర్పడినది. దాని నుండి యేర్పడిన కాలశబ్దము ఖండాఖండ కాల బోధకము. విద్యాతత్త్వమునకు చెందిన విద్యారాగ కాల నియత్యాది తత్త్వముల లోని కాలము ఖండకాలము. దానికి ఉత్పత్తి ఉన్నది. కావున అది నిత్య కాలము కాదు. అఖండకాలము కాదు. పైన చెప్పఁబడిన వాచ్య ప్రథమాధ్వమైన కల మాయనుండి పుట్టినది. శక్తి తత్త్వములలోని (ఖండ) కాలము ఈ కలనుండి పుట్టినది. ఈ కల సుషుప్తికి చెందిన అత్యల్పమైన అనగా అణువైన అజ్ఞాత కించిత్కర్తృత్వమును వ్యంజించును. ఈ కలయే సంసార బీజమునుబ్బునట్లు చేయగా దానినుండి నామరూపాత్మక జగమేర్పడును. జగము అంతయు కలాధ్వము నుండి పుట్టిన తత్త్వాధ్వ భువనాధ్వములతో నిండి యున్నది. మాయ నుండి ఉత్పన్నమైన కల మాయ యందే తన వికారమును చూపించును. కాని ఆ జీవాణుత్వవాదము ననుసరించి అణువైన జీవుని యందు వికారమును కలిగించలేదు. పరస్పర సాపేక్షములైన ఇంద్రియ విషయములందలి పరస్పర సాపేక్ష భోక్తృ భోగ్యత్వ భావము కలచేతనే ఏర్పడును. జీవునందు కర్తృత్వము భ్రాంతమే కాని వాస్తవము కాదు.

## నిత్యానిత్య కాల ప్రమాణాలు :-

విష్ణుధర్మోత్తర పురాణము సంకర్షణ నామకుడైన రుద్రుని కాలునిగా పేర్కొనుచున్నది. బోధాయన ప్రోక్త మహాన్యాసము సంకర్షణ స్వరూపో యోసావాదిత్యః

పరమ పురుషస్య ఏష రుద్రో దేవతా అని సంకర్షణ నామకుడు ఆదిత్యరూపుడు, పరమపురుషుడు అయిన రుద్రుని పేర్కొనుచు ఆదిత్య శబ్దముచేత ఆతని కాలాత్మ స్వరూపము బహుపురాణములలోను వైదిక గ్రంథములలోను పేర్కొనఁబడినది.

ఖండకాలము ఆదిత్య స్పన్ద రూపము అనుట ప్రాచీనాధునిక వైజ్ఞానిక సమ్మతము. జ్యోతిశ్శాస్త్రము **భూతానామన్తకృత్ కాలః కాలోన్యః కలనాత్మకః** భూతాన్తక రుద్రాత్మక కాలుడు వేరు. లవ కాష్ఠాది కలనాత్మక కాలుడు వేరని చెప్పఁబడుచున్నది.

కాల మాధవీ యోపోద్ఘాతము **నిత్యోజన్యశ్చ కాలౌ ద్వౌ తయో రాద్యః పరేశ్వరః సో2వాఙ్మనసగమ్యోపి దేవీ భక్తానుకమ్పయా** (నిత్యము జన్యము అని కాలము ద్వివిధము. ఆ రెండు కాలములలో మొదటిది పరమేశ్వరరూపము. అది అవాఙ్మనస గోచరమైనను భక్తుల మీది దయతో దేహమును ధరించినది) అని చెప్పినది.

## కాల లక్షణాలు :-

మహాభారత శాన్తి పర్వమున **నిశ్చితం కాలనానాత్వమ్ అనాదినిధనం చ యత్ కీర్తితం యత్ పురస్తాన్మే సూతేయశ్చాత్తి చ ప్రజాః** (లవ కాష్ఠాది కాలనానాత్వము నిశ్చితము. ఆద్యంతములు లేనిది కాలము అని నాకు నిశ్చితముగానే చెప్పఁబడినది. నాకు ముందే ఏ పరమేశ్వరుడు ఈ ప్రజలను సృష్టించునో సంహరించునో వాడు కాలుడు అనుట సందేహము లేనిది) అని చెప్పఁబడినది. ఇందును నానాత్వ రూపమైన కాలము వేఱు. నానాత్వము (ఆది మధ్యాంతములు) లేనిది సర్వ ప్రజా సృష్టి లయముల నొనర్చు కాలము వేఱు అనియే చెప్పఁబడినది. ఆ కాల స్వరూపమే స్త్రీలింగమున కాలిగా పేర్కొనఁబడినదని ఈ వఱకే చెప్పఁబడినది. కుల (క్రమ) దర్శనమున కాలము యొక్క ఐదు లక్షణములు చెప్పఁబడినవి.

(1) క్షేపము-అకుల శివుని కౌలికేశక్తి విశ్వావభాసనక్రమమున బిత్తి యందున్న విశ్వమును స్వాతంత్ర్య రూపస్వేచ్ఛ చేత బయటనుల్లసింపఁజేయుట. ఈ క్షేపమున సృష్టి అంతర్భవించును.

(2) జ్ఞానము - బహిరుల్లాసిత క్షేపాత్మక విశ్వము స్వాభిన్నమేయను పరామర్శము.

(3) సంఖ్యానము - భిన్నము చేయఁబడిన ప్రమాతృ ప్రమేయాది రూపార్థమును ఇది ఇది ఇదికాదు అని పరస్పర వివిక్తముగా వ్యవస్థాపించుట గణించుట వికల్పించుట.



(4) గతి అనగా జ్ఞానగతి. జ్ఞానమును (మోక్షమును) పొందుట ప్రతిబింబమువలె స్వరూపము తిరోహితముగాకుండ ఉండుట.

(5) నాదము - పై నాలుగు తొలగుట వలన నాదమాత్ర రూపమైన కలనమును చేయుచు సాధకుడు చిదానంద పూర్ణాహంతా సమావిష్టుడైనందున పరశాక్త రూపుడై ముక్తుడై స్వాత్మ పరామర్శ శేషుడై ఉండుట, సంవిత్తే లావెక్కి నీలాది రూపమునొంది ప్రమాణోపారోహ ద్వారమున ఆ నీలాది రూపతను విడచి ప్రమాత యందు విశ్రాంతి నొందుట ప్రమాత్రైకత్వమున నుండుట.

## కాలి - కాలాకర్షిణి :-

పై అయిదు విధములైన కలనముల నొనరించుట స్వతంత్రశక్తి పర పరాపర అపర అన్న త్రివిధ భేదముల తనలో కలిపికొన్న చతుర్థశక్తి కాలాకర్షిణి అనఁబడును. ఈ నాలుగు భేదములు సృష్టి స్థితి సంహార భేదమున త్రిగుణితములై పన్నెండగును. 1) సృష్టి సృష్టి ; 2) సృష్టి స్థితి; 3) సృష్టి సంహారము; 4) సృష్టి తురీయము; 5) స్థితి సృష్టి ; 6) స్థితి స్థితి; 7) స్థితి సంహారము; 8) స్థితి తురీయము; 9) సంహార సృష్టి ; 10) సంహార స్థితి; 11) సంహార సంహారము; 12) సంహార తురీయము. ఈ పన్నెండు రూపములు గల కాలి స్వనామమును సార్థక మొనరించు కొనును. ఎట్లనగా తురీయకాలిలోని సంవిత్తు భావమును (కలయతి) కలుపుకొని యుండును. (సృష్టి కాలి) బయట కూడి స్పష్టముగా (కలయతి) గుర్తించును. (స్థితి కాలి) దాని యందలి రాగమయత్వమును స్వీకరించి లోనికి ఉపసంహరింపఁదలచి (కలయతి) బయట ఉంచియే స్వీకరించి లోనికి స్వీకరించుచుండును (అనుభవించుచుండును). సంహారకాలి ఉపసంహార విఘ్నశంకను నిర్మించి (కలయతి) మింగును. దాని (వస్తువు యొక్క) బయటి స్థితి లేకుండఁజేయును.

పరా పరాపరా అపరా శక్తుల జాగ్రత్స్వప్న సుషుప్తి తురీయములనెడి ద్వాదశ శక్తుల సర్వభేదములను నాలుగుగా వర్గీకరించి కాలీశబ్దార్థానుగమము చూపఁబడినది. మిగిలిన వానినట్లే ఊహించు కొనవచ్చును. మహార్థ మంజరీ పరిమలమున **అనాఖ్యా ఆభాసా** అనుశక్తి ద్వయ మంగీకరింపఁబడినది. అనాఖ్యాశక్తి నిగ్రహమును భాసాశక్తి అనుగ్రహమును చేయునని చెప్పఁబడినది.

## కాలి-షట్పంచాశ ద్రూపములు :-

ఈ సృష్ట్యాది పంచశక్తుల దశగుణములుగా నొనరించి ఏబది ఆఱు

ప్రకారములు వివరింపఁబడినవి. ఆ పఞ్చ శక్తుల లక్షణములిట్లు చెప్పఁబడినవి. సృష్టి అనగా 1) ఉద్యోగ, 2) అవధాన, 3) చర్వణ, 4) ఆత్మ విలాపన, 5) నిస్తరంగత్వ లక్షణ ప్రధా పఞ్చక సమష్టి. ఉద్యోగము అవధానము చర్వణము ఆత్మ విలాపనము నిస్తరంగత్వము అనేవి పఞ్చప్రథలు. వీని సమష్టి సృష్టి. దాని కలలు పదునొకండు 1) క్రియ; 2) జ్ఞానము; 3) ఇచ్ఛ; 4) ఉద్యోగము; 5) ప్రతిభ; 6) స్వభావము; 7) అవభాసము; 8) సృష్టి; 9) స్థితి; 10) సంహారము; 11) అవధానము. సృష్టి స్థితి, సంహారము అనాఖ్య, భాస అను ఐదింటిలో స్థితి అనగా సంహరేచ్ఛకలుగనంత వఱకు అవికలముగా ఉండుట. దీని కలలు ఇరువది రెండు. శివచక్రమునందలి యుగనాథులు నల్వురు. వారిభార్యలు నల్వురు. హృదయ షట్కోణము నందలి కర్మ జ్ఞానేంద్రియ పఞ్చకములు (5+2) ఏడు. మనో2హంకార ద్వయ సహితములు (5+2) ఏడు. స్థితి కలలు మొత్తము **ఇరువది రెండు.** సంహారమనగా బహిరుద్వాంతములైన భావములు ప్రకాశమున తిరిగి ఉద్భవించునంతవరకు వాసనామయములుగా మారిపోయి ఉండుట. దీని కలలు కర్మజ్ఞానేంద్రియ పఞ్చకద్వయి పది, సర్వాంతఃకరణ సమష్ట్యహంకారము (10+1 =11) వీనిని భక్షించు శక్తులు పదనొకండు (11 + 11 = 22) అనాఖ్య అను చతుర్థశక్తి కలలు పదమూడు. షోడశి లేక సప్తదశి అనబడు ఐదవశక్తి ఒకటి (13 + 1 = 14) మొత్తము ఏబదియాఱు.

## కాళి సర్వోపాస్య :-

మహేశ్వరు ప్రకృతి యనఁబడు శక్తి ఏయే దర్శనములలో మతములలో ఏయే విధముగా భావింపఁబడునో ఆయా రూపముల ధరించి ఆయా దార్శనిక మతస్థుల రక్షించు చుండును. సౌరులకు ఆమె మహారాజ్ఞి, బౌద్ధులకు తార, కాళులకు కాలి, లోకాయతిక ముఖ్యులకు తదాత్వ, పాశుపతాదులకు శాంత, ఆర్హతు (జైను)లకు శ్రీ, హైరణ్యగర్భులకు శ్రద్ధ, వేదవాదులకు గాయత్రి, అజ్ఞానతిమిరాంధులకు మోహినియే. లోకమున కాలియని, వేదమున మహాదేవి అని పేర్కొనఁబడును. మనుష్యుల దృష్టిలో ఆమెకు రెండు రూపములున్నవి. ఒకటి గమ్యా (భార్య (ప్రేయసి), మరొకటి అగమ్య జన్మమున తల్లి, పూజాకాలమున దేవత; తల్లి జన్మకాల సంబంధిని కావున కాలి, దేవత. పూజాకాల సంబంధిని కావున కాలి భార్య (స్వకీయ) లేక వేశ్య (సామాన్య) పరస్త్రీ (పరకీయ) వీరు గమ్యులు. రతికాల సంబంధినులు కావున వీరును కాలీ నామ భాజనలే. కాలి యను స్త్రీలింగశబ్దముచేత కాలయను పుంలింగశబ్దముచేత లేక బ్రహ్మ ఇత్యాది నపుంసక లింగ శబ్దములచేత ఆమె తత్త్వము బోధింపఁబడినను ఆమె కా



లింగములు లేవు. ఆ లింగము లామెను వ్యంజింపఁజేయలేవు. పైగా ఆమెయే ఆ లింగ త్రయమును వ్యంజింపఁజేయును.

## కాళీ కాల సంబంధాల వైవిధ్యము :-

పరమేశ్వరు (కాలు) నకు ఆమె కులము, శక్తి, సామర్థ్యము, ఊర్ధ్వత, స్వాతంత్ర్యము, ఓజస్సు, వీర్యము, పిణ్డము, సంవిత్తు, శరీరము అని చెప్పఁబడును.

1. ఆమె - ఆయనకు కులము (గృహము), నివాస్య నివాసకత్వ బంధము.
2. ఆమె - ఆయనశక్తి శక్తి శక్తి మత్సంబంధము అభేద రూపము అని అద్వైతులు, భేదాభేద రూపమని విశిష్టాద్వైతులు, భేదరూపము అని ద్వైతులు.
3. ఆమె - ఆయన సామర్థ్యము. ఆయన సమర్థుడను వ్యవహారమున ఆమె మూలముననే కలుగును. వాచ్య వాచక భావ సంబంధము. ఈ సంబంధము కూడ అభేద రూపమని అద్వైతులు భావించెదరు.
4. ఆమె - ఆయన అధో భాగమున ఆధారమై ఉండగా ఆమె ఊర్ధ్వ భాగము ఆధేయమై యుండును. అందుచేత ఆమె ఆయనకు ఊర్ధ్వ అని చెప్పఁబడినది. సంబంధము ఆధాదాధేయ భావము.
5. ఆమె - ఆయన యొక్క స్వాతంత్ర్యము ఆమె. అనగా ఆయన యొక్క ఇచ్ఛ సంబంధము గుణగుణి భావము. గుణికి భిన్నముగా గుణము యొక్క దర్శనము ఉండనందున ఇది కూడ అభేద రూపమే అని అద్వైతులు భావిస్తారు.
6. ఆమె - ఆయన ఓజస్సు. ప్రకాశ్య ప్రకాశక భావ సంబంధము.
7. ఆమె - ఆయన వీర్యము. వీర్యము అనగా సృజనశక్తి, ధర్మ ధర్మి భావ సంబంధము.
8. ఆమె - ఆయన పిణ్డము. బ్రహ్మాండము యొక్క అంశమే పిండము కావున అంశాంశ భావ సంబన్ధము.
9. ఆమె - ఆయన సంవిత్తు. అపృథక్త్వ సంబంధము.
10. ఆమె - ఆయన శరీరము. శరీర శరీరి భావ సంబంధము.

భిన్నభిన్న శబ్దములలో శివశక్తుల భిన్నభిన్న సంబంధములు భిన్న భిన్న మతస్థులచే భావింపఁబడును.

## కులశబ్ద నిర్వచనాలు :-

1) కులం హి పరమాశక్తిః-కులమనగా పరమశక్తి
2) లయోదయ శ్చిత్స్వరూపసైన తత్కుల ముచ్యతే-చిత్స్వరూప సృష్టి లయములు కులములు
3) స్వభావే బోధమమలం కులమన్యత్ర కారణమ్-అమల బోధ స్వాభావికము కులమితర (అబోధ) హేతువు
4) సర్వకర్తృ విభు సూక్ష్మం తత్కులం వర వర్ణిని-సర్వకర్తృత్వ సర్వవ్యాపిత్వ సూక్ష్మత్వములు కలది
5) సర్వేశం తు కులం దేవి సర్వం సర్వవ్యవస్థితమ్-సర్వేశము సర్వము వ్యవస్థితముగా గలది కులము
6) శక్తి గోచరణం విద్ధి తత్కులం విద్ధి సర్వగమ్ -సర్వవ్యాపకమై శక్తి గోచరమై యుండునది కులము
7) కులమాత్మ స్వరూపం తు - ఆత్మ స్వరూపమే కులము
8) కులం స పరమానన్దః - పరమానన్దమే కులము
9) కులం శరీర మిత్యుక్తం - ఇత్యాది నిర్వచనము లెన్నో కుల గ్రంథములలో గోచరించును.

కుల శబ్దము నుండి కౌల శబ్దమేర్పడినది. కుల శబ్దము కౌలోపాసకుల సమూహ వాచకమని శక్తిసంగమతంత్రమున చెప్పఁబడినది. కాళీ మహా కాళ్యుపాసనములు ఉత్తరామ్నాయగత కాళీ మహాకాళీ మంత్రార్థ భావనా రూపములు. వీని నూర్ధ్వామ్నాయగతములుగా కొందఱు భావించుట కలదు.

## అక్షర సంఖ్యానుసారంగా మంత్రములు-భేదములు :-

మంత్రములలో కొన్ని ఏకాక్షరములు. 1) వర్ణమాలలోని అచ్చులకు చివఱ మకారము లేక అనుస్వారము చేర్చబడి అట్లే, 2) హల్లులకు అమకారములు లేక అకారానుస్వారములు చేర్చి, 3) కొన్ని హల్లులకు అకారేతరములైన అచ్చులు అనుస్వారమే కాక, 4) విసర్గ చివఱకు చేర్చబడి, 5) రెండు హల్ వర్ణముల సంయోగమునకు లేక బహు వర్ణముల సంయోగమునకు అచ్చులు అనుస్వారము, లేక అచ్చులు విసర్గము చేర్చబడి బహువిధములైన ఏకాక్షర మంత్రములున్నవి. వీనికి **బీజములని** వ్యవహారము. వర్ణ క్రమములోని ప్రతి బీజమునకు లేక అన్ని బీజముల సమూహమునకు మాతృకయని పేరున్నది. ఈ శబ్దము వర్ణము నుండి సృష్టి అను



సిద్ధాంతమును సృష్టి కర్తృత్వము స్త్రీకి భావించుట సముచితము అన్న సిద్ధాంతమును సూచించును. వర్ణ శబ్దము అక్షర శబ్దము ఏకార్థమున ప్రయోగింపఁబడినను కేవలాచ్చులు అజంతములైన హల్లులును అక్షరములనుట సముచితము. అర్ణ శబ్దము వర్ణ పర్యాయము. అర్ణవ శబ్దము సముద్రమును చెప్పునట్లే సాంకేతికముగా వర్ణములనుండి యేర్పడిన సమస్త వాఙ్మయమునకును సూచకమైయుండుట అచ్చుటచ్చుట కన్పించును.

పరమాత్మ అర్ణవశాయియై నారాయణుడని చెప్పఁబడుటలోని రహస్యార్థ మేమనగా సగుణ బ్రహ్మ వర్ణసమూహము లేక మంత్ర సమూహము చేత వాచ్యుడనుట, నిర్గుణ బ్రహ్మ తల్లక్ష్యార్థ భూతుడనుట.

మంత్రములలో ద్వ్యక్షరములకు **కర్తరులని** పేరు. వర్ణాదియైన అకారమును వర్ణాంత హకారమును కలిపి అమ్ బీజ సహిత మొనర్చినచో అహం శబ్ద మేర్పడును. ఇది ఆత్మవాచకము. తచ్ఛబ్దము సగుణ బ్రహ్మ వాచి. తచ్ఛబ్దము యొక్క పుంలింగ ప్రథానైక వచన రూపము సః అనునది, ఇవి రెండు కలిసి అహంసః / సః అహమ్ ఆవృత్తిలో సోహం సోహం సో రూపుదిద్దుకొని హంస మంత్రముగా పేర్కొనఁబడినది.

ఉచ్ఛ్వాస నిశ్వాసములలో సోహం శబ్దముల భావనము లేక మానసికో చ్చారణము అజపా జప మనఁబడును. అద్వైత దర్శనమున సో2హం భావనము లేక ఉపాసనము జీవ బ్రహ్మైక్య సాక్షాత్కార హేతువుగా విచారముతో పాటు చెప్పఁబడినది. సో2హం శబ్దముల (చివరి మకారము తప్ప) హల్వరి త్యాగమున ఓం శబ్దమేర్పడును. మిగిలిన శబ్దము లోపించువాని యర్థమును గూడ చెప్పునను వ్యాకరణ సిద్ధాంతము ననుసరించి ఓంకారమును సో2హ మర్థకమే యగును. అట్లే అహం శబ్దములోని అకారము శివవాచకముగా హకారము జీవ వాచకముగా చెప్పబడినచో అహం శబ్దమే సోహం ఓం శబ్దములవలె జీవ బ్రహ్మైక్య లక్షక మగును. అందుచేత అహం శబ్దము తంత్ర దర్శనములలో నెంతో ప్రాధాన్యమును పొందియున్న ద్వ్యక్షర మంత్రము. ఇది అహంతా వాచకమే గాక తాంత్రికోపాసనా సిద్ధియైన పూర్ణాహంతా వాచకము కూడ. ఏకాక్షర మంత్రములకు **పిండములు** అని పేరు. మూడు అక్షరములు మొదలు తొమ్మిది అక్షరములు గల మంత్రములు **బీజకములు** అనఁబడును. పది అక్షరముల మొదలు ఇరువది అక్షరములు గల మంత్రము **మంత్రకములు** అని చెప్పఁబడును. ఇరువది అక్షరములు మించిన అక్షరములు గల మంత్రములు **మాలా మంత్రములు** అని చెప్పఁబడును.

తొలుత వర్ణములకు మంత్రత్వము, వర్ణ సమూహ రూప పదముల మంత్రత్వము, పద సమూహ రూపవాక్యముల మంత్రత్వము సిద్ధించగా అమంత్రక శబ్దమే లేదని తేలును. శబ్దము లేక కొన్ని అక్షరములే ఉపాసనలలో దేవతా వాచకములుగా దేవతా సూచకములుగా తంత్రములలో చెప్పఁబడును. లేఖనమునకు సాయపడు ఈ వర్ణముల లిపులైన రేఖల యొక్క బిందు రూపావయవములలో కూడ దేవతాభావనము చేయు పద్ధతి తంత్రములలో గోచరించును. రేఖలన్నియు లిపిలోనత్యంత సూక్ష్మమైన బిందు (చుక్క) మయములే. బిందువు చెప్పరానంత సూక్ష్మ మగుటచేత కొన్ని బిందువుల సమూహమే (చుక్క) బిందువు అని పేర్కొనుట తప్పని సరియగును. శ్రీ చక్రము యొక్క పై త్రికోణమున నున్న బిందువు లిఖింపఁబడక పోవుట కిదియే కారణము అనుకొనుట సరియైనదే అనిపించును. అహం శబ్దములో మొదట నొక అకారము హకారోత్తరమున మరొక అకారము నున్నవి.

చివరి అకారము ఉత్తరము అనుకొన్నప్పుడు మొదటి అకారము అనుత్తరము అనఁబడదగును. ఏదైనను అకారము యొక్క లిపి భేదముల ననుసరించి కాబోలు అవయవములు చెప్పఁబడినవి.

## అకారము యొక్క ఆకారము-దానిలో భావింపదగిన శక్తులు :-

**అకారస్య శిరోరౌద్రీ వక్త్రం వామా ప్రకీర్తితా।**
**అమ్బికా బాహురిత్యుక్తా జ్యేష్ఠా చైవాయుధం స్మృతా॥**

ఈ శ్లోకమున జ్ఞానేచ్ఛా క్రియామ్బికా శక్తుల ధ్యానము అకారమున ఎట్లు చేయఁదగునో చెప్పఁబడినది. అకారము యొక్క శిరము రౌద్రి (క్రియాశక్తి). దాని యొక్క ముఖము వామ (ఇచ్ఛాశక్తి) ఏ ఆయుధముతో ఆ దేవత లోకమును పాలించునో ఆ ఆయుధము జ్ఞానశక్తియైన జ్యేష్ఠ. ఆ ఆయుధ మేబాహువున ధరింపబడునో ఆ బాహువు అమ్బిక యని పేర్కొనఁబడినది. శాక్తేయ తంత్రమున పౌరాణిక బ్రహ్మ విష్ణు రుద్రేశ్వరుల సృష్టి స్థితి లయరూప త్రికృత్యములను వామా జ్యేష్ఠా రౌద్రీ అమ్బికలు నిర్వహింతురని చెప్పఁబడినది. అనగా బ్రహ్మలోని సృజించు శక్తి వామ, విష్ణువులోని పాలన (స్థితి) శక్తి జ్యేష్ఠ, రుద్రునిలోని సంహార శక్తి రౌద్రి. బ్రహ్మ రజోగుణ ప్రధాన వామాశక్తి యుక్తుడు. విష్ణువు సత్త్వగుణ ప్రధాన జ్యేష్ఠా శక్తి యుక్తుడు. రుద్రుడు తమోగుణ ప్రధాన రౌద్రాశక్తి యుక్తుడు. ఈ శక్తులు చేయు పనులను చూచుటయే బ్రహ్మ విష్ణు రుద్రులపని. ఈ మూడు గుణములలో బ్రహ్మ విష్ణు రుద్ర రూపములను ధరించు ఈశ్వరునిలోని అమ్బికాశక్తి చేయుచుండగా చూచుటయే ఈశ్వరుని పని.



ఈ సృష్టి స్థితి లయముల కర్తృత్వము శక్తులకే అని శక్తి ప్రాధాన్యమును వివరించు శాక్తేయ తంత్రమున వాని ప్రమేయము లేనప్పుడు బ్రహ్మ విష్ణు రుద్రేశ్వరులు కేవలము శవప్రాయులే. వారి ప్రాణము లాశక్తులే. ప్రాణశక్తి లేనివారు శవములనుటలో దోషము లేదని శాక్తేయ తంత్రాభిప్రాయము.

మహార్థ మంజరి యను కాల గ్రంథమున రాజనమున (ప్రకాశింపజేయుట చేత) రంజనమున (జనులను సంతోషపెట్టుట చేత) కాలుడే రాజు. (రాజు భార్య అగుటచే అమ్మవారు రాజ్ఞి అనఁబడుట వేరు విషయము). ఇంద్రియము లాతని వలన పుట్టినవి అగుటచే వానికి రాజ పుత్రత్వము కూడ చెప్పఁబడినది. ఇట్లు కుల తంత్రమున ఇతర తంత్రములలో కానరాని కొత్త పరిభాషలు కానవచ్చును.

## కౌలులో బాహ్య వామాచార ప్రవేశహేతువు :-

కులతంత్రానుయాయులను కౌలులని చెప్పుట లోకమున నున్నది. కాల క్రమమున బాహ్య (విడువదగిన) ఆచారములు మద్యపానము. మాంస భక్షణము మత్స్య భోజనము దేవతా నివేదనానంతరము స్వీకరింపఁబడుట మొదలగునవి వచ్చి చేరినవి. తంత్రములు సార్వవర్ణికాధికారము లగుట చేత సర్వవర్ణులను శాకాహారులు కాకపోవుటచేతను, మాంసాహారులకు శక్తి పూజ నిషిద్ధము కాకపోవుటచేతను, అనివేదితమును స్వీకరింపరాదను నియమము ఆరాధకులలో నుండట చేతను అట్టి బాహ్యాచారముల ప్రేరేపించుటలో ఆశ్చర్యము లేదు. కౌల తంత్రము నందలి సర్వము కాళీ మయము అను సిద్ధాంతము సమాదరణీయము. దార్శనిక దృష్టితో మంచి ఎట్లు కాళీమయమో, లోక బాహ్యమైన చెడును కాళీమయము అనుట కాదనరానిదే. అందుచేతనే చెడు ఆరాధింపఁబడకుండుటకు భగవద్గీత విభూతియోగమున ఉత్తమ వస్తువునందే ఈశ్వర భావనము చేయదగినది అని ప్రతిపాదింపఁబడినది. జీవులలో అనేక ప్రకృతుల వారుందురు. తామస ప్రకృతులలో బాహ్యాచార సమాదరణము మన మెఱుగనిది కాదు. వారిలో బుద్ధిమంతులు తమ ఆచారములకు ఉత్తమత్వమును ఇంకను చెప్పవలెనని దివ్యత్వమును కల్పించుకొనుట అసహజము కాదు. అది కారణముగ మహిళ మాతయైనను వేశ్యయైనను పుంశ్చలియైనను భార్యయైనను సోదరియైనను పుత్రికయైనను శాక్తేయ సిద్ధాంతము ననుసరించి పూజనీయ యగును. తామస భావోద్రేకమున **'మాతృ యోనిం పరిత్యజ్య విహరేత్సర్వ యోనిషు'** తల్లి యోని తప్ప ఏ యోనిలో నైనను విహరింపవచ్చుననుట వంటి వచనములు వారికి రుచించుటయు అసహజము కాదు.

యోని అను పదము కారణము అను అర్థముకల శబ్దము. తన యోని ద్వారమున ప్రాణులకు జన్మనిచ్చునది మహిళ. ఆమె దేని ద్వారమున ప్రాణుల జన్మను కలిగించునో ఆ యోని మరియు పూజనీయము. రేఖా గణిత శాస్త్రమునందలి త్రికోణ శబ్దము శ్రీ చక్రాది యంత్రములందలి త్రికోణములు యోని అను శబ్దము చేత పేర్కొనఁబడినవి. ఈ పరిణామ క్రమమున ప్రత్యక్ష యోని పూజ చోటు చేసుకొన్నది. ఎంత బలమైన హేతువాదమున్నను సమాజమున దాని నిరసనీయత సర్వ శిష్టాంగీకార్యము. విశృంఖల ప్రవృత్తిని కలిగించు ఆచారము లథః పతన హేతువనుట సార్వకాలిక సత్యము.

కౌలోపాసన స్థాయి వేరు. కౌలమున ప్రవేశించిన బాహ్యాచారముల స్థాయి వేరు. ఉపాసనా స్థాయిలో మూలాధారాది స్వాధిష్ఠాన చక్రము గుదోపస్థా సన్నిహితములు. కావున వాని యందు మానసిక పూజయైనను పనికిరాదని సమయాచారులు భావించినారు. కౌలులు 'వికారహేతౌ సతి విక్రియంతే యేషాం న చేతాంసి త ఏవ ధీరాః' వికార హేతువున్నప్పుడు వికృతి చెందకుండుటయే ధీర లక్షణము అని భావించు వారు, ఆ మూలాధార స్వాధిష్ఠానములు సైతము శక్తి యొక్క మానసపూజ (అంతర్యాగమున) కర్హములే అని భావించినారు. గౌడపాదాచార్యుల వంటి సమయాచారులచే (సుభగోదయస్తుత్యాది గ్రంథములందు) నిందింపఁబడినారు. శ్రీ శంకరులు మాత్రము మూలాధార స్వాధిష్ఠానములలోని శివశక్తి మిథునముల నామరూప భేదమున సౌందర్యలహరిలో స్తుతించి కౌల సమయాచారముల సమన్వయించినట్లు తోచును.

## షట్చక్ర క్రమము :-

| | | |
|---|---|---|
| **మూలాధారము** | - | **భూ తత్త్వము** |
| **స్వాధిష్ఠానము** | - | **జల తత్త్వము** |
| **మణిపూరము** | - | **అగ్ని తత్త్వము** |
| **అనాహతము** | - | **వాయుతత్త్వము** |
| **విశుద్ధము** | - | **ఆకాశ తత్త్వము** |
| **ఆజ్ఞాచక్రము** | - | **మనస్తత్త్వము** |

కొన్ని ప్రాచీన యోగగ్రంథములందీ క్రమమిట్లే చెప్పఁబడినది. ఇది యుక్తి యుక్తముగను సక్రమముగను ఉన్నది. కాని శ్రీ శంకరులు స్వాధిష్ఠానము నగ్ని తత్త్వముగా, మణిపూరమును జల తత్త్వముగాను సంభావించుటకు కారణము తెలియదు. అన్ని కుల దర్శనములలో హేయమైన ఆచారములు ప్రవేశించి యుండలేదు. కొన్నింట మాత్రమే ప్రవేశించినవి.



భాస్కరాచార్యులవంటి మహామనీషి యజ్ఞములలో పశుహింస దోషము కానట్లు, శక్తి పూజయందు మద్యపానము దోషము కాదని నిరూపించుటకు ప్రయత్నించినారు. అంతటి మహామనీషి ప్రయత్నము వైదికుల కంగీకార్యము కాలేదు. ఆ ప్రయత్నము నిర్ద్వంద్వముగ తిరస్కరింపఁబడినది.

కౌలోపనిషత్తులోని జ్ఞానం బన్ధః అజ్ఞానం మోక్షః (జ్ఞానము బన్ధము, అజ్ఞానము మోక్షము) వంటి విపరీతార్థాలు గల వాక్యాలు కనిపిస్తాయి. అవి అనధికారులను కౌలం లోనికి వచ్చే అవకాశం లేకుండా చేయడానికేనని కౌలతత్త్వజ్ఞులు భావిస్తారు. భాస్కరరాయలు ఆ ఉపనిషత్తును ఉత్తమాద్వైతాన్ని నీతిని వ్యంగ్యంగా బోధించేదిగా వ్యాఖ్యానించారు. మద్యపానం సంవిన్మద్య పానమే, మత్స్య భక్షణం అంటే జీవ భావ నిరాసమని ఇత్యాదిగా దురాచారాలైన మద్యపాన మత్స్యభక్షణాలను కౌలం బోధించదని ఆ పదాలు అర్థాంతర బోధకాలుగా కౌల తాత్త్వికులు వ్యాఖ్యానించారు. కౌలం రహస్య తత్త్వమని దానిలోనికి అనధికారులు ప్రవేశించకుండా ఉండడానికే విపరీతార్థాలు వాచ్యాలుగా ఉండే వాక్యాలను ప్రయోగించారని కౌల తత్త్వవ్యాఖ్యాతలు నిరూపించారు. అయినప్పటికి ఆ వాసనతో ఏర్పడిన కౌల సమయ మిశ్రాచారులు రాగి పాత్రలో చక్కెరనీళ్ళు మద్యంగా నివేదించడం, గుమ్మడికాయ, టెంకాయ వంటి వాటిని పగులకొట్టడం, మేక మొదలైన జంతువుల బలికి ప్రత్యామ్నాయమని భావించి అట్లా పూజలు నిర్వహించు కొంటున్నారు. ప్రస్తుతం దేశంలో మిశ్రాచారాలే అధికంగా పాటింపఁ బడు తున్నాయి.

వామాచారులని పిలువఁబడే కౌల బాహ్యాచారాల సాధనగూడ నిర్వహించి సిద్ధిని పొందిన శ్రీ రామకృష్ణ పరమహంస ఆ మార్గాన నడవడం దొడ్డిదారి గుండా పరమేశ్వరుని చేరే ప్రయత్నమేనని, ఆ మార్గం పట్ల తమ నిరసనభావాన్నే ప్రదర్శించారు. బాహ్యాచారుల మాట ఎలా ఉన్నా శుద్ధకౌల దర్శన గ్రంథాలలో దాదాపు అవైదికాంశాలు లేవనే అంశం గమనింపఁదగింది. కాబట్టే తత్త్వదృష్టి కలవారు ఆ దర్శనాన్ని సముచితంగా గౌరవిస్తూనే ఉన్నారు.

వర్ణమాలలో పదునైదవ అక్షరమును సబిందుకంగా అంటే బిందూత్తరమైన అకారంగా ఉచ్చరిస్తారు. వ్రాస్తారు. అలా ఉచ్చరించడం తప్పనిసరి. ఉచ్చారణార్థ మైన అకారము యొక్క లేఖనం కూడా కేవల బిందువునుచ్చరించడం సాధ్యంకాదని చెప్పడం కోసమే. పదునారవ విసర్గ విషయంలో కూడ పై వివరణం యథాతథంగా వర్తిస్తుంది.

## మకార బిందు భేదము :-

బిందువు శివునకు,విసర్గము శక్తికి సంకేతంగా ఒకప్పుడు వ్యుత్క్రమంగా కూడ తాంత్రికులు భావిస్తారు. బిందువునకు ప్రత్యామ్నాయంగా మకారోచ్చారణం కనిపించినా మకారం, బిందువు భిన్న భిన్నాలే. పైగా ఏకాక్షరములైన బీజ మంత్రాల్లో బిందువు మకారోత్తరంగా ఉచ్చరించఁదగినదైన అక్షరంగానే సూక్ష్మ పరిశీలకులచే గమనింపఁబడిందనేది కూడా వాస్తవమే. ఇంతేగాక బిందువు మొదలైన తొమ్మిది సూక్ష్మనాదాలు తంత్రజ్ఞులచే అధికంగా ఆదరణీయాలుగా ఉన్నాయి.

## నాదభేదములు :-

చంద్రమండలము, (బిందువు) అర్థచంద్రము, రోధిని, నాద, నాదాంత, శక్తి, వ్యాపిక, సమన, ఉన్మనీ అనేవి ఒకదానికంటే ఒకటి సూక్ష్మ సూక్ష్మతర సూక్ష్మతమ కాలోచ్చారణీయాలు. ఆజ్ఞ అనబడే భ్రూమధ్యము మొదలు సహస్రారం వరకు ఉన్న స్థానం (స్థలం) లో క్రింది నుండి పై వరకు అవి ధ్యేయాలు కూడా. ధ్యానానికి అవసరమైన ఆకారాలు కూడా తంత్ర గ్రంథాలలో నిర్దేశింపఁబడినాయి. హ్రీం వంటి సంయుక్తాక్షర మంత్రాల్లో, హ్రీంకారంలో హకారరేఫకారాలు మూడు పై తొమ్మిది నాద భేదాలు కలిపి మొత్తము పన్నెండు వర్ణాలున్నాయని చెప్పఁబడింది.

## శివశక్తి ప్రణవాలు :-

ఓంకారానికి తారం ప్రణవం లాంటి పేర్లున్నట్లు హ్రీంకారానికి గుహ హృల్లేఖవంటి పేర్లున్నాయి. ఇంతేగాక ఇటువంటి ఏకాక్షర మంత్రాలకు ధ్యేయమైన దేవీ రూపాన్ని అనుసరించి వేరు వేరు పేర్లు చెప్పఁబడినాయి. హ్రీంకారాన్ని భువనేశ్వరీ బీజమని, శ్రీం కారాన్ని లక్ష్మీబీజమని, క్లీంకారాన్ని కామబీజమనీ, ఐంకారాన్ని వాగ్బీజమనీ సౌఃను శక్తిబీజమని ఇత్యాదిగా ఉన్న నామాలు ధ్యేయ రూపాన్ని కొంచెం సూచిస్తాయి.

వైదికులు ఓం కారాన్ని సృష్ట్యాది ఆవిర్భవించిన వేదాల మూలంగా తత్త్వసారంగా భావించినట్లే తాంత్రికులు కామకల అనే పేరుగల సృష్ట్యాది శబ్దంగా సృష్టి మూల శబ్దంగా ఈంకారాన్ని భావిస్తారు. కొందరు ఏకారాన్ని, మరికొందరు శ్రీంకారాన్ని ఇతరులు క్లీంకారాన్ని కామకలగా భావిస్తారు. సంయోగాదులైన ఈకారాంతాలైన ఏకాక్షర మంత్రాల్లో క్లీంకారాన్ని కొందఱు కాలీబీజంగా భావించడం ఉన్నది.



## కామకల వైదికం :-

క్లీంకారాదులలోని (హల్లులను) సంయోగాన్ని తొలగించగా మిగిలిన ఈకారాన్ని కేవల అనే పేరుతో కూడ పిలుస్తారు. క్లీంకారంలో కకార లకారాలను తొలగించి కేవల నుచ్చరించడాన్ని **ఈగ్ం శృణోతి అలకగ్ం** (లకార కకార రహితాన్ని) **శృణోతి** అనే వేదమంత్రంలో ఈంకారమే ప్రస్తావింపఁబడిందని తాంత్రికులు భావిస్తారు. ఋగ్వేదంలోని ఎన్నో మంత్రాలలో ఈంకారం కనిపిస్తుంది. కాని వేదభాష్యంలో జప్యమైన మంత్రంగా వ్యాఖ్యానింపఁబడలేదు. శ్రీ విద్యను సంభావించే తాంత్రికులైతే వైదికమైన త్రిపురోపనిషత్తే పంచదశీమంత్రాన్ని ఉద్ధారిస్తుండడాన్ని ప్రముఖంగా ప్రస్తావిస్తారు. అరుణోపనిషత్తులోని వాక్యాలన్నిటిని పంచదశీమంత్ర విషయవివరణ పరాలుగా వ్యాఖ్యానిస్తారు. త్రైవర్ణిక బ్రహ్మవిద్యకు ప్రత్యామ్నాయంగా సార్వవర్ణికమైన శ్రీవిద్యను బహుముఖంగా సంభావిస్తారు. శ్రీ శంకరులే పూర్వదక్షిణోత్తర పశ్చిమామ్నాయ పీఠాలలో చంద్రమౌళీశ్వరారాధనతో పాటు శ్రీ చక్రము యొక్క ఆరాధనను ప్రవేశింపఁజేశారనీ వక్కాణిస్తారు.

## పూజలు-యాగాలు :-

తాంత్రికములైన దేవీస్తోత్రాల వ్యాఖ్యాతలు తమ ఇష్ట దేవతయైన దేవీ తత్త్వాన్ని వివరించేటప్పుడు వైదిక మంత్రాల నెన్నింటినో, వైదిక వాఙ్మయానికి చెందిన అనేక పౌరాణిక శ్లోకాలను ఉదహరిస్తారు. బౌద్ధాది నాస్తిక తంత్రాలను తప్ప, ఈశ్వరాంగీకారం గల తంత్రాల వైదికత్వాన్ని వేదమూలత్వాన్ని కాదనడం అసాధ్యమే అవుతుంది. ఇంతేగాకుండా సప్తశత్యాది పౌరాణిక వాఙ్మయ శ్లోకాలకు మంత్రాలకువలె అంతమందు స్వాహాకారాన్ని చేర్చి బహిర్యాగాలను నిర్వహించడమే కాకుండా ఆరాధనలను కూడా బహిరంతర్యాగాలుగా పేర్కొంటారు. పౌరాణిక యాగాలను నిర్వహించేటప్పుడు కూడ వైదికయాగాల ఆరంభంలోని కుండ సంస్కారాదులను నిర్వహిస్తారు. కుండ నిర్మాణాది వైదిక యాజ్ఞిక క్రియా కలాపంలో తాంత్రికత అనివార్యంగా భాసిస్తుందనడంలో కూడ సందేహించ నక్కఱలేదు. కావున కొందఱు ఆధునిక తాంత్రికులు **విద్య ద్వివిధా తాంత్రికీ వైదికీచ** అని విద్య తాంత్రికమని వైదికమని రెండువిధాలుగా ఉంటుందనడంలో ఎంత అనౌచిత్యముందో విద్వాంసులు గ్రహింపగలిగే ఉంటారు.

## కామకల అమ్మవారి రూపం :-

దర్శనాల్లో సూత్ర గ్రంథాలన్ని ఇంచుమించుగా అథాతో అని ఆరంభింపఁబడతాయి. అథ శబ్దం ఓంకారం వలె బ్రహ్మకంతాన్ని భేదించుకొని వచ్చిన శబ్దంగా

భావిస్తారు. వర్ణక్రమంలోని మొదటి ముప్పదిరెండు వర్ణాలకు అకారము మొదటిది. తరువాతి వర్ణాలకు థకారము మొదటిది. త్రిపురోపనిషత్తులో శ్రీ చక్రంలో వర్ణమాల ఉండదగినదనే అంకాన్ని 'అకథా అత్ర సన్నవిష్టా' అని పేర్కొనడం జరిగింది. అకథ అను మూడు వర్ణములు వర్ణ షోడశీత్రయానికి ఆరంభ వర్ణాలు అనే అంశాన్ని పరిశీలిస్తే అథ శబ్దం యొక్క ప్రాముఖ్యం బాగా అర్థమవుతుంది. అథ శబ్దం వలె శ్రీశబ్దం కూడా మాండలికంగా భారతదేశంలో సంస్కృత వాఙ్మయంలోనేగాక దేశీయ వాఙ్మయాల్లో కూడ ఆరంభంలో ప్రయోగింపఁబడింది. ఇప్పటికీ ప్రయోగింపఁబడుతున్నది.

శ్రీం బీజాన్ని కామకల అంటారు అని చెప్పడం జరిగింది. ఇందులోని బిందువు కామకల అని చెప్పఁబడే దేవత యొక్క ముఖముగా శకార మొక స్తనముగా, రేఫము మరొక స్తనముగా ఈకారము గుహ్యముగా భావింపఁబడింది. వెనుక బిందువు శివ స్వరూపము అని, విసర్గము శక్తి స్వరూపమని చెప్పడం జరిగింది. బిందు విసర్గలు కలిపి మూడు బిందువులు వీనిలో తొలిబిందువు శివ స్వరూపము. మూడవ కన్ను మొదలైన శివ లక్షణములు దేవి ముఖమందుండుటచే శివ స్వరూపమైన బిందువు దేవీ ముఖము అని చెప్పఁబడింది. దేవి అని చెప్పఁబడిన స్త్రీ దేవతకు స్తనములు ముఖ్యలక్షణం కావున శక్తి స్వరూప విసర్గములోని రెండు బిందువులు స్తనములుగా చెప్పఁబడినవి. సృష్టిలో మొదటి బింద్వాకారమున కనిపించు సూర్యబింబము అమ్మవారి ముఖముగా భావింపఁబడింది. విసర్గరూప స్తనద్వయమున చంద్రబింబము సుధాపూర్ణమైనట్లు అమ్మవారి స్తనము సర్వజీవ పోషక స్తన్య సుధతో నిండియుండు కారణమున ఎడమ స్తనము శకారము అనఁబడే చంద్రబింబము, రేఫము అనఁబడే అగ్ని మండలము దక్షిణ స్తనము కుడి భాగము పుంభాగము. పుం స్వభావమైన తీక్ష్ణత కారణముగా కుడి స్తనము అగ్ని మండలము అని చెప్పఁబడినది. త్రి బిందువులతో త్రికోణ మేర్పడు కారణమున బిందు త్రయ రూపమైన ఈకారము ఆ దేవత గుహ్యముగా చెప్పఁబడినది.

## అహమ్-అః :-

బిందువకారముగా, విసర్గము హాకారార్థ రూపమైన విసర్గము కాగా అః అనునది అహమ్ అను కామకలా రూపాంతరము యొక్క సంక్షిప్త రూపమైన అః స్వరము మధ్య యందు గలది శ్రీ చక్ర త్రికోణము. అః స్వర మధ్యమ్ అని త్రిపురోపనిషత్తులో చెప్పఁబడినది. పదునాఱు అచ్చులలో విసర్గము షోడశి (పదునాఱవది). అది అకార



పూర్వకముగా ఉచ్చరించుటకు వీలైనది. ఏ అచ్చునకు పరముగానైన విసర్గము చేరదగినదే యైనను ప్రథమాతిక్రమణే కారణాభావాత్ (మొదటిదైన అకారమును విడచి పెట్టుటకు కారణము లేనందున) అను న్యాయము ననుసరించి పై ఉపనిషత్తు అఃస్వర మధ్యమ్ అని అః కారమే షోడశ స్వరముగా పేర్కొనఁబడినది. ఆ త్రికోణము యొక్క మూడు భుజములందు మిగిలిన పదునైదు స్వరములను ఐదేసి చొప్పున ఉన్నట్లు భావించుట శ్రీ విద్యా సంప్రదాయ సిద్ధ విషయము. పై ప్రథమాతిక్రమణే కారణాభావాత్ అను న్యాయము ననుసరించియే వర్ణక్రమములోని హల్లులన్నియు అకార పరములుగా ఉచ్చరింపఁబడుట లిఖింపఁబడుట సంప్రదాయమైనది.

## చండీలలితా సంప్రదాయాలు :-

ప్రస్తుత కాలమున నవార్ణ మంత్ర ప్రధానమైన చండీ సంప్రదాయమున పంచదశీ ప్రధానమైన లలితా సంప్రదాయమునను నవరాత్రములు జరుపఁబడుచున్నను, నవరాత్రదీక్ష ప్రధానముగా చండీ సంప్రదాయమునకు చెందినది. **ప్రతిపన్ముఖ్య రాకాంత తిథిమండల పూజితా** అను లలితా సహస్రనామస్తోత్రగత నామము ననుసరించి పదునైదు దినములలో దీక్షనో మాసదీక్షనో లలితా సంప్రదాయమున స్వీకరించదగియున్నది. అయినను శ్రీ చక్రమున నవచక్రము అంతర్గతమై యుండుట హేతువుగా లలితా సంప్రదాయమున నవరాత్ర దీక్ష ఉచితమేయగును.

నవరాత్ర దీక్షలో కలశ స్థాపనము ప్రధానము. దేవీ పూజలలో ప్రధాన కలశములతో పాటు ఇతర కలశములును స్థాపించఁబడుచుండును. కలశ శబ్ద పర్యాయము ఘటము. ఘటస్తవము అనుపేర కాలిదాసు రచించినాడు అని భావింపఁబడు ఘటస్తవమొకటి శాక్తేయ లోకమున ప్రసిద్ధమై యున్నది. బిందువు ఆకారము తనలో కలిపికొన్న కలశము దేవికి ప్రతినిధిగా నవరాత్రాది దేవీ పూజా దీక్షలలో కలశ స్థాపనము ఔచిత్యమును సంతరించుకొనుచున్నది. ముఖ్యముగా కాలీ శబ్దములోని కకార లకారములు గల క్లీం బీజము యొక్క స్థూలాకార కల్పనమే కలశము. కకార లకారములు ఇందు (క్లీం బీజమునందు) శయనించి యుండునను వ్యుత్పత్త్యర్థము ననుసరించి క్లీం బీజ బాహ్యరూపమైన కలశ(ఘట)మునకు కలశనామము సార్థకమగుచున్నది.

## పితరౌ అంటే తల్లిదండ్రులే, ఇద్దఱు తండ్రులు కారు:-

కుల దర్శనమున వాగర్థములు తల్లిదండ్రులుగా భావింపఁబడినను వాక్కునకు

చెందినవి. వర్ణపద మంత్రాధ్వములు మూడు వాగధ్వములు, అర్థమునకు చెందిన కలాతత్త్వ భువనాధ్వములు మూడు కలిపి షడధ్వములు వాగర్థ రూపులైన పార్వతీ పరమేశ్వరులు 'షడధ్వపితరౌ' (షడధ్వముల తల్లిదండ్రులు) అని పేర్కొనఁబడినారు. 'పితరౌ' అను శబ్దమునకు ఏకశేష వృత్తి ననుసరించి మాతాపితాచ పితరౌ (తల్లియు దండ్రియు) అని విగ్రహము చేయవలెను. ఈ విగ్రహము ననుసరించి పితరౌ శబ్దము తల్లిదండ్రులు అను అర్థము నొసఁగును. ఒకవేళ పితాచ పితాచ అను విగ్రహము నొనరించినచో ఇద్దరు తండ్రులు అనునర్థ మేర్పడును. కాని వాక్శబ్దము యొక్క స్త్రీలింగమును అర్థ శబ్దము యొక్క పుంలింగము ననుసరించి షడధ్వపితరౌ అను శబ్దములోని 'పితరౌ' అను శబ్దమునకు మొదట చెప్పఁబడిన విధముగా విగ్రహము చేసి లేక చెప్పి మాతా పితరులు (తల్లి దండ్రులు) అనియే అర్థము చెప్పవలెను.

## ఆత్మ స్త్రీ పురుష రూపము :-

ఆత్మ ద్విధావిభక్తమై స్త్రీ పురుషులుగా మారినది. ద్విధా విభజన యోగ్యస్థితి అర్ధనారీశ్వర తత్త్వము. ఇది జగదాంకురోత్పత్తి హేతువైన బీజము యొక్క ఉచ్ఛూనస్థితి. చింతగింజ మొదలగు బీజములంకురోత్పత్తికి ముందు ఈ ఉచ్ఛూనస్థితిని అనగా ఉబ్బినస్థితిని పొందును. ఇందు రెండుగా విడిపోకున్నను విడిపోగలవన్న స్థితిని సూచించు విభజన రేఖ యుండును. వెనుక చెప్పబడిన బిందు విసర్గల విభాగము లేకున్నను బిందువున తద్విభజన రేఖ నూహించుకొనవచ్చును. త్రిబింద్వాత్మక త్రికోణము మధ్య బిందువు బిందుత్రయరూపమును అనగా బిందువిసర్గల సమావేశ రూపమైన త్రికోణస్థితిని పొందును. త్రికోణస్థితి ప్రధానముగా మాతృత్వమును సూచించునదే యైనను దానియందలి బిందువు యొక్క పునఃప్రవేశమే సృష్టి హేతువగును. **తత్సృష్ట్వాతదేవానుప్రావిశత్** అను వేదవాక్యమునకు తాంత్రికమైన వివరణమిది. బిందు ప్రవేశానంతరము సంతానము కలుగువఱకు ఆమె పితృ మాతృత్వములను రెంటిని కలిగియుండును. అందుచేతనే తంత్రములలో **వారాహే పితృ రూపా** అని చెప్పబడినది.

## మాత ఆత్మయే :-

ఓంకారము శివ ప్రణవము. అది అకార, ఉకార, మకారముల క్రమమును మార్చినచో ఉమా యనబడు శివపత్నియను అర్థమునిచ్చును. అయినను శివశక్తుల ఏకత్వమును ఓంకారము ఉమా శబ్దమును సూచించును. అట్లే ఓంకారార్థమని



చెప్పదగిన బ్రహ్మమును బోధించు ఆత్మ అను శబ్దమున తకార మకారములు అను రెండు హల్లులు రెండు ఆకారములు ఉన్నవి. వాని క్రమమును కొంచెము మార్చిన మాతా అను శబ్దమేర్పడును. ఆత్మా మాతా అను రెండు శబ్దముల ఏకత్వము (క్రమము మారినను) వర్ణములు మారకపోవుట అను అంశము చేత సూచింపబడును. ఆత్మ ద్విధా విభక్తమైనను తదేకత్వము నీ రెండు శబ్దములు సూచించును. ఈ వివరణము వలన తత్త్వమే ప్రధానము కాని స్త్రీ పుంభావముల అకించిత్కరత్వము సిద్ధమగును. జగత్కారణత్వ విషయమున ఉభయుల సమభావము సూచింపబడును.

## సమస్తము కాళీమయమే :-

స్త్రీ పుంభావముల ప్రకటించు విగ్రహముల ఆరాధనమున కన్న తంత్రములలో యంత్రముల ఆరాధనము యొక్క ప్రాధాన్యమున్నది. యంత్రములలోని వృత్తములు దళములు పుంభావమును కోణములు స్త్రీ భావమును సూచించును. కావున అన్ని యంత్రములలో స్త్రీ పుం తత్త్వములు సమావేశమే. ఈ ఏకీకృతతత్త్వమే ఆరాధ్యము. అయినను యంత్రములు రూపవిభాగమునకు చెందినవి. కావున వానియందు పుంభావ ప్రకటనమే అధికము. వాగంశక నామ విభాగమునకు చెందిన మంత్రములలో పుందేవత ధ్యేయమైన సందర్భములలో ఆ ప్రకటించు వర్ణపదములతో కూడిన వాగధ్వమునకు చెందినందున స్త్రీత్వమే వానియందు ప్రధానమై వుండును. అందుచేతనే తంత్రములలో కాళి కాలుని శరీరముగా చెప్పబడినది. బహుత్వము నావిష్కరించు వాగర్థములు రెండును స్త్రీ ప్రాధాన్యమునే సూచించును. వాగర్థములే జీవ బ్రహ్మల ఏకత్వము (నుండి) ఉనికిని పొందినవో బహుత్వము కూడ దేనినుండి ఉనికిని పొందినదో అది పుంస్త్వమునో లింగాతీత్యమునో సూచించును. ఈ అంశమునే గోపికా శ్రీకృష్ణుల రాసక్రీడ సూచించును. అట గోపికలు జీవరూపిణులు. కృష్ణుడు పురుషుడు లేక లింగాతీత పరబ్రహ్మము. ఆ తత్త్వము గర్భమందు కలిగిన జగము గాని చివరకు తదీశ్వర తత్త్వము కాని సమస్తము కాళీమయమే. నామరూపోభయము స్త్రీమయమే. సచ్చిదానంద త్రయాత్మక బ్రహ్మము లింగాతీతము. దానిని చెప్పు స్త్రీ పుంనపుంసక శబ్దములన్నియు వాగధ్వమునకు చెందినందున కాళీమయములే. సాధారణముగా నామరూపములు వాగర్థములని అంగీకరించినను మహార్థమైన బ్రహ్మమునకు శరీర భూతములు శేషభూతములు అగుటచే వాస్తవమునకు అవి యన్నియు కాళీమయములే. బ్రహ్మము అను శబ్దము దానియర్థము మహార్థమును లక్షించునవియే కాని వచించునవి కావున కాళీయములే. ఆ బ్రహ్మమును వచించుటయో లక్షించుటయో చేయునది

కాలియే. కావున తత్ప్రాప్తికిని కాలియే శరణ్య. ఆయనను చూపి ఆమె తొలగిపోయిన తొలగిపోవుగాక. ఆ బ్రహ్మమునకు దాచి ఉంచు కులమామె గృహమే. పురమామె. వాని అన్నిటికి లోనున్న గుహ కూడా ఆమెయే. గుహలోని చీకటి అవిద్య ఆమెయే. దానికవతలి వెలుగును ఆమెయే. ఆ బ్రహ్మము యొక్క మంత్రము ఆమె. యంత్రము ఆమె. తంత్రమును ఆమెయే. ఆమె తొలగి బ్రహ్మమును చూపునో, తొలగక నిలచి బ్రహ్మమును చూపునో తెలియదు. తెర ఆమెయే, తెరలోపల నున్నదియు ఆమెయే. తెర తొలగించునదియు ఆమెయే. బ్రహ్మము యొక్క వాచక లక్షకములు అయిన శబ్దముల ఆవృత్తియైన జపమామె. ఆ శబ్దముల అర్థము యొక్క జ్ఞానముల ఆవృత్తి రూపమైన ధ్యానము లేక ఉపాసనయు ఆమెయే. ధ్యానమొనర్చుటకు కావలసిన మనస్సు మరియు దానియొక్క ఏకాగ్రత ఆమె. ఆ మనస్సు యొక్క లయమును ఆమెయే. జాగ్రత్స్వప్న హేతువయిన నిద్ర ఆమెయే. అవస్థాత్రయాతీత తురీయస్థితి యైన సమాధి ఆమె. సర్వావస్థావివర్జిత (పంచమి) ఆమె. పంచదశ్యతీత షోడశి ఆమె. షోడశ్యతీత సప్తదశి ఆమె. తదతీత జపస్వరూపిణియునైన అష్టాదశియు నామెయే. సర్వమాతృకల సమాహార మామె. మాతృకలకు మాతృకయు ఆమెయే. సంకల్పమామె. వికల్పమామె. సంశయమామె. నిశ్చయమామె. అహంకారమామె. అహమర్థ మామె. కాలుని అహమహమిక ఆమె. ఆయన పౌరుషమామె. ఆయన ఆహోపురుషిక ఆమె. ఆమె ఆయన చేతిలోని ఆటబొమ్మ. ఆ బొమ్మను పట్టుకొను సూత్రమామె. సూత్రము పట్టుకొను ఆయన బాహువామె. ఆయననే ఆడించు బొమ్మ ఆయనలోని కొమ్మ ఆమె. తన కనుబొమ్మల సైగతో పరతంత్రునొనర్చు స్వతంత్ర ఆమె. శిరమున గంగను మోపి ఆయన శిరమును వంచి తన కాళ్ళను కడిగించుకొను స్వాధీనపతిక ఆమె. అమంగల ఆమె. మంగల ఆమె. సర్వమంగల ఆమె.

బ్రహ్మకు అనగా కాలునికి ఆవరణము ఆమె. లవకాష్ఠాది రూపమైన ఖండకాలము ఆవరణాల్లో ఒకటి. అన్ని ఆవరణాలు అజ్ఞాన రూపమైన మహావరణంలో నుండి పుట్టినవే. అజ్ఞానావరణం లేని బ్రహ్మము నగ్నము. దిక్కులు (దేశము) కూడా బ్రహ్మమునకు ఖండకాలము వలె ఆవరణమే. దిగంబరత్వము అనే ఆవరణం కూడా లేని బ్రహ్మము నగ్నము. ఆవరణ ప్రియులకు నగ్నము భయంకరమే కాని ఆవరణ నివారణేచ్ఛువులకు నగ్నమే ప్రియము. ఎంతెంత ఆవరణ భంగము జరుగునో అంతంతగా అది ప్రియము. ప్రియతము. ప్రియతమము (ప్రేష్ఠము) అవుతుంది.



ఈ నగ్న స్వరూప వాచక శబ్దం పుంలింగములో భైరవుడు, స్త్రీ లింగంలో భైరవి. కాలిని భైరవీ శబ్దంతో పేర్కొనటం తంత్రంలో కనిపిస్తుంది.

బ్రాహ్మణాల్లో కర్మపరాలు కొన్ని, ఉపాసనా పరాలు కొన్ని, జ్ఞాన పరాలు కొన్ని వున్నాయి. వానిలో ఉపాసనా పరాలు ఆరణ్యకాలు అని పేర్కొనబడతాయి. గ్రామాల్లో, నగరాల్లో ఉండేవారు ధరించినంతగా, అరణ్యాల్లో ఉండేవారు వస్త్రాలు ధరించరు. వస్త్రాలు ధరించక పోవటం నగ్నత్వంగా లోకంలో భావింపబడుతుంది. ఈ నగ్నత్వం అనగా ఆవరణ రాహిత్యం, ఉపాసకులకు జ్ఞానులకు ప్రియతరం, ప్రియతమం అవుతుంది. భైరవో (భైరవ్యు)పాసనలోని రహస్యమిదియే. కాలభైరవ శబ్దము కాలునికి, భైరవునికి గల అభేదాన్ని తెలుపుతుంది. కాలికి భైరవికి గల అభేదాన్ని కూడా సూచిస్తుంది. కావుననే కొన్ని కౌలవామాచార తంత్రాలలో భైరవీ భైరవులే - కాలకాలీ స్థానంలో ఉపాసింపబడుతారు.

మహానయ ప్రకాశం అనే శాక్త గ్రంథాన్ని రచించిన అభినవగుప్తుడు తన గ్రంథంలో ఆరాధ్యయైన త్రయోదశీ దేవతను అపటటంకమయ ప్రతిష్ఠగా పేర్కొన్నాడు. అపట అనేమాట నగ్న శబ్దానికి పర్యాయమే అనే విషయం విజ్ఞులకు తెలియంది కాదు. శ్రీ కృష్ణుని గోపికా వస్త్రాపహరణ లీల ఆవరణ భంగ సూచకమే అని గోపీ కృష్ణ తత్త్వ రహస్య వేత్తలు వక్కాణిస్తారు. సాధకపక్షంలో భైరవ శబ్దం ఆవరణ భీరుత్వాన్ని ఆవరణ రాహిత్యము యొక్క అభయత్వాన్ని సూచిస్తుంది. ఈ విధంగా కొన్ని కాలతంత్రాలలోని భైరవీ భైరవోపాసనం అద్వైతంలోని ఆవరణ భంగ ప్రియత్వాన్ని ఆ దర్శనంలోని అద్వైత తాత్త్వికతను ప్రకటిస్తుంది.

ఈ విధంగా భైరవీ భైరవోపాసన సంప్రదాయం కాలో(కాల్యు)పాసనంతో పాటు అభివృద్ధి చెంది కౌలంలో స్థానాన్ని పొందింది. అభిన్నంగా భిన్నంగా కూడా ఆ రెండు సంప్రదాయాలు పరిఢవిల్లాయి. ఆటవికులు తమను రక్షించడంలో విశ్వసనీయతను పొందిన కుక్కలు ఒక్కొక్కప్పుడు వారిచే దైవతాలుగా ఆరాధింపబడడం ఉన్నది. వైదికులు కూడా వైశ్వదేవంలో వానికి బలి ఈయటం సుప్రసిద్ధమే.

**'శ్వానౌ హి శ్యామ శబలౌ వైవస్వత కులోద్భవౌ తాభ్యాం బలిం ప్రదాస్యామి రక్షేతాం పథి సర్వదా'** నలుపు చిత్రవర్ణం గల వైవస్వత కులోద్భవాలైన వానికి బలియిస్తారు. అవి మార్గంలో రక్షించుగాక! అని వానిని స్తుతిస్తూ ప్రార్థిస్తూ బలి ప్రదానం చేయటం అనే వైదికాచారమే. తాంత్రికుల భైరవీ భైరవ శబ్దాల ప్రాచుర్యానికి

సంబంధమే లేదనటం సరిగాదు అని వాని శ్వాన శబ్ద రూఢత్వం స్పష్టపరుస్తుంది. దత్తాత్రేయుని వేదాలు శునక రూపంలో వెంబడిస్తున్నట్లున్న చిత్రాలు బాగా ప్రచారంలో కూడా ఉన్నాయి. దత్తాత్రేయోపాసకులు వాని చతు(నాలుగు) స్సంఖ్యను బట్టి వేదాలుగానే నిర్ణయించుకొన్నారనటం సత్యదూరం కాదు.

ఇలా ఒక్కొక్క జంతువు ఒక్కొక్క దేవతగా లోకంలో భావింపబడి పూజల నందుకోవటం కూడా లోకంలో ప్రసిద్ధమే. ఆవు భూదేవతకు, నన్ది శివునకు ప్రతీకంగా శైవులచే ఆరాధింపబడడం తెలిసిన విషయమే. మత్స్య కూర్మ (నర) సింహాలు విష్ణ్వవతారాలుగా వైష్ణవులచే ఆరాధింపబడుతున్నవి. సింహాన్ని చంపగల శరభ సాల్వాదులు వైష్ణవులను మించు స్పర్ధతో శివావతారాలుగా పరిగణింపబడ్డాయి.

భై భై (భౌ భౌ) అనే రవం చేయటంచేత శ్వానాలకు భైరవ శబ్దం వాచకం అయింది. నీచమైన శ్వభావం జీవభావమనీ అదిలేని అమ్మవారు విశ్వరూప అని లలితా సహస్ర నామాల్లో పేర్కొనబడడాన్ని శ్రీ భాస్కరరాయులు సమర్థించిన సర్వత్ర బ్రహ్మభావాన్ని దర్శించే కాలులు మూలాధార స్వాధిష్టానాల్లో కూడా దేవ్యుపాసనను సౌందర్యలహరిలో అంగీకరించిన శ్రీ శంకరాద్వైత సిద్ధాంతానికే భైరవ భైరవోపాసనం ఏ మాత్రం విరుద్ధం కాదు.

శివుని దిగంబరత్వాన్ని మించిన దేశకాలాది సమస్త ఆవరణరాహిత్యాన్ని (నగ్నత్వాన్ని) ప్రకటించే భైరవ్యుపాసనం కాల్యుపాసనకు అంగంగా గాని అభిన్నంగా గానీ కాళీ (క్రమ)దర్శనం అంగీకరిస్తుంది.

పై పుటలలో ప్రకటింపబడినదంతా కాళీ క్రమ దర్శనం యొక్క స్థూల పరిచయం మాత్రమే. ఈ క్రింది పుటలలో ఆ దర్శనంలో విశిష్టతను సంపాదించుకున్న చిద్గగన చంద్రిక అను గ్రంథము యొక్క పరిచయం స్థూలంగా చేయబడుతుంది.

## చిద్గగన చన్ద్రికా - గ్రంథనామార్థము :-

చిద్గగన మనగా చిదుపలబ్ధికి లేక చిదుపాసనకు యోగ్యమైన, దహర నామకమైన హృదయమను పేరుగల, అనాహతచక్రస్థానముగా యోగులచే చెప్పబడు ఱొమ్ములోని నాడుల మధ్యలోని ఆకాశము. చిదుపలబ్ధి యనగా అహమ్ బ్రహ్మాస్మి అను చరమవృత్తి. (శాక్తేయమున శక్తి శివసామరస్యము లేక కాలీమిథున సామరస్యము) చిదుపాసన అనగా అట్టి చరమవృత్తి లాభము కొఱకు చిత్తమున చిద్రూపులైన జీవేశ్వరుల యైక్యమును భావించుట. అనుభవము కలుగుటకు ముందు ఉపాసనకు లేక భావనకు



అవశ్యకత కలదు. కాని అనుభవము కలవానికి ఉపాసన (భావన) అనావశ్యకము. హృదయగత దహర నామకమైన ఈ ఆకాశము జ్ఞానాకాశ మనియు పేర్కొనబపడును. ఇదియే చిద్గగన శబ్దార్థము. చన్ద్రిక యనగా చన్ద్రకాన్తి. ఇది వాగర్థోభయ రూపము. షడధ్వమయము. దేశనామక ప్రకృతి కాలనామక పురుష రూపము.

వర్ణపద మన్త్ర నామకములైన మూడు వాగధ్వములు, కలా తత్త్వభువన నామకములైన మూడు అర్థాధ్వములు, మొత్తము ఆఱు షడధ్వములని చెప్పబడును. అర్థమును విడచిన వాక్కు ఉండనట్లు చంద్రుని విడచి చన్ద్రిక యుండదు. అందుచేతనే ఇట చన్ద్రికా శబ్దము వాగర్థోభయాధ్వ సంకేతముగా చెప్పబడినది.

చిద్గగనమనగా 1) చిత్తే గగనము లేక 2) గగనమే చిత్తు అని సామానాధికరణ్య (కర్మధారయ) సమాసముగా గాని 3) చిత్తునందు గగనమని వైయధికరణ్య (భిన్న విభక్తిక పద తత్పురుష) సమాసముగా గాని చిద్గగన శబ్దమును విగ్రహించి అర్థమును వివరించవచ్చును. లేక 4) ఏ జన్మాదులలో చిత్తు గగనమై (అదృశ్యమై) ఉండునో లేక 5) చిత్తు అను గగనము వేనిలో ఉండునో ఆ జన్మాదులే చిద్గగన శబ్దార్థముగా బహువ్రీహి సమాసము నాశ్రయించి భావింపవచ్చును. చిద్గగన మందలి చన్ద్రిక అని అధికరణ తత్పురుష సమాసమునుగా లేక 6) ఎవతె యొక్క గగనమున చిత్తు కలదో ఆమె చిద్గగన అను పూర్వ పదమును బహువ్రీహి సమాసమునుగా ఆ తరువాత చిద్గగనయే చన్ద్రిక యని సామానాధికరణ్య (కర్మధారయ) సమాసముగా భావించి లేక చిద్గగనమే చన్ద్రిక (చన్ద్రికయే చిద్గగనము) అని సామానాధికరణ్య (కర్మధారయ) సమాసముగా గాని భావించి చిద్గగన చన్ద్రికా శబ్దార్థమును గ్రహింపవచ్చును.

## అనుబంధ చతుష్టయము :-

ప్రబన్ధముఖమైన మంగళాచరణము ఆశీరూపమునగాని, నమస్క్రియా రూపమునగాని, వస్తు నిర్దేశ రూపమునగాని (ఆశీర్నమస్క్రియా వస్తు నిర్దేశోవాపి తన్ముఖమ్) అనెడి అలంకారిక సూక్తి ననుసరించి ఉండవచ్చును. మంగళాచరణమున విషయము ప్రయోజనము అధికారి, ప్రతిపాద్య ప్రతిపాదక భావరూప సంబన్ధము అనెడి అనుబన్ధ చతుష్టయము యొక్క సూచనము కూడా సాధారణముగా కవిచేత చేయబడుచుండుట అను ఈ అనుబన్ధచతుష్టయసూత్రణమే ప్రాచీన సంప్రదాయము.

ఈ విధముగా పూర్వము చెప్పబడిన ప్రబన్ధ నామనిర్దేశమునందునూ ఆఱు విధములైన (శబ్ద) విగ్రహ పరిభాషతో కారకములైన ఆఱు అధ్వముల షట్కముచే

సాంకేతికములైన షడజ్గ షడ్దర్శనాది పర్యాయనామములు గల వానితో వానివాని అభిధేయార్థములైన షడధ్వ విగ్రహ పరిభాషతో, మనోబుద్ధియుత దశేంద్రియ చక్రము పురుష స్వరూపము పుమర్థ సంపత్తును, దానియందు త్రి చతుః పఞ్చవాహములైన వాగర్థ త్రిపుటులయందు సమష్టి వ్యష్టులతో, సమష్టి వ్యష్టులు వాగర్థ సంతతులునైన షడ్ద్వాదశ షోడశాంతములందు మహా బింద్వేక రూపమైనందున అట్లే దిగ్దేశకాల త్రిపుటి తత్త్వము నందును, సాయము వత్సరము యొుక్క గాని, మలమాసము యొుక్కగాని, శిశిర వసంతములలో ఒక ఋతువుయొుక్క గాని, కలాకాల వాగర్థ త్రిపుటులయందు సమష్టివ్యష్టులతో రెండుగా చీలిన ఏకరూప మగుట వలనను, అట్లే ఈ త్రిపుటుల ద్వయమో త్రయమో ప్రాకృత కాల పురుష మిథునమో, వానిలో నేదో యొుకటియో యేదైనను దానియొుక్క తాత్త్విక స్వరూపము తురీయ తత్త్వమే. ఇందలి విషయము ఇదియే. పేరాశాక్త శామ్భవ విసర్గద్వయము మాత్రము బిన్దుత్రయ నిర్వాచ్యమగుచు సువ్యక్తములైన శామ్భవ శాక్త నవకము భేదమున మాతృకయందు స్వర ఖణ్డాన్తమునను అన్తర్బహిస్త్రిపుటీ షడధ్వముల సృష్టి సమష్టుల ఉపచారమున ద్వాదశ షోడశాన్తనాద వాగర్థక్ష నవకాన్తము ఉన్మనీ మహానాద బిన్దు పర్యన్తము పార్యన్తిక మిథున భేదమునను మహార్థసిద్ధి వఱకు సాధ్యరూపముగానే ఉండును. స్ఫుటోచ్చారణమున వ్యక్తి దశయందును నాద వాగర్థ షడధ్వ రూపమున కర్తృకారకాది క్రియాకార్యాంత అక్షమాతృకలందు భేద స్ఫురణమునను ఆణవ వాగర్థ క్రమమున వ్యష్టి సమష్టులతో అగ్నీషోమాది ధామత్రయ స్ఫుటీకరణమందునను క్రమణాభిన్నమేయన్నదని ఈవఱకే సూచింపబడినది.

ఆణవ విసర్గమైన జీవుడే అనుబన్ధ చతుష్టయమున మూలభూతమైన అధికారి ఆతనికి ఆణవమలము మాత్రమే మిగిలియుండగా కాలావయవ జనన మరణ ప్రవాహమున కాల వేగమున కొట్టుకొని పోవుచున్నవాడై శాక్త విసర్గ గర్భమునుండి జన్మ కలుగును. ఇదియే ఆతనికి చివరి జన్మ యగును. లేక ఆతని కాలనాశము. ఆతడప్పుడు ప్రపఞ్చ పఞ్చ ప్రేతాసనాసీనయైన మహాకాల సంకర్షిణీ పరదేవత యొుక్క మఞ్చ పాదములలో మొదటి వాడగును. **బ్రహ్మణామ్ బ్రహ్మణస్పత** ఇత్యాది వేదమంత్ర వర్ణిత గాణాపత్య వాగర్థ షడధ్వరూపుడగుట వలన గణేశావతారుడైనందు వలన శక్తిపుత్రుడు గణపతిగా గాని వ్యవహరింపబడి శామ్భవ విసర్గ పతితుడైనచో షడానన శివకుమారుడుగా గాని కర్మ భూమి యందవతరించును. గ్రన్థాది మంగల శ్లోకపాదములో కవి శక్తి జన్మాగణేశః అనుటలోనిదియే రహస్యము. అన్తర్బహి రక్షార్థ



విషయ గణముల కీశుడగుట వలన గణేశున కాపేరు సార్థకము. ఇదియే అధికారి స్వరూపము. మఞ్చ ప్రథమ పాద బ్రహ్మరూప గణేశావతారము మొదలు మఞ్చఫలక సదాశివుని వఱకు గల బ్రహ్మావతారము లందు ఆయా అవతారముల క్రమమున మహాకాలీ కాలమిథున తాదాత్మ్యమో, సాధక హృదయోద్యోగము వంటి అభేదమో, పంచవాహ మహార్థకము గహన విషయ పూర్ణమగుట చేత దానికి ప్రబన్ధముతో ప్రతిపాద్య ప్రతిపాదక భావ సంబన్ధము, సాధకునితో ప్రాప్యప్రాపక భావసంబన్ధము.

సాధకునకు శక్తి గర్భ ప్రవేశద్వారమున విష్ణుత్వ రుద్రత్వాదులుగా సక్రమమున ఏకానేక జన్మలలో ఈశ్వర భావానుభవక్రమముతో గాని, పఞ్చమ బ్రహ్మభావమును కూడా నతిక్రమించి సద్భావ పూర్ణభావములతో పరసదాశివ మిథునత్వ ప్రాప్తి ప్రయోజనము.

ఇట్లు,
భవదీయుడు
**దోర్బల విశ్వనాథ శర్మ**

**శ్రీః**



శ్రీః

కాళిదాస విరచితా

# చిద్గగన చన్ద్రికా

## ప్రథమ విమర్శః

**అవతారిక:–** కవికుల తిలకుడు కాళిదాస నామకుడునైన మహాకవి మందులు (అధములు), మధ్యములు మొదలగు సకల భక్తజనులనుద్ధరించు కోరికతో, ప్రతీకాద్యుపాసనా భేదములలో ధామ, సంవిత్, వర్ణ క్రమత్రయముతో కూడిన ప్రకాశ, ఆనంద, మూర్తి నామములతో, త్రివిధమైన బృన్దచక్రోపాసనయందు **'అంతర్బహిః పురుష కాల రూపమ్'** అని శ్రీమద్భాగవతమున భగవానుడు చెప్పినట్లు లోపలి దహరముగా బయటి కాలుడు (లము) గా చరాచర సకల జగన్నియామకుడైన, కలధాత్వర్థమైన 'కాలి' యనెడి శివునిశక్తి స్వాభిన్న మహాకాల పఞ్చవాహమహార్థ క్రమమను పేరుగల అనుత్తర సిద్ధాన్తరూపమైన 'రహస్యమును చెప్పుచున్నాము, గర్భ శోలములతో తిరుగకుడు, అత్యాసన్నమైన హృదయమును దాని ప్రయత్నమును బాగుగా ఆలోచించుడు' అనెడి మహార్థమఞ్జరీ పరిమలమున చెప్పఁబడిన హృదయోద్యోగ రూపమైన తత్త్వమును, కావ్య మర్యాదతో ప్రకటించు కోరికగలవాడై, పరదేవతా మఞ్చ పాదములలో నొకడైన లేక శిష్యౌఘము మొదలు మహాపరౌఘము వరకు గల గుర్వౌఘములలో నొకడైన వాహనామాత్ర లాభమునను జాగరూకుడు కాని వానిని 'వినాయకులు అనిత్య భోగములతో కలిపి వైచెద'రను పై పరిమలమునఁ జెప్పబడినట్లు, నిర్విఘ్నసిద్ధికి తజ్జాగరూకతకును హేతువైన ప్రథమారాధ్యుడైన, బ్రహ్మగ్రంథి భేదక మహాప్రణవ రూపమైన తొండముగల, శక్తిపుత్రుడైన, అధికారిక మఙ్గల మూర్తియైన మహాగణపతిని సత్సమ్ప్రదాయ పరంపర ననుసరించి, మనసున మాత్రమే గాక వాక్కునసైతము గ్రన్థారంభమున మంగళాచరణ రూపముగా స్తుతించుచున్నాడు.

**శ్లో॥ క్షీరోదమ్ పౌర్ణమాసీశశధర ఇవ యః ప్రస్ఫుర న్నిస్తరఙ్గం**
**చిద్వ్యోమ స్ఫారనాదం రుచివిసరలసద్బిన్దువక్త్రోర్మిమాలమ్।**
**ఆద్యస్పన్దస్వరూపః ప్రథయతి సకృదోఙ్కారశుణ్డః క్రియాదృ**
**గ్దన్త్యాస్యోఽయం హఠాద్వః శమయతు దురితం శక్తిజన్మా గణేశః॥ 1**



**ప్రతిపదార్థము:–** యః=ఎవడు, నిస్తరఙ్గమ్=తరంగములులేని, క్షీరోదమ్=పాల సముద్రమును, పౌర్ణమాసీ శశధరఇవ=పున్నమిచంద్రునివలె, ప్రస్ఫురన్=ప్రకాశించుచు, రుచివిసరలసద్బిన్దు వక్త్రోర్మిమాలమ్=కాంతిసమూహములతో ప్రకాశించు బిందువులు ముఖమునం(లం)దు గల తరంగముల వరుసలు గల, స్ఫారనాదమ్=విస్తరించిన నాదములుగల, చిద్వ్యోమ=చిదాకాశమును, ఆద్యస్పన్ద స్వరూపః=మొదటి స్పన్దమే స్వరూపముగాగలవాడై, ఓఙ్కారశుణ్డః=ఓంకారమే తొండముగాగలవాడై, దన్త్యాస్యః=గజముఖముగలవాడై, సకృత్=ఒకేసారి, ప్రథయతి=విస్తరింపఁజేయునో, క్రియాదృక్=కర్మలను (నిర్విఘ్నములగునట్లు) చూచు, శక్తిజన్మా=శక్తి (పార్వతి) నుండి పుట్టుకగల, సః=ఆ, అయమ్=ఈ, గణేశః =గణపతి, వః=మీయొక్క, దురితమ్=పాపమును, హఠాత్=బలాత్కారముగా, శమయతు=శమింపఁజేయుగాక!

**తాత్పర్యము:–** పున్నమి చందమామ, విస్తరించిన నాదముగల, కాంతుల సమూహములతో ప్రకాశించు ముఖములుగల, తరంగముల వరుసలుగల పాల సముద్రమును వలె ఓంకారమను తొండము, గజముఖముగల, శక్తి (పార్వతి) నుండి పుట్టుక గలిగిన, చిద్వ్యోమము నొకేసారి ప్రకటింపఁజేయు, ఆద్యస్పన్ద రూపుడైన గణేశుడు, మీయొక్క దురితమును బలాత్కారముగా శమింపఁజేసి, మీ క్రియలను నిర్విఘ్నములగునట్లు చూచువాడగుగాక!

**వివరణము:–**1) **మ, ర, భ, న, య, య, య** గణములతో నేర్పడు స్రగ్ధరావృత్తముచే, మ–గణముతో నారంభింపఁబడినదీ శ్లోకము. మ–గణము భూదేవతాకమగుటచే ఏవైన ఇందలి గణములశుద్ధములైయుండినను వానిని శుద్ధములనొనర్చును. క్షకారము కూటవర్ణము. కావున అది శుద్ధము కాకపోయినను ఆది మగణాన్తర్గత మగుటచే దానికి శుద్ధి ఏర్పడునని మగణారమ్భము సూచించును. అశుద్ధ వర్ణము శుద్ధవర్ణయోగమున అశుద్ధిని కోల్పోవుననెడి యౌగిక వర్ణ శుద్ధి మాత్రమే ఇట వివక్షితముకాదని, రూఢమైన సంపూర్ణ శుద్ధియే వివక్షితమని తెలుపుటకే క్షకారము యొక్క మగణాన్తః పాతిత్వము సహకరించును. 2) కకారము మొదలు 'మ' వఱకు గల పఞ్చవర్గములందలి మొత్తము హల్లులిరువది యైదు. 'క' నుండి 'మ' వఱకు ప్రత్యాహారము చేయగా కామ శబ్దమేర్పడును. ఇది జడజాగ్రద్దశా ప్రకృతివాచకము. కావున ఆ ఉభయవర్ణములు కామ (పురుషార్థ) వాచకములు. వానిలో కకార

మొకటియు కామ (పురుషార్థ) వాచకము. శ, ష, స, హ అను ఊష్మవర్ణములు తురీయావస్థకు, శుద్ధవిద్యకు ఈశులైన పురుష శివ, శక్తి, ఈశ్వర, సదాశివులకు వాచకములు. వీనిలో రెండవదైన షకారము సదాశివ వాచకము. చిత్ప్రకృతి తాదాత్మ్యాపన్న శుద్ధవిద్యకు శ-కారము, ష-కారము సదాశివునకు, స-కార హ-కారములు పరశివ మిథునమునకు వాచకములు. పరశివ మిథునగతమైన అంతర్ముఖమైన హృదయోద్యోగ రూపమైన తత్త్వముల చతుష్టయమునకు గాని పఞ్చకమునకు వాచకమగుటచే కూటవర్ణ మైన క్ష-కారము, ధ్యేయమైన గణేశతత్త్వమును బోధించునదగుటచేత హృదయాకాశమున ప్రవృత్తి నివృత్తుల (క-కారము ప్రవృత్త్యన్తర్గతము, ష- కారము నివృత్త్యన్తర్గతము) కషణమును (రాపిడిని) ప్రత్యాహార విధానమున సూచించు క్ష-కారముతో నీశ్లోకమారంభించఁ బడినది. క-కారము ప్రవృత్తి సుఖ రూపమైన కామమును, ష-కారము నివృత్తి సుఖరూపుడైన సదాశివుని స్వరూపమును బోధించును. తదుభయ సుఖప్రదాతయైన గణేశుని బోధించు నీ శ్లోకము తద్బోధక క్ష-కారముతో నారంభింపఁబడుట మిక్కిలి సముచితముగ నున్నది. శివః, శక్తిః, కామ ఇత్యాది సౌందర్యలహరీ శ్లోకమున కాదిపర వ్యాఖ్య యందు శివ శబ్దము క-కారమును బోధించునని చెప్పఁబడినది. స-కారము శక్తివాచకమనుట శాక్త విద్వత్సమ్మతమే. శివశక్తుల పుత్రుడైన గణేశుని సూచించుట క-కార, స-కార యోగమున నేర్పడిన క్ష-కారము తోడనే శ్లోకమారంభింపఁబడినది అనియు చెప్పవచ్చును. (క-కారనంతర స-కారము అట్ కుప్విత్యాది పాణిని సూత్రముచేత స-కారము, ష-కారముగా మారుట వైయాకరణసమ్మతమే) **'కామేశ్వర ముఖాలోక కల్పిత శ్రీగణేశ్వరా'** అను లలితా సహస్రనామస్తోత్రములోని నామము గణేశ్వర జననమునకు శివ శక్తులుభయులు కారణమని చెప్పఁబడినది కూడా వాస్తవమే. కాని పురాణములలో శక్త్యంగ సంభవుడుగా వర్ణింపఁబడుటచే శాక్త విసర్గమునకు చెందినవాడుగా గాని, తద్గర్భగతాణవ విసర్గమునకు చెందినవాడుగా గాని, శక్తి జన్మా అనుపదముచే వ్యంజింపఁబడును. ఈ పక్షమున ఆ గణేశుడు శామ్భవ విసర్గమునకు చెందిన వాడు, కాదని సూచించుటకు శక్తి జన్మా అను గణేశ విశేషణము కూర్పఁబడినదని చెప్పవలెను. మాతృకా వివేకమున ప్రవృత్తి రూప ప్రకృతిచేత మకారార్ధ రూపపశువు మ్రింగఁబడునని హకారార్ధ చిత్ప్రకృతి నివృత్తిరూపమని క్ష-కారము



తదుభయ రూపమని చెప్పఁబడినది. 3) చంద్రునితో గణేశుడు పోల్చబడుటచేత ఉపమానోపమేయ, సాధారణధర్మ, సాదృశ్యవాచకములను ఉపమాలంకారావయవ చతుష్టయముండుటచే నిట పూర్ణోపమాలంకార మేర్పడియున్నది. చంద్రుని కలలు, పదునైదు. వృద్ధి, క్షయములు కలవి. అమృత ఇత్యాది నామములు గల పదునాఱుకలలలో పదునాఱవకల వృద్ధి, క్షయములు లేనిది. అట్లే గణేశుని శరీరోపాధి పంచతన్మాత్ర, పంచభూత, పంచేంద్రియమయ పంచదశ కలలతో కూడినది. వీనికి వృద్ధి, క్షయములున్నను ఉపహితాత్మ స్వరూప షోడశ కలకు వృద్ధి క్షయములు లేవు అను అంశమే చంద్ర సామ్యవర్ణమునముచేత వ్యంగ్య మగుచున్నది. 4)మాయవలన కలిగిన భేద భ్రాంతి బాహుల్యరూప దురితమును క్రమముగా తొలగించుటకు చాలాకాలముపట్టును. అంత కాలము వఱకు నోర్వలేని సాధకుని ముముక్షా తీవ్రతను ఒకేసారి శమింపఁజేయునను అర్థమున సకృత్పదమును 'శమయతు' అను క్రియలోనికి నన్వయింపవచ్చును. 'స్ఫార నాదమే' అను విశేషణమును 'రుచి విసరలసద్భిన్దు వక్త్రోర్మిమాలమ్' అను మధ్యమ పాదగత విశేషణ ద్వయమును, ఇంటిలోపలికి, బయటికి మధ్యనున్న కడపమీద పెట్టిన దీపమువలె, క్షీరోదమునకు, చిద్వ్యోమమునకును అన్వయింపవచ్చును. క్షీరోద శబ్దమును విశేషణముగా చిద్వ్యోమమునకు అన్వయించి పునరావృత్తముఁ జేసి విశేష్యముగా చిద్వ్యోమోపమానముగా కూడ నన్వయింపవచ్చును. క్ష-కారమను మేరు వర్ణము యొక్క షడధ్వరూపమును (క్షీ+ఈర=క్షీర) ప్రేరేపించు నదను విభాగమును క్షరతీతి అను వ్యుత్పత్తిననుసరించి, క్షీరమనగా 'క్షరించునది' యను అర్థమును గ్రహింపవచ్చును. ఆక్షీరము ఉదయించుచోట అను వ్యుత్పత్తి ననుసరించి క్షీరోద శబ్దమును చిద్వ్యోమ విశేషణముగా నన్వయించ వచ్చును. క్షీరోద శబ్ద మీ రెండు విధములుగా హృదయోద్యోగమునే బోధించును. 5) సృష్టిక్రమమున అనుత్తర అకారము నందలి అస్పందతయే వాగర్థముల అచలత్వము అని **'ఆది+అస్పన్దరూప'** అను విగ్రహముననుసరించి గాని సంహార క్రమమున (అక్షప్రత్యాహారమున) ఆద్యమున అక్షస్పన్దమే సంహార క్రమారంభమగుటచేత **'ఆద్యస్పన్దః'** అను విగ్రహము ననుసరించి గాని, **'ఆద్యస్పన్ద స్వరూపః'** అను విశేషణము గణేశున కన్వయింపవచ్చును. అప్పుడతనికి సృష్టిలయక్రమముల ఆరమ్భక స్పన్దరూపత్వము సిద్ధించును. 6) సముద్ర పక్షమున

రుచుల యొక్క విసరణము చేత ప్రకాశించు బిన్దువులు వక్రములందు ఊర్ముల వరుసలు గలది అను అర్థమును గాని, చిద్వ్యోమపక్షమున వాఙ్మాధుర్యరసాను సన్ధానముతోగాని, శబ్దాలంకారరసానుసన్ధానముతో గాని రుచి విసరలసద్బిన్దువులు తాలు రసాఖ్య బ్రహ్మరస బిందువులే శబ్దోచ్చారణ కారక వక్రములందు గల ఊర్మిమాలలు గలది అను అర్థమునుగాని, 'రుచి విసరలసద్బిన్దు మాలోర్మిమాలమ్' అను విశేషణమునకు విగ్రహభేదమున గ్రహింపవచ్చును. లేక అంతః స్ఫారనాదమైనను రుచివిసరలసద్బిన్దువులు వక్రములు గల ఊర్ములందు మూలము అనగా అణవాది మలత్రయము గలది అను అర్థమును గ్రహింపవచ్చును. 7) గణేశునికి ఓంకార శుణ్డః, క్రియాదృక్, దన్త్యాస్యః, శక్తిజన్మా అను నాలుగు విశేషణములున్నవి. (1) ఓంకారవాచ్య శబ్ద పురుషతత్త్వమే తొండముగా గలవాడు (ఆత్మను అధరారణిగా చేసి, ప్రణవమునుత్తరారణిగా చేసి ధ్యానమున మథనమునభ్యసించిన జనించిన అగ్ని అజ్ఞానమును దహించును అను శ్రుత్యర్థము ననుసరించి) అను అర్థమును, అందుచేతనే (2) క్రియాదృక్, (3) దన్త్యాస్యః, (4) శక్తిజన్మా అను విశేషణములు జ్ఞానేచ్ఛాక్రియామయ కార్యబ్రహ్మ రూపతను గూడ సూచించును. క్రియాదృక్ పదము బహిర్ముఖ క్రియామాత్ర విమర్శమును, దన్త్యాస్యః అను శబ్దము ఆకలిని (ఫలబుభుక్షను) సూచించు యౌవనావస్థా సంపన్నముఖ విశేషణమైనదన్తి (దన్తములు గలది) పదము యొక్క బలమున, శక్తిజన్మా శబ్దము క్రియామయ శరీర జన్మభూమిని సూచించు పదమగుటచేత వరుసగా కార్యరూప విష్ణువును, క్రియారూప బ్రహ్మను, సంహార రూప మహేశ్వరుని సూచించును. బ్రహ్మవైవర్త పురాణమున **'కార్యం విష్ణుః, క్రియా బ్రహ్మ, కారణం తు మహేశ్వరః'** అని చెప్పబడినది. ఆ మహేశ్వరుడు ఆది అస్పన్ద రూపుడు. తత్పుత్రుడు తదాత్మకుడు. **'ఆత్మా వై పుత్రనామాసి'** అను శ్రుతి ననుసరించి గణేశుడు నట్టివాడను గణేశ పారమ్యమును సైతమా పదము వ్యంజించును. 8) ఆగమముల ననుసరించి సంవిద్రూప పరాశక్తి యొక్క మొదటి స్పన్దము ఇచ్ఛాశక్తి. సాంఖ్యసిద్ధాన్తము ననుసరించి ప్రకృతి యొక్క మొదటి పరిణామము మహత్తు. పురాణముల ననుసరించి రజోగుణ ప్రధానుడైన బ్రహ్మ (అవ్యాకృత) నారాయణు నుండి తొలుత పుట్టినాడు. కావున ఆతనిని ఆద్య స్పన్దముగా భావించవచ్చును. ఔపనిషద సిద్ధాంతము ననుసరించి సగుణ బ్రహ్మ



యొక్క మొదటి స్పన్దము హిరణ్యగర్భుడు. ఈ తంత్రమున హిరణ్యగర్భాభిన్నుడు గణపతి. ఈయనకు ఇచ్ఛాశక్తి ప్రధానుడైన సృష్టికారణత్వము, జ్ఞాన క్రియాశక్తులు లేనిదే సమగ్రము కాజాలదు కావున 'క్రియాదృక్' అని చెప్పఁబడినాడు. క్రియా శబ్దము క్రియాశక్తిని దృక్ శబ్దము జ్ఞానశక్తిని బోధించును. **'తత్పురుషాయ విద్మహే వక్రతుణ్డాయ ధీమహి తన్నో దన్తిః ప్రచోదయాత్'** అనే దంతి ముఖగాయత్రిలో మొదటి రెండు పాదాల్లో పదునెనిమిదేసి వర్ణములు, చివరి పాదమున ఇరువది యొక్క వర్ణములు మొత్తము ఈ త్రిపద గాయత్రిలో ఏబది ఏడు వర్ణములున్నవి. ఇందులో ఎనిమిది వర్ణసమష్టులు (పదములు) ఉన్నాయి. వర్ణాలు (57), వర్ణసమష్టులు (8) మొత్తము అరువది ఐదు. గణేశుడు 64 విద్యల యొక్క (కలల యొక్క) సమష్టి. లేక అరువది నాలుగు విద్యలకు అతీతమైన అరువదియైదవ తత్త్వం కావడం వలన దంతి గాయత్రి వర్ణ, వర్ణసమష్టులకు అతీతమైన అరువదియైదవ తత్త్వమైన గణేశుని విద్యామయత్వాన్ని లేక ఆతని విద్యాతీతత్వాన్ని సూచిస్తుంది. అహంకారము నుండి యేర్పడిన తన్మాత్రలలో శబ్దము మొదటిది. సంవిద్రూప పరాశక్తి నుండి పుట్టిన పరాహక్కు ఇచ్ఛాశక్తి రూపము. నాదాత్మక మైన ఓంకారరూప పరావాక్కున శబ్దార్థములు బీజరూపమున కానరాక యుండును. అన్ని వర్ణములు తొలుత నాదాత్మక పరావాగ్రూపములే. వానిలోనే పదవాక్యాదులు సూక్ష్మరూపములై యుండును. అర్థములు కూడ అహమ్ శబ్దముయొక్క ఆద్యంత వర్ణముల మధ్యనుండు వర్ణముల నుండి యేర్పడు పదవాక్యాది వాక్ప్రపంచమంతయు అర్థప్రపంచమును గర్భమున దాల్చి యుండును. అహంకార సమష్టి మహత్తే సోహం పదద్వయములోని తత్పదార్థము. దానినుండి జనించిన వ్యష్టి అహంకారము. అహంకార శబ్దార్థము ఈ రెంటి సమష్టి ఓంకారము. దానికి ఆది యందు స-కారము బిందు స్వరూపమున హ-కారము ఉచ్ఛ్వాసనిశ్వాసముల స-కార హ-కార ధ్వనులు వ్యష్టులైనప్పుడు సోహమ్ అను రెండు పదములు జనించుననుట ఒక మతము. లేక ఓంకారము నందలి అకారమే మహత్తు చివరి బిందువు వ్యష్టి అహమ్ (కారము) శబ్దముతో, అంత్యశేషము ఉ-కారము. ఆద్యంత వర్ణములైన అ-కార హ-కారముల మధ్య నున్న వర్ణముల సమాహారము ఓంకారమున అదృశ్యముగా నుండును. బీజ రూపమున వ్యక్తముగాని ద్విదలస్థితియే బీజాంకురముల మధ్యదశ యందలి

ఉచ్ఛూన దశగా దర్శింపఁబడు పశ్యంతీ వాక్కు స్థితి. దీనినే కొందరు తాంత్రికులు ఇచ్ఛాశక్తిగా భావించినారు.

మధ్యమా వాక్కు వాగర్థభేదముతో ద్విబీజస్థితి జ్ఞానశక్తిరూపము వైఖరీ వాక్కు క్రియాశక్తి రూపము. కర్మేంద్రియమగుటచే నిది క్రియాశక్తి రూపమనుట సముచితమే. ఇది అర్థసహితముగానే వక్త ముఖములో నుండి బయలుదేరి శ్రోత యొక్క శ్రోత్రమును చేరి అర్థావబోధము కలిగించును. అకారాది హకారాంతము ఏబది వర్ణములు, వాని వివిధ సంయోగములు పదములు, వాక్యములు వైఖరీవాక్కు యొక్క వివిధ రూపములు. అహమ్ సమాహారము యొక్క ఆది మధ్యాంతములలో నంతర్భవించునవి. అహంకారము యొక్క సాత్త్విక రాజస తామస (వైకారిక తైజస భూతాది) నామక త్రివిధ భేదముల నుండి జనించు జ్ఞానేంద్రియ, కర్మేంద్రియ తన్మాత్ర పంచకములు దేహగతములై ఆత్మ స్వరూపములేనివైనను తాదాత్మ్యాధ్యాసతో అహంకారము యొక్క వ్యాప్తి కలిగియున్నవి. ఈ పుర్యష్టక మంతయు అహంకార రూప గణేశుని శరీరమే. సోహమ్‌లోని ఓంకారము ఈ శ్లోకమున గణేశుని తొండముగా వర్ణింపఁబడినది. ఓంకార స్ఫారనాద రూపమైన సమస్త వాఙ్మయము గజాస్య నిర్గత ఘీంకృతి రూపస్ఫారనాదమే. ఇదంతయు 'ఓంకార శుణ్డః' అను విశేషణము యొక్క వివరణము. వృత్తాకారమైన చిద్వ్యోమగతమైన బిందువు గణేశుని అభిన్నములుగా నిందు స్ఫురింపఁజేయఁబడినవి. నిస్తరఙ్గమైన చిద్వ్యోమమును బిందువక్రమునుండి వెలువడు ఇచ్ఛాశక్తి వాయువశము నొనరించి ఊర్మి (తరంగ) మాలలతో నింపగలిగిన గణేశుడు శక్తిజన్మా అని చెప్పబడుట ఆయా శాక్త విసర్గతను, తద్వారా సంసార విస్తార హేతుత్వమును, వాగర్థోభయ జగత్సర్జకత్వమును సూచించును. ఈ లక్షణము స్వానందానుభవ విఘ్నముల కలిగించు విఘ్నేశత్వమును, దురిత విఘ్ననివారణము ద్వారమున విఘ్నాంతకత్వమును గూడ సూచించును. గణేశుని పెద్ద పొట్ట బిందుసమూహాత్మకము. వృత్తాకార రేఖ వృత్తమున శూన్యముగా గనిపించు ఆకాశము కూడ బిందు సమూహవ్యాప్తము. రూప నామములు లేక వాగర్థములు గణేశేచ్ఛావాశమున మొదట బిందువుగానే ఉండి, తరంగములుగా, భిన్న భిన్న పరిణామముల నొందినవి. శక్తి రూప బిందువు నుండి వెలువడు నామరూపముల తొలిదశ వర్ణము. అకారాది వర్ణముల నుండి వాక్ప్రపంచము



రక్తహరిత నీలాది వివిధ వర్ణవ్యాప్త రూప ప్రపంచము, రూపము కనఁబడని మహదాహంకారాకాశాది (నీరూప) భూత ద్రవ్య సమూహము, గుణ, క్రియా, జాతి విశేష విశిష్టమైన ద్రవ్యాశ్రయధర్మ సమూహము అంతయును శక్తియే.

రుచి విసరము అనగా కాంతి సమూహము. అదియే రూప (అరూప) ప్రపంచము. నీరూప ప్రపంచము యొక్క మరొక పేరు నలుపు. సర్వ వర్ణముల సమావేశము యొక్క మరొకపేరు తెలుపు. ఈ రెండు రాత్రింబవళ్ళుగా ప్రపంచమున వ్యవహరింపఁబడును. వీని సంధి (సంధ్య) లో కనిపించు (రంజనాత్మక) రాగము (పరిమిత హరిత పీతాది వర్ణముల సముదాయము) నకు మరొక పేరు ఎఱుపు. ఈ మూడు వర్ణములు (రంగులు) సత్త్వరజస్తమో గుణ ప్రకృతి శక్తి వ్యాప్తి గలవి. ధ్వని (నాద–నామ) రూపములు రెండు శక్తి యొక్క రూపాంతరములు. రుచివిసరము నీరూప చిద్వ్యోమమున గణేశుని ఇచ్ఛచేతనే లసించుననుట 'రుచి విసరలసత్' అను విశేషణము సూచించును.

'చిత్' అను శబ్దము శివబోధకము. చిత్తును వ్యోమమనుట పంచ భూతములలో మొదటిదైన ఆకాశము యొక్క సామ్యమును తెలుపుటకు మాత్రమే, శూన్య (ఆకాశ)మునందును శక్తి ఉండును. అదియే శూన్యస్థితిగతి, ధ్వని, కాంత్యాది, రూపముల ధరించును. శక్తి యొక్క శివాభేదము సూచించుటకే ప్రపంచము లయించుటలోని పరమార్థము.

**అవతారిక:–** పై శ్లోకమున మాయీయ మలమును నిరసింపఁజేయు గణేశస్తుతి రూపమఙ్గలాచరణము చేయఁబడినది. తదనంతరము ఈ శ్లోకమున వ్రాయఁ దలచిన గ్రన్థమునకు ఉపయుక్తమైన కార్మణమల నిరాసము నభిలషించి (చిద్) ఆకాశ శరీరమైన శివతత్త్వమును పరామర్శించుచున్నాడు గ్రన్థకర్త.

**శ్లో॥ స్థూలం సూక్ష్మం పరం చ త్రివిధమిహ జగద్యత్ప్రథావేశసిద్ధ్యా**
**యుక్తం సత్తా యదీయా స్ఫురతి చ పరతః స్వప్రథైక స్వభావా।**
**భామూర్తిం యం విమర్శక్రియమనుపతితా లక్ష్యతే లోకవృత్తిః**
**సన్మార్గాలోకనాయ ప్రశమయతు స వ స్తామసీం వృత్తిమీశః॥ 2**

**ప్రతిపదార్థము:–** స్థూలమ్=స్థూలము, సూక్ష్మమ్=సూక్ష్మము, పరంచ= పరమును, త్రివిధమ్=మూడు విధములైన, జగత్=జగము, యత్ప్రథావేశసిద్ధ్యా= (శివు) ఎవని

వెలుగు యొక్క ఆవేశము యొక్క సిద్ధితో, స్వభావా=స్వయంప్రకాశ స్వరూపమై, పరతః చ=బయటకు, స్ఫురతి=ప్రకాశించునో, లోకవృత్తిః=లోకవృత్తి, భామూర్తిమ్ =ప్రకాశరూపుడైన, విమర్శక్రియమ్=విమర్శరూపక్రియ గల, యమ్=ఎవనిని, అనుపతితా=అనుసరించి పడినదిగా, లక్ష్యతే=కనఁబడునో, సః=ఆ, ఈశః= ఈశ్వరుడు, సన్మార్గాలోకనాయ=మంచి (ఆకాశ) మార్గము యొక్క చూచుట కొఱకు, వః=మీ యొక్క, తామసీమ్=తమోగుణ సంబంధియైన, వృత్తిమ్=వృత్తిని, ప్రశమయతు=బాగుగా శమింపఁజేయుగాక!

**తాత్పర్యము:–** స్థూలము, సూక్ష్మము, పరము అని మూడు విధములైన జగము ఎవని వెలుగు ప్రసరించుటచే సిద్ధించునో, యెవని సత్త స్వయంప్రకాశమై, లోననుండి బయటకూడ స్ఫురించునో, ప్రకాశరూపుడు విమర్శక్రియుడునైన ఎవని ననుసరించి లోకవృత్తి నడచునో, అట్టి ఈశ్వరుడు ఆకాశమువంటి సన్మార్గమును చూచుటకు మీ తామస వృత్తిని బాగుగా శమింపఁజేయుగాక!

**వివరణము:–** 1) వ్యావహారిక సత్త గలది స్థూలము. ప్రాతిభాసిక సత్త గలది సూక్ష్మము. పారమార్థిక సత్త గలది పరము. పరబ్రహ్మ స్వరూపము అసత్య మైనను సంవాదభ్రమకు ఆశ్రయమైన జగము వ్యావహారికముగా సత్తని చెప్పఁబడును. అసత్యమైనను విసంవాది భ్రమకు ఆశ్రయమైన రజ్జుసర్ప స్వప్నాదులు (ప్రాతి భాసికములు) అనగా కనబడు కాలమున కను వ్యక్తికి మాత్రమే సత్యముగా ప్రతి భాసించు వస్తువులు ప్రాతిభాసిక సత్తులని చెప్పఁబడును. త్రికాలాబాధ్య పదమైన పరబ్రహ్మ మొకటే పారమార్థికముగ సత్త్వము. అది సంవాది, విసంవాది భ్రమకాలములలో అనేక వ్యక్తులకు ఏకరూపమున భాసించు ఒకే వ్యక్తికి, భాసించు వస్తువులకు వ్యావహారిక ప్రాతిభాసిక సత్తలను కలిగించును. మరియొక విధముగా వైఖరీవాక్కు స్థూలము. మధ్యమావాక్కు సూక్ష్మము. పశ్యన్తీవాక్కు పరము. పరబ్రహ్మము జగదన్తర్యామి యగుటచే జగద్భేదములలో పరబ్రహ్మము పరజగద్రూపముగా మొదటి విధమున చెప్పఁబడినది. రెండవ విధమున పరా (సంవిత్)రూపమైన పరబ్రహ్మమును విడచి, మిగిలిన స్థూల, సూక్ష్మ, పరజగత్తులు, వైఖరీ మధ్యమా పశ్యన్తీ రూపములు ఎట్లైనను జగత్త్రైవిధ్యము నిరూపించవచ్చును. కావున ఈ శ్లోకమున జగము త్రివిధమని చెప్పఁబడినది. మరొక విధముగా పదార్థము స్థూలము. దానిని చెప్పుపదము (వాక్కు) సూక్ష్మము. దానియందు



వ్యాపించి ఉండు నాదము పరము అని జగముయొక్క త్రైవిధ్యమును నిరూపించ వచ్చును. నాదరూపపరజగముగాని, పరారూపనాదముగాని పుట్టినవియే యను పక్షము నాశ్రయించిన, పరబ్రహ్మమే పరమని చెప్పఁదగినది. లేదా చెప్పదగిన (జగమున) దానికన్న పరము పర బ్రహ్మము (వాచామగోచరము). ఆ పరబ్రహ్మమైన ఈశ్వరుని సత్త నాశ్రయించి జగము స్థూల, సూక్ష్మ, పరమను మూడు విధములైనది. ఈశ్వరుని ప్రథావేశము అనగా ప్రకాశ ప్రసారము వలన జగము త్రివిధములైనది అని ప్రథమార్ధార్థము. జగము ఈశ్వర సిద్ధ్యధీన సిద్ధి గలది. ఈశ్వరుడు జగత్సిద్ధ్యధీన సిద్ధి గలవాడు అను అన్యోన్యాశ్రయ దోషము జగము మిథ్యయైన కారణమున అద్వైత సిద్ధాంతమున పరబ్రహ్మమున గుణమే యగును. ద్వైతులకు మాత్రమది దోషమే. ఈ అర్థము ప్రథమ పాదమున సూచితము. **'ఏష వన్ధ్యా సుతో యాతి ఖపుష్పకృత శేఖరః –** ఈ గొడ్రాలి బిడ్డ డాకాశ కుసుమాలను ధరించి పోవుచున్నాడు.' ఇత్యాది వాక్యముల వలన లభించు అర్థము శబ్ద ప్రతిభా సరూపము మాత్రమే. గొడ్రాలికి బిడ్డగాని, ఆయన ఆకాశ కుసుమము ధరించుటగాని సంభవించునవి కావు. కావున ఆ వాక్యార్థము శబ్ద ప్రతిభాసము మాత్రమే. తదర్థమునకు ఆర్థికప్రతిభాసము, వ్యావహారికముగ కూడ లేదు. అసంభవమును వర్ణించు శాబ్దిక చమత్కారము మాత్రమే. అది ఆ వాక్యము యొక్క అర్థము కాదు. అర్థాభాసము. పరమార్థానుభవము గలవారి దృష్టిలో నీ జగమంతయు అర్థాభాస రూపమే. ప్రాతిభాసికము మాత్రమే. **'అత్యంతాసత్యపిత్యర్థే శబ్దో జ్ఞానం కరోతి హి'** (పూర్తిగా సత్యముకాని లేక లేనివస్తువును చెప్పు శబ్దమును ఏదో జ్ఞానమును (చమత్కారమును) కలిగించును గదా!) అను సూక్తి పర బ్రహ్మానుభవము గలవారి జగదనుభవాభాసమును సైతము వివరించును. లేక గిరి నదీ సముద్రాది రూపార్థము స్థూలము. తద్వాచక శబ్దము సూక్ష్మము. ఆ సూక్ష్మమున వ్యాపించి యుండు నాదము పరము. ఈ మూడు శివుని ప్రకాశము చేతనే ప్రకాశించునని మరొక విధముగా స్థూల సూక్ష్మ పరత్రైవిధ్యము జగమున కలదని చెప్పవచ్చును. 2) ద్వితీయపాదమునందలి పరతః అను శబ్దము అభిన్నము భిన్నమైయున్నట్లు ఈశ్వరసత్త స్ఫురింపఁజేయునన్న తాత్పర్యము ప్రయోగించ బడినది. 3) భామూర్తి శబ్దము ఈశ్వరుని ప్రకాశరూపుడుగ, విమర్శక్రియమ్ అను శబ్దమాతని పని విమర్శమే యను అర్థము నిచ్చును. ఆయన తనకు తానే

ప్రకాశించును. ఆయన నే ప్రమాణమును ప్రకాశింపఁజేయఁజాలదు అను **'న తత్ర సూర్యో భాతి'** ఇత్యాది శ్రుత్యర్థమును మూడవపాదము చెప్పుచున్నది. ఇందలి 'లోకవృత్తిః' అను శబ్దము లోకప్రవృత్తి అను అర్థమును లేక లోకము యొక్క బ్రతుకు తెఱువు అర్థమును ఇచ్చును. వ్యావహారికముగా ఈశ్వరు నాశ్రయింపక లోక ప్రవృత్తి తజ్జీవనమును దుస్సాధ్యములని నిరూపించును. 4) ఈశ్వరానుగ్రహము లేనిదే తామసవృత్తి తొలగదు. ఆ తామసవృత్తి తొలగనిదే సన్మార్గము కానరాదు. సన్మార్గము కనఁబడవలెనన్న భగవానుని అనుగ్రహము వలన చిత్రము లోని తామసవృత్తి తొలగవలెను. కావుననే నాల్గవ పాదమున కవి సమస్త పాఠకులకు సన్మార్గావలోకనమునకు హేతువైన తామసవృత్తి నాశము నీశ్వరు డనుగ్రహించు గాక యని కోరుచున్నాడు. శివుడు (పరమార్థము) లభించవలెను. ఉపాయములతో నాతడు లభించునా? ఉపాయము లాతనికన్న గొప్పవైనచో వానికీశ్వరుడు లొంగి లభించునేమో? యని ఊహించుటకు కూడ అవకాశము లేదు, అని ఈశ శబ్దము వ్యంజించుచున్నది. పైగా ఈశుని అనుగ్రహమున ఉపాయములు సాధకునకు స్ఫురింపవచ్చును. కావున ఈశ్వరానుగ్రహమునకు లోబడినవే అన్ని ఉపాయములును. **ఉపాయైర్న శివోభాతి భాన్త్యమీ తత్ప్రసాదతః ఈశ్వరానుగ్రహాదేవ పుంసామద్వైతవాసనా**(ఉపాయములతో శివుడు ప్రకాశించడు. ఆయన అనుగ్రహముననే ఉపాయములు భాసించును లేక స్ఫురించును) అట్టి వానిలో అద్వైతభావన మొకటి. అదియు ఈశ్వరుని అనుగ్రహముననే స్ఫురించును అను శ్లోకార్థము చతుర్థపాద వ్యంగ్యము. ఈ చతుర్థపాదము కించిద్భేదమున మాలవికాగ్నిమిత్రనాటక నాన్దీశ్లోకమునను చతుర్థపాదముగా కనిపించుచున్నందు వలన మాలవికాగ్నిమిత్ర నాటక కర్తయైన కాలిదాసే ఈ చిద్గగనచంద్రికా గ్రంథమునకు కర్తయని చెప్పుట కవకాశము ఏర్పడినది. సాధారణముగ ఒక కవి తన భిన్నభిన్న కావ్యములలో తన శ్లోక పాదములను పునరావృత్తి చేయుట గానిపించును. ఇట ప్రశమయతు అని యుండగా అట వ్యపనయతు అనియున్నది. ఆ రెండు క్రియలు ఏకార్థములై గ్రన్థముల యొక్క ఏకకర్తృత్వమును దృఢపఱచుచున్న వనుట కొందఱు విమర్శకుల అభిప్రాయము. పై శ్లోకమువలె ఈ శ్లోకమును స్రగ్ధరావృత్త నిబన్ధనమే. 5) సన్మార్గాలోకనము కొఱకు కంటిలోని తామసవృత్తి కూడా తొలగవలెను. కంటిలో తిమిర దోషము కలవారు సన్మార్గ



భ్రష్టులై కంటకములచే విద్ధులగు చుందురు. 6) సన్మార్గ శబ్దము ఆకాశమార్గము అను అర్థము నిచ్చును. ధూమార్చిరాది మార్గములు సన్మార్గములు. ఈ మార్గము లందలి జ్యోతిర్విద్యుచ్చన్ద్ర సూర్యాద్యాతివాహిక దేవతలు ఆకాశమునందుండు వారే. ఆ మార్గములలో ప్రయాణించుటకును వైదికావిశ్వాస రూప తిమిర దోషము మనస్సునుండి తొలగి పోవలెను. అందుకు నిష్కామకర్మోపాసనా రూపమైన పిపీలికామార్గమున బ్రహ్మ లోకప్రాప్తి ద్వారమున కైవల్యము కూడా లభించుటచే ధూమ మార్గమున కన్న అర్చిరాది మార్గమున పోదలచిన వారికి చిత్తతిమిర దోషము మరియు తగ్గిపోవలెను. ఆకాశయాన మొనరించు వైమానికులకును తిమిర దోషము బాధకమే యగును. కావున సన్మార్గ శబ్దము ఆకాశయానార్చిరాది మార్గ ద్వయ బోధకము అని గ్రహింపవలసి యున్నది. విహంగ మార్గమైన ఈ జన్మముననే బ్రహ్మను పొందించు జ్ఞానమార్గమున అజ్ఞానతిమిరదోషము తామసీవృత్తనాశము ఆవశ్యకమే అని వేఱుగా చెప్పనక్కఱ లేదు.

**అవతారిక:–** పై శ్లోకమున శివతత్త్వ పరామర్శ పూర్వకముగ కార్మణమల నిరాసార్థ ప్రార్థనము చేయఁబడినది. ఈ శ్లోకమున శామ్భవ విసర్గ రూపాణవ మల నిరాసప్రార్థనముతో పాటు గ్రన్థనామ స్వనామ ప్రకటనము చేయఁబడుచున్నది.

**శ్లో॥ ఇహ కాళిదాసచన్ద్ర**
**ప్రసూతిరానన్దినీ స్తుతిర్వ్యా(వ్యా)జాత్।**
**చిద్గగన చన్ద్రికాబ్ధే**
**శ్శమయతు సంసారదావదవథుం వః(నః)॥** **3**

**ప్రతిపదార్థము:–**ఇహ=ఇచట; కాలిదాస చన్ద్ర ప్రసూతిః=కాలిదాసుడు అను చన్ద్రుని నుండి జన్మగల, ఆనన్దినీ=ఆనన్దింపఁజేయు, స్తుతి=స్తుతి, వ్యాజాత్=మిషవలన, చిద్గగనచన్ద్రికా=చిద్గగనచన్ద్రిక, నః=మనయొక్క, (వః=మీ యొక్క) అబ్ధేః=(చిత్తమను) సముద్రమునుండి, సంసారదావదవఘుమ్(థుమ్)=సంసారదావాగ్ని సంతాపమును, శమయతు=శమింపఁజేయుగాక!

**తాత్పర్యము:–** కాలిదాసు అనెడి చన్ద్రుని నుండి జన్మ కలిగిన, సహృదయుల చిత్తమను సముద్రము నుండి సంసారమనెడి దావాగ్ని యొక్క సంతాపమును చిద్గగన చన్ద్రిక యనెడు నీ గ్రంథము శమింపఁజేయుగాక!

**వివరణము:-** 1) కాలిదాస కవి చన్ద్రునితో, సంసారము దావాగ్నితో పోల్చబడి నందున ఈ శ్లోకమున రూపకాలంకార మేర్పడియున్నది. 2) తండ్రి కన్యకు జన్మనిచ్చినట్లు, కవి కావ్యమునకు జన్మను ఇచ్చును. సహృదయుడు ఆ కన్యను అనుభవించును – అను సాధారణ వాక్యము సాహిత్యలోక వ్యవహారమున నున్నది. సహృదయుడు సమాన హృదయముకలవాడు. ఆతని హృదయము ఎవరి హృదయముతో సమానమను ప్రశ్నకు కవి అనే చెప్పవలెను. బ్రహ్మదేవుడు సరస్వతికి జన్మనిచ్చి ఆమెను భోగించినట్లు పురాణకథయున్నది. ఈ కథ తాను పలికిన వాక్కు తనకానందము కలిగించుట, కూతు సంభోగమువలె దోషమగు నని చెప్పవచ్చునా? అట్లే కవి తన కావ్యము యొక్క సౌందర్యమునకు ఆనందించుటయు దోషమని చెప్పరాదు. **'అపారే కావ్య సంసారే కవిరేకః ప్రజాపతిః'** – అను సూక్తి కవికి విలక్షణ కావ్య ప్రపంచమునకు స్రష్టృత్వమును చెప్పుచున్నది. సాధారణ ప్రపంచపు నియమములు కొన్ని దీనికి వర్తించవు. ఆ ప్రపంచమున రుచులాఱు. ఈ ప్రపంచమున రుచులు (రసములు) తొమ్మిది. ఆ ప్రపంచమున సుఖదుఖఃములు రెండును ఉండును. ఈ ప్రపంచమున సుఖము మాత్రమే యుండును. ఇట్టి విలక్షణ కావ్య ప్రపంచమున కవి స్రష్టృత్వ హేతువున ప్రజాపతియని చెప్పఁబడును. అంతమాత్రమున కావ్య ప్రపంచము స్రష్టయైన కవి కానందము కల్గించదు అని చెప్పుట అసత్యము చెప్పుటయే. అందుకే ఈ శ్లోకమున ఆనన్దినీ యను పదము కవి, సహృదయుల కిరువుఱకు వర్తించునట్లు వ్యస్తముగా ప్రయోగింపఁబడినది. 3) సంసారము సముద్రము వంటిది. దాని అవతలి ఒడ్డు మోక్షము. దానిని చేరునప్పుడే, సముద్రములో మునిగి తేలువఱకు కలుగు దావాగ్ని తాపరూప దుఃఖము నశించదు. సముద్రమును జీవిగా భావించిన ఆతనిని కూడ ఆ దావాగ్ని బాధించును. ఆతని బాధ తొలగవలెనన్న దావాగ్నియే నశింపవలెను. ఇట వ్యస్తముగా నున్న అబ్ధేః అను పదము ఈ అర్థమునకు అనుకూలముగా, అన్వయింపబడుట కనుకూలముగా ప్రయోగింపఁ బడినది. సముద్రము నుండి చంద్రుడు పుట్టినట్లు సంసార (చిద్గగన) సముద్రము నుండి కాలిదాసు పుట్టినాడు. ఆతని నుండి చిద్గగనచన్ద్రిక యనెడి కావ్యము పుట్టినది. చన్ద్రునుండి పుట్టిన చన్ద్రిక చన్ద్రునికి కుమార్తెయైనట్లు చిద్గగన చన్ద్రిక యనెడి కృతి కాలిదాస కవికి కుమార్తెయే. కాని చన్ద్రచన్ద్రికా సంబంధము



అవినాభావ స్త్రీ పురుష దాంపత్యముగా కూడా సాహిత్యమున వ్యవహరింపఁ బడినది. అంతమాత్రమున చన్ద్రిక చంద్రుని నుండి పుట్టలేదని చెప్పలేము. అట్లని వాని వినాభావమును కూడ అంగీకరింపలేము. చన్ద్రునుండి పుట్టిన చన్ద్రిక చన్ద్రుని తండ్రియైన సముద్రునకు పితామహుడగును. మనుమరాలు పుట్టినదని సముద్రునకును ఆనందము కలిగినది, అనియు ఆనందినీ శబ్దము వ్యంజించును. 4) పున్నమినాడు సముద్రము పొంగును. దానికి కారణము తన సంతతి అవిచ్ఛిన్నముగా సాగుచున్నదని మనుమరాలు పుట్టినందున ఆనందించుట కావచ్చును. లేక చన్ద్రికకు అభిన్నముగా చన్ద్రుడు **'ప్రజయా హి మనుష్యః పూర్ణః'** – అను శ్రుతి ననుసరించి చన్ద్రుని పూర్ణతకు సముద్రుని కానందము కలిగి పొంగినాడనియు చెప్పవచ్చును. చన్ద్రు నుండి విడదీయరాని చన్ద్రిక చన్ద్రాభిన్నయై నట్లు విశ్వకర్తకు విశ్వమునకు అభేదము కార్యకారణైక్య సిద్ధాంతము ననుసరించి దార్శనికులు చెప్పెదరు. ఛాన్దోగ్యము మృద్ఘటముల అభేదమును ఘటము యొక్క అసత్యతను చెప్పినది. 5) శివుడు చన్ద్రుడైనచో చన్ద్రిక శక్తియగును. చన్ద్రశక్తి చన్ద్రిక చన్ద్రాభిన్నము అయినట్లు శక్తి శివాభిన్న. చన్ద్రచన్ద్రికలు చిద్గగనమున ప్రకాశించెదరు. వారిరువురు భిన్నముగా అభిన్నముగాను చన్ద్ర చన్ద్రికలవలె వ్యవహరింపఁబడెదరు. తన్త్రశాస్త్రమున శివశక్తుల భేదాభేద వ్యవహారము పుష్కరముగానే ఉన్నది. ఈ శ్లోకమున 'కాళిదాస చన్ద్ర ప్రసూతిః' అని చన్ద్ర చన్ద్రికా రూపులైన శివశక్తుల భేద వ్యవహారము కూడ వ్యంజింపఁబడుచున్నది. 6) చిద్గగనము శివస్వరూపము. దాని యందు చన్ద్రచన్ద్రికా ప్రకాశము శివశక్తి భేద వ్యవహార రూపము. శివశక్తి మిథునమును పరానుత్తరవిద్యాసంప్రదాయము కాలీ, కాల మిథునమని పేర్కొనడం జరుగుతుంది. ఈ మిథునంలో కాలి, కాలుడు అను వ్యవహార భేదమున్నను వస్తుగత భేదము లేదు. అందుచేతనే ఈ శ్లోకములో కృతికర్త చంద్రుడుగా, కృతి చన్ద్రికగా వ్యవహరింపఁబడినా, వీరిరువురు చిద్గగన స్వరూపులే. చిద్గగన శబ్దము చిత్తు యొక్క గగన సామ్యమును సూచించు రూపక సమాసము, లేక అవధారణ పూర్వపద కర్మధారయ సమాసము. ఈ చన్ద్ర చన్ద్రికలు ఈ గ్రంథమున ప్రతిపాదింపఁబడిన దేవతా మిథునము, తాంత్రికముగా ప్రకాశ విమర్శములుగా వ్యవహరింపఁబడు ఈ మిథునముయొక్క సంబంధము కల్పిత జన్య జనక భావ సంబంధము కావచ్చును. కార్య కారణ ద్వంద్వము కార్యాకారణ భావాతీతమున

కల్పితము. మాయారూపిణియైన కాలి యొక్క అనాదిత్వమును పురస్కరించుకొని అనాది దంపతి రూపము అనుట ఎక్కువ సముచితము. కావున కాలిదాసు శబ్దము లోని కాలి శబ్దము సంబుద్ధిగా చేసి దాస చన్ద్ర పదాల రూపక సమాసముగా చేసియు ఈ శ్లోకమున అన్వయము సాధింపవచ్చును. దాస శబ్దముచే కాలీ (కాలునకు)కి ఈశ్వరత్వము సూచితమగును. 7) చిద్గగన శబ్దమును దహరాకాశమను అర్థము నిచ్చునదిగా గ్రహింపవచ్చును. ఆకాశము సర్వమున కాధారమైనట్లు హృదయమునకును ఆధారమగును. అట్లయ్యు హృదయమున ఘటాకాశమువలె ఆధేయము కూడ నగును. ఇట్టి ఆకాశము దహరాకాశముగా పేర్కొనఁబడును. భౌతికమైన ఆకాశము అంధకారము. తమోరూప మాయా పరిణామమై అంతఃకరణాదిశబ్ద వాచ్యమైన హృదయము అనునది అంధకారమే. అచట ఆత్మ చన్ద్రప్రకాశము చేతనే భ్రాంతి (విక్షేప) జ్ఞానముగా అజ్ఞానులలో, శుద్ధాత్మ జ్ఞానముగా జ్ఞానులలో భాసించును. కావున అట ఆత్మ స్వరూపిణిగా ప్రకాశించు కాలి చిద్గగనచన్ద్రికయని గ్రన్థనామాభిన్నముగా ఈ శ్లోకమున పేర్కొనఁ బడినది. 8) దాస శబ్దము వర్ణ వ్యత్యయము నాశ్రయించి సాదయను చన్ద్రకలను లక్షింపఁజేయును. అట్టి సాదాఖ్య షోడశ చన్ద్రకల శివ శిరోభూషణము. అట్టి చన్ద్రుడే శివుడు. ఆతని శక్తియగు కాలి, భక్తుల చిత్తాకాశమున ప్రకాశించి చిద్గగన చన్ద్రికయని పేర్కొనఁబడును. సర్వశేషియైన కాలి (కాలునకు) కి కవియు శేష భూతుడు. కావున దాసుడని చెప్పఁబడును. శివశిరమునలంకరించు చంద్రుడును శివునకు శేషుడే. లౌకిక చన్ద్రుడు (పఞ్చదశ కలామయుడు) శేషభూతుడని వేరుగా చెప్పనక్కఱ లేదు. అట్టి దాస చన్ద్రుడు రచించినదే యీ కృతి, చిద్గగన చన్ద్రికా నామకమై సాధకుల హృదయాజ్ఞానము నశింపఁజేసి తన నామము నన్వర్థము చేసికొనుననుట ఈ నామ (కరణము) లోని ముఖ్యాభిప్రాయము. కవ్యుద్దిష్ట ప్రయోజనమును అగును. కవి సాధకునివలె అజ్ఞుడని భావించినప్పుడే సాధకుని వలె కవిని కూడ ఆమె (కాలి) అనుగ్రహించి హృదయాన్ధకారమును పోగొట్టు ననియు ఈ నామకరణము వ్యంజింపఁజేయును. దీనిని సూచించుటకు వః అనుచివటి పదము యొక్క నః అను పాఠాంతర మేర్పడి యుండినదేమో? 9) చిద్గగనము చిదాకాశమే. అది నిరంతర స్వయంప్రకాశము. లౌకిక చన్ద్రుడు పర (సూర్య)ప్రకాశ్యుడైనట్లు పర ప్రకాశ్యము కాదు. ఆ స్వయంప్రకాశ్యమే చిద్గగనచన్ద్రిక



యని చన్ద్రాభిన్నముగా పేర్కొనఁబడినది. 10) కవియే కాలికి దాసుడైనప్పుడు తత్కృతియైన ఈ చిద్గగనచన్ద్రిక దాసియయ్యు ఆనందిని యగుట కభ్యంతరము లేదు. ఆ కృతిరూపదాసియు కాలికి ఆనందినియేయగును. లేక ఆనన్ద చన్ద్రాభిన్న చన్ద్రిక ఆనన్దినియేయగును. ఆనన్దినీ శబ్దము ఆనన్దము కలది, ఆనందము కలిగించునది – అని రెండర్థములను బోధించు సామర్థ్యము కలిగినట్టిది. ఆహ్లాదార్థక **'చది'** ధాతు నిష్పన్న చన్ద్రికా శబ్దము యొక్క అర్థము యొక్క వివరణమునే ఆనన్దినీ శబ్దము చేయును. 11) కవికి కృతి నిర్వహణము సంసార సముద్రమును దాటుటవంటిది. ప్రతిభాపౌష్కల్యము వ్యుత్పత్త్యభ్యాసముల ఆధిక్యము ఉన్ననే కాని కృతి విద్వాంసులకు (కవి) సహృదయులకు ఆనందిని కాజాలదు. భావముల వాగర్థముల సముచిత విన్యాసమునకు యత్నించునపుడు ఒక్కొక్కప్పుడు తృప్తికరముగ నవి భాసించవు. అపుడు హృదయమున దావాగ్ని వలెనే తాపము కలుగును. కవియొక్క అదృష్టము ఫలించి లేక దేవతానుగ్రహము కలిగిన సముచితమైన వాగర్థభావములో శ్లోకమున నొదిగి పోవుట సంభవించును. ఇది దాదాపు తపస్సిద్ధివంటిది. ఆ ప్రయత్నము తపస్సువంటిది. సిద్ధించక ముందు తపస్సు తాపమే. సిద్ధ్యనంతరము దాని శాంతి యేర్పడును. అట్టి శాంతికై కవి ప్రార్థించుటయు నీ శ్లోకమున వ్యంగ్యమగుచున్నది. 12) ఈశ్వరానుగ్రహము కల్గుట తపస్సిద్ధియో, యోగసిద్ధియో కావచ్చును. ముఖ్యముగా యోగసిద్ధులకు లేక సిద్ధయోగులకు **'దుఃఖాన్యపిసుఖాయన్తే విషమప్యమృతాయతే మోక్షాయతే చ సంసారః యత్ర మార్గః సశాఙ్కరః'** (దుఃఖములు సుఖములుగా, విషమమృతముగా, సంసారము మోక్షముగా మారును) – శామ్భవ సర్గము యొక్క ఈ అనుభూతి కలుగును. 13) ప్రబన్ధ నిర్మాణము బ్రహ్మ యొక్క పంచకృత్యములతో కూడిన ప్రపంచరచనమును పోలును. ఈ ప్రపంచరచనము ఆద్య సృష్టియైన జలముల నిధియైన సముద్రము నుండి (అవాన్తర ప్రలయమున) ఏర్పడును. 'చిద్గగన చన్ద్రికాబ్ధేః' అను పదబన్ధము నొక సమాసపదముగా భావించినప్పుడే యర్థము సిద్ధించును. ప్రబన్ధమున కల్పతరువులవంటి వాక్య విన్యాసములు అభిమతార్థముల పెక్కింటిని ప్రసాదించుచుండును. భావ రత్నములును అందు లభించును. అందుచేత ఈ ప్రబన్ధమునకు సముద్రము తోడి పోలిక సిద్ధించును. 14) ఈ కృతి స్తుతి కావ్యము. స్తుతి విషయమున ఇందు పరానుత్తర సిద్ధాన్త సంప్రదాయము

వ్యచ్ఛిన్నము కాకుండ అధికారుల కొఱకై అనుగ్రహింపఁబడినది. స్తుతి వ్యాజమున ప్రధానముగ సంప్రదాయ రక్షణము ఇట చేయఁబడినది. అని వ్యాజ శబ్దము తెలుపును. స్తుతిర్ వ్యాజాత్ లేక స్తుతివ్యాజాత్ అను పాఠములలో దేనినంగీకరించి నను ఈ అర్థము లభించును. 15) అధికారులు విజ్ఞానాకలులు, ప్రలయాకలులు, సకలులు, నిష్కలులు అని నాలుగు విధములుగ నుందురు. మహాకాలీ కాల మిథునావతారమైన ఈ కృతికర్త నాలుగు వర్ణముల వారికి నిషాదులతో కలిపి పంచజనులకు పురుషులతో పాటు స్త్రీలకును ఈ గ్రంథమున అధికారము కలదు. వేదావిరోధములైన తంత్రములందు త్రైవర్ణికులకే గాక వేదవిరుద్ధములైన అధికారము నంగీకరించుట తాంత్రిక సమ్మతము. వేద విరుద్ధములైన జైనాది తంత్రములందెట్లును సర్వవర్ణాధికారము అంగీకరింపఁబడిన దనుట వేరుగా చెప్పనక్కఱ లేదు. పై అధికారులలో నిష్కలులు ఉత్తమాధికారులు. వారు నిష్క లోపాసన చేయుదురు. ఆ నిష్కలోపాసనయే సర్వోపాసనలలోనూ శ్రేష్ఠమైనది. అను ఉద్దేశ్యము మంగళాచరణ ద్వారమున ప్రకటించినాడనుట రహస్యము. నః అను పదము ఈ రహస్యమును వెల్లడించుచున్నది. నః అనుపదము పాఠకులను రచయితను కలిపి చెప్పునట్టి పదము. అధికారులలో మాయిక కార్మికాణవ మలత్రయము గలవారు పై మలత్రయము నందలి రెండు మలములు కలవారు కొందరు, ఒకే మలము కలవారు కొందరు. ఈ నాలుగు విధములలో రచయిత నిష్కలుడు అని చెప్పదగినవాడు. కావున గుర్వనుగ్రహపాత్రుడై నిష్కలత్వ స్థితికి చేరుకున్న ఆతనికి మిగిలిన మంద మధ్యమాధికారులందఱపైన అనుగ్రహము తోడనే ఈ గ్రంథమును రచించినాడని గ్రంథమును మొత్తము పఠించిన అనంతరము సహృదయులు గుర్తించెదరు. నిష్కలుడు జీవన్ముక్త సదృశుడు. నిష్కలత్వస్థితి దార్ఢ్యము కొఱకు గాని, సంప్రదాయ పరిరక్షణము కొఱకుగాని మందాద్యధమ మధ్యమాధికారులందఱి దయచేత గాని ఈ కృతిని రచించి నాడని భావింపవలసియుండును.

**అవతారిక:–** పై శ్లోకమున గ్రన్థనామమును, తన నామమును, గ్రన్థమునకు అధికారులకానన్దమను ప్రయోజనమును చెప్పఁబడినవి. ఈ శ్లోకమున ప్రయోజనమును అభిలషించు చిత్తమున్నచో తన ఈ కృతి ఆశ్రయింపఁదగినది అని చెప్పఁబడుచున్నది.



**శ్లో॥ చిల్లోచనేన సతతం**
**శివమీక్షితుమన్వయే చ సద్భావమ్।**
**లబ్ధుం చ పూర్ణభావం**
**యది చేతస్సముపాధ్వమిమామ్॥** 4

**ప్రతిపదార్థము:–** చిల్లోచనేన=జ్ఞాననేత్రముతో, సతతమ్=నిరంతరము, శివమ్=శివుని, ఈక్షితుమ్=చూచుటకు, అన్వయే=అన్వయమునందు, సద్భావమ్=సద్భావమును, చ=మరియు, పూర్ణభావమ్=పూర్ణభావమును, లబ్ధుమ్=పొందుటకు, యది=ఒకవేళ, చేతః=మనసు (ఉన్నచో), ఇమామ్=దీని(కృతిని), సముపాధ్వమ్=ఉపాసింపుడు(లేక), సముపాద్యమ్=సంపాదింపదగినది. త్వల్లోచనేన అను పాఠమున నీ కంటితో అని అర్థము, సముపాద్యమ్ అను పాఠమున ప్రవృత్తి పదమును అధ్యాహారము చేసికొని యది ప్రవృత్తిః=ప్రవృత్తి ఉన్నచో, చేతః =మనస్సు, సముపాద్యమ్=సంపాదింపఁదగినది అని అర్థము చెప్పుకొనవలెను.

**తాత్పర్యము:–** నిరంతర శివసాక్షాత్కారము ఈ సంప్రదయ సమన్వయమున సద్భావమును పొందుటకు ఆ తరువాత పూర్ణత్వమును పొందుటకును చిత్తమున అభిలాష ఉన్నచో ఈ కృతి ఆదరింపఁదగినది లేక మంచి మనస్సు సంపాదింప దగినది.

**వివరణము:–** మాతృగర్భమునంతరాలలో భ్రమింపకుడు. రహస్యమును చెప్పు చున్నాము. మీకతి సన్నిహితముగా నున్న హృదయము యొక్క ఉద్యోగమును పర్యాలోచించుడు.

**హన్త రహస్యమ్ భాణామో మా భ్రమత గర్భగోలేషు।**
**అత్యాసన్నం హృదయమ్ పర్యాలోచయత తస్య చోద్యోగమ్॥**

అని మహార్థమంజరీ పరిమలమున చెప్పబడిన విధముగా సాధకహృదయాకర్షణ ప్రయత్నము, '**శ్రోతృచిత్తాభిముఖ్యా**' సంపాదన ప్రయత్నము ఈ శ్లోకమున ముఖ్య ప్రతిపాద్యమైయున్నట్లు స్పష్టమగుచున్నది. 2) అట్టి ప్రయత్నమేల చేయబడవలెను? కేవలము మందాద్యధికారులందలి ప్రేమచేతనే అట్టి ప్రయత్నము చేయబడుచున్నది. సాధారణ బుద్ధిసామర్థ్యముగలవారికి శాస్త్రార్థము సంగ్రహముగా ఉపదేశము చేసిన పిదప వారి జిజ్ఞాస పెరిగినదని గమనించిన పిదప విస్తరముగా ఉపదేశింపవలెననుట శాస్త్ర (సంగ్రహ విస్తార) సంప్రదాయము. ఆరంభమున

పిల్లకాలువలవలె నదులు కనంబడును. వీనిని సులభముగా దాటుదుము, అని దానిని దాటుటకు లోకులు యత్నించెదరు. సంగ్రహముగా శాస్త్రార్థమును మొదట చెప్పుట సాధకులలో మాకీ యత్నము సుసాధ్యమే అను ధైర్యము కలిగించుటకు చేయంబడును. మొదటనే విస్తరముగా శాస్త్రార్థమును వివరించుటకు ఆరంభించి నచో, ఇది మా బుద్ధి కందదను వైరాగ్యమునకు గురియగుదురు. ఇది యంత సులభముగానున్నది. ఇందు అర్థము చేసికొనదగిన గొప్ప విశేషము లేవియు ఉన్నట్లు లేదే అను సాధకుల నిరాదరణమునకు గురి కాకుండ, శాస్త్రార్థ విస్తరణము చేయదగినదైయున్నది. మొదటి చిన్న కాలువల వలెనున్న నదులు ప్రవహించినకొలది దుస్తర విస్తారము కలవిగా మారు చుండును. ఈ విషయమును రాజశేఖరుడు కావ్యమీమాంస యందిట్లు చెప్పినాడు.

**సరితామివ ప్రవాహాస్తుచ్ఛాః ప్రథమం యథోత్తరం విపులాః।**
**యే శాస్త్ర సమారమ్భా భవన్తి లోకస్య తే వన్ద్యాః॥**

నదుల ప్రవాహములవలె ఆరంభమున అల్పములై క్రమక్రమముగా విస్తరించు శాస్త్రారంభములు నమస్కరింపదగినవి.

3) గ్రన్థకర్త పాఠకులకు ఆదర్శముగా నుండవలెను. గురువు శిష్యుల కాదర్శముగా నుండవలెను. గ్రన్థకర్త గురుతుల్యుడు. పాఠకులు శిష్యతుల్యులు. వారి నుద్దేశించి జ్ఞానోపదేశము చేయుటయే ఇరువురికిని ఏకమైన ప్రయోజనము. కలికాలమున గురువులు లభింపనపుడు పూర్వుల గ్రన్థముల ద్వారముననే పాఠకులు శిష్యులుగా ప్రయోజనమును పొందుటకు మార్గాంతర మిది యొక్కటే అని ఈ శ్లోకమున సూచింపంబడుచున్నది.

గ్రన్థరూపమైన చిద్గగనచన్ద్రిక వైఖరీ వాఙ్మయము. ఇది స్థూలము. మన్దాధికారులకును తెలియంబడును. పరసూక్ష్మస్థూలములు ప్రథమద్వితీయ తృతీయములు. కావున ఇది తృతీయము. లేక వ్యుత్క్ర మమున పశ్యంతీ వాగ్రూప చిద్గగనచంద్రిక ప్రథమము. మధ్యమా వాగ్రూప చిద్గగనచన్ద్రిక ద్వితీయము. పశ్యన్తీ వాగ్రూప చిద్గగనచన్ద్రిక తృతీయము. పరావాగ్రూప చిద్గగనచన్ద్రిక తురీయము. వాగిన్ద్రియము ప్రమాణము. గ్రన్థకర్త ప్రమాత. చిద్గగనచన్ద్రికా కృతి ప్రమేయము. ఇవన్నియు ఉపాస్యములు. గ్రన్థకర్త వాని నుపాసించెను. తనవలె సవిమర్శముగ



నుపాసించు వారికి గ్రన్థకర్తయే ఆదర్శము. 2) శివ(కాల)దర్శనము అనగా తన ఆత్మయే శివుడు అను అనుభవము చిల్లోచనము ద్వారమున కలుగును. చిల్లోచనము అనగా జ్ఞాననేత్రము. జ్ఞానమే ఈ శివత్వానుభవమునకు ఏకైక సాధనము. వస్తుదర్శనము నేత్రములేనిదే ఎట్లు కలుగదో, శివత్వము శివోహమును అపరోక్ష అనుభవములేనిదే సిద్ధించదు. ఈ అనుభవము పూర్ణభావము అనియు పేర్కొనం బడును. జీవునందు అపూర్ణత్వానుభవముండును. అది శివోహమను 'అపరోక్ష జ్ఞానము' అను నేత్రముతో శివత్వము శివునిలోని పూర్ణత్వము అపరిచ్ఛిన్నత్వము అనుభవములోనికి వచ్చును. వ్యావహారికముగ ఇతరుల కాతడు అపూర్ణముగా శరీర ధారణ హేతువున కనంబడినను సద్భావమాతని యెడ లోకులు ప్రదర్శించెదురు. ఆతనికి తన సద్భావము సత్యత్వము అనుభవములోనికి వచ్చును. ఇతరుల కది ఎఱుగంబడక పోవుటచే ఆతని అన్వయమున అనగా వంశమునను సద్భావమునే దర్శించెదరు. తన పూర్వుల పవిత్రవంశమున జన్మించుట చేతనే తనకీ సద్భావము కలిగినదని ఆ సాధకుడు తృప్తినందును. త్వల్లోచనేన అనుపాతమున అయే అని అన్వయ పదమును విభజించినచో 'ఓయీ నేనెట్లు జ్ఞానలోచనమున శివదర్శనమున వ్యావహారిక సద్భావమును పూర్ణభావము నొందితినో మీరును శివుడనను జ్ఞానమును నేత్రముగాంజేసికొని వ్యావహారిక సద్భావమును, పారమార్థిక పూర్ణత్వానుభవమునొందదు–అని అసాధకుల నుద్దేశించి కవి పలుకు వాక్యము, శ్లోకమున అన్వయము చెప్పవచ్చును. గ్రన్థమును కూడ చక్కగా అన్వయించుకొని దానియందు సద్భావమును పూర్ణభావమును పొందుదు అను అర్థాంతరమును కూడ గ్రహింపవచ్చును. వ్యావహారిక సద్భావమనగా ఈతడు మంచివాడు అని జనులలో ఆతని యెడ కలుగు భావము. ఇదియే **సగురుమేవాభిగచ్ఛేత్ సమిత్పాణిః తమేతం వేదాను వచనేనే**త్యాది బ్రాహ్మణోపనిషద్వాక్యములందు సూచింపంబడినదే. వ్యావహారికమైన సద్భావముచే పూర్ణభావాపత్తికి పరంపరగా సహకరించును. 3) సతతం అను పదము శివదర్శనమునందలి ప్రకృతి విముక్తత్వమును వ్యంజించును. శివ దర్శనము పరోక్షజ్ఞానరూపము కాదు, అపరోక్షజ్ఞానరూపము అని వ్యంజించును. 4) నా చేతి విలాసమే ఈ చిద్గగనచన్ద్రిక గ్రన్థము. మీరును దీనివలన లాభము నొందుటకు మీ చేతమును గ్రన్థపఠనమున విలసింపంజేయుడు–అని యదిచేతః

అను శబ్దములు సూచించును. సముపాద్యమను పాఠమున ఇట్టి చిత్తము మీకు సంపాదనీయము అను అర్థము లభించును. 'సముపాద్వమ్' అనుపదమును సమ్, ఉప అను రెండు ఉపసర్గలతో కూడిన అద ధాతుజ క్రియగా భావించి మీరు మీ ఆత్మను మల త్రయోపాధిగల ఆత్మను ఈ కృతిని ఉపాసించుడు- అను అర్థమును గ్రహింపవచ్చును.

విమర్శమయ జ్ఞాననేత్రముతో ఆత్మా ప్రకృతి విముక్తమైనది అను పరోక్ష జ్ఞానము కలిగినను చిద్గగనచన్ద్రికా విమర్శము వలన కలుగు హృదయశాంతి లేనిదే ఔపనిషదమైన శివా(బ్రహ్మ)త్మైక్య దర్శనరూపమైన అపరోక్షజ్ఞానము మాత్రము కలుగదు. సార్వాత్మ్యాపత్తి రూపపూర్ణత అసలే కలుగదు అనుట రహస్యార్థము.

ఈ శ్లోకమున జీవశివతాదాత్మ్యము, జగత్సత్త యొక్క శివ సత్తావినాభావము శివతాదాత్మ్యమున జీవుని పూర్ణత్వము అను సిద్ధాంత త్రికము (త్రికసిద్ధాంతము) చెప్పఁబడినదనుట గమనింపఁదగినది.

పై నాల్గుశ్లోకములు అనుబన్ధచతుష్టయ నిరూపణ రూపోద్ఘాతరూపములు.

1) **విషయము** :- పరానుత్తర మహార్థ క్రమ సంప్రదాయము.

2) **అధికారి** :- మలత్రయమో, మలద్వయమో, ఏకమలమో కలిగి తన్మోక్షము కోరువాడు.

3) **ప్రయోజనము** :- పూర్ణభావాపత్తి

4) **సంబంధము** :- ఎ) విషయ గ్రన్థములకు ప్రతిపాద్య ప్రతిపాదక భావము
బి) సాధక విషయములకు ప్రాప్యప్రాపక భావము.

అను అనుబన్ధ చతుష్టయము నిరూపింపఁబడినది. మలత్రయ శోధనము నకై విరాడ్గాయత్ర్యర్థానుసన్ధానము చేయదగినది.

1) పృథివి ఏకపాద్గాయత్రీ రూపము
2) అన్తరిక్షము ద్విపాద్గాయత్రీ రూపము
3) ద్యులోకము త్రిపాద్గాయత్రీ రూపము
4) దిక్కు చతుష్పాద్గాయత్రీ రూపము
5) పరోరజము పంచపాద్గాయత్రీ రూపము



ఈ అనుసన్ధానమునకు ఫలము వై విరాట్ ప్రాప్తి లేక విరాట్ ప్రతిష్ఠ. వీనిలో పూర్వపూర్వము, ఉత్తరోత్తరమున అంతర్భవించును. ఇది తైత్తిరీయ శ్రుత్యుక్తము.

**అవతారిక:-** హృద్గుహలోని అవిద్యాకార్యమైన అపూర్ణాహంత అను సర్వానర్థ రూప గ్రన్థి యొక్క విచ్ఛేదము కొఱకు తన యందు శివాద్వైత దృష్టి కలుగుటకై శివ ప్రపత్తి చేయఁబడుచున్నది.

**శ్లో॥ హృద్గుహామఖిలషన్నహన్తయా**
**దృక్క్రియావపురదృక్క్రియా పదమ్।**
**సన్తమేమి సమభావదం శివం**
**సఖ్యహానిరమునా హి సూయతే॥ 5**

**ప్రతిపదార్థము:-** దృక్క్రియావపుః=దృక్క్రియా శరీరుడనైన నేను, అదృక్క్రియా పదమ్=దృక్క్రియచే పొందరాని, సమభావదమ్=సమభావము(స్వసామ్యము) నొసగు, శివమ్=శివుని, (సమభావదర్శినమ్=సమభావదర్శియైన), సన్తమ్=ఉన్న వానిని(శివుని), అహన్తయా=అహన్తతో, హృద్గుహామ్=హృద్గుహను, అభిలషన్= కోరుచు, ఏమి=సామీప్యమును పొందుచున్నాను లేక సన్తనోమి=విస్తరించు చున్నాను, అమునా=శివునిచేత, సఖ్యహానిః=విరుద్ధసఖ్యముయొక్క హానిని, సూయతే హి=ఈయబడును గదా!

**తాత్పర్యము:-** దృక్క్రియలు శరీరముగాగల నేను దృక్క్రియలకు స్థానము కాని సమభావము నొసగుచున్న శివుని అహన్తతో హృద్గుహనభిలషించుచు నేను చేరుచున్నాను.

**వివరణము:-** 1) మహదాదులలోని గుణములు మమ అని చెప్పదగినవైనను వానిని నేనని భావించుట గౌణాహంకారము. అహం శబ్దార్థములుగా ప్రసిద్ధములు కాని వానియందలి అహమ్భావము కూడ గౌణీవృత్తి నాశ్రయించియే యుపపన్నము అగును. కావున అట్టి అహమ్భావము లేక అహన్తయను గౌణాహంతయే యగును. అనగా అహమ్ శబ్దము యొక్క గౌణార్థములు అగును. అట్లే సర్వవ్యాపకమైన ఆత్మయందు ప్రాదేశికత్వ(మును) భావముతో కూడిన 'హం' భావము గౌణమే. ఈ రెండు విధములైన అహన్తలు కాక ముఖ్యమైన అహన్తయే ఈ శ్లోకశబ్దము

నందలి అహన్తా శబ్దముచే చెప్పఁబడును. ఇది అహమ్ప్రత్యా హారముతో నేర్పడిన నాద త్రిపుటీవృత్తి రూపము. ఇది యొక విధమైన ముఖ్యాహంత. **త్రివృద్వైజ్యేష్ఠమ్** అను శ్రుతిననుసరించి మాతా పితృ పుత్రరూప పిత్రహమర్థ రూపమైనది మరొక ముఖ్యాహన్త. శబ్దార్థ సామరస్యాత్మకమైన అనాహత నాదపూర్ణభావన రూపమైనది మరొక ముఖ్యాహన్త. ఈ మూడు ముఖ్యాహన్తలు శ్లోకములోని అహన్తా శబ్ద రూపములు. 2) గుహూ సంవరణే అను ధాతువు నుండి ఏర్పడినది గుహా శబ్దము. సంవృత సమష్టి శబ్దార్థమైన హృద్గుహా బోధకము. అట్టి హృద్గుహను అభిముఖముతో కోరుచు – అన్నది అభిలషన్ శబ్దార్థము. 3) దృక్క్రియావపుః అను సమాసములోని వపుః శబ్దము ఉప్యతే అనేన అను వ్యుత్పత్తి ననుసరించి వృత్తిమయ జ్ఞానదృక్క్రియా శరీరుడను అర్థము నిచ్చును. 4) అదృక్క్రియా+ పదమ్ అను సమాసము దృక్క్రియలతో పొందరానిది అను ఒక అర్థమునిచ్చును. అనగా శివుడు కర్తృ కర్మక్రియలు అను త్రిపుటిలేనివాడు, అని భావము. అదృక్క్రియా పదమ్ అను నీ సమాసము అనుత్తరాకార విషయక దృక్క్రియలచే మాత్రమే శివుడు పొందదగినవాడను మరొక అర్థమును కూడ నిచ్చును. దీనికి హేతువు శివుడు వాగర్థశరీరుడగుట అను విషయము కూడ నిది ధ్వనించును. అందుచేత నాదబిన్దు కలామయ మహానాద రూపత్వము కూడ అనుకరణముగా ధ్వనించును. 5) సన్తమే అనుపదము శివుని పారమార్థికసత్త స్వరూపత్వమును బోధించును. లేక హృద్గుహనభిలషించును. ఆ హృద్గుహతోడనే దృక్క్రియా శరీరుడనై అదృక్క్రియుడుగా నున్నవానిని అను అర్థమును బోధించును. అందుచేతనే సమభావాదుడైన మఙ్గల స్వరూపుడైన శివుని శివ శబ్దము బోధించును. 6) **బ్రహ్మ వేదబ్రహ్మైవ భవతి, బ్రహ్మైవసన్ బ్రహ్మావసన్ బ్రహ్మాప్యేతి, బ్రహ్మతన్మఙ్గలమ్ పరమ్** ఇత్యాది శ్రుతులు జీవుని యాథార్థ్యము బ్రహ్మస్వరూపమే అని శివుని స్వరూపము మఙ్గలము అని బోధించునవై ఈ శ్లోకార్థమును ప్రమాణీకరించుచున్నవి. **వశ కాన్తే** అను ధాతువు ననుసరించి శివ శబ్దము శివుని ఇచ్ఛారూపమును బోధించును. జీవుల అధికారేచ్ఛల ననసరించి శివుడు సారూప్యాది ముక్తుల నొసగునని భావము. సన్తం శివమను శబ్ధముతో కలసి సాదాఖ్య పురుషచంద్రకలారూపుడు శివుడు అని బోధించును. ఏమి అను క్రియ పొందెదను, అను ప్రవేశము చేయుదును అని అర్థమునిచ్చును.



7) సమ+భావః, సమ్+అభావః అని రెండు విధములుగా విభజించి అర్థములు చెప్పుకొనవచ్చును. ప్రతిపదార్థమున మొదటి అర్థము చెప్పఁబడినది. రెండవ అర్థము నాశ్రయించి మంచి అభావము అర్థము. అభావాధికరణమును గాని భావాన్తరరూపమను అర్థమును గాని ఇచ్చును. అట్టి సమ్ అభావమును ఇచ్చువాడు శివుడు. 8) తార్కికులు, గుణ, కర్మ, సామాన్య, విశేష, సమ, వాయములు అను ఆఱు భావ పదార్థములను, అభావము అను ఏడవ పదార్థమును అంగీకరించెదరు. తార్కికులు ఈ అభావమును సమవచనము కాదు అని చెప్పుటకే సమ్ అను ఉపసర్గ మీ అభావమునకు విశేషణముగా చేసి శ్లోకమున సమభావ శబ్దము ప్రయోగించఁబడినది. వైశేషికులు, నైయాయకులు మొదలగు వారు కొద్దిమంది దార్శనికులు తప్ప మిగిలిన దార్శనికులు అభావమును పదార్థముగానే అంగీకరించరు. భావాన్తరమభావస్తు కయాచిత్తు వ్యపేక్షయా అని వార్తికమున అధికరణాత్మకోఽ భావః అని భట్టుపాదులును చెప్పినారు. 9) మూడవ పాదమునకు గల సన్తనోమి సమభావ దంగినమ్ అను పాఠాంతరమును అనుసరించి దృక్క్రియలచే పొందరాని వాడైనను సమాన స్ఫురణము గల శివుని 'అంగినమ్ ఆత్మానమ్ సన్తనోమి' – అంగియైన ఆత్మను విస్తరించెదను. అను విధముగా వ్యాఖ్యానించవచ్చును. విస్తరించుట అనగా సృష్ట్యాది తటస్థలక్షణ ద్వారమున ఉపాసించుట. 10) పైన పేర్కొనఁబడిన ఆత్మ విస్తృతి రూప శివభావాపత్తి రూపానుప్రవేశము 'సఖ్యహాని' అని నాల్గవ పాదమున చెప్పఁబడినది. 'ద్వాసుపర్ణా సయుజా సఖాయౌ' కఠోపనిషన్మంత్రమున జీవాత్మ పరమాత్మలు దేహమున సఖులై యున్నారని చెప్పఁబడినది. ఈ సఖ్యము బద్ధ జీవులలో కొందఱి చేత మాత్రమే అనుభవింపఁబడును. ఎందఱి చేత అనుభవింపఁబడినను అది బద్ధులలోని శివుడు ఆ బంధరూపమై సఖ్యము యొక్క హాని శివుని చేత ఈయఁబడు చున్నది. అని నాల్గవ పాదమున చెప్పబడినది. ఈ పాదము నందలి 'సూయతే' అను పదము 'దీయతే' అను అర్థమునొసఁగును. రెండు అహముల లేక ఆత్మల ఐక్యము లభించుననుట సఖ్యార్థము. అందుచేత ఆ శివుని పొందుచున్నానను వాక్యము ఫలబోధక వాక్యము. ఈ 'సఖ్యహాని' అద్వైత సిద్ధాంతము ననుసరించి అద్వితీయాత్మ సాక్షాత్కారావస్థ యందు దానిని పోలిన వృత్తి జ్ఞానసన్తతి రూపమైన అహంగ్రహోపాసన యందును స్వస్వరూపమగుటచే జీవపరమాత్మల (సఖ్యము కుదరదు) సఖ్యహాని ఏర్పడును. విశిష్టాద్వైత సిద్ధాన్తము

ననుసరించి నశేషతానుభవావస్థయందు ఒకరు శేష మరొకరు శేషుడగుటచేత సఖ్యము కుదరదు. ద్వైత సిద్ధాంతము ననుసరించి సేవకతానుభవావస్థయందు జీవుడు సేవకుడు, శివుడు సేవ్యుడగుట చేతను ఆ ఉభయులకు సఖ్యము కుదరదు. ఇట్లు త్రిమతముల యందును జీవేశ్వరుల సఖ్యమునకు హాని ఈ శ్లోకమున వ్యంజింపఁబడినదిగా గమనింపవలెను. హన ధాతువుయొక్క హింసాగత్యర్థములలో హింసార్థము నంగీకరించి హాని శబ్దార్థము పైన వివరింపఁబడినది. ఇక గత్యర్థము నాశ్రయించి సఖ్యహాని యనగా సఖ్యమును పొందుట అట్టి సఖ్యగతి విద్యను అర్థించు వారికి గాని వైషయకులకు శివునిచేత ఈయఁబడును అనుట చతుర్థ పాదార్థముగా సమన్వయింపవచ్చును. ఉపాసకుని కీశ్వర సఖ్యానుభవావస్థయందు సఖ్యము తీవ్రమై అనుబంధముగా మారినప్పుడును, ఈ గ్రన్థము ననుసరించిన వాడు శివుడే కాని కాలిదాస నామకుడనైన నేను కాదు అని చెప్పుటగా అర్థము సమన్వయించుకొనవచ్చును.

**'విశ్వోత్పత్తి విపత్తి భూస్సుభగవానత్ర ప్రవక్తా శివస్తస్యాహమ్ప్రతి శబ్ద పర్వత గుహా యన్మేవ గర్వగ్రహః తద్దోషోస్తు గుణోస్తు వా న ఖలు తత్స్వాయత్తమిత్థం స్థితే మాత్సర్యమ్మహతాముదేతు యది వా వాత్సల్య ముజ్జృమ్భతామ్'** (విశ్వ సృష్టి లయముల నొనరించు నా భగవానుడైన శివుడే దీనికి (మన్త్రరామాయణమునకు) ప్రవక్త (కర్త). ఆ శివుడు చెప్పిన వాక్కు ప్రతిధ్వనించు గుహన్య రూపుడను నేను. అందువలన గ్రంథకర్తృత్వ గర్వము దోషమో గుణమో ఏమైనను నా స్వాధీనము లోనివి కాదు. కావున విద్వాంసులకు మాత్సర్యము కలిగిన కలుగు గాక. లేక వాత్సల్యము విజృంభించ విజృంభించు గాక.) అని మంత్ర రామాయణమున చెప్పినట్లు రచయిత తన యీ కావ్యమునకు శివుడే కర్తయని చెప్పుకొనుచున్నాడు. 11) ఈ శ్లోకము ప్రతిపాదమున ర, న, ర, ల, గ అను గణములుండుటచే రథోద్ధతావృత్త నిబన్ధనము. ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవతు (ఆత్మను రథిగా శరీరమును రథముగా తెలుసుకొనుము) అన శ్రుతి చెప్పిన విధముగా, ప్రత్యగాత్మ శివ విరాడ్దేహము చిద్గగనచన్ద్రికా ప్రబన్ధరూపమున ఉద్ధర రథమువలె ప్రవర్తించునది గావున దానికి వాగర్థ విలాస మయత్వ ప్రత్యభిజ్ఞాపనమున తన దేహమునకు తాదాత్మ్యభావము నీ వృత్త నామము సూచించుటచే ఈ కావ్యమున వృత్తౌచిత్య మేర్పడియున్నదను కొనవచ్చును. ఆవరణ కారణమున స్వస్వరూపుడైన



శివుడు స్వాత్మయే అని గుర్తింపలేక దూరస్థితునివలె భావింపఁబడుచున్న శివుని సమీపించుటకై పోవుచున్నానను సాధారణార్థము కూడ ఈ శ్లోకమున తెలియఁ బడుచున్నది.

ఇట్లు పర శివతత్త్వానుప్రవేశమున పూర్ణభావభరితుడైన పరశివుని యొక్క ప్రకాశ విమర్శోభయాత్మక మను మరొకపేరు గల వాగర్థాత్మకార్ధనారీశ్వర రూపతను సూచించుచు, **నమో వాచే యా చోదితా యా చానుదితా తస్యైవాచే..... పితరోనుమదన్తు'** ఇత్యాది క్రియాకాండోక్త శాంతి మంత్రోక్త స్వరూపముగల వాక్కునకు ఉదితానుదితా దశాభేదమున అవిద్యకలోక వ్యవహారి ప్రసిద్ధమైన వైఖరీ పరావాగర్థ దృష్టి భేదమును తలక్రిందులు చేయుచు, ఉదితానుదిత వాగర్థాభిన్న విద్యామయ పరా వైఖరీ వాగర్థ భావమున చెప్పఁబడఁబోవు ద్విత్రాచతుః పఞ్చవాగర్థ రూపము లేక అనుత్తర పఞ్చవాహ మహార్థ క్రమమునకు ప్రయోగించు నదగుట చేత వాగర్థమయ షడధ్వ సృష్టి హేతువు శివుడేయని తెలియఁజేయఁ బడుచున్నది.

**అవతారిక:–** పై శ్లోకమున శివాద్వైతసిద్ధికై శివ ప్రపత్తి చెప్పఁబడినది. ఈ శ్లోకమున శివునిలోని పరా(కాలీ) పర(కాల) రూపులైన షడధ్వ రూప వాగర్థోభయ హేతు మాతాపితలైన శివాశివల పరస్పరోన్ముఖత అర్ధనారీశ్వరత తథా పరాశ్రయణము సాధకునిలోని కృతి మహంతా నివృత్తికై చెప్పఁబడుచున్నది. పై శ్లోకమున శివభావాపత్తి చెప్పఁబడినది. ఈ శ్లోకమున ఆ శివుడు వాగర్థమయ షడధ్వ హేతువని చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ యాహమిత్యుదితవాక్పరా చ సా**
**యః ప్రకాశలులితాత్మవిగ్రహః।**
**యౌ మిథస్సముదితావిహోన్ముఖౌ**
**తౌ షడధ్వపితరౌ శ్రయే శివౌ॥** **6**

**ప్రతిపదార్థము:–** యా=ఏది, అహమ్ ఇతి=అహమ్ అని, ఉదితవాక్=పుట్టిన వాక్కు గలదో, సా=అది, పరా=పర, యః=ఎవడు, ప్రకాశలులితాత్మ విగ్రహః –ప్రకాశ= (శబ్దార్థము యొక్క) స్ఫురణముచేత, లులిత=వ్యాపించఁబడిన (శబ్దానుప్రవేశము గల), ఆత్మ విగ్రహః=స్వస్వరూప జ్ఞానవిశేషము గలవాడో, సచ= అతడు గూడ,

పరః=పరుడు,యౌ=ఏ యిరువురు, మిథః సముదితౌ=పరస్పర ప్రవేశము గలవారో, ఇహ=ఇచ్చట, ఉన్ముఖౌ=ఊర్ధ్వముఖములు గలవారో, షడధ్వపితరౌ=షడధ్వములకు తల్లిదండ్రులో, తౌ=ఆ, శివౌ=కాళీకాలురను, శ్రయే=ఆశ్రయించెదను.

**తాత్పర్యము:–** అహమ్ అని ఉదయించిన వాక్కు పర. అది శివ ప్రకాశస్ఫురణ రూపము. దానిచే ప్రకాశ రూప శివుని అర్ధవిగ్రహమున శబ్దా(వాగ)నుప్రవేశము కలిగి శివుడును పర అని వ్యవహరింపఁబడినాడు. ఈ విధముగ పరస్పరోన్ముఖత నొందిన వాగర్థ షడధ్వ మాతాపితలైన కాళీకాల మిథునమును ఆశ్రయించెదను.

**వివరణము:–** 1) అకారము నుండి హకారము వఱకు ప్రత్యాహారము చేయగా అహమ్ అను శబ్దమేర్పడును. ఇది ఈ ప్రత్యాహార విమర్శనముచేత ఆభ్యన్తర క్రియామయమైనది. ఉదిత వాక్శబ్దము పుట్టిన తనను చెప్పునదైన వాక్కు అను అర్థము నిచ్చును. పరా శబ్దము ఉత్కృష్టతను చెప్పును. ఈ ప్రథమపాదము విమర్శ రూపిణియైన శివాభిన్న కాళికి విశేషణముగా ఆమె యొక్క వాగ్రూపతను చెప్పుచున్నది. 2) రెండవ పాదమున ప్రకాశ శబ్దము (శబ్దాభిన్నార్థము యొక్క) స్ఫురణమును బోధించును. లలిత శబ్దము అర్థము యొక్క శబ్దానుప్రవిష్టతను బోధించును. ఆత్మ శబ్దమునకు స్వస్వరూపమని అర్థము. గ్రహమనగా జ్ఞానము. విగ్రహమనగా విశేషజ్ఞానము. ఈ పదార్థములు ప్రకాశ స్వరూప శివాభిన్న కాలుని యొక్క అహమర్థత్వమును చెప్పును. ప్రథమపాదమందలి చ శబ్దబలమున అధ్యాహారమైన పుంలింగ పర అనుశబ్దము ద్వితీయపాదమున లేకున్నను ఆ కాలుని యొక్క పరత్వమును అనగా ఉత్కృష్టతను బోధించును. అహం శబ్దార్థ అహం శబ్దము ప్రయోక్త ఆత్మరూప శివుడే లేక కాలుడే. 3) పూర్వార్ధమున కాళి పర అని, కాలుడు పరుడు అని చెప్పబడినది. ఈ ఇరువురు సత్యస్వరూపులని చెప్పఁబడినట్లైనది. అట్లైనచో ఏకమేవాద్వితీయమ్ అను శ్రుతి బోధితమైన అద్వైతమునకు భంగము రాదా? అను ప్రశ్నము కలుగును. దీనిని వారించుటకు తృతీయపాదమున వీరిరువురు మిథస్సముదితులని చెప్పఁబడినది. శబ్దాభిన్నార్థముగా కాలుడు అర్థాభిన్న వాక్కుగా కాళి పరస్పరభేదములేని ఒకరికొకరు తమను దయింపఁజేసికొన్నారని వ్యంజించును. ఉదయ శబ్దమున ఉపసర్గగానున్న సమ్ అనునది ప్రపంచము యొక్క జన్మను ఉదయ శబ్దము బోధించును – అని ఇది అట్టి ఉదయము కాదని ఆవిర్భావరూపమని వ్యంజించును. (ఆవిర్భూతులైన కాళీ కాలుర ఉదితత్వము సముదితత్వమే, కాని సాధారణ ప్రపంచముయొక్క ఉదిత తత్వము వలె కర్మజన్యము కాదని, అందుచేతనే ఈ ఉభయుల ఉదితత్వము సముదితత్వమే అని వ్యంజించును.) శబ్దార్థ రూపులైన వీరిరువురు పరస్పరాను ప్రవిష్టస్వరూపములని మిథఃశబ్దము వ్యంజించును.



శబ్దములు సుబన్తములు, తిఙన్తములు అని ద్వివిధములు. తిఙన్తములు క్రియలు అనఁబడును. విధి నిషేధ బోధనమునకై లిఙ్ అను ప్రత్యయములు ధాతువులకు చేర్చఁబడును. అప్పుడే క్రియలు విధినిషేధముల బోధించును. ఈ విధి నిషేధములు వేదాదిగతములై అవిద్యాగ్రస్తులైన మనుష్యులలో సత్కర్మ, దుష్కర్మ, ప్రవృత్తి నివృత్తుల కలిగించుచుండును. ఇది యంతయు విద్వాంసుల దృష్టిలో కల్పనా క్రమమే అగును. మరియు స్త్రీ పురుష లింగభేదము నాశ్రయించి కొన్ని కర్మలను పురుషులకే, కొన్ని కర్మలను స్త్రీలకే విధించుట లేక నిషేధించుట శాస్త్ర వ్యవహారము. ఈ లిఙ్గాది కల్పనయు పారమార్థికము కాదు.

ఉత్తమ జాతి స్త్రీ పురుషులలో పద్మ, వజ్ర, చక్రాదులు హస్తరేఖా మాత్రములుగా నుండును. అయినను వారిని పద్మాఙ్కులని, వజ్రాఙ్కులని, చక్రాఙ్కులని వ్యవహరించుట లేదు. శఙ్ఖచక్రాది తప్త ముద్రాఙ్కులు వైష్ణ వాదులుగా వ్యవహరింపఁబడుచున్నారు. ఇవి సమాజాఙ్కములు కావు. శిశ్న యోనులు సహజ లిఙ్గములు. కావున ప్రజలందరు మహేశ్వరులని చెప్పఁబడుటయే యుచితము. మహేశ్వర రూప కాళీ కాల చిహ్నములైన వానిని జన్మసిద్ధముగా ధరించు ప్రజలందఱు మహేశ్వరులే. వాఱందఱకు పరస్పరౌ న్ముఖ్యముండును. పరస్పరో న్ముఖ కాళీకాల జాతులగుట చేతనే కాళీ కాలురు అట్టి ఔన్ముఖ్యము కలవారగుటచే ఉన్ముఖులని ఈ శ్లోకమున కాళీకాల విశేషణముగా ఉన్ముఖౌ అని ప్రయోగించఁ బడినది. 4) పరస్పరౌన్ముఖ్యము చేతనే కాళీకాలురు షడధ్వ మాతాపితరులగుట నాల్గవపాదమున చెప్పఁబడినది. వాగధ్వములు, వర్ణపదమంత్రాధ్వములు మూడు అర్థాధ్వములు, కలాతత్త్వ భువనాధ్వములు మూడు మొత్తము ఆఱు షడధ్వములని చెప్పఁబడును.

**మాఙ్మానే** ధాతువు నుండి యేర్పడిన మాతృ శబ్దము అపరిచ్ఛిన్న రూపమును పరిచ్ఛిన్నము చేయును – అను అర్థమునిచ్చును. పాలనార్థక పాధాతు నిష్పన్న పితృశబ్దము జగమును పాలించు కాళికిని, కాలునకు సమముగా వర్తించుటచే పితృశబ్ద వాచ్యులగుచున్నారు.

**వశ కాంతౌ** అను ఇచ్ఛార్థక వశధాతునిష్పన్న శివశబ్దము ద్వివచనాంతముగా నీ చతుర్థపాదమున ప్రయోగింపఁబడుటచే కాలీకాలురిరువురు ఇచ్ఛామయులు – అని స్పష్టమగుచున్నది. వారిని శ్రయించుట యనగా అభేద రూపమున వారిని ధ్యానించుటయే. 5) వాగధ్వములలో వర్ణాధ్వము మొదటిది. వర్ణ శబ్దమునకు అచ్చు లేక హల్లు అని అర్థము. ఈ శబ్దము అర్థాధ్వమునకు చెంది చాతుర్వర్ణ్యము నకును వాచకము. ఈ చాతుర్వర్ణ్యముల పరిజ్ఞానమే అవిద్యక త్వమ్పదార్థ ప్రమేయ జ్ఞానవత్కల మాత్రమే. ఆ చాతుర్వర్ణముల పరిజ్ఞానమునకు హేతువులు, వారివారి వర్ణధర్మములే. ఆ ధర్మముల జ్ఞానము 'పద్యతే' (పొందఁబడినది) అను వ్యుత్పత్తిచే 'పదమ'ని చెప్పఁబడును. తత్పదవాచ్యార్థము పరోక్షేశ్వరుడు సర్వజ్ఞత్వాద్యుపపాతుడు. లక్ష్యార్థము కేవల జ్ఞానరూపాత్మ అపరోక్షము, త్వమ్పదార్థ వాచ్యార్థము. కించిద్జ్ఞత్వాద్యుపపాతజీవుడు త్వమ్పద లక్ష్యార్థ కేవల జ్ఞానరూపాత్మ అపరోక్షము. పరోక్ష పరారూప కాలి. అపరోక్ష ప్రత్యగారూపుడు కాలుడు. ఉపాధిరహిత పరాప్రత్యగాత్మల కాలీకాలుర స్వాత్మాభేదము తత్త్వమసి వాక్యార్థము. వాక్యార్థము పదార్థజ్ఞాన పూర్వకము. పదజ్ఞానము వర్ణ జ్ఞాన పూర్వము. వర్ణార్థము కల. పదార్థము తత్త్వము. తత్త్వమ్పదార్థ జ్ఞానపూర్వక వాక్యార్థజ్ఞానము తత్త్వమ్పద వాచ్య ఈశ్వర జీవుల లేక కాలీ కాలుర స్వాత్మ (భేద జ్ఞానము) లనెడి జ్ఞానము.

తత్త్వమ్పదార్థములు 'అసి' పద వాచ్యభేదమున విశ్రమించును. 'తత్త్వమసి' అను మూడు పదములు పద సముచ్చయము. కనుక వాక్యము ఆ వాక్యార్థము మంత్రార్థభూత భువనాద్యైక్య రూపము కూడనగను. శబ్దములు లేక పదములు వర్ణాత్మకములు. వాని నిత్యత్వము వైయాకరణ మీమాంసకాది తంత్ర సమ్మతము. కౌల తంత్ర సూత్రకర్త పరశురాముడు. **శబ్ద వర్ణాత్మకా నిత్యాశ్చ మన్త్రణామనన్యా దృశం సామర్థ్యమ్** అను సూత్రములలో శబ్దములు (పదధ్వకు చెందినవి) నిత్యము లని చెప్పుట విశేషము. దీని ననుసరించి శబ్ద సముదాయాత్మకములైన మంత్రముల కును నిత్యత్వము సిద్ధమగుచున్నది. తార్కికులు మాత్రము శబ్ద బుద్ధి కర్మలను ద్విక్షణ మాత్రావస్థాయులుగా అనిత్యములుగా చెప్పుదురు. వారి సిద్ధాంతముతో త్రిపుర సిద్ధాన్తోక్తార్థమును తాత్పర్యముగా చెప్పిన పరశురామ సూత్రములతో విరోధ మేర్పడినదన్నచో ఆ నిత్యత్వము అపేక్షకము మాత్రమే, అనిత్యతుల్యమే అగుటచే విరోధము పరిహరింపఁబడును.



శ్రీ విద్యాశఙ్కరులు **'ఉపాదానే వినష్టేసి క్షణం కార్యం ప్రతీక్షతే ఇత్యాహు స్తార్కికాః'** – ఉపాదానము నశించినను తత్కార్యము క్షణకార్యము నిలచి యుండును. ఇది తార్కికమతము, **'తద్వదస్మాకం కిం న సమ్భవేత్ తన్తూనాం దిన సంఖ్యానే తై స్తాదృక్ క్షణ ఈరితః, భ్రమస్యా సర్వకల్పస్య యోగ్యః క్షణ ఇహేష్యతామ్'**– అట్లే లెక్కలేనన్ని కల్ప భ్రమ హేతుక సంసారనాశక జ్ఞానాంతరము నాశ్య సంసార నాశక్షణము ఉపాదాన భ్రమ నాశానంతరము యోగ్యమైన క్షణము ఒక జ్ఞానోత్పత్త్యనంతర ప్రారబ్ధకర్మానుభవ సమాప్తి పర్యంత శేష జీవితము కాలము ఉండునని యేల అంగీకరింపగూడదు.

పైన గౌణముఖ్యాహన్తలు ప్రస్తావింపఁబడినవి. రహస్యాగమమున నివి కృత్రిమ పూర్ణాహంతలుగా పేర్కొనఁబడినవి. కృత్రిమాహంతను విడచి స్వాత్మయందు పూర్ణాహంభావమును దర్శించువాడే జ్ఞాని అని చెప్పఁబడినది.

**అవతారిక:– 'ప్రమేయస్య స్వరూపత్వ ప్రకాశో హి ప్రమాతృతా ప్రమాణానాం విమర్శశ్చేత్యర్థ నారీ శతాత్మనః'** – ప్రమేయ స్వరూప ప్రకాశమే ప్రమాతృత ప్రమాణముల విమర్శయు, అందుచేత ఆత్మ అర్ధనారీశ్వరుడు అను సూక్తి ననుసరించి ప్రమాతృ ప్రమాణ సామరస్య మనఁబడు ప్రకాశ విమర్శ మయత్వమును భావించి ధూమార్చిర్మార్గ ప్రమేయ విమర్శకుడైన జీవసాధక రుద్రునకును తత్ప్రాప్తి కొఱకు ఆతడు ప్రమేయ వాగర్థాభిన్న రూపుడగుట వలన, **'ద్రవ్యయజ్ఞాస్తపోయజ్ఞాః'** ఇత్యాదిగా భగవద్గీతలో చెప్పఁబడిన ఏడు విధములైన యజ్ఞములలో ద్రవ్య యజ్ఞమునకే అహన్తవిద్యాఽత్రి మల స్వరూపమునందును కృత్యత్రయ శిరోరూపమున ప్రథమ సాధనత్వమును వ్యంజించుచు వైదిక సోమయాగ విశేషములలో **'రుద్రో వా ఏష యదగ్నిః'** అను శ్రుతి యందు చెప్పఁ బడిన ఉష్ణవీర్య శిరస్సన్ధానాత్మక ప్రవర్గ్యాదులకు **'అహరహః ప్రవృజ్యతే అర్థమాసే అర్థమాసే ప్రవృజ్యతే'** అను శ్రుతి యందు చెప్పఁబడిన తత్థానాపన్న అగ్రహోత్ర దర్శపూర్ణమాసాదికమునకు నిత్యత్వ కారణమున ప్రాముఖ్యమేర్పడియున్నట్లు తాంత్రిక యాగ విశేషములందును వీర్యరుద్ర శిరస్సన్ధానాత్మక పఞ్చపదార్థ కారణ పూజావిశేషణమునకు ప్రాముఖ్యమును వ్యంజింపఁజేయుటకు ప్రమేయ జీవ/ రుద్రుడనఁబడు మహామన్థాన భైరవునకు ప్రమాణ పదస్థ పాంచభౌతిక దేహేన్ద్రియ సఙ్ఘాతమును జీవమాత్రామయ సృష్ట్యాది పంచకృత్య సముద్ర మథనమున

కుపయోగించు మానదణ్డముగా ప్రమాత్రభిన్నముగా స్తుతించుచు నమస్కరించుట చెప్పఁబడుచున్నది.

పై శ్లోకమున వాగర్థ సృష్ట్యాది హేతు కాలీకాలుల అర్ధనారీశ్వరత్వము స్తుతింపఁబడినది. ఈ శ్లోకమున ఆ అర్ధనారీశ్వర కాలీకాల మిథునము ప్రమాత్ర భిన్నముగా స్తుతింపఁబడుచున్నది.

క్రమప్రకాశికా వ్యాఖ్య ననుసరించి ఈ క్రింది శ్లోకమునకు ఈ క్రింది విధముగా అవతారిక చెప్పవచ్చును. పై శ్లోకమున షడధ్వపితురులైన పార్వతీ పరమేశ్వరులు స్తుతింపఁబడినారు. ఈ శ్లోకమున సృష్ట్యాదిలో తననాశ్రయించి యున్న సుధాకరుతో శక్తిని తర్పింపఁజేయుచు పరిపూర్ణభామయ సముద్రమును క్షోభింపఁజేయుచు శివుడు మందరసాదృశ్యమును పొందునను ఆగమార్థ మీ శ్లోకమున చెప్పఁబడినది.

**శ్లో॥ శక్తినేత్రపరిణద్ధ(ధ్వ)మాస్థితం**
**పూర్ణభామయ(వమ)పయోధిమన్థ(థ్న)తామ్।**
**దేవి! తర్పణసుధాకలాశ్రయం**
**రుద్రమన్దరమహం స్ఫుటం భజే॥ 7**

**ప్రతిపదార్థము:-** దేవి=ఓ ప్రకాశ విమర్శలకాశ్రయమైనదానా!, శక్తి నేత్ర=శక్తియే కన్నుగా గల, పరిణద్ధమ్=పరిణమించిన (లేక) శక్తికి, నేతృ=నాయకుని(ఆత్మ)చే, అపరిణద్ధమ్=పరిణమించని శక్తియే, నేత్ర=చిలుకు త్రాడులచేత పరిణమించిన, పూర్ణభామయ పయోధి మన్థతామ్=పూర్ణ ప్రకాశమయమైన సముద్రము యొక్క మన్దరతను, ఆస్థితమ్=ఆశ్రయించిన, శక్తినేత్ర పరిణధ్వమాస్థితమ్ (అను పాఠమున) శక్తినేత్ర పరిణత్=శక్తినేత్రము పరిణయించు దాని(దహరాకాశము)ను, వమ= ప్రసరింపఁజేయు దానిని (సర్వశక్తి ప్రసారక పాంచభౌతిక శరీరేన్ద్రియ సంఘాతమును), ఆస్థితమ్=ఆశ్రయించిన, (పూర్ణభావమ్+అపయోధి మథ్నతామ్ =పూర్ణభావముకల అకారమాత్ర స్వరమను సముద్రము - మూలాధారస్థ స్వర కుండలీ మాత్ర విమర్శమున - నుమథించువారి యొక్క) తర్పణ సుధాకలా శ్రయమ్=తర్పణము కొఱకైన సుధయందలి, కలా=అర్ఘ్యద్రవ్య సంస్కార పదార్థము లకు, ఆశ్రయమ్=ఆశ్రయమైన, దేవితర్పణసుధాకలాశ్రయమ్ (అను అవిభక్త



పాఠమున)-దేవి=చిచ్ఛక్తిని, తర్పణ=తర్పింపఁజేయు, సుధా=అమృతాత్మకమైన, కలా=విద్యకు ఆశ్రయమైన (లేక) దేవి తర్పణమైన, సుధాకలాశ్రయమ్= చంద్రునకు ఆశ్రయమైన, స్ఫుటమ్ (స్ఫోట రూపమునగాని చర్మచక్షుర్వేద్యద్రవ్య రూపమున గాని)=ప్రత్యక్షుడగు, రుద్రమన్దరమ్=రుద్రుడను మన్దరమును, భజే= సేవించెదను.

**తాత్పర్యము:-** ప్రకాశ విమర్శలకాశ్రయమైన ఓ దేవీ! శక్తివంటి కన్నుగా ప్రసరించు హృదయాకాశము తర్పింపఁజేయు అమృత కలాశ్రయుడైన (స్ఫోట రూపమున లేక చర్మ చక్షుర్వేద ద్రవ్యరూపమున ప్రత్యక్షుడగు) రుద్రుడను ఆత్మ జ్ఞానామృత మథనము అను సాధక కృత్యమునకుపయోగించు మందరమును సేవించెదను. (క్రమ ప్రకాశిక ననుసరించి):- ఓ దేవీ! శక్తి అను కవ్వపు త్రాడులో చుట్టబడిన పూర్ణ ప్రకాశరూప సముద్రముయొక్క విక్షోభహేతుమన్థాన దండముగా రూపొందిన తర్పణసుధాకలకాశ్రయుడైన రుద్రుడను మందరమును సేవించెదను.

**వివరణము:-** 1) **'శక్తి నేత్ర పరిణద్ధమ్'** అని ఒక విభాగము. **'శక్తినేతృ+ అపరిణద్ధమ్'** అని మరొక విభాగము. ప్రథమ సమాసముగా 'శక్తియే నేత్రముగా గల' అని అవధారణా పూర్వపదకర్మధారయ సమాసముగాని, 'శక్తి నేత్రము' వంటిది అని ఉపమానోత్తరపదకర్మధారయముగా గాని సమాసము చేయ వచ్చును. నేత్ర శబ్దమునకు కన్ను అని ఒక అర్థము. చిలుకుత్రాడు అని మరొక అర్థమును కలవు. 2) రెండవ పాదమును పూర్ణభావమ్+అపయోధి మన్థతామ్ అని ఒక విభాగము, పూర్ణ భా+వమ+పయోధి మన్థతామ్ అని మరొక విభాగము చేయవచ్చును. మొదటి విభాగమున పూర్ణభావమ్ అపయోధి మన్థతాం (చ) ఆస్థితమ్ అని అన్వయించుకొనవలెను. రెండవ విభాగమున రుద్రమన్దరము పూర్ణప్రకాశమును ప్రసరింపఁజేయు సముద్రమున ఆత్మ జ్ఞానామృత మన్థాన సాధనమైన మన్థాన దండము అని అర్థము వచ్చును. 'పూర్ణభావ మపయోధి మథ్నతామ్ అను పాఠమున పూర్ణ ప్రకాశమును ప్రసరింపజేయు సముద్రమును మథించు వారి యొక్క అని ఈ పాదమునకు అర్థము చెప్పి ప్రథమ పాదములోని శక్తినేత్ర పరిణద్ధమ్ అను సమాసముతో కలిపి అన్వయించుకొనవలెను. 3) మూడవ పాదమును ఏక సమాసముగా గాని దేవి అనుపదమును సంబద్ధిగా విభజించి తర్పణ సుధాకలాశ్రయమ్ అని రెండు పదములుగా గాని మొత్తము ఒక సమాసపదముగా గాని విభజించు కొనవచ్చును. 4) మొదటి పాదమున

శక్తినేత్ర పరిణద్ధ్వ మాస్థితమ్ అను పాఠాన్తరమున్నది. ఈ పాఠమున శక్తినేత్ర పరిణత్ వమ ఆస్థితమ్ అని విభాగము చేసికొనిన నేత్రము వంటి శక్తి పరిణమింపఁజేయు దహరాకాశమును ప్రసరింపజేయు ఆత్మ అమృతమథన సముద్ర పర్వతతుల్యమున పాంచ భౌతిక దేహేన్ద్రియ సంఘాతము సాధనమైన దేహము అని అర్థము చెప్పుకొనవలెను. 5) రెండవపాదమునందలి అపయోధి శబ్దమునకు ఆత్మజ్ఞుడు అకారమే సర్వసముద్రముగా గలవాడు అని అర్థము. **అకారో వై సర్వవాక్** అనుశ్రుతి ననుసరించి, అకారమున సర్వహల్లులు లీనమైనట్లు ఆత్మజ్ఞునిలో సర్వజగము లీనమైయుండును, అను అర్థమును స్ఫురించును. అన్ని హల్లులలో వ్యాపించు ఈ అకారము మూలాధారస్థ కుండలినీ స్వరూపము. దానిని విమర్శమున సిద్ధులైన (మన్థానభైరవ నామముగల) వారికి సముద్రమన్థనమునందు ప్రవృత్తి ఉండదు.

తైత్తిరీయ బ్రాహ్మణమున రెండవకాండలోని నాల్గవ ప్రశ్నమున ఆఱవ అనువాకమున శ్రుతియు శ్రౌత మంత్రలింగమున నాదవాగర్థ షడధ్వ లక్షితమైన (ప్రకాశానంద) శక్తి నేత్ర పరిణద్ధ విగ్రహముగల వైశ్వానరమూర్తి చక్రమున రాక్షసులే గూఢలిఙ్గులై చరింతరు–అను న్యాయమున **నహి స్పశమవిదన్నన్యమస్మాత్ వైశ్వానరాత్పుర ఏతార మగ్నేః అధే మమన్థన్న మృత మమూరాః' –** వైశ్వానరాగ్ని నుండి తప్ప మరొకరి నుండి ముందుగా వచ్చు గూఢచారి నెరుగరు. పిమ్మట ఈ అమృతమున మారులు మథించిరి – ఇత్యాది వాక్యముల ద్వారమున వారి మన్థాన (భైరవ) రూపతను చెప్పెను.

పూర్ణభా+వమ+పయోధి మథ్నతామ్ అను పాఠమును స్వీకరించి పూర్ణ ప్రకాశమును ప్రసరింపఁజేయు సముద్రమును మథించు వారి మధ్యమున శక్తి నేత్ర పరిణద్ధుడైనవాడు రుద్రమన్దరుడు అను విధముగా కూడ అన్వయించు కొనవచ్చును.

అగ్నిషోమాత్మక జగత్సృష్టియందు అగ్ని శక్తిరూపుడు సోమము ద్రవ్య రూపము. ఆధునిక విజ్ఞాన శాస్త్రము కూడ ద్రవ్యము, శక్తి అను రెండు పదార్థములనే అంగీకరించుచు ఆ రెంటిలో శక్తిద్రవ్యముగా మారుటను అనగా శక్తి ద్రవ్యముల ఏకత్వమును అంగీకరించుచు, ఇట్లు ద్వైతము యొక్క వ్యావహారికత్వమును, అద్వైతము యొక్క పారమార్థికత్వమును, ద్రవ్యశక్తులు



ఏకపదార్థము యొక్క రూపభేదత్వమును చెప్పుచున్నది. సోమమే శక్తి మద్ద్రవ్యము మన్థదండము సోమములోని శక్తి అగ్ని నామకము శక్తిమద్ద్రవ్య సృష్టియే అగ్నీషోమయ జగత్సృష్టి. జగమంతయు అగ్నిషోమాత్మకము. శక్తిమద్ద్రవ్యమయము. ఒకవేళ అశక్తిమద్ద్రవ్యములేవియైన జగముననున్నను క్రత్యపంచక క్రియా యజ్ఞములందు అవి అకించిత్కరములు (అప్రధానములు). హవిర్యజమాన ద్వయము సౌమ్యము అనగా సోమదేవతాకము. కావున దీనికి ప్రతినిధి ఉండదు. అనగా వాని స్థానమున మరొక వస్తువును ప్రతినిధిగా (బదులుగా) ఉంచరాదు. అను మీమాంసాన్యాయము అర్థాక్షిప్తమే. కావున మరల గుర్తు చేయబడనక్కఱ లేదు. 6) మూడవ పాదమున దేవి అనగా చిచ్ఛక్తి. దానికి తర్పణమైన సుధ అనగా జీవశక్తియే. అదే కల అనగా విద్య. దానికి ఆశ్రయము లేక దేవికి తర్పణమైన సుధాకలునకు అనగా చన్ద్రునకు ఆశ్రయము రుద్రకన్దరమే. మన్థరము మన్థాన పర్వతము. ఇట ఆత్మ జ్ఞానామృత సాధకత్వమును చెప్పును.

చిచ్ఛక్త్యభిన్న బ్రహ్మీ, లక్ష్మియైన సుధ, వారుణియు ఇన్ద్రచంద్రసహోదరీత్వము కలదియే. ద్విజరాజలక్ష్మి పరిచయము లేకున్నను ద్విజ, రాజ అను రెండు సంజ్ఞలు గలవాడు చంద్రుడు. ఆతనికి ఆశ్రయము రుద్రకన్దరమే. లేక దేవి అను పదము సంబద్ధిగా స్వీకరింపవచ్చును. మిగిలిన తర్పణ సుధాకలాశ్రయ శబ్దము తర్పణార్థ సుధయందలి సంసార్యద్రవ్య సంస్కారార్థములైన వానికాశ్రయమైనది రుద్రకన్దరము అని అర్థము చెప్పవచ్చును.

పైన సూచించఁబడిన సోమకలలు అమృత, మానద, పూష, తుష్టి, పుష్టి, రతి, ధ్రుతి, శశిని, చంద్రిక, కాంతి, జ్యోత్స్న, శ్రీ, ప్రీతి, అంగద, పూర్ణ, పూర్ణామృత అనునవి. ఇవి సబిందుక షోడశ స్వర స్వరూపములు. ఇవి యన్నియు తంత్ర ప్రసిద్ధములే. చతుర్నవ తిక కలా నిమన్త్రణ పక్షమున పైన చెప్పఁబడిన (అ) పదునాఱు సోమకళలు.

(ఆ) 1) కం భం తపిని, 2) ఖం బం తాపిని, 3) గం ఫం దూమ్ర, 4) ఘం పం మరీచి, 5) ఙం నం జ్వాలి, 6) చం ధం రుచి, 7) ఛం దం సుషుమ్న, 8) జం థం భోగద, 9) ఝం తం విశ్వ, 10) ఞం ణం బోధిని, 11) టం ఢం ధారిణి, 12) ఠం డం క్షమ – అను పన్నెండు జతలు అనగా ఇరువదినాలుగు సూర్యకలలు.

(ఇ) 1) యం ధూమ్రార్చిక, 2) రం ఊష్మా, 3) లం జ్వాలిని, 4) వం జ్వాలిని, 5) శం విస్ఫులింగిన, 6) షం సుశ్రీ, 7) సం సురూప, 8) హం కపిల, 9) ళం హవ్యవాహిని, 10) క్షం కవ్యవాహిని – అను పది కళలు అగ్నికళలు. పై మూడు సోమసూర్యాగ్ని కళలు. మొత్తము ముప్పది ఎనిమిది.

పైన పేర్కొనఁబడిన కళలలో (ఈ) బిందు యుక్తములైన కచ వర్ణములు సృష్టి, బుద్ధి, స్మృతి, మేథ, కాంతి, లక్ష్మి, ద్యుతి, స్థితి, స్థిర, సిద్ధి అను పది బ్రహ్మ కళలు. (ఉ) టత వర్ణములు జర, పాలిని, శాంతి, ఈశ్వర, రతి, కామిని, వరద, ఆహ్లాదిని, ప్రీత, దీర్ఘ అను పది విష్ణుకళలు. (ఊ) పవర్గము అంతస్థలు. ఊష్మములలోని మొదటి తక్ష, భయ, నిద్ర, తంద్ర, క్షుతు, క్రోధిని, క్రియ, జ్వాలిని, మృత్యువు అను పది రుద్రకళలు. (ఋ) ఊష్మములలోని ద్వితీయ, తృతీయ, చతుర్థములు ళ వర్ణము. పీత, శ్వేత, అరుణ, అసిత, అను నాలుగు ఈశ్వర కళలు. (ౠ) అచ్చు (స్వరము)లు నివృత్తి, ప్రతిష్ఠ, విద్య, కాంతి, ఇంద్రిక, దీపిక, రేచిక, మోచిక, పర, సూక్ష్మ, సూక్ష్మమృత, జ్ఞాని, జ్ఞానామృత, ఆప్యాయని, వ్యాపిని, వ్యోమరూప అను పదునాఱు సదాశివ కళలు. మొత్తము ఏబది. (ఎ) హగ్ంస శుచిషదిత్యాదులైదు, (ఏ) మూల మూర్తి కల ఒకటి. ఇవి మొత్తము కలిసి తొంబదియాఱు కళలకు ఆశ్రయము రుద్రమన్దరమని అన్వయించు కొనవలెను. 7) స్ఫుట శబ్దము రుద్రగత ప్రత్యక్షతను బోధించును. శతరుద్రీయమున పృథివ్యంతరిక్షద్యులోక త్రయగత రుద్ర గణముల ఆయుధము లగుటచేత, అన్నవాత వర్షరూప రుద్రగణములు స్థూలములే కావున వాని ప్రత్యక్షత అవివాదితమే. ఆగణములన్నిటి యొక్క అక్షశబ్ద వాచ్యములైన ఇంద్రియములు సమర్థములగుటచే ఆ గణముల పటు కరణేంద్రియతయు స్పష్టమే. పదార్థములు కరణములుగా గల ద్రవ్యమయ యజ్ఞము కర్మేంద్రియ జ్ఞానేంద్రియ పఞ్చకము కరణములుగా గల వైతానిక సోమయాగమునకు వలె విచ్ఛిన్న రుద్ర శిరస్సన్ధానాత్మ కత్వ భావనతో వర్ష్యాదికర్మలు గల పఞ్చ కృత్యాత్మిక మహాస్థితికి అందును. సాక్షాత్రప్రధానాఙ్గత్వమును నిరంతరము అనుసన్ధించెదను – అనుట భజే క్రియ యొక్క భావము.

అభీష్టక ప్రధానారుణ కేతుక అగ్ని బ్రహ్మ విద్యా ప్రకరణములోని అరుణ ప్రపాఠకము నందు **దివ్యస్యైకా ధనురార్త్నిః పృథివ్యామ పరాశ్రితా తస్యేన్ద్రో వమ్రి**



**రూపేణ ధనుర్జ్యామచ్ఛినత్ స్వయమ్ తదిన్ద్రధనురిత్యజ్య మభ్రవర్ణేషు చక్షతే ఏతదేవ శయోర్బార్హస్పత్యస్య ఏతత్ రుద్రస్య ధనుః రుద్రస్యత్యేవ ధనురార్త్నిః శిర ఉత్పిపేష స ప్రవర్గ్యోఽభవత్ తస్మాద్యస్సప్రవర్గ్యేణ యజ్ఞేన యజతే రుద్రస్య స శిరః ప్రతిదధాతి నైనగ్ం రుద్ ఆరుకో భవతి య ఏవం వేద' –** 'స్వర్గము నందీతని కొక ధనువున్నది. అది ఆర్త్ని. పృథివి యందు మఱొకటి ఆశ్రయింపఁ బడియున్నది. దాని యొక్క అల్లెత్రాటిని ఇంద్రుడు స్వయముగా చెదపురుగై ఛేదించెను. ఆ ఇన్ద్రుని ధనువు అజ్యము (అల్లెత్రాడు లేనిది) అని ఆ మబ్బుల రంగులలో చెప్పఁబడుచున్నది. ఈ ఆఖ్యాయకయే దేవీభాగవతమందలి వమ్రి అల్లె తాడును భేదించుట విష్ణువు తల ఎగిరిపోవుట అను కథచే ఉప బృంహణము చేయఁబడినది. ఇదే బృహస్పతి కుమారుడైన శంయువు యొక్క ధనువు. అది ఆర్త్ని. రుద్రుని యొక్క శిరమును పిండి పిండిగా చేసెను. అది ప్రవర్గ్యమయ్యెను. అందువలన ఎవడు ప్రవర్గ్యమను యజ్ఞమున యజించునో ఆతడు రుద్రునికి శిరమును కూర్చుచున్నాడు. ఇతనికి రుత్ (దుఃఖము) పీడకము కాదు అని ఎవడు ఎఱుగునో వాడు ప్రవర్గ్య యాగానుష్ఠాన ఫలము నొందును. వేదములోని ఈ ఆఖ్యాయిక సాధకుడైన దక్షుని కథను సూచించును. దక్షుడే రుద్రుడు. ఆయన శిరస్సుతెగుట అతికింపఁబడుట మరణ కథాంశములు' దీనికి ఉపబృంహణములు. పఞ్చ పదార్థ కరణక ప్రవర్గ్యారుణకేతుక సోమయాగాదు లందు చిత్యగ్న్యాది సామరస్య ప్రకారము గురుముఖము నుండియే యెఱుగఁదగినది.

**అవతారిక:–** పై శ్లోకమున ప్రమాణ ప్రమేయ ప్రమాతృ త్రిపుటిగా ఆత్మ యొక్క సర్వాత్మతను ద్రవ్యమయ యజ్ఞము యొక్క ప్రథమసాధనత్వమును అనుసంధించఁ బడినవి. ఈ శ్లోకమున ఏ కర్మతో జంతువులు నరకమునఁబడుదురో ఆ కర్మ చేతనే త్రికాలజ్ఞులై పైకెగిరి పోవుదురు, అను కాలికామతమున చెప్పఁబడిన విధముగా అభిసన్ధి భేదమున కర్మలకు మోచకత్వమును కలదు అని చెప్పఁ బడినందున సాధకాభిసన్ధి వైగుణ్యమున తామసకర్మ యొక్క అధః పతన హేతుత్వమును గుర్తు చేయుచు సార్వాత్మ్యమే తెలుపఁబడుచున్నది. (క్రమ ప్రకాశిక ననుసరించి) పై శ్లోకమున సృష్ట్యాదినందు శివుని మందరాయమాణత్వము చెప్పఁ బడినది. ఈ శ్లోకమున సర్వవ్యాపక చిత్తత్వమునకు (హార్దాకాశ పరిజన్యమైన దానికి) వందనము చెప్పఁబడుచున్నది. పై శ్లోకమున రుద్ర మన్దర భజన

వ్యాజమున ద్రవ్యమయ యజ్ఞము యొక్క ప్రాథమ్యము చెప్పఁబడినది. ఈ శ్లోకమున తామసమైన సాధకుని సదభిసన్ధానము లేని ఆ యజ్ఞము యొక్క నరకహేతుత్వము చెప్పఁబడుచున్నది. మరొక విధముగా పై శ్లోకమున సాధన సాధక సాధ్య త్రిపుటికి మూలమైన ప్రమాతృ ప్రమాణ ప్రమేయ త్రిపుటి రూపమున రుద్రనామక ఆత్మయొక్క సార్వాత్మ్యము రుద్రమన్దర రూపకము ద్వారమున చెప్పఁబడినది. ఈ శ్లోకమున ఆ సార్వాత్మ్యమే విస్తరించి చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ యోఽ భవద్భవతి యస్తథేతరో**
**యో భవిష్యతి పృథక్క్రియో (క్రమో) జనః।**
**తత్త్రయోదరమహన్తయైకయా**
**సన్తమస్మి హృదిరన్ధ్ర ఆనతః॥ 8**

**ప్రతిపదార్థము:–** యః=ఎవడు, ఇతరః=అన్యుడో, జనః=జనుడు, అభవత్=ఉండెనో, భవతి=ఉన్నదో, భవిష్యతి=ఉండగలదో, యః=ఎవడు, పృథక్క్రియః=వేఱైన (లోకపాలనరక్షణములైన) క్రియలు గలవాడో, తథా=ఆ విధముగా, తత్త్రయోదరమ్=ఆ ముగ్గుఱి యొక్క పొట్టగా, ఏకయా=ఒక, అహన్తయా= అహన్తతో, సన్తమ్=ఉన్న, హృది=హృదయమందలి, రన్ధ్రమ్=ఆకాశమును, (లేక) రన్ధ్ర పరిమాణముగా నున్న దహరాకాశముగా, సన్తమ్=ఉన్న దానిని గూర్చి, ఆనతః=నమస్కరించిన వానినిగా, హృది=హృదయమున, అస్మి=ఉన్నాను, పృథక్క్రమః అను పాఠమున – పూర్వము చెప్పఁబడి ఉత్తమ జనాపేక్షతో వేఱైన సంసార క్రమము కలవాడని అర్థము, అహన్తయైకయా అను పాఠమున – తత్త్రయోదరమ్=ముగ్గురికి ఉదర భూతముగానున్న అను అర్థమును చెప్పినను రన్ధ్రమ్ అను పదమును విశేషణముగా చేసి అన్వయించు కొనవచ్చును.

**తాత్పర్యము:–** ఏ జనుడు విలక్షణ క్రియలు గలవాడై ఇది వఱకు ఉండెనో, ఇప్పుడున్నాడో, ఇక ముందు ఉండగలడో, ఆ ముగ్గుఱికి ఉదర భూతముగా నున్న హృదయాకాశమున ఆత్మ భూతుడైన త్రికాలములకు తత్కాలములలోనున్న వానిని అహన్తతోడనే అనగా ఆత్మగానే ఉన్నాను.

**వివరణము:–** యః అనుపదము సాధకుని గాని, మన్థనభైరవరుద్రునిగాని బోధించును. అభవత్ అను భూతకాలక క్రియచేత పూర్వవిద్యావస్థయందు



అనిగాని, పూర్వజన్మమునందు అని గాని అర్థము ఆక్షిప్తమగును. తథా శబ్దము వలన యథా శబ్దము ఆక్షిప్తమై నాదానుత్తరాకాశ రూపమున సత్తాహీనునివలె నున్న అను అర్థము వచ్చును. దీనివలన **'అసదేవ సోమ్యేదమగ్ర ఆసీత్'** అను శ్రుతిలో చెప్పఁబడిన విధముగా సత్తుగా నామరూప సత్తాభివ్యక్తి లేనివాడనను సత్తావంతుడనను అర్థము వచ్చును. అట్లే భవతి అను వర్తమాన కాల క్రియచేత ఇప్పుడు జగద్రూపముననున్నది(వాడు). పూర్వము అనగా జగములేకున్నప్పుడున్న వాడు అను అర్థము వచ్చును. సంసార్యర్థకమైన ఇతర శబ్దము యొక్క బలమున ఇదివఱకు, ఇప్పుడును ఆత్మకు సంసారము లేనిదే అను అర్థము వచ్చును. సాధక పక్షమునను పూర్వమునందు వలె నిప్పుడును లోక విలక్షణ క్రియలు గలవాడగుట చేత జ్ఞానక్రియాది పురుషార్థ వాసన లేక సంభ్యాపూరక సత్త గలవాడు కూడ కాడను అర్థము వచ్చును. రుద్రపక్షమునందును **'అసన్నేవ సభవతి అసద్ బ్రహ్మేతి వేదచేత్ అస్తి బ్రహ్మేతి చేద్వేద సన్తమేనం తతో విదుః'** (బ్రహ్మ అసత్తు (లేనిది) అని చెప్పువాడు అసత్తే అగును. బ్రహ్మ ఉన్నది అని చెప్పువాడు సత్పురుషు డగుచున్నాడు) అని శ్రుతినిందించిన ఆత్మశూన్యతావాదికి భయము, శ్రుతి ప్రశంసించిన ఆత్మాస్తిత్వవాదికి అభయము కలుగును.

ఆత్మ 1) ఉన్నది 2) లేదు 3) ఉన్నది లేదు 4) లేదు లేదు అనునవి ఆత్మధానము యొక్క నాల్గుకోటులు గౌడపాదకారికలలో అలాతశాన్తి ప్రకరణమున చెప్పఁబడినవి.

పృథక్క్రియలలో కొన్ని (ఆస్తిక్యమున) ఉత్తమ జన్మనిచ్చునవి. కొన్ని అధమ జన్మనిచ్చునవి. పుణ్యములు, పాపములు అని వ్యవహరింపఁబడును. ఇట్టి పృథగ్భూత క్రియలు గలవాడు పృథక్క్రియుడు. పృథక్క్రమః అను పాఠమున వెనుక చెప్పఁబడిన ఉత్తమాధమ సాధక జనాపేక్షతో వేరయిపోయి సంసార క్రమము గలవాడు అను అర్థము వచ్చును. అహమర్థము, తిర్యక్ స్రోతమని, ఊర్ధ్వస్రోత మని, అధస్స్రోతమని మూడు విధములుగా నుండును. లేక నాద, వాగర్థ క్రియా, షడధ్వకృత్య త్రయము కలిగి త్రివిధముగా నుండును. ఉత్తమ శివ సంసారము కాక, అధమ పశు సంసారము కాక మూడవదైన విధమునకు చెందిన సాధకజీవ సంసారమును సూచింపఁబడుచున్నది. కావున జనుడు రాబోవు జన్మమునను సంశయాత్మకుడగుట వలన జన్మవంతుడే అగును. రుద్ర పక్షమున జనః అనికాక

అకార ప్రశ్లేషమున అజనః అని విభజించి లోకత్రయ విలక్షణక్రియుడై భూతభవద్భావి జన్మత్రయమందునను జన్మ సంబంధరహితుడే లేక లోక త్రయ విలక్షణక్రియుడై ఇదివఱకుండెను, ఇప్పుడున్నాడు, ఇక ముందుండగలడు అను అన్వయమును చెప్పుకొనవచ్చును. గుణ త్రయము గల లేక పూర్ణసత్త రూపము గల అహన్తతో హృదయము నందలి రంధ్రముగా అనగా ఆకాశ స్వరూపముగా ఉన్నవానిని గూర్చి నమస్కరించి యున్నవాడను. అహన్తదైవ అనుపాఠమున త్రయోదరభూతుని వలె ఒకే అహన్తతో హృదయాకాశరూపునిగా ఉన్నవానిని గూర్చిగాని, ఉన్న ఆకాశ ప్రమాణమున హృదయమందున్న వానిని గూర్చి గాని నమస్కరించి యున్నానని అర్థము చెప్పుకొనవచ్చును.

**అవతారిక:–** క్రమప్రకాశిక ననుసరించి పై శ్లోకమున హార్దాకాశగత చిత్తత్త్వము స్తుతింపఁబడినది. ఈశ్లోకమున హార్దాకాశముగ ఈశ్వరుని ధ్యానించు పతంజల్యాది మహర్షుల ఉపాసనము చెప్పఁబడుచున్నది.

ప్రమాతృ రుద్రుడు, మన్థాన భైరవ రుద్రుడు, రుద్రుడు అనువారు ముగ్గుఱును సాత్త్విక, రాజస, తామస గుణ ప్రధాన సాధకులుగా భావింపఁ బడవచ్చును. ఈ సాధకభేదమును చెప్పి సద్విద్యా సంప్రదాయ మార్గ ప్రవర్తనము కొఱకు ఆ సంప్రదాయ మందలి గురుపరమ్పరా భేదమున అనేక శరీరములను స్వీకరించిన విషయమును స్ఫురింపఁజేయుటకు **'యోగేన చిత్తస్య పదేన వాచాం మలం శరీరస్యచ వైద్యకేన యోపాకరోత్తం ప్రవరమ్మునీనామ్'** అన్నట్లు శబ్ద శాస్త్రముతో వాఙ్మలమును, యోగ శాస్త్రమున మనోమలమును, వైద్య శాస్త్రమున శరీరమలమును నివర్తించు గుర్వోఘ త్రయ గురుపంక్తి సమష్టి మూల భూతుడైన పతఙ్జలి మహాముని యొక్క శబ్ద బ్రహ్మావతారత్వమును నిరూపించు పరౌఘ ప్రభృతి శిష్యౌఘ పర్యంతమున్న గురుపఙ్క్తికి ఈ క్రింది శ్లోకమున నమస్కరించుట చెప్పఁ బడుచున్నది.

**శ్లో॥ విశ్వసద్మని సదాత్మనీశ్వరే**
**పూరణా త్పురుషతాముపేయుషే (షి)।**
**యే మనః ప్రణిదధు ర్మహర్షయ**
**స్తాన్ పతఙ్జలి ముఖానుపాస్మహే॥** **9**



**ప్రతిపదార్థము:–** విశ్వసద్మని=విశ్వమే ఇల్లుగా గల, (లేక) విశ్వమునకు నివాస మైన, సదాత్మని=నిత్యాత్మయైన, ఈశ్వరే=(సర్వ) నియామకుడైన, పూరణాత్= పూరణమువలన, పురుషతామ్=పురుషత్వమును, ఉపేయుషి=పొందినవానియందు, యే=ఏ, మహర్షయః=మహర్షులు, మనః=మనస్సును, ప్రణిదధుః= నిలిపిరో, తాన్=ఆ, పతఙ్జలిముఖాన్=పతఙ్జల్యాదులను, ఉపాస్మహే= ఉపాసించుచున్నాము.

**తాత్పర్యము:–** ప్రపఞ్చము నివాసముగా గల, ప్రపంచమున వసించు చోటైన, పూరణమువలన, పురుషుడని చెప్పదగిన, నిత్యుడైన ఈశ్వరుని యందు మనస్సును నిల్పిన పతఙ్జల్యాది మహర్షుల నుపాసించుచున్నాము.

**వివరణము:–** విశ్వము పరమాత్మయందున్నది. కావున విశ్వమునకు పరమాత్మ ఇల్లు అని చెప్పఁబడును. ఆ విశ్వమును సృజించి జీవరూపమున మరల ఆ విశ్వమునందే ప్రవేశించి నివసించుచున్నందున ఆతనికి విశ్వమే ఇల్లుగా నున్నదని చెప్పవచ్చును. విశ్వము ఇల్లుగా గలవాడు అను అర్థమున విశ్వసద్మ శబ్దము బహువ్రీహి సమాసము. విశ్వమునకు ఇల్లు అయినవాడు అను అర్థమున ఆ శబ్దము షష్ఠీతత్పురుష సమాస శబ్దము. 2) ఆత్మ శబ్దము జీవుని చెప్పినను పరమాత్మను చెప్పినను అది యొక నిత్య వస్తు వాచకమే. ఆ నిత్య వస్తువునకు గల ఉపాధులలో కొన్నిటికి నాశమున్నను, అన్ని ఉపాధులు నశించుట ఈ విశ్వమున్నంతవఱకు సాధ్యము కాదు. కావున ఆత్మ సద్రూపుడు. ఆ సద్వస్తువే ఆత్మ. అసత్తు అనగా మిథ్యాభూతము. మిథ్యాభూతమైన దేదియు సత్తుకాదు. కావున సద్వస్తువు ఆత్మయే లేక సద్వస్తువే ఆత్మయని సదాత్మని అను శబ్దము బోధించును. 3) జీవుడు నిత్యుడనుట శాస్త్ర వ్యవహారమే కాని లోక దృష్టిలో నాతడు నశించువాడే కావున ఆతడీశ్వరుడని చెప్పఁబడుటలేదు. కాని ఆ జీవులలో నెవరైనను చివఱకు తామీశ్వర స్వరూపులమే అని గ్రహించినపుడు మాత్రమే ముక్తి కలుగును. జీవుని యందు జీవత్వ బుద్ధి భ్రాంతి మూలమే. ఈశ్వరత్వమే ఆయన వాస్తవ రూపము. కావున సదాత్మ శబ్దము ఈశ్వర శబ్దమునకు విశేషముగా నన్వయించుకొనవచ్చును. లేక ఈశ్వరత్వము జీవుని వాస్తవ రూపము కావున అట్టి ఈశ్వరత్వము కలదియే సదాత్మ అని ఈశ్వర శబ్దమును సదాత్మ శబ్దమునకు విశేషణముగా కూడ అన్వయించు కొనవచ్చును. 4) జీవేశ్వరులిరువురు పురుష నామధేయులే. పూర్ శబ్దము యొక్క సప్తమీ విభక్తి

పురి అను శబ్దము. అట్టి పూర్ నామకమైన శరీరమే పూర్ణశబ్దము. పురశబ్దమునకు పట్టణము అనియు అర్థమున్నది. పట్టణమైనను, ఇల్లైనను నివసించునదే. సుఖముగా ఆత్మకు నిద్రించు లేక శయనించు స్థానము శరీరమే. ఇట పూర్ శబ్దముచే బోధింపఁబడదగినది. 'పురి=శరీరమున శయనించువాడు' అగుటచే పురుష శబ్దము ఆ జీవేశ్వర రూపమైన ఆత్మను బోధించును. ఈ యర్థమున పురుష శబ్దములోని షకారము యొక్క పూర్వ రూపము 'శ' అని భావింపఁబడినది. అందుచేతనే **'పురి శయనాత్ పురుషః'** అను నిర్వచనము పెద్దలచే అంగీకరింపఁబడినది.

మరొక విధమైన పురుష శబ్దము యొక్క నిర్వచనమందు ఆ శబ్దము నందలి ఉష అను ఉత్తరభాగము ఉష ధాతువు యొక్క పూర్వరూపముగా భావింపఁబడినది. **పురమోషతి** అను నిర్వచనము పురమును ప్రకాశింపఁజేయువాడు అను అర్థమునిచ్చును. ఈ నిర్వచనము వ్యాకరణమునకు మిక్కిలి అనుగుణముగా ఉన్నది. పుర్ ఉష=పురుష అను విభాగమున నేర్పడియున్నట్టిది. పురిశయనాత్ అను నిర్వచనమున 'ష' యను ఉత్తరభాగము 'శీఙ్' ధాతువులోని శకారము యొక్క షకార రూప పరిణామము. అది సరే కాని అందు ఉకారము ఆగంతుకముగా మాత్రమే అంగీకరింపవలయును. కాని అర్థవంతముగా గ్రహించుట కవకాశము తక్కువ.

పై రెండు నిర్వచనములు పురుష శబ్దము సపదసమాసముగా భావింపఁబడవలసియుండును. కాని పురణాత్ పురుషః అను నిర్వచనమున పుర్ ధాతువు నుండి ఉత్తర భాగము ప్రత్యయముగా చేర్చఁబడగా పురుష శబ్దమేర్పడు నని సూచించుచున్నది. ఈ నిర్వచనమునే ఈ శ్లోకము యొక్క రెండవ పాదము సమర్థించుచున్నది. వాగర్థ పూరణ భావము లేక వాగర్థ పూర్ణభావము అను అర్థమిట అభిలషణీయమైనందున పూరణము వల్లనే పురుషతను పొందినవాడు పరమాత్మ అను నర్థము నీ పాదము వివరించుచున్నది. 5) ప్రణిదధుః అను క్రియ **ప్ర ని** అను ఉపసర్గలతో కూడిన 'ధా' ధాతువు నుండి యేర్పడినది. ఉంచుట లేక నిలుపుట దాని అర్థము. ధ్యానించుటను ప్రణిదధుః అను మూడవ పాదమందలి క్రియ బోధించును. పతంజల్యాదులైన మహర్షులీశ్వరుని యందు మనస్సును నిల్పు పవిత్రమూర్తులు. అట్లు నిల్పి ఈశ్వరునే స్వాత్మగా దర్శించిన



జ్ఞానులు అని, ఋషదర్శనే అను ధాతువునుండి జనించిన ఋషిశబ్దము అంత మందుగల మహర్షయః అను శబ్దము వ్యంజించును. ఉపాస్మహే అనుక్రియ కూడ ప్రణిదధుః అను క్రియ వలె ధ్యానార్థకమే. పరమాత్మను ధ్యానించు వారును పరమాత్మునివలె ధ్యాన యోగ్యులగుదురని ఈ రెండు ఏకార్థక క్రియలు వ్యంజించును.

గురువులు మూడు విధములుగా తంత్రములలో పేర్కొనఁబడినారు. 1) దివ్యౌఘము, 2) సిద్ధౌఘము, 3) మానవౌఘము. బ్రహ్మాదులు దివ్యౌఘమునకు చెందినవారు. శైవతంత్రమున సుమారు ఆరువందల మంది సిద్ధులు పేర్కొనఁబడినారు. వారు శ్రీ వైష్ణవ సిద్ధాంతమునందలి నిత్యసూరుల వంటివారు. గురువులుగా ప్రసిద్ధులైన ఆ సిద్ధులు లోకమునకు శివాజ్ఞతో దిగివచ్చి శివుడు చేయవలసిన కృత్యములనే అనగా భక్తానుగ్రహాదులను చేయుదురు. ఇట్టివారు సిద్ధౌఘమని పేర్కొనఁబడుదురు. మానవ లోకమున సాధారణులుగానే జన్మించి, సాధనద్వారా గురు పదము నలంకరించిన వారు మానవౌఘముగా పేర్కొనఁబడుదురు. గుర్వౌఘము మరల త్రివిధములుగా కొన్ని తంత్రములలో పేర్కొనఁబడినారు. ఈ శ్లోకమునందలి పతంజల్యాదులు పైన పేర్కొనఁబడిన గురువుల సమష్టిగా భావించఁబడదగినవారు. పతంజలి శేషావతారముగా విశ్వసింపఁబడినందున ఆయనను దివ్యౌఘము నకు చెందిన వానినిగా, నిత్యసూరులలో నొకనిగా భావింపఁబడినందున సిద్ధౌఘమునకు, మానవలోకమున జన్మించినందున మానవౌఘమునకు చెందిన వానినిగా కూడా భావింపఁదగినవాడు. కావున శ్రీ కణ్వ అగ్నిహోత్ర శాస్త్రి గారి చిద్గగనచన్ద్రిక యొక్క తమ వ్యాఖ్యయందు పతంజల్యాదులు గుర్వౌఘ సమష్టిగా పేర్కొనఁబడినారు.

**అవతారిక:–** సకల (పంచవిధ) గుర్వౌఘ సమష్టి రూప పతంజల్యాది గుర్వౌఘోపాసనము పై శ్లోకమున చేయఁబడినది. ఈ శ్లోకమున వాగర్థ సమష్టియైన పంచవాహమయ విశ్వోత్పత్త్యాది హేతువైన దివ్యౌఘ త్రయరూపిణియైన తన అభీష్టదేవత యొక్క స్పన్దమైన దహర ప్రకాశాత్మకాకార శమ్భువు యొక్క విమర్శాత్మక హకార రూప శక్తి యొక్క కలయికయైన పూర్ణాహంతా రూపము యొక్క అవభాసన చేత శివానుభవము కలుగునను ఆగమసిద్ధాంతమును అనువదింపఁబూనుచు స్తుతింపఁబడుచున్నది.

**శ్లో॥ ఖేచరీముఖమరీచిజాలకం**
**వ్యోమశక్తితను సంశ్రయే (యం) సదా।**
**శమ్భుదక్షతనుజావభాస (నా) యా**
**యత్ర విశ్వమనుకర్తు మీహతే॥ 10**

**ప్రతిపదార్థము:–** ఖేచరీ ముఖ మరీచి జాలకమ్=ఖేచరి మొదలైన కిరణముల సమూహము గల, వ్యోమ శక్తి తను=ఆకాశము (హకారము) అను శక్తి శరీరముగా గల, యత్ర=దేనియందు, శంభుదక్ష తనుజావభాసయా=అకార హకార రూపులైన, ప్రకాశ విమర్శరూపులైన శివపార్వతులయొక్క సామరస్యము చేత, విశ్వమ్= ప్రపంచము, అనుకర్తుమ్=అనుకరించుటకు, ఈహతే=కోరు చున్నదో, తత్=ఆ హృదయోద్యోగమును, సదా=ఎల్లప్పుడు, సంశ్రయే=ఆశ్రయించెదను.

**తాత్పర్యము:–** ఖేచర్యాది శక్తులు కిరణములుగా గల ఆకాశము(హకారము) అను విమర్శము స్వరూపముగా గల శివపార్వతుల ప్రకాశనమునే ఆశ్రయించెదను. దీనినే విశ్వమనుకరింపఁగోరుచున్నది.

**వివరణము:–** 1) ఖేచరి, భూచరి, దృక్చరి, దిక్చరి, గోచరి అను ఐదు శక్తులు విమర్శరూపిణియైన దహరాకాశ రూప మహాశక్తి యొక్క మహా తేజమునకు కిరణములు అనునది ప్రథమపాద భావము. 2) సిద్ధుల యొక్క ఇంద్రియ ప్రాణయుక్తమైన దేహమను ప్రాసాదమున గవాక్షరన్ధ్ర సముదాయ రూపము జీవుడను జాలరి నిర్మించిన వలరూపమును తనలో కలుపుకొన్న దహరాకాశము సాధకుల చేత ఆశ్రయింపఁదగినది. సిద్ధుల యొక్క దహరాకాశమునకు సాధకుల యొక్క దహరాకాశమునకు భేదముండదు. సిద్ధులు ప్రకాశ విమర్శ రూపమైన పూర్ణాహంతను సిద్ధించుకొనియున్నవారు సాధకులు కూడ వారి జాడలో వానిని సాధించవలసినవారు – అనునది సిద్ధులకు సాధకులకు భేదము.

శక్తి తను సంశ్రయమ్ అను పాఠమున సిద్ధులశక్తికి వారి తనువులకు అనగా శరీరములకు దహరాకాశమే ఆశ్రయమని అర్థము. లేక శక్తి తనువుల నాశ్రయించు సాధకుల దహరాకాశము అని అర్థము. తను ధాతువునకు విస్తారము, క్షయము అను రెండర్థములు. సిద్ధుల పక్షమున విస్తారమును, సాధకుల పక్షమున క్షయమును గ్రహించి శక్తితను పదమును వివరింపవచ్చును. 3) శమ్



అనగా ఆనందమను పర్యాయముగల పరమావధి సుఖము. దానికి భూమియైన ఆత్మయే శమ్భుశబ్దార్థము. దక్ష శబ్దము సమర్థవాచకము. తనుజా శబ్దము సూక్ష్మశరీరమున అనగా అంతఃకరణమున పుట్టు అంతఃకరణ వృత్తి. ఆ అంతః కరణవృత్తులయొక్క అనగా ప్రకాశ విమర్శల(అకార హకారముల) సామరస్యముతో అని **'శమ్భుదక్ష తనుజావభాసయా'** అను పాఠమున శమ్భువనగా ఆత్మ, దక్ష మనగా సమర్థమైన, తను అనగా శరీరము. ఆ ఆత్మ శరీరముల నుండి పుట్టిన అవభాసన అనగా అహమాకార వృత్తి హృదయము యొక్క ఉద్యోగము. ఇది పూర్ణాహంత రూపులైన శివపార్వతుల నుండి పుట్టిన సమస్త విశ్వమునను కరింప గోరుచున్నది – అను శ్లోకార్థము సిద్ధించును. 4) అకారాది హకారాన్త వర్ణమాలా ప్రత్యాహారమున నేర్పడు అహం శబ్దము కూడ కామకలా రూపమే. ఈ ప్రత్యాహారమున నలుబది ఎనిమిది అక్షరములుండును. ఇవి త్రికోణమందలి మూడు రేఖలలో వ్రాయబడుచుండును. **అకథాః అత్ర సన్నివిష్టా** అను త్రిపురోపనిష న్మంత్రమీ అర్థమును చెప్పును. అకారాది థాంత వర్ణముల ప్రత్యాహారమున సిద్ధించు అథ శబ్దము కూడ ఓంకారము వలె బ్రహ్మకంఠమును భేదించుకొని వచ్చినదగటచే మాంగలికమే. ఈ ప్రత్యాహారమున ముప్పదిమూడు వర్ణములు ఉండును. దకారాది క్షకారాంత వర్ణముల ప్రత్యాహారమున నేర్పడు వర్ణములు పదేడు. మూడవ పాదములోని శమ్భుదక్ష పదము జీవుని శిరమును భేదించుటలో దక్షుడైన శివుని బోధించును. అహం శబ్దార్థము శమ్భువు (ఆత్మ). అహం ప్రత్యాహారాంతర్గతముగా దక్ష శబ్దమేర్పడుటచే జీవుని దక్షత్వము శమ్భ్వధీన మనుటను స్పష్టమొనరించును. ఆ దక్షుని తనువు అనగా సూక్ష్మ శరీరము అహంతా రూపమైన అవభాసనము పూర్ణాహంతైక దేశమే అనుట 'శమ్భుదక్ష తనూజావభాసనా' శబ్దము యొక్క అర్థమనియు చెప్పవచ్చును.

దక్ష ప్రత్యాహారములోని ఉపాంత్యమైన ళకారములకారాభిన్నమే అగుట చేత, చివరి క్ష కారము కకార షకార సంయోగమే అగుటచేత అవియు అహం ప్రత్యాహార బహిర్భూతములు కాజాలవనుట గ్రహింపఁదగినది. అందుచేతనే దక్ష ప్రత్యాహారము అహం ప్రత్యాహారాంతర్గతమని పైన చెప్పఁబడినది. అకారాది క్షకారాన్త ప్రత్యాహారము వలన సిద్ధించునది అక్ష శబ్దము. దాని అర్థము ఇంద్రియము. అది తెలిసికొనుటలో దక్షమైనచో జ్ఞానేంద్రియము. ఆదాన గ్రహణ

గమనాది కర్మదక్షమైనచో కర్మేంద్రియము. ఈ విధముగా కర్మ జ్ఞానేంద్రియో భయము దక్షమనియే చెప్పఁబడినది. అక్ష ప్రత్యాహారములోని చివరి రెండు వర్ణములు పైన పేర్కొనిన విధముగా అహం ప్రత్యాహారాంతర్గతములే అగుటచే అహం ప్రత్యాహారమును ఏకరూపములే అగును.

అహం ప్రత్యాహారము ప్రకాశ విమర్శోభయ రూపము, పూర్ణాహంతా రూపము శమ్భురూపము, తదేకదేశములైన ఇంద్రియములు శమ్భుదక్షశబ్దార్థము. తను శబ్దార్థము శరీరము. ఆ విధముగా శమ్భుదక్షతనువుల నుండి పుట్టు అవభాసనము పూర్ణాహంత గాని అహంతగాని శమ్భుదక్ష తనుజావభాసనా శబ్దార్థములనియు చెప్పవచ్చును. పారమార్థికమైన ఆ అవభాసనమే వ్యావహారిక జగమై పరమార్థసత్తారూపులైన పార్వతీ పరమేశ్వరుల వలె పరస్పరాకారాది సామ్యమును పొందగోరుచున్నట్లున్నది. ఆ అర్థము కూడ అవభాసనా అను పాఠమున సిద్ధించును.

శ్రీ భైరవీ పరా భట్టారిక నుద్దేశించి శ్రీ భైరవ భట్టారకునిచే చెప్పఁబడిన త్రికశాస్త్రము యొక్క ఆరంభమున **'అథాద్యాస్తిథయస్సర్వే ర్వా'** అనుచోట అథ శబ్దము కాలీ కాల మిథునమునుద్దేశించుటకు ప్రయోగింపఁబడినది. తంత్ర లోకమున అభినవగుప్త పాదులచే ప్రతిపాదింపఁబడినది. 5) క్రమ ప్రకాశికా వ్యాఖ్య 'అనుకర్తుమ్' అను శబ్దమునకు **'అవభాసితమ్'** అను అర్థమును చెప్పి, జగమంతయు పార్వతీ పరమేశ్వరుల ప్రకాశము ననుసరించియే ప్రకాశించును –అని **'తస్య భాసా సర్వమిదం విభాతి'**–అను శ్రుత్యర్థము నీశ్లోకము వివరించునని చెప్పినది. ఖేచరి, గోచరి, భూచరి, దిక్చరి అను నాలుగు శక్తుల మాత్రమే పేర్కొన్నది. వీని అంగము లనంతములు అని చెప్పినది. ఈ (భైరవీ) శక్తులు సర్వపీఠగతములైన సర్వవ్యాపకాలైన చిన్మరీచులు అని చెప్పిన సర్వ రహస్య నిరూపణ గ్రంథమునుదహరించినది.

పశు భూమిక యందు ఖేచరి అనగా ప్రమాత. గోచరి అనగా అంతః కరణము (అంతరింద్రియము). దిక్చరి అనగా బాహ్యేంద్రియము. భూచరి అనగా వీనికి విషయమైన శబ్దాది విషయప్రపంచముగా ప్రకాశించు చితియే కాని ఖేచర్యాదులు చితికి భిన్నములుగావు. చిదచిద భేద నిశ్చయమున స్ఫురించుచు గోచరి అని, అభేదాలోచన రూపమున స్ఫురించుచు దిక్చరి అని, విశ్వమును



స్వాంగముగా స్ఫురింపఁజేయుచు భూచరి అని, సర్వకర్తృత్వాది శక్తియుక్తమైన దహరాకాశమున స్ఫురించు చిత్తు ఖేచరి అని వ్యవహరింపఁబడును – అని **ఖేచరీముఖమరీచి జాలకమ్** అను ప్రథమపాదమును విశేషముగా వివరించినది. 6) ర, న, ర, ల, గ అను గణములు ప్రతిపాదమున నుండుటచే నీ శ్లోకము రథోద్ధతా వృత్తమున నిబంధింపఁబడినది.

**అవతారిక:–** పై శ్లోకమున దహరనామకమైన చిద్వ్యోమసత్తా స్వరూపము యొక్క ఆశ్రయణము చెప్పఁబడినది. ఈ శ్లోకమున అఖండఖండరూప సిద్ధ మానవౌఘ రూప శివశక్తులలో ప్రకాశక శివునిచే ప్రకాశింపఁబడు ప్రకాశ్య శక్తి స్తుతింపఁ బడుచున్నది. (క్రమప్రకాశిక ననుసరించి):– సృజింపఁబడు పరస్పర విలక్షణ భావములు గర్భమందుగల తనచేత ఖండరూపము నందిన తత్త్వముల నాయికగా శక్తి (కాలి) స్తుతింపఁబడుచున్నది.

**శ్లో॥ ఖణ్డసత్త్వసరగర్భయా యయా**
**లక్షితంస్ఫురణ పూర్ణసత్తయా।**
**తత్త్వమైశ్వరమఖణ్డమమ్బికామ్**
**త్వాం ప్రణౌమ్యఖిలతత్త్వనాయికామ్॥** 11

**ప్రతిపదార్థము:–** యయా=ఏ, ఖండసత్త్వసర గర్భయా=ఖండములయ్యు సత్తను కోల్పోని పదార్థముల సమూహము గర్భమందుగల, స్ఫురణపూర్ణ సత్తయా= స్ఫురణచే పూర్ణతను పొందిన సత్తచేత, లక్షితమ్=దర్శింపఁజేయఁబడిన లేక లక్షణావృత్తిచే బోధింపఁబడిన, అఖండమ్=అఖండమైన, ఐశ్వరమ్=ఈశ్వర (భావ) రూపమైన, తత్త్వమ్=తత్త్వమును, అఖిలతత్త్వ నాయికామ్=అన్ని తత్త్వముల యొక్క నాయికమైన, అమ్బికామ్=తల్లివైన, త్వామ్=నిన్ను (కాలిని), ప్రణౌమి=బాగుగా స్తుతించెదను.

**తాత్పర్యము:–** స్ఫురణ రూపమైన పూర్ణ సత్త యొక్క గర్భమున ఖండపదార్థముల సత్తయుండును. అట్టి ఖండ పదార్థములు వ్యావహారిక సత్తా స్ఫురణ రూపమైన పారమార్థిక సత్తచేతనే వ్యాప్తములైన పదార్థములై ఉన్నవి – అను వ్యవహారమును పొందును. పదార్థములు ఖండములగుటచేతనే భిన్నభిన్నముగా వ్యవహరింపఁ బడును. అన్ని ఖండపదార్థముల యొక్క మరొకపేరు తత్త్వములు అనునది. ఆ అన్ని తత్త్వములకు తన పారమార్థిక సత్తచే ఉనికిని కలిగించుటచే అమ్మవారు

అఖిల తత్త్వనాయక అని చెప్పఁబడఁదగినది. అట్టి తత్త్వములచే నిర్మింపఁబడిన శరీరము గల తనకు (రచయితకు) మాత్రమే సర్వజీవులకును శక్తి తల్లి అగును. అట్టి తల్లివైన నిన్ను స్తుతించెదను.

**వివరణము:–** అఖిల తత్త్వనాయిక శక్తి. అఖిల తత్త్వములు అనగా అన్ని తత్త్వములు అని ఒక అర్థము. నశించని తత్త్వమని మరొక అర్థము. నశించని తత్త్వము శివుడు లేక కాలుడు. ఆయన యొక్క నాయిక కాలి లేక శక్తి. నశించని తత్త్వము ఐశ్వరతత్త్వము. ఇంతేకాక ఈశ్వరుని ఐశ్వర్యము శక్త్యధీనము. శక్త్యధీనమనుట కన్న శక్తియే ఈశ్వరతత్త్వమనుట మరింత సమంజసము.

తత్త్వ శబ్దమునకు రహస్యము, వస్తుధర్మము మొదలగు అర్థములు గలవు. ఆ అర్థములలో స్వరూపము అనునదొక అర్థము. ఐశ్వరతత్త్వము అనగా ఈశ్వరుని స్వరూపము. నశించక యుండుట ఆయన స్వరూపము. కావున అదియే అఖిల తత్త్వము. తత్త్వశబ్దమునకు పదార్థమను మరొక అర్థము కలదు. పదార్థముల సంఖ్య దర్శన భేదమున భిన్న భిన్నముగా నున్నది. తార్కికులు (నైయాయిక వైశేషికులు) ముఖ్యముగా వైశేషికులు భావపదార్థములాఱు, అభావ పదార్థమొకటి మొత్తము పదార్థములు ఏడు అని చెప్పెదరు. సాంఖ్యులు ప్రకృతి పురుషులు అను రెండు తత్త్వములు కలవందురు. వానిలో ప్రకృతి మహ దహంకార పంచతన్మాత్ర, పంచభూత దశేంద్రియ మనోరూప చతుర్వింశతి (ఇరువదినాలుగు)తత్త్వరూపిణి పురుషునితోకలిపి వారు తత్త్వము లిరువదియైదు అని అందురు. పై తత్త్వములకు ఈశ్వరతత్త్వమును కలిపి, యోగులు తత్త్వము లిరువదియాఱు అని చెప్పిరి. శైవులు శాక్తేయులు, వీనికి మరి పది తత్త్వములు (శివ, శక్తి, సదాశివ, శుద్ధవిద్య, రాగ, కాలి, కలా, నియతి, మాయా, బుద్ధులు) చేర్చి తత్త్వములు ముప్పదియారని చెప్పెదరు. ఇవి 1) శివ, 2) శక్తి, 3) సదాశివ, 4) ఈశ్వర, 5) శుద్ధవిద్యా, 6) మాయా, 7) కాల, 8) కలా, 9) నియతి, 10) రాగ, 11) విద్య, 12) పురుష, 13) ప్రకృతి, 14) మహత్, 15) అహంకార, 16) బుద్ధి, 17) శబ్ద, 18) స్పర్శ, 19) రూప, 20) రస, 21) గన్ధ, (శబ్దాదులైదు తన్మాత్రలని వ్యవహరించఁబడును.) 22) శ్రోత్ర, 23) త్వక్, 24) చక్షుస్, 25) జిహ్వా, 26) ఘ్రాణ, (శ్రోత్రాదులైదు బాహ్య జ్ఞానేంద్రియములని వ్యవహరింపఁ బడును.) 27) వాక్, 28) పాణి, 29) పాద, 30) పాయు, 31) ఉపస్థ



(వాగాదులైదు కర్మేన్ద్రియములని వ్యవహరించఁబడును), 32) ఆకాశము, 33) వాయువు, 34) తేజస్, 35) జల, 36) పృథివీ నామకములు. ఈ అన్ని తత్త్వములు శక్తి లేక కాలి లేక అమ్బిక నాయిక అయియున్నందున అమ్బిక అఖిలతత్త్వనాయిక అని చెప్పఁబడినది. ఈ తత్త్వములలో శివశక్తులు అభిన్నులే అయినను భిన్నులుగా వ్యవహరింపఁబడినారు.

ఈ శ్లోకము తృతీయ పాదమున 'తత్త్వమైశ్వరమఖణ్డం' అని చెప్పఁబడి నందున ఈశ్వరతత్త్వ మఖండము, అమ్బిక 34 ఖండతత్త్వములకు నాయిక అని నాల్గవపాదమున ఈ ఖండతత్త్వములు స్ఫురణ పూర్ణ సత్త గర్భగతాదులని పూర్వర్ధమును చెప్పఁబడినది. 2) పూర్ణసత్తయా అను సమాసమును పూర్ణసత్ తయా అను రెండు పదములుగా విభజించి అఖండీశ్వర తత్త్వము పూర్ణసత్తు అను అర్థము గ్రహింపవచ్చును. పూర్ణమైన సత్త అనగా అఖండ సత్తయే. ఇది పూర్ణసత్తు (శివు)నందుండు పారమార్థిక సత్త. అది స్ఫురణ అని విశేషింపఁ బడుటచే చిద్రూపమని, పరిశేష న్యాయమున మిగిలిన ఖండ తత్త్వములు ముప్పది నాలుగు అచిద్రూపములనియు స్పష్టమగుచున్నది. ఈ ఖండతత్త్వముల నాయికగా అమ్బిక చెప్పఁబడుటచే, ముప్పది యైదవ తత్త్వమైన శక్తి శివాభిన్న అగుటచే చిద్రూపిణి అని, జడతత్త్వముల గర్భమందు ధరించియుండు పూర్ణసత్తా రూపిణి అని వ్యంగ్యమగుచున్నది. ఈ స్ఫురణ అను విశేషణము ఆమె విమర్శ రూపిణి అని వ్యంజించుచున్నది. 3) లక్షితమ్ అను అఖండ తత్త్వవిశేషణము అఖండ తత్త్వరూపుడైన శివుడు అభిధావృత్తితో బోధింపఁబడు వాచ్యార్థ భూతుడు కాదని, లక్షణావృత్తిచే బోధింపఁబడు లక్ష్యార్థభూతుడు అని తెలుపును. లేక పూర్ణ స్ఫురణ సత్తలు లక్షణములు(లక్షణాభాసములు) గా గలవాడని తెలుపును. 4) అఖండేశ్వర తత్త్వమును'అఖిలతత్త్వ నాయికామ్'అను ద్వితీయాంతములు చకారరహితములుగా ప్రయోగింపఁబడుటచేత, పరస్పర విశేషణ, విశేష్య భావమునొంది, తదుభయాభిన్న తత్త్వమును స్తుతించెదను – అను వాక్యార్థమును బోధించుచున్నవి. పూర్వార్థము ఆ ఉభయులు పూర్ణసత్తా స్ఫురణ రూపులని, ఖండసత్పదార్థ సమూహమును గర్భమందు ధరించిన అఖండ తత్త్వమైన వారనియు, 'ప్రణౌమి' అను క్రియ లోనికి అన్వయించ వచ్చును. 5) శివతత్త్వమునకు పిమ్మట సదాశివాదితత్త్వము లకు పూర్వము పేర్కొనఁబడిన, శక్తితత్త్వము తదుభయ సామరస్య రూపమైనది.

శివునివలె పూర్ణసత్తను కలిగియుండియు, ఖండసత్తులైన స్వానంతర నిర్దిష్ట తత్త్వములకు నాయికగా, అమ్బికగా కూడ చెప్పబడుటచేత, ప్రాతిభాసిక వ్యావహారిక సత్త గల పదార్థముల జీవకామములననుసరించి, బంధ మోక్షముల రెండింటిని ప్రసాదించుననుట, శివతత్త్వమువలె పూర్ణసత్తని గాని, జాగతిక పదార్థములవలె పారమార్థిక దృష్టితో అసత్తని గాని, చెప్పబడరాని అనిర్వాచ్య ఈ శక్తి అనుట, తత్త్వాకారమున ఖండమైనను, స్ఫురణాకారమున అఖండ మైనదిగా ఈశ్వరతత్త్వమునమ్బిక లక్షింపఁజేయుచున్నదనుటయు, శబ్దాత్మకమైన స్వర్ణఖండరూపమున అర్థాత్మకమైన నాదనాద (వాగర్థ) సామరస్యరూపమైన అకారస్వరఖండరూపమునను ఈశ్వరతత్త్వమును అంబిక లక్షింపజేయుననుటయు నిందు వ్యంగ్యము. సర్వవర్ణవ్యాప్తమైనది.నాదరూపమైన అఖణ్డమైన అకారమనియు విడిగా వర్ణమాలారంభమున ఉన్నది. ఖండాకారమనియు గమనింపవలసియున్నది. ప్రకృతి నాశమున సకల తత్త్వనాశా శివయోగుల అనుభవము గోచరించుననుట సంప్రదాయము. అద్వైత సిద్ధాంతానుగుణము. అఖిల అను విశేషణము ఖండాఖండరూప వాగర్థాత్మక షట్త్రింశత్ సంఖ్య సర్వతత్త్వ నాయికాత్వ మమ్మవారి యందు గలదని, అనగా శివుని జీవునిగా, జీవుని శివునిగా నయింపఁజేయు నాయిక అమ్బిక అని స్ఫురింపఁజేయును.

పై అర్థమునకు మూలమైన అకార స్వర ఖండాఖండ ప్రస్తావనము కఱ్ఱా అగ్నిహోత్రశాస్త్రిగారి వ్యాఖ్యయందున్నది. ఈ శ్లోకము కూడా పూర్వ శ్లోకమువలె రథోద్ధతావృత్త నిబద్ధనమే.

6) (క్రమ ప్రకాశిక ననుసరించి) ఖండములనగా పరస్పరాభిన్నములైన వస్తు పరిచ్ఛిన్నములై ప్రతీయమానములైన వస్తువుల (పదార్థముల) సమూహము. ఖండ సత్ప్రసరము గర్భమందుగల శక్తి అను ఉపాధిచేత ఈశ్వరుడే సఖండ తత్త్వము. స్వయంప్రకాశ సంవిద్రూప (స్ఫురణ పూర్ణసత్త) మున ఈశ్వరుడే అఖండ తత్త్వము. ఈశ్వర రూపములైన ఈ రెండు ఖండాఖండతత్త్వములకు నాయికయే అమ్బిక. వామా, జ్యేష్ఠా, రౌద్రీ నామక త్రిశక్తులు సృష్టి, స్థితి, లయకారిణులు. అమ్బిక ఆత్మ స్ఫురణ రూపిణి. త్రిశక్తులు జగత్సంబంధినులు. తత్త్వానుగతములు. తురీయమైన అమ్బికాశక్తి తత్త్వాతీత. యోగినీ హృదయమున అమ్బికా, వామా,



జ్యేష్ఠా, రౌద్రీ శక్తి చతుష్కమే, పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ రూప వాక్చతుష్టయముగా పేర్కొనఁబడినది. అమ్బికా రూపమైన అఖండేశ్వర తత్త్వమే జగదుపాదానము. జగత్ప్రకాశకము.

**అవతారిక:–** పై శ్లోకమున కాలీ శక్తి అఖిలతత్త్వనాయికగా చెప్పఁబడినది. ఈ శ్లోకమున ఆ కాలీశక్తి ఆదిభౌతికమైన ఈశ్వరాధిష్ఠితమైన కైలాసా త్రిరూపిణిగా సంభావింపఁబడుచున్నది.

**శ్లో॥ యః కిలాస స కిలాస ఈశ్వరః**
**ఖ్యాతసత్త్వలులితోర్ధ్వమూర్ధని।**
**ప్రత్యహం జనని! యత్ర తిష్ఠతి**
**త్వం స సత్త్వవపురద్రిరస్య యః॥ 12**

**ప్రతిపదార్థము:–** యః=ఎవడు, ఆసకిల=ఉండెనటనో, సః=ఆ, ఈశ్వరః= ఈశ్వరుడు, కిలాసః=కిలాసనామకుడు, ఖ్యాత సత్త్వలులితోర్ధ్వమూర్ధని – ఖ్యాత=ప్రసిద్ధమైన, సత్త్వ=సత్త్వగుణము చేత, లులిత=వ్యాప్తమైన, ఊర్ధ్వ=ఎత్తైన, మూర్ధని=శిఖరముగల, యత్ర=దేనియందు, ప్రత్యహమ్=నిత్యము, తిష్ఠతి= ఉండునో, సః=ఆ, అద్రిః=కొండ, అస్య=ఇతని (శివుని) కి, సత్త్వవపుః=సత్త్వ రూపమైన శరీరము, జనని=ఓ తల్లీ, త్వమ్=నీవు.

**తాత్పర్యము:–** ఎవడు (కిలాస) ఉండెనట అని చెప్పఁబడునో వాడు కిలాస నాముడు. వాని సత్త్వమయ శరీరము శక్తియు కైలాసమే. ఆ ఈశ్వరుడు దాని ఊర్ధ్వశిఖరముననే ఎల్లప్పుడు నివసించును. ఓ తల్లీ! ఆ కైలాసము నీవే అయి యున్నావు.

**వివరణము:–** 1) ఈశ్వరుడు శుద్ధ సత్త్వ ప్రధానుడు. శుద్ధసత్త్వము ప్రధాన మైనను రజోగుణాధిక్యమున బ్రహ్మయని, తమోగుణాధిక్యమున రుద్రుడని, సత్త్వగుణాధిక్యమున విష్ణువని పిలువఁబడుచు సృష్టి, స్థితి, లయములను జగమునకు కలిగించు చుండును. ఈ ఈశ్వరుడు ఘనతర శుద్ధసత్త్వ ప్రధానుడై సదాశివుడని ఘనతమ శుద్ధ సత్త్వ ప్రధానుడైన మహేశుడనియు పిలువఁ బడుచుండునని కొందఱు తాంత్రికులు చెప్పుదురు. 2) **'అజామేకాం లోహిత శుక్ల కృష్ణామ్'** అను ఉపనిషద్వాక్యము ప్రకృతి రజస్తమోసత్త్వగుణములు కలదని

– రజోగుణము లోహిత వర్ణ ప్రతీకమని, తమోగుణము కృష్ణవర్ణ ప్రతీకమని, సత్త్వగుణము శుక్లగుణ ప్రతీకమని చెప్పును. ఈ రజస్తమస్సత్త్వ గుణముల సామ్యావస్థయే (ప్రలయ) ప్రకృతియని చెప్పఁబడును. శుద్ధసత్త్వ ప్రధానమైన ఈ ప్రకృతికే మాయయను వ్యవహారము కలదు. సత్త్వగుణము శుక్ల వర్ణ ప్రతీకమని పైన చెప్పఁబడినది. శుద్ధసత్త్వమునకు శుక్లవర్ణమే ప్రతీకము అని వేఱుగా చెప్పనక్కఱలేదు. 3) ప్రకృతి మాయ, అవిద్య మొదలగు పర్యాయములు గల శక్తిలేనిచో ఈశ్వరునకు స్వరూపలాభమే లేదు. కావున శక్తిని విడచిన ఈశ్వరుడను మాటకేగాదు, ఊహకును అవకాశములేదు. ఆ ఈశ్వరుడు ప్రాకృతి బ్రహ్మాండము నకు ఆవల కైలాసమున నుండును – అని శైవులు చెప్పెదరు. వైకుంఠమున నుండునని వైష్ణవులు చెప్పెదరు. గౌడీయ వైష్ణవులు గోలోకమున నుండునని చెప్పెదరు. ఆ ప్రాకృతిక బ్రహ్మాండ బహిర్భూతమైన కైలాసమునకు ప్రతీకముగానే భూలోకమున హిమాలయ పర్వత శ్రేణిలో ఆధిభౌతికముగానున్న కైలాసమున కూడ శివుడు పార్వతీపతియై నివసించునని చెప్పెదరు.

**'యః కిలాస సకిలాస ఈశ్వరః'** – అను శ్లోకమునందలి ప్రథమ పాదము ఈశ్వరునకు కిలాస నామమున్నదని, ఆ నామము ఒకప్పుడు సృష్టికి పూర్వ కాలమునందును ఉండినాడని, పారోక్ష్యబోధకమై కిల అను అవ్యయము ఆస శబ్దముతో కూడి బోధించును.

అసధాతువు సత్తార్థకము. సత్త ఈశ్వరునకు (శివునకు లేక బ్రహ్మకు) స్వరూపము. ఆ శివుడు త్రికాలాబాధ్యుడు. ఇదివఱకు ఉండెను. ఇప్పుడున్నాడు. ఇకముందు ఉండగలడు. భూతవర్తమాన భవిష్య కాలములలో నుండు శివుడు లేక కాలుడు త్రికాలాబాధ్యుడు. త్రికాలాబాధ్యతయే పారమార్థిక సత్త అని పేర్కొనఁ బడును. అస ధాతువునుండి పుట్టిన ఆస అను క్రియ భూతకాల బోధకము. అయినను అది వర్తమాన భవిష్య కాలములలో ఆ ఈశ్వరుని ఉనికిని నివారించదు. కిల+ఆస (కిలాస) అని చెప్పఁబడు ఈశ్వరునకు కిలాస నామము ఏర్పడినది. ఆయన నివాసము కిలాస సంబంధి అను అర్థమున కైలాసమైనది. 4) కిలాసం పతితం అను నిఘంటువును బట్టి తెల్లఁబడిన జుట్టుగల శిరము గూడ కిలాసమని చెప్పఁబడును. జుట్టులేక శిరములోని తెలుపు గూడ సత్త్వమునకు సత్త్వగుణ విశేషమైన జ్ఞానమునకు ప్రతీకముగా శివుని జ్ఞాన



స్వరూపమును కిలాస శబ్దము తెలుపును. శివుడు కైలాస పర్వతమునందు న్నాడనగా శుద్ధ సత్త్వ ప్రధానశక్తి వపువుగా అనగా శరీరముగా లేక స్వరూపముగా కలిగి ఉన్నాడనుట, శివుడు కైలాసవాసి అను వ్యవహారముయొక్క ఆధ్యాత్మికార్థము. 5) కిలాస ఈశ్వరః ప్రథమపాదోత్తర అర్థమును కిలాస ఈశ్వరః అని విభజించి కిలాసే అను పదమునకు రెండవ పాదము (ఖ్యాత సత్త్వలులితోర్ధ్వ మూర్ధని) విశేషణముగా చేయవచ్చును. లేక ఎక్కడ ఈశ్వరుడు ఉండెనట అని లోకము భావించును. అది అనగా ఆచోటు లేక పర్వతము కిలాస అనఁబడుననియు చెప్పును. ఈ పక్షమున కిలాసే ఈశ్వరః అని విభాగము. అప్పుడు కైలాస (కిలాస) పర్వతమున ఊర్ధ్వశిఖరము ఖ్యాత సత్త్వముతో (శుద్ధ సత్త్వముతో) వ్యాప్తమైనదను అర్థము లభించును. 6) ఈ రెండవ పాదమునకు 'ఖ్యాత సత్త్వలులితోధ్వమూర్ధని అను పాఠాంతరమును స్వీకరించి 'ఖ్యాతసత్త్వలులితః అధ్వమూర్ధని' అని విభజించి కిలాసము షడధ్వములకు పైనున్నది అని అర్థము లభించును. ప్రాకృతికములైన షడధ్వములకు (వర్ణపదమన్త్ర కలా తత్త్వ భువనాధ్వములకు) అతీతముగా కైలాస మున్నదను అర్థము సిద్ధించును. ఈ పక్షమున కిలాసశబ్దము స్వార్థ తద్ధితము చేర్చగా కైలాస శబ్దమేర్పడును. కిలాస శబ్దము కైలాస పర్వతవాచకము. 7) వికుంఠ వైకుంఠ శబ్దములు విష్ణుతన్నివాస వాచకములైనట్లు కిలాస కైలాస శబ్దములు శివ తన్నివాస వాచకము లగుటలో విరోధమేమియులేదు. కాని కిలాస శబ్దము శివ వాచకముగా గాని తన్నివాసముగా రూఢము గాదు. అందుచేతనే ప్రథమ పాదమున కిలాస శబ్దముల కలయికతో నిరుక్త పద్ధతిలో కిలాస శబ్దమీశ్వర వాచకము అని యమకాలంకార శోభతో కవి నిరూపించినాడు. 8) నాల్గవ పాదమున 'సత్త్వవపుః' అను పాఠమునకు బదులు 'తత్త్వవపుః' అను పాఠాంతరము, 'అద్రిరస్యయః' అనుపాఠమునకు బదులు 'అద్రికస్యయః' అను పాఠాంతరమునున్నవి. 'తత్త్వవపుః' అను పాఠమునకు తత్త్వములే శరీరముగా గలదా అద్రి (కైలాసము లేక శక్తి) అని అర్థము చెప్పవచ్చును. 'అద్రికస్య' అను పాఠమున శివునకు భార్యయగుటచే కైలాస శక్తి వాచక శబ్దమునకు అల్పార్థక ప్రత్యయము చేర్చఁబడగా అద్రియే అద్రికయైనది. కైలాసాత్మక శివ శక్తికి తత్త్వములుగాని సత్త్వముగాని శరీరమనుటలో అసమంజస్య మేమియు లేదు. 9) మూడవ పాదమున 'ప్రత్యహమ్' అను దానిని ప్రతి అహమ్ అని విభజించి

ప్రతి అను పదమును తిష్ఠతి అను క్రియకు ఉపసర్గగా చేసి ప్రతి తిష్ఠతి - ప్రతిష్ఠను పొందును - అని అర్థము చెప్పవచ్చును. ప్రత్యసౌ అను పాఠమునను అసౌ=ఈ ఈశ్వరుడు ప్రతి తిష్ఠతి ప్రతిష్ఠను పొందును - అని అర్థము చెప్పవచ్చును. 10) కిలాస శబ్దమున పలితమ్ తెల్లఁబడిన లేక నెఱసిన అను అర్థమున్నదని పైన పేర్కొనఁబడినది. కొందరు కాలపలిత శిరస్కులు, కొందరు జ్ఞానపలిత శిరస్కులు ఉందురు. పెక్కురికి వార్ధకమున శిరము పలిత మగును. అనగా నెఱయును (తెల్లఁబడును) కొందఱు మాత్రమే చిన్న వయసుననే పలిత శిరస్కులగుదురు. వారికి రోగము కారణముగా వచ్చిన పలితత్వము. ఆయుర్వేద శాస్త్రమందలి కాయకల్ప చికిత్స ద్వారా పలితత్వమును నివారించవచ్చును. కాని వార్ధకము కారణముగా వచ్చిన పలితత్వమును నివారించుట మిక్కిలి కష్టము. పైగా ఆ వార్ధక లక్షణమును స్వానుభవము ద్వారా నివారించుకొనుటచే కొంత పాపమును నివారించుకొనుట ద్వారా పవిత్రతను సాధించు కొనవచ్చును.

వెంద్రుకలు నెఱియని జ్ఞానవృద్ధులు కొందఱుందురు.వారు పలిత శిరస్కులు అనగా వృద్ధులు కాకున్నను వృద్ధులుగా గౌరవింపఁబడుదురు. ఈశ్వరుని శరీరము కాలమున పరిణతమగునది కాదు. అది కేవలము చిన్మయము లేక జ్ఞాన ఘనము అయినను జ్ఞానమయము అయిన శరీరము కలవాడైన కారణమున 'కిలాస' అనగా 'నెరసినవాడు' అని చెప్పఁబడినాడు. ముసలితనములేని జ్ఞానవృద్ధుడు అని ఆ శబ్దము శివుని జ్ఞానపూర్ణతను చెప్పును. 11) ప్రథమ పాదమునకు 'కిలాస' కైలాస పర్వతమునందు ఆస కిల (ఉండుట) అనియు, ఆస పదము యొక్క భూతకాలద్యోతకత్వమును వివక్షించక అర్థము చెప్పవచ్చును. 12) ద్వితీయ పాదమందలి ఊర్ధ్వము శుద్ధ సత్త్వకము అని కఱ్ఱా అగ్నిహోత్రశాస్త్రి గారి వ్యాఖ్య చెప్పినది. అదిగాక ఊర్ధ్వ మూర్ధ శబ్దము ద్వాదశాంత వాచకము కూడ అని చెప్పినది. ఓమిత్యాది బీజాక్షరములలో చివఱ మకారము అనునాసికమగుటచే అది నాసాగ్ర భ్రూ మధ్యమున ఉచ్చరణ సమాప్తి నొందినను, దాని నాదము సహస్రారము వఱకు వ్యాప్తినందును. ఈ వాదము నాదము యొక్క సూక్ష్మ, సూక్ష్మతర, సూక్ష్మతమత్వముల ననుసరించి నవవిధ రూపముల నామముల ధరించును. బిందువు, అర్ధచంద్రము, రోధిని, నాదము, నాదాంతము, శక్తి, వ్యాపక, సమన, ఉన్మన అనునవి నవవిధనాదములని చెప్పఁబడును. సహస్రారము



శిరోగతమై యోగులచే దశమనాదమని చెప్పఁబడినను అకారోకారాది పూర్వకమైన మకారము అను తృతీయ వర్ణముతో కలిపి తొమ్మిది నాదములలో చివరి ఉన్మనతో కూడి ద్వాదశాంతమని చెప్పఁదగినది. 13) ఈ సహస్రారమునే వైష్ణవులు వైకుంఠమని, శైవులు కైలాసమని చెప్పెదరు. ఖ్యాతసత్త్వ ఉలితః అధ్వమూర్ధని అనుపాఠమున ఖ్యాతసత్త్వ ఉలితః అనునది ఈశ్వరునికి విశేషణమని గమనింపవలెను. ఖ్యాతసత్త్వ ఉదితోధ్వమూర్ధని అను పాఠమునను ఖ్యాతసత్త్వ ఉదితః అనుపదములు ఈశ్వరునకు విశేషణములుగానే గ్రహింపవలెను. ఖ్యాతసత్త్వ ఉదితోర్ధ్వమూర్ధని అనుపాఠమున ఖ్యాతసత్త్వ అనుపదము ఈశ్వరునకు విశేషణముగా గ్రహింపవలెను. కిలాస శబ్దమును సప్తమ్యంతముగా స్వీకరించి నప్పుడు ఖ్యాతసత్త్వ పదము ఖ్యాతసత్త్వే అని సప్తమ్యంతముగా 'కిలాసే' అను పదమునకు విశేషణముగా చెప్పవచ్చును. మూడవ పాదమున 'ప్రత్యసౌ' అను పాఠమున ప్రతితిష్ఠతి అను క్రియకు 'అసౌఈశ్వరః' అనుపదములు కర్తృ సమర్పకములు. 'ప్రత్యహమ్' అను పాఠమునకు ఎల్లప్పుడు ప్రతిదినము అని అర్థములు చెప్పనగును. 14) నాల్గవ పాదమునందలి అద్రిరస్యయః అను పాఠమున పూర్వార్ధమునందలి యః ప్రతితిష్ఠతి అను వాక్యమున కర్తయైన ఈశ్వరునకు పరామర్శకమైన అస్య అనుపదమునకు ఉండు లేక ప్రతిష్ఠను పొందు ఈతని యొక్క అనగా ఈశ్వరుని యొక్క అని, ఆతని యొక్క అద్రి అనగా కైలాసమే. ఓ అమ్మా నీవు తత్త్వవపువవు అని అన్వయించి అర్థము చెప్పవలెను. 'అద్రికస్యయః' అను పాఠమున అద్రిక యనగా చిన్న పర్వతము. అల్పార్థము క ప్రత్యయము. ఆ పదము సతత్త్వవపుః (సతత్త్వ వపుః) అను పాఠమునాశ్రయించి, భూలోకములోని అల్ప పర్వతమైన హిమాలయములలోని భాగమైన కైలాసమును బోధించును. ఆ భూలోక కైలాసము యొక్క శరీరము కూడ అమ్మవారే. ఆ పర్వతము ఆమె లేక శివుని శరీరము ఐనందున పరిమిత తత్త్వము అని గాని, పరిమిత సత్త్వము అనిగాని చెప్పవలెను. అప్రాకృత కైలాసము యొక్క అపరిమిత సత్త్వముగా అపరిమిత తత్త్వముగా, ప్రాకృత కైలాసము యొక్క పరిమిత సత్త్వముగా గాని, పరిమిత తత్త్వముగా గాని ఈశ్వరుని ఇచ్ఛావశమున శరీరము పరిణమించునని ఉభయకైలాస స్వరూపిణివి నీవే, అని అమ్మవారిస్తుతి ఈ శ్లోకమున చేయఁబడినది. పైన చెప్పఁబడినదంతయు 'అవిద్వాంసుల పరోక్ష శివశక్తి సమన్వయము. 15) మూర్ధ శబ్దమునకు తల అని అర్థము. పరమాత్మ

యొక్క విరాట్ఛరీరమున తల(ముఖము)నుండి బ్రాహ్మణులు పుట్టినారను శ్రుతిననుసరించి విరాట్ఛరీర శిరము బ్రాహ్మణ రూపముగా ధ్యానింపఁదగినది. పరిచ్ఛిన్న జీవ శరీరమున గూడ జ్ఞానేంద్రియ బాహుల్య స్థానమైన శిరమే బ్రాహ్మణ స్థానీయము. సత్త్వగుణమును సూచించు పలితత్వమును బోధించు కిలాస శబ్దమీ శ్లోకమున జ్ఞానవృద్ధత్వమును సూచించునని ఈవఱకే చెప్పఁబడినది. మూర్ధమునే కిలాస శబ్దము పలితమని విశేషించినది. శిరము తరువాత చెప్పదగిన శరీర భాగము బాహువులు, ఆ తరువాత చెప్పఁదగినవి. ఊరువులు, ఆ తరువాత చెప్పదగినవి పాదములు. ఈ నాలుగు భాగములు క్రమముగా పరా పశ్యంతీ, మధ్యమా, వైఖరీ వాగర్థరూపములు. ఈ వాగర్థములు ఆది నాద లేక నాథ రూపములు.

యః కిలాస స కిలాసః – ఏది కిలాసమో అది నాదనాథ రూపమో అదియే కిలాసము. అనగా జ్ఞానేంద్రియాధిష్ఠానమైన శిరము. కిలాస శబ్దమును కిల ఆసః అని విభజించి అసః అను శబ్దము యొక్క అర్థమునిట్లు భావించవచ్చును. అకారము మొదలు సకారమువఱకున్న వర్ణముల ప్రత్యాహారమే అసః అనునది ఏర్పడును అని దీని అర్థము 'ఆ' అనగా పూర్తిగా ప్రకాశించఁబడి సకారబీజ ధర్మముతో అనగా శాక్త విసర్గము అనుత్తర శామ్భవ విసర్గము చేత ఖ్యాత సత్త్వలులితం=ప్రకాశింపఁజేయఁబడిన సకార బీజ ధర్మముతో లులితః గర్భిత మైనది. అనగా 'అ' అనునది శామ్భవ విసర్గము, సః అనునది శాక్త విసర్గము. సత్త్వము అనగా సకార బీజ ధర్మము. ఇది 'ఆసః' అను దానిలో గర్భితమైనది. శాక్త విసర్గము సకార బీజత్వ ధర్మముతో అనుత్తర శాంభవ విసర్గమున గర్భితమైనది–అని ఖ్యాతసత్త్వ 'లులితః' అను సమాసపదమునకు అర్థమేర్పడును.

ఆస్(అ)ః (విసర్గము) అను విధముగా ఉదితః=ఉదితమైనది శామ్భవానుత్తర బిందువు 'ం', శాక్తానుత్తరనాదము 'ః' అనునది ఆంతరము ః అనునది బహిరము. అహమ్ (ం ః) శబ్దార్థములలో శాక్తనాదము (అమ్) తో కూడిన శామ్భవ బిందువు (అం) లులితమైనది. అసౌ ప్రతి=పరాశక్త నాద బిందువుల 'తిష్ఠతి'=ప్రతినిధిగా ఉండును. లేక శాక్తానుత్తర నాద సకార ధర్మముతో శామ్భవానుత్తర బిందు సకార ధర్మముతో ఉదితః లోపల బయట ఉదయించినచో అస్+ఆఉ (ఆస్ అఆ ఉఓ) భిన్నస్వరమను పేరుగల అనుత్తరానందేచ్ఛ బయట ఈశనము ఉన్మేషణము ఊర్మ



అను చెప్పఁబోవు షడధ్వ పరామర్శ పరాశాక్త నాదరూపము. ఆస లోపల పరశాంభవ నాదనాద త్రిపుటి బిన్దు త్రయరూపము ః ం ః నకు ప్రతినిధిగా ఉండును. బయట వాగ్రూపము. లోపల అర్థరూపము. సహస్రారమున అహమ్ రూపమునగాని అస రూపము (సత్త) గా గాని ఉండును.

ఆస అనునది ప్రథమ పురుషైక వచనముగా పరోక్షము ఉత్తమ పురుషైక వచనముగా అపరోక్షమైన అహమర్థాత్మ సత్తను తెలుపునది. అయినను ఇట లిడ పరోక్ష బోధకముగానే ఉన్నది. ఈ శ్లోకములోని ఆస పరోక్షా పరోక్షసత్తను, సాధారణముగ బయట ప్రత్యక్ష సత్తను అసౌ అనునది గూడ అహమని రోధి సత్తను బోధించును. ఒక్కొక్కప్పుడు 'అసౌ' అనునది కూడ అహమవిరోధిసత్తను బోధించును. ఉదితోర్ధ్వభాగే అనుపాఠమున ద్వాదశాన్తముగా లేక షోడశాన్తముగా చెప్పఁబడు శామ్భవ బిందురూప సహస్రారమున శామ్భవ బిన్దునాదత్రయ రూపమునగాని, అధ్వషట్క రూపమునగాని, నవనాద సమష్టి రూపమునగాని 'ప్రతితిష్ఠతి' – ఈశ్వరుడు ప్రతిష్ఠితుడై యుండును. బయటను అసౌ=ఇతడు స్వరఖండ నాదము అను ఆకాశమునగాని, అహం అముకానంద నాధామ్బా రూపమునగాని ప్రతితిష్ఠతి=ప్రతిష్ఠను బొంది ఉండును. ఒక్కొక్కప్పుడు ఏతద్ ఇదమదస్ శబ్దములు అహమ్ శబ్దముతో సామానాధికరణ్యముగా ప్రయోగింపఁ బడుట విజ్ఞులెఱిగిన విషయమే. కాని స్థూలముగా ఇదమ్ ప్రత్యక్షమును, అదస్ పరోక్షమును, ఏతద్ అధిక సమీపవర్తిని బోధించును. జనని=ఓ తల్లీ! అస్య=పరా వాగర్థరూపము యొక్క (అహమ్ అను ఆత్మ మన్త్రమున అసౌ అను పరామన్త్రము నను ఉన్న ఆకారము అని ధ్వనించును) యః అద్రిరస్యయః=అహమర్థ రూపము గాని, అసామర్థ రూపముగాని, నాదోపాధిగాని, నాథనివాసముగాని అయిన కైలాస పర్వతము సతత్త్వవపుః=సకారాక్షరతత్త్వము యొక్క శరీరము. త్వమ్=శక్తి విసర్గ రూపిణిని స్ ఔ అను స్పన్ద రూపమున నుండు దానవు నీవీ. అద్రికస్య యః అను పాఠమున సతత్త్వవపుః అను సమాసమును ద్వితీయాంతముగా భావించి జ్యోతిశాస్త్ర మర్యాదతో చెప్పబడబోవు భాగత్రయమున ప్రధానభాగమైన అకార మాత్ర త్రైక్కణ రూపము యొక్క (లేక అద్+రిక) రకాన్తమైన అదస్ శబ్దముగా భావించి పరోక్ష శబ్దార్థ రూపమునుండి రిచమానమైన అకారము యొక్క అనగా సకారరూప శాక్తానుత్తర విసర్గ బిందువుల నుండిగాని, నాదము నుండి గాని

విడివడిన అకారము యొక్క శాక్త విసర్గైక దేశము యొక్క పరామన్త్రైక దేశము యొక్క సత్త్వవపుః సత్త్వ ప్రధానమైన శామ్భవానుత్తర నాథనాద సామరస్య శరీరము అనగా సోఽహమ్ అను పరోక్ష తచ్ఛబ్దార్థ రూపమైన దానవు. అపరోక్షాహమర్థ రూపమైనదానవు నీవే. అసావహం అను ప్రత్యభిజ్ఞతో గాని, సోఽహమ్ అను ప్రత్యభిజ్ఞాత స్వరూపముతో గాని స్వరూపానంద సాక్షాత్కారము కలవాడనుట తాత్పర్యము.

సత్త్వవపుడనైన శివుడను నేను అను అర్థము ధ్వనించును. పరౌఘము మొదలు దివ్యౌఘము వఱకు గల ఓఘత్రయమున త్రయరూపులైన పతంజల్యాదుల వంటివాడు కాలిదాసు అనుట శ్లోకమున సమన్వయమున లభించు పరమార్థము.

**అవతారిక:–** పూర్వ శ్లోకమున అమ్మవారు కైలాసాద్రి రూపస(త)త్త్వవపువుగా స్తుతింపఁబడినది. ఈ శ్లోకమున శుద్ధబ్రహ్మ రూపిణిగా నమస్కరింపఁబడు చున్నది.

**శ్లో॥ కల్పనాతిగమతీన్ద్రియం చ య**
**ల్లక్ష్యముజ్ఝతి బహిర్ముఖం (త్రిధా) తథా।**
**అన్తరాలగమభావభావయో**
**(స్సన్నతో)స్తం నతోఽస్మి సదహం నిరాకృతి(తిమ్)॥ 13**

**ప్రతిపదార్థము:–** కల్పనాతిగమ్=కల్పనలకు అతీతమైన, చ=మఱియు అతీన్ద్రియమ్ =ఇంద్రియములకు అతీతమైన, తథా=అట్లే, బహిర్ముఖమ్=బహిర్ముఖమైన, లక్ష్యమ్ =లక్ష్యమును, యత్=ఏది, ఉజ్ఝతి=వదలునో, అభావభావయోః=భావాభావము లకు, అన్తరాలగమ్=మధ్యనున్నట్టి, నిరాకృతి=ఆకారరహితమైన, సత్=సద్వస్తువును గూర్చి, అహమ్=నేను, సంనతః=బాగుగా నమస్కరించిన వాడను, అస్మి= అగుచున్నాను.

**తాత్పర్యము:–** కల్పనలకు, ఇంద్రియములకు అతీతమైన బహిర్ముఖ లక్ష్యము కాని భావాభావముల మధ్యనున్న ఆకార రహితమైన సద్వస్తువును గూర్చి నేను బాగుగా నమస్కరించిన వాడను అగుచున్నాను.

**వివరణము:–** బ్రహ్మము (ఈశ్వరుడు) వ్యావహారిక జగమును కల్పించునట్లు జీవుల మనస్సు ప్రాతిభాసిక వస్తువులను కల్పించును. స్వప్నగత వస్తువులు



ప్రాతిభాసికములైన మనఃకల్పనలే. ఒక్కొక్కప్పుడు మెలకువలోను మనస్సు కల్పించు చుండును. కవులు, భావుకులు మొదలగు వారి మనస్సులిట్టి కలలు అని చెప్పఁ బడని పగటి కలల గనుచుండును. గతకాలపు జాగ్రద్వాసనలే కలలకు మూలము లని శాస్త్రజ్ఞులు చెప్పెదరు.

మనస్సు జ్ఞానేంద్రియములలో నొకటి. ముఖ్యముగా ఇది అంతర్గతకల్పన మొనర్చును. శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వా ఘ్రాణములు అనునవి బాహ్య వ్యావహారిక జాగతిక విషయముల గ్రహించును. కావున ఇవి బాహ్య జ్ఞానేంద్రియములనియు చెప్పఁబడును.

బాహ్యజ్ఞానేంద్రియానుభవజన్యమైన వాసనలతో మనస్సుస్వయముగా వస్తువులను కల్పించి తానే బాహ్యేంద్రియాది రూపముల ధరించి స్వకల్పిత వస్తువులను తానే అనుభవించును. ఈ కల్పితములు అంతరంగ గతములైనను బాహ్యవాసనా జన్యములు గావున వీని ననుభవించు మనస్సు బహిర్ముఖమనియే చెప్పనగును. బాహ్య విషయానుభవమున మనస్సునకు సహకరించు బాహ్యేంద్రియములు బహిర్ముఖములని వేఱుగా చెప్పనక్కఱ లేదు.

'బహిర్ముఖం లక్ష్యముజ్ఝతి' అను ద్వితీయ పాదములోని పదములు 'స్వప్న సమయము నటుంచి నిద్రాసమయమున పూర్తిగా ఆత్మ లేక బ్రహ్మము, బహిర్ముఖ లక్ష్యమును తాను స్వయముగానే విడుచును. సద్గురువుల బోధలతో సద్భాష్యుల మనస్సు కూడ బహిర్ముఖ లక్ష్యమును విడచి అంతర్ముఖమగుచుండును. ఇక వారి మనస్సునకే లక్ష్యమైన వారి ఆత్మ బహిర్ముఖ లక్ష్యమును విడచునని చెప్పనక్కఱయే లేదు అను అంశమును తెలుపును. జాతి గుణ క్రియా సంజ్ఞాద్రవ్యా శ్రియము గాని బహిర్ముఖలక్ష్యమొకవేళ ఏదైన ఉన్నచో, లోనమాత్రమే గాక బయటను వ్యాపించియుండు ఆత్మయే అని చెప్పఁదగును. జ్ఞానులదృష్టిలో ఆత్మేతర మట్టిదేదియు బయటలేకపోవుటచే బహిర్ముఖ లక్ష్యము విడువదగినదేయగును. ఆత్మ లోపలనే అంతర్ముఖ లక్ష్యమైయుండగా బహిర్ముఖములైన బాహ్యేంద్రియము లకు ఆత్మ లక్ష్యమే కాజాలదు.

సాధారణముగా లోపల బయట అనుపదములు శరీర ప్రతియోగికమైన ఆంతర బాహ్యములనే బోధించును. కాని మనస్సు కూడ ఆత్మకు బాహ్యమే అగును. సత్సంప్రదాయ గురువుల నాశ్రయించిన శిష్యుల ఆత్మ బహిర్ముఖ మానవ

బాహ్యేంద్రియ విషయరూప లక్ష్యమును సర్వదా విడచియేయుండును. మనస్సు నంతర్ముఖమొనరించి ఆంతరమైన (సర్వాంతరమైన) స్వాత్మను లక్ష్యముగా నొనరించుకొని చేయు ధ్యానము వలననే వారు నిర్వికల్ప సమాధిరూప మనోలయ ద్వారమున పరమానందము ననుభవించు స్థితి స్వానుభవ సిద్ధమైయుండగా, దానిని విడచి బహిర్ముఖలక్ష్యు లెట్లు కాగలరు? కావున వాని ఆత్మ ఆనంద రహితము, దుఃఖపూర్ణమునైన బహిర్ముఖలక్ష్యమును విడచి. తానే ద్రష్టగా, తానే దృశ్యముగా నుండు నొక కాల్పనికా భ్యాసము ద్వారా స్వాంతరాత్మ లక్ష్యమును సవికల్పన సమాధ్యవస్థలో దర్శించుచు బహిర్ముఖ లక్ష్యమును విడచియుండును. సద్గురువుల వలన ఆత్మజ్ఞానమును పొందిన శిష్యులకు లోపల, బయట ఆత్మయే లక్ష్యము. అట్టివారి ఆత్మ బహిర్ముఖేంద్రియ లక్ష్యమైన శబ్దస్పర్శాదికమును విడచియేయుండును. నిరాకృతిమ్ అను పాఠాంతరమును గాని, తమ్ అను పాఠాంతరమును గాని క్రమ ప్రకాశిక పట్టించుకొనలేదు. 2) పై తాత్పర్యము క్రమ ప్రకాశికా వ్యాఖ్యననుసరించి చెప్పఁబడినది. ఆ వ్యాఖ్యయందు ఈ శ్లోకము నకు ఖండాన్వయ ప్రతిపదార్థము చెప్పబడలేదు. దివ్యచకోరిక వ్యాఖ్యననుసరించి పూర్వ శ్లోకమునందలి సోహం ప్రత్యభిజ్ఞ కైలాసాద్రిమయ వపువే ద్వాదశాంతాది రూపమున వాగర్థనాదలయస్థానమగుటచే కల్పనాతిగము అతీంద్రియము బహిర్ముఖ లక్ష్యమును విడచినదిగా భావాభావ మధ్యగతముగా సద్రూపముగా ఈశ్లోకమున వర్ణింపబడినది. వాగర్థ కల్పకము కులమునకు (దేహత్రయమునకు) ఈశ్వర రూపమైన స్వాహంకారము కూడ అట లయించున దగుటచే కల్పకము లేనప్పుడు కల్పనమే ఉండదు. కావున కల్పనాతిగమ్ అనుట సమంజసమే. ఇంద్రియములు అథఃస్థితములు అనగా అపరాఙ్ముఖములుగా లేక నిర్వ్యాపారములుగా నున్నప్పుడు అపరోక్షముగా తత్త్వ జ్ఞానము లభించును. ఇంద్రియములు బహిర్ముఖములు అనగా పరాఙ్ముఖముగా నున్నప్పుడెట్లును అది కలుగదు. కావున బహిర్ముఖ లక్ష్యముజ్ఝతి అని చెప్పుట యుచితమే. త్రిధా అను పాఠాంతరమున దివ్యమానవ సిద్ధౌఘత్రయ పరామహ స్సిద్ధి మయ త్రిపుటి రూపము గాని, ప్రమాత్రాది శామ్భవ త్రిపుటిరూపమునగాని, బహిర్ముఖలక్ష్యమును విడచును అని అర్థము చెప్పవలెను. ప్రమాత యగు ఆత్మకు ప్రమాణాంతరము కావలెనని చెప్పినచో అనవస్థా దోషము కలుగును. కావున ఆత్మదర్శనమున ఆత్మయే ప్రమాత, ఆత్మయే ప్రమేయము.



శాక్త సిద్ధాంతము ననుసరించి శక్తి జ్ఞానము. శివుడు సాక్షి (ప్రమాత). శివ జ్ఞానమున శక్తియే ప్రమాతగా పరస్పర లక్ష్యములగు చుందురు. కావున ప్రమాత్రాంతరము యొక్క ఆవశ్యకత లేదు. శివశక్తులు అభిన్నులైనందునను పరస్పర లక్ష్యములైన ఆ శివ శక్తులు బహిర్ముఖ లక్ష్యములు అని చెప్పదగినవి కావు అనుట శాక్తాభిప్రాయము. 2) భావములనగా ఘటాదులు. అభావములనగా వన్ధ్యపుత్రాదులు. తన్మధ్యగత సదస ద్విలక్షణ వాగర్థరూపమునగాని సాక్షి రూపమునగాని తానే ఉండుటచే అభావభావయోరంతరాలగమ్ అను తృతీయపాద రూపవిశేషణము సమంజసము గానే ఉన్నది. మహార్థమంజరీ పరిమళమున భావాభావములుగాని తృతీయుడైన శివునకు నమస్కారము అని చెప్పఁబడినది. క్రియావిశేషణమైన 'నిరాకృతి' శబ్దము ఆత్మేతర నిరాకరణమగునట్లుగా అను అర్థముచెప్పి 'తమ్' అను సర్వనామమునకు విశేషణముగా చేయవచ్చును. 'సదహమ్' అను పదమునకు గూడ పారమార్థిక సత్తగల అహం శబ్దార్థరూపమైన అను అర్థమున కైలాసాద్రికే విశేషణము చేయ వచ్చును. సాధారణముగా నమ్యుడు (నమస్కరింపఁదగినవాడు) నంత (నమస్కరించు వాడు) వేరువేరుగా ఉందురు. కాని నమ్య కైలాసాద్రి అహం శబ్దార్థరూపమని చెప్పఁబడినందున 'నంత'యని కూడ చెప్పబడినట్లైనది. ఉపాధి భేదమున ఆత్మయందు నమ్యనంతృభావనలు రెండు ఉండుట దోషము కాదు. తనయందే వాగర్థములు కల్పింపఁబడినవే కాని వాస్తవములు కావు. వాగర్థాంశములలోనివే నమ్యంతృ భావములు కావున మహ్యామేనమోనమః వంటి ప్రయోగములు కూడ నున్నవి గదా. ఉపాధిగతములైన నమ్యనంతృ భావములు ఆత్మయందు కల్పించ బడినవి మాత్రమే. ఆత్మావా ఇదగ్ం సర్వం అను శ్రుతిని బట్టి ఆత్మయే నమ్యము. ఆత్మయే నంత అనియు చెప్పవచ్చును.

**అవతారిక:–** పై శ్లోకమున బ్రహ్మస్వరూపిణిగా కాలి నమస్కరణము చెప్పఁబడినది. ఈ శ్లోకమున భువనాత్మ బ్రహ్మ స్వరూపిణిగా ఆమె భజింపఁబడు చున్నది.

**శ్లో॥ అమ్బ! యద్భవతి తత్తదాత్మనా**
**సైవ (స్వే) రితామజహదద్వయోదయమ్।**
**తావకమ్ పద మపాకృతక్రమం**
**బ్రహ్మ తత్సదితి వా శ్రుతం భజే॥ 14**

**ప్రతిపదార్థము:-** అమ్బ=అమ్మా, యత్=ఏది, తత్తదాత్మనా=ఆయారూపములను, భవతి=ఉండునో, స్వైరితామ్=స్వాతంత్ర్యమును, అజహత్=విడువనిదో, అద్వయో దయమ్=స్వాభిన్నముగానే (జగము యొక్క) పుట్టుక కలిగియున్నదో, అపాకృత క్రమమ్=క్రమమును తొలగించుకున్నదో, తత్సదితివా='తత్సత్' అనియే, శ్రుతమ్= వినcబడినదో, తత్=ఆ, తావకమ్=నీకుసంబంధించిన, పదమ్=పదమును, భజే= సేవించెదను.

**తాత్పర్యము:-** అమ్మా! ఏ నీ పదము ఆయారూపమున నున్నను లోకము సృజించు చున్నను, అద్వయభావమును స్వాతంత్ర్యమును విడువనిదో తత్‌సత్ అని వినc బడిన ఆ నీ పదమును భజించెదను.

**వివరణము:-** అబి ధాతువు నుండి ఏర్పడిన అమ్బాపదమునకు మహాభారత శాంతిపర్వము 26వ అధ్యాయమున **'అంగానాం వర్ధనాదమ్బా'**(అవయవముల వృద్ధి పొందించునది కావున తల్లి అమ్బయని చెప్పcదగినది. పాణినీయ ధాతు పాఠమున అబిబన్ధనే అని బన్ధనార్థకముగా పేర్కొనcబడినది. అమ్బా అనగా ప్రేమతో బంధించునది, సంసారమున బంధించునది అనిగాని, కడుపున మోయుచు తాను తిన్న ఆహారమున గర్భస్థశిశువు అంగములవృద్ధి పొందించునది అనిగాని అర్థము చెప్పవచ్చును. అమ్బే అమ్బాల్యంబికే అని అశ్వమేథ ప్రకరణ మంత్రమున చెప్పబడినట్లు మహాప్రాణ సత్త్వ ప్రకృతి రూపిణి అనిగాని అర్థము చెప్పవచ్చును. లేక పూర్వముచెప్పిన విధముగా అమ్ అనగా అకారస్వరనాదాత్మక వాగర్థరూపమును వబయోరభేదః అనుసూక్తిననుసరించి 'వా'వమతి (సృజించునది) లేక వాతి(వ్యాపించును)అను వ్యుత్పత్తి ననుసరించి దహరాత్మకవైన ఓ జగన్మాత! అని కవి సంబోధించునట్లు చెప్పవచ్చును. 2) తత్తదాత్మనా అను సమాసమునకు దేశకాల పదార్థ రూపమున అని అర్థము. సౌభాగ్యహృదయము లోని దేశకాల పదార్థాత్మా యద్యద్వస్తు యథాతథా తత్తద్రూపేణ య భాతి తత్తద్రూపతయాద్భృతి' – ఏయే దేశకాల వస్తువులు యెట్లెట్లు ఉండునో ఆయా వస్తురూపమున అట్లు ప్రకాశించు చుందువు. అను శ్లోకార్థమే ఈ శ్లోకము ప్రథమ పాదమున చెప్పc బడినది. 3) 'స్వైరితామ్' తనచేత చెప్పcబడిన పరారూపమైన వాక్కును 'అజహత్' విడువనిది అని అర్థము. వాక్కు అర్థమును విడచియుండదు గదా! అద్వయోదయమ్ అనుపదమునకు అభిన్నమైన ప్రకాశము యొక్క స్ఫురణము కలది – అని అర్థము.



శివుడు ప్రకాశమని స్ఫురణరూపము విమర్శము శక్తి అని వ్యవహరించుట శాక్తతంత్ర సంప్రదాయము. 'స్వైరితామ్' అను పాఠాంతరమున స్వైరి అనగా స్వతంత్రముగా విహరించువాడు (పరమాత్మ). ఆతని ధర్మము స్వైరిత స్వాతంత్ర్యము. దానిని విడువకయుండునది – అని ద్వితీయ పాదార్థము. 4) క్రమమనగ అవిద్యకసృష్టి క్రమము. దానిని విడచికూడ అమ్మవారు సృష్టిచేయ దలచిన చేయగలదు. యుగపత్సృష్టివాదము ఈ క్రమ విసర్జనమును సూచించును. ఆకాశాది క్రమమున గాక మేలుకొన్ననే జగమున్నదన్నట్లు సృజింపcబడునది అను దృష్టిసృష్టి పదము కూడ ఈ క్రమవిసర్జనమును సూచించును. ఉపాకృతక్రమమ్ అను పాఠమున ఉల్లంఘనాత్మక క్రమము గలదని అర్థము. భావవృత్తులు చిత్తమున చిత్తము సంవిత్తున సంవిత్తు పరవ్యోమమున అసహించుట ఉల్లంఘ్యన క్రమమని శ్రీసంవిత్త్సోత్రమున చెప్పcబడినది. 5) **'ఓం తత్సదితి నిర్దేశో బ్రహ్మణ స్త్రివిధ స్మృతః'** అను గీతావాక్యము తత్సత్ అను శబ్దములు బ్రహ్మ బోధకములు అని చెప్పును. సాధారణముగా పురాణములలో చతుర్ముఖ బ్రహ్మను బోధించు బ్రహ్మపదము ఉపనిషత్తులలో పరమాత్మ అను అర్థమున ఉపయోగింపcబడును. **తదైక్షత** ఇత్యాద్యుపనిష ద్వాక్యములలో తత్పదము బ్రహ్మవాచకముగా ప్రయోగింపc బడినది. సదేవసౌమ్య ఇత్యాద్యుపనిషద్వాక్యమున సత్ శబ్దము బ్రహ్మవాచకముగా ప్రయోగింపబడినది. బ్రహ్మతత్ సత్ అని వేదభాగములైన శ్రుతులలో వినc బడుటచే శ్రుతమ్ అని నాల్గవపాదమున చెప్పcబడినది. బ్రహ్మ మనగా సుప్రబుద్ధము లేక ప్రవృద్ధమైన మహానందము. తత్‌పదము పరోక్షబ్రహ్మ వాచకము. సత్ పదము పారమార్థిక సత్తగల బ్రహ్మను బోధించును. అట్లే అహమర్థాపరోక్ష బ్రహ్మమును బోధించును. వా శ్రుతమ్ అనుపాఠమున **బ్రహ్మ తత్‌సత్** అను నామాంశములులేనిదని కౌమర తంత్రమున చెప్పబడినట్లుగానే అనగా నామరహితమనియే బ్రహ్మము ఉపనిషత్తులలో వినcబడినదను అర్థము లభించును. సాధారణముగా వికల్పవాచకమైన వా అను పదమిట వికల్పరహిత త్రివార్థకముగా ప్రయోగింపcబడినది.

**అవతారిక:-** తత్‌సత్ అని శ్రుతమైన బ్రహ్మము పై శ్లోకమున చెప్పcబడినది. ఈ శ్లోకమున విహిత(కర్మ)ము హితమని చెప్పcబడుచున్నది.

**శ్లో॥ దేశకాలకలనా విశేషతో**
**యద్భవాని! విహితం నిగద్యతే।**
**వ్యక్తిజాతితనుసంశ్రితక్రమం**

**తద్ధితం తవ బహి ర్విజృమ్భణమ్॥ 15**

**ప్రతిపదార్థము:–** దేశకాలకలనా విశేషతః=దేశకాలములకలనా విశేషము వలన, యత్=ఏది, విహితమ్=విధింపఁబడినదిగా, నిగద్యతే=చెప్పబడునో, 'నిషిధ్యతే' అనుపాఠమున నిషేధింపఁబడినదో, భవాని=భవానీ, వ్యక్తి జాతి తను సంశ్రిత క్రమమ్=వ్యక్తి జాతిని శరీరమున ఆశ్రయించిన క్రమముగల్గిన, తవ=నీ యొక్క, తత్=ఆ, బహిర్విజృమ్భణమ్=బయట విజృమ్భణమును, హితమ్=మేలైనది.

**తాత్పర్యము:–** దేశకాల నిమిత్తముగా వ్యక్తి జాతి వయోభేదము గల శరీరము మొదలగు వానిలోని క్రమము నాశ్రయించిన వేద విహితకర్మము నొనరించుట లేక వేద నిషేధిత కర్మ మానివేయుట నీ బహిర్విజృమ్భణము అగుటయే గాక లోకమున మేలైనదియు.

**వివరణము:–** 1) భూధాతువు సత్తను బోధించును. పారమార్థిక సత్త గలవాడు శివుడు. వ్యావహారిక సత్త గలది సంసారము. భూధాతుజమైన భవ శబ్దము శివుని మరియు సంసారమును బోధించును. భవుని (శివునిగా) జీవింపఁజేయునది మరియు జీవునిగా సంసరింపఁజేయునది భవాని. సంసారము నందంతట కనఁబడకుండ వ్యాపించియున్న శివునిగా దర్శింపఁజేసి, జీవుని భవుడుగా జీవింపఁజేయునది భవాని. శ్రీశంకరులు సౌందర్యలహరిలో చెప్పినట్లు **త్వమ్ భవాని –** నీవు అగుదును అన్నంత మాత్రమున జీవునికి స్వరూపము నొసంగి ముక్తునిగా నొనరించునది భవాని. 2) రేవా తీరమున తపము చేయవలెను, గంగా తీరమున మరణింపవలెను – ఇత్యాది వేదవిధులు రేవాగంగాది దేశ విశేషకలనము గలవి. చెట్టు మీదికి సూర్యుడు వచ్చినప్పుడు (అనగా మధ్యాహ్న కాలమున) మాట్లాడవలెను. రాహు కేతు గ్రహణకాలమున స్నానము చేయవలెను. ఇత్యాది వేద విధులు కాలవిశేష కలనము గలవి. దేశము కలాతత్త్వభువనరూపమైన అర్థాధ్వ త్రికమున, కాలము, వర్ణపద మన్త్రరూప వాగధ్వత్రికమున అంతర్భ వించుటచే దేశకాలములు క్రియాజ్ఞానములు కలనలు అని చెప్పఁబడును. (అనగా క్రియ అర్థాధ్వమున జ్ఞానము వాగధ్వమున చేరును) కలనము అనగా గణనము లేక సంఖ్యానము. క్షేపము గతినాదము అనునవి కూడ కలనలుగానే చెప్పఁబడినవి. క్రమ విశేష జ్ఞానము కూడ కలనమని చెప్పఁబడును. ద్వైతము నాశ్రయించి యుండు విధినిషేధ మార్గ విశేషమున అని 'దేశకాలకలనా విశేషతః' అను ప్రథమ



పాదమునకు అర్థము. 3) కర్మ మార్గము వ్యక్తి, జాతి, తనువు (శరీరము) అనువాని క్రమము నాశ్రయించి యుండును. జ్యోతిష్టోమ యాగమును దర్మ పూర్ణమాసయాగములను స్వర్గకాముడు చేయవలెను. పూర్ణకాముడు ప్రజాపత్యు పాసనము నొనరింపవలెను (శ్రీమద్భాగవతము). భూతికాముడు వాయుదేవతాక శ్వేత (వృష)మును ఆలంభింపవలెను. ఇత్యాది విధులలో స్వర్గ కామవ్యక్తి ఉత్తముడు. సంతానకామ వ్యక్తి మధ్యముడు. సంపత్కామవ్యక్తి అధముడు అని వ్యక్తి నాశ్రయించిన క్రమమున్నది. బ్రాహ్మణుడు బృహస్పతి సవమొనరింప వలెను. క్షత్రియుడు రాజసూయయాగము చేయవలెను. వైశ్యుడు వైశ్యస్తోమముతో యజించవలెను. వర్షాకాలమున రథకారుడు అగ్న్యాధానము చేయవలెను. ఇత్యాది విధులలో బ్రాహ్మణాది జాతి నాశ్రయించిన క్రమమున్నది. కృష్ణకేశుడు (నల్లని జుట్టు గలవాడు) అగ్న్యాధానము చేయవలెను – ఇత్యాది విధులలో యౌవనాద్య వస్థలు గల శరీరముల నాశ్రయించిన క్రమమున్నది. వేదాంత సిద్ధాంత దృష్టిలో నీ విధులన్నియు ప్రవృత్తిని కలిగించు అధ్యారోప విధులలోని నిషిధ్యతే అను పాఠాంతరమున పై అధ్యారోప విహితమును నేతి నేతి వాక్యములలో ఆత్మ ముందున్నది – వెనుకనున్నది – ఇత్యాది దేశ విశేషణము నాశ్రయించిన భూతము, భవ్యము భవత్తును అంతయు ఆత్మయే – ఇత్యాది వాక్యములలో భూతభవిష్యాది కాల విశేష క్రమమున్నది. వీని నాశ్రయించిన ఎవనికి తెలియఁబడినదో వానిని తెలియలేదు. ఇత్యాది వాక్యములలో, కలనా విశేషము నాశ్రయించిన కామము, కామోపభోగమున నెన్నటికి శమించదు(శ్రీమద్భగవద్గీత) వాక్యమున కలనాక్రమము కనిపించును.

ఆకలిదప్పులులేని తండ్రి తండ్రికాడు. దేవతలు దేవతలుకారు. వేదములు వేదములు కావు – ఇత్యాది వాక్యములలో వ్యక్తి విశేషముల నాశ్రయించి బ్రహ్మ క్షత్రాది భేదములు తొలగిన–ఇత్యాది వాక్యములలో జాతి విశేషము నాశ్రయించిన క్రమము – శబ్దములేనిది, రూపములేనిది, స్థూలముకానిది, సూక్ష్మముకానిది ఇత్యాది వాక్యములలో తను(శరీర) విశేషము నాశ్రయించిన క్రమములు అపవదింపఁబడినవి. (చివరకన్నియు తొలగింపఁబడినవి.) ఈ విధి నిషేధముల ద్వారా శక్తి (వాక్కు) యొక్క బహిర్విజృంభణము సిద్ధులకు, సాధకులకును మేలైనదియే. విధిరూప బహిర్విజృంభణము సాధకులకు, నిషేధరూప విజృంభణము

సిద్ధులకును మేలైనది అనుట హిత శబ్దార్థము. తత్+ హితమ్=తద్ధితమ్ అని విభజించి పై అర్థము చెప్పఁబడినది. అట్లు విభజించక తద్ధితమ్ అను పదమును వ్యాకరణశాస్త్రము ననుసరించి తద్ధిత ప్రత్యయ పరముగా భావించి అర్థము చెప్పినచో అమ్మవారి బహిర్విజృమ్భణ రూపమైన కర్మవిధి వాక్యమున గల తద్ధిత ప్రత్యయ ప్రాధాన్యము తెలియును. తద్ధితముచే అనగా చతుర్థిచే గాని, మంత్రవర్ణముచే గాని చెప్పఁబడిన దేవతగాని, విధిగాని ఉత్తరోత్తరము అని వార్తికమున చెప్పబడినవిధముగా తద్ధితముచే చెప్పబడిన దేవతావిధులకంటే చతుర్థీవిభక్తిచే చెప్పబడినవి. దుర్బలములు. దానికంటే మంత్రవర్ణముచే చెప్పఁబడిన దేవతా విధులు ఇంకను దుర్బలములు అగు కారణము చేత తద్ధిత ప్రత్యయాంత పదములచే చెప్పఁబడినదే నీ బహిర్విజృంభణము అను అర్థమును సిద్ధించును.

ఇంతేగాక అంతర్ముఖులైన విద్వాంసులు విద్యనాశ్రయించి చేయు నీ అధ్యాస క్రమము మెల్లమెల్లగా విద్యాఫల(ముక్తి)లాభము కొఱకు అవిద్వాంసులు అవిద్యనాశ్రయించి మెల్లమెల్లగా అవిద్యాఫలము (సంసారము)ను పొందెదరు అను తాత్పర్యము అనురణనముగా నీ శ్లోకమున ధ్వనించును.

అనేక జన్మల తరువాత జ్ఞానవంతుడు నన్ను చేరును. వాసుదేవుడే సర్వము అను జ్ఞానము కల మహాత్ముడు సుదుర్లభుడు. అని మెల్ల మెల్లగా విద్యనాశ్రయించి తత్ఫల (మోక్ష) మును పొందుట ఆయా కామములచే అపహరింపఁబడిన జ్ఞానము కలవారు, తమ ప్రకృతిచే నియమింపఁబడి అన్య దేవతల నాశ్రయించెదరు. అని విద్య నాశ్రయించి తత్ఫలము (సంసారము) నెట్లు పొందెదరో భగవద్గీత స్పష్టము చేసినది. నీలకంఠ దీక్షితులు చెప్పినట్లు నీతిజ్ఞులు, నియతిజ్ఞులు, శాస్త్రజ్ఞులు, బ్రహ్మజ్ఞులు (బ్రహ్మవేదజ్ఞులు) అయిన వారెందరో ఉందురు. కాని అజ్ఞానము నశింపఁజేసికొన్న వారు మాత్రము విరలముగానే ఉందురు. 4) ఇప్పటి వఱకు వ్యాఖ్యానింపఁబడిన నాలుగైదు శ్లోకములలో అమ్మవారు దహరము కైలాసాద్రి తత్త్వనాయిక, బ్రహ్మరూపిణి, ఇత్యాది బహువిధములుగా వర్ణింపఁబడినది. ఈ అన్నింటి యందును ఆమె శివాభిన్న స్వరూపమును విస్మరింపరాదు. సృష్టి అంతయు వాగర్థమయము. వాగర్థములు పరస్పరాభిన్నములుగానే పార్వతీ పరమేశ్వరాభిన్నములుగానే తాంత్రికులచే భావింపఁబడును. వ్యవహరింపఁబడును.



**అవతారిక:–** ఇంతవఱకు పదనొకండు శ్లోకములలో వాగర్థమయ స్వాత్మ (వస్తువు) యొక్క కాలీకాల మిథున స్వరూపము ప్రస్తావింపఁబడినది. ఇకముందు ఛాందోగ్యోపనిషదుక్త త్రివృత్కరణము గుణత్రయసృష్ట్యాది కృత్యత్రయరూపత చెప్పఁబడును.

**శ్లో॥ సత్త్వమమ్బ! విహితస్య వస్తున**
**స్తత్ప్రసాదితదయోదయం వపుః।**
**స్యాత్తమశ్చ యదిదం నిషిధ్యతే**
**ద్వే (ద్వ్రి) రజః సదస దన్యరూపతః॥ 16**

**ప్రతిపదార్థము:–** విహితస్య=విధింపఁబడిన (యాగాది) రూపమైన, వస్తునః= కర్మయొక్క, తత్ప్రసాదిత దయోదయమ్=దానిచేత ప్రసాదింపఁబడిన దయ యొక్క పుట్టుక గల, సత్త్వమ్=సత్త్వగుణమే, అమ్బ=అమ్మా!, వపుః=శరీరము, యత్= ఏది, నిషిధ్యతే=నిషేధించబడునో, ఇదమ్=ఇది, తమఃచ=తమోగుణమును, స్యాత్ =అగును, ద్వే=రెండు (సత్త్వ తమస్సులు కలిసి) సదసదన్యరూపతః=సదసద్భిన్న రూపము వలన, రజః=రజోగుణమును కర్మహేతుకమే.

**తాత్పర్యము:–** అమ్బ! నీ దయనుదయింపఁజేయు విహితకర్మనొనరించుటకు ప్రేరకమైన అంతఃకరణమును సత్త్వగుణమును నీ శరీరమే. తమోగుణము నిషేధింపబడిన కర్మనొనర్చుటకు ప్రేరేపించును. రజోగుణము ఈ రెండు సత్త్వ తమస్సుల మేళనమైనను అది సత్తనిగాని, అసత్తనిగాని చెప్పదగని తదన్య రూపము అగుట వలన ఈ రెండు గుణముల కన్న భిన్నమే అదియు కర్మను ప్రేరేపించు గుణమే.

**వివరణము:–** 1) సత్త్వగుణముతో గూడిన రజోగుణము వేదవిహిత కర్మలను చేయుటకై జీవుల అంతఃకరణమును ప్రేరేపించును. అట్లే తమోగుణముతో కూడిన రజోగుణము నిషిద్ధకర్మలనొనర్చుటకై ప్రేరేపించును. విహితములైన యజ్ఞ యాగాదుల నొనర్చిన వారియందు అమ్మవారికి దయకలుగును. ఎందుకనగా వేదములామె ఆజ్ఞారూపములు గావున తద్విహిత కర్మనొనరించిన వారిపట్ల ఆమెకు దయ ఉదయించును. ఇది పూర్వార్ధ వివరణము. 2) నిషిద్ధకర్మలనొనరించుట యనగా తమోగుణము ఆ కర్మలచేయువారి యందున్నదని అర్థము. ఈ మూడవ పాదము ఈ తమోగుణము విహితకర్మలను చేయవద్దని నిషేధించును అను

అర్థమును కూడ బోధించి ఇదం విహితం (కర్మ) యత్=యస్మాత్ నిషిధ్యతే తత్ తమ అస్యాత్ అని అన్వయించుకొని పై అర్థము చెప్పుకొనవచ్చును. మరొక విధముగా యత్=ఏది, నిషిధ్యతే= నిషేధింపఁబడునో, ఇదమ్=ఇది, తమఃస్యాత్– అది తమోగుణమే అనగా తమోగుణము నిషిద్ధకర్మవలె, దుఃఖము వలె హేయము అని అర్థము. అన్వయ భేదమున వేరువేరుగా ఉన్న ఈ అర్థములకు తమో గుణము అసత్తు అనగా మంచిదికాదు అనుటయే తాత్పర్యము. ఇది తృతీయపాద వివరణము. 3) రజో గుణము సదసదన్య రూపమైనందున అనగా మంచిదనిగాని, చెడ్డదనిగాని చెప్పబడరాని దైనందున అది ద్వే=రెండు సత్త్వ తమోగుణములకు సహకరించి జనులను మంచివారుగా గాని, చెడ్డవారుగా గాని వ్యవహరింపఁ బడ జేయును. క్రమప్రకాశిక సత్త్వతమో గుణములు రెండు కలసి సదసదన్యరూప రజోగుణమును కలిగించునట్లు చెప్పినది. ఇది చతుర్థ పాదార్థము. 4) శుద్ధ సత్త్వ ప్రధాన శరీరముగల అమ్మవారి దయ విహితకర్మనొనరించు వారి యెడ ఉదయించునని శుద్ధసత్త్వము ప్రధానమైనను ఆమె వపువున సత్త్వరజస్తమో గుణములు మూడు నుండుననుట క్రమప్రకాశిక తాత్పర్యము కావచ్చును. ఈ శ్లోక వ్యాఖ్య అసంపూర్ణముగా ముద్రితమైనట్లు తోచుచున్నది. పంక్తి చివఱ శ్రీ అని మాత్రము మంత్రింపఁబడినది. తరువాతి వాక్యము అమ్మవారి విశుద్ధ సత్త్వ ప్రాధాన్యములో శ్రీమద్భాగవత వచనము సమర్థించినది. అగ్నిహోత్రశాస్త్రి గారి వ్యాఖ్యననుసరించి ఉపాదేయముగా విహితము, అనుష్ఠేయముగా విహితము, హేయముగా విహితము, అని విహితము త్రివిధము.

సిద్ధమైన ఆత్మగాని, సాధ్యములైన వాగర్థములుగాని సద్వస్తువులు అని చెప్పఁ బడును. దయాబీజము నాటబడునది ఆభ్యంతర (సూక్ష్మ) శరీరము గాని, బాహ్య(స్థూల) శరీరముగాని ఉప్యతే (నాటఁబడును) అను వ్యుత్పత్తి నాశ్రయించి బీజములు మొలచు భూమివంటిది. శరీరము వాగర్థములలోనేదో యొక్క దాని రూపమున సేవ్యమైనది అనుదించదగినది విహితము. అటువంటి విహిత సద్వస్తువును సేవించుటవలన దేవిప్రసాదమైన దయ ఉదయించును. సత్త్వాధిక్యము గల హృదయమున మాత్రమే దయ పుట్టును. సత్కర్మానుష్ఠాన ఫలముగా దేవి సత్కర్ముల హృదయమున సత్త్వగుణమును, దయను కలిగించును. అమ్మవారి హృదయము శుద్ధసత్త్వ ప్రధానము. ఆమె స్థూలశరీరము కూడ అట్టిదే.



సత్కర్మానుష్ఠానముచేత అనగా తన ఆజ్ఞను పాలించుటచేత ఆమె హృదయమున తత్కర్తలైన వారి యెడ దయకలుగుట ఒక అంశము. ఆ తరువాత సత్కర్ముల హృదయముననుు సత్త్వగుణాధిక్యము, దానివలన దయ కలుగుట మరొక అంశము. ఈ రెండు విధములుగా అమ్మా! నీ సత్త్వగుణములు సన్మార్గుల కుపయోగించును. ప్రసాదిత శబ్దము ప్రధానముగా ప్రసాద గుణము గల అను అర్థమును బోధించును. అది **'కర్మాణి చిత్త శుద్ధ్యర్థమ్'** అను సూక్తి కనుగుణము. అనుష్ఠాతలకు అంతఃకరణశుద్ధి కలుగును. దయాది సద్గుణములును వృద్ధి పొందును. హృదయమున రజస్తమోగుణములు తగ్గుటచే నైర్మల్యము కలుగును. ఆ తరువాత దయాగుణము పుట్టును. అంతఃకరణము మనోబుద్ధి చిత్తాహంతలు అను నాలుగు అంతరింద్రియముల సమాహారము. అందుచేత అహంతయందును దయాగుణముండును. ఆ అహంతామయమైన అమ్మవపువు అనగా శరీరము (పూర్వము చెప్పఁబడిన కైలాసాద్రి) సత్త్వమని ఈ శ్లోకమున చెప్పఁబడినది.

తత్ప్రసాదితయోదయమ్ అను పాఠమున సత్కర్మానుష్ఠాన ఫలముగా సత్కర్మలకు రాబోవు జన్మమున ఉత్తమ శరీరము అనగా సుఖాధిక్యమనుభవించ గల శరీరము పుట్టుక అని ద్వితీయ పాదము యొక్క అర్థము ఏర్పడును. తమోగుణ స్థూలరూపమే ఇదంత. అందుచేతనే ఇది నిషేధింపఁబడదగిన తమస్సు అనుట తృతీయ పాదార్థము. వాస్తవమునకు అహంతేదంతలే నిషేధింపఁబడ దగినవి. అనగా ఆత్మయందు దేహబుద్ధి దేహాదులందు అహం బుద్ధి నిషేధింపఁ బడదగినది. అహంతేదంతలే సదసత్తులు. వీనికి భిన్నమైనది ఆత్మ. నేను అహమ్ బుద్ధి గోచరుడనే కాని ఇదమ్ బుద్ధి గోచర శరీరమును కాను అను రెండు బుద్ధులు విధి నిషేధ గోచరములు. ఆత్మవిధినిషేధాతీతము. సిద్ధద్రవ్యమున విధి, నిషేధముకాని యుండఁజాలదు. సిద్ధ ద్రవ్యమైన ఆత్మ విధి నిషేధాతీతము, అయినను దానియందు 'ఇదమ్‌బుద్ధి' (శరీరబుద్ధి) నిషేధింపఁబడదగినదే అను అర్థము 'విహితమ్' అను పదమునకు చెప్పవలెను. ఆత్మ యందు అహమ్ బుద్ధి సత్త్వ గుణమున కలుగును. ఇదంతా బుద్ధి తమోగుణమున కలుగును. ఇదం బుద్ధిగోచరమైన శరీరము అసత్తు. అహం బుద్ధి గోచరమైన ఆత్మ సత్తు. ఆత్మ యందు కలుగు అహంత బుద్ధి సద్బుద్ధి. ఇదంత బుద్ధి అసద్బుద్ధి. ఈ అహంతేదంతలు రెండు కలసి రజమనఁబడును.

ద్వైరజః అను పాఠమున రెండు రజస్సుల (వాగర్థపరమాణువులో) యొక్క

సమాహారము ద్వైరజః అనఁబడును. సదసదన్యమైన స్వరూపైక్యమున ఇదియే బ్రహ్మాత్మతారూపము. భావ ప్రకాశమున సత్యము ఈశ్వరసిద్ధులలో సంకల్ప(మన)ముగా,సంసారులలో అహంతగా పరిణమించును. ఈశ్వర సిద్ధులలో క్రియాహేతువై రజస్సు సంసారులలో ప్రాణముగా పరిణమించును. ఈశ్వర సిద్ధులలో శుద్ధ వాక్కుగా ఉండు తమస్సు సంసారులలో క్రోధాదులతో కూడిన అశుద్ధ వాక్కుగా పరిణమించును అని చెప్పఁబడినది.

**అవతారిక:–** పై శ్లోకమున అమ్మవారి శరీరము విశుద్ధసత్త్వప్రధానగుణ త్రయాశ్రయమని చెప్పఁబడినది. ఈ శ్లోకమున స్థూలభూతములును గుణత్రయ కారణ జన్యములని చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ యత్తమోఽన్యదిహ తత్ క్షితేర్వపు**
**స్సత్త్వమన్యదిహ తేజస శ్శివే।**
**మిశ్రణోత్థమితరద్రజ స్తయో**
**స్త్వత్క సత్త్వజమతో గుణత్రయమ్॥** **17**

**ప్రతిపదార్థము:–**ఇహ=ఇచట, అన్యత్=కారణరూపమైన, యత్=ఏ, తమః=తమస్సు (గలదో),తత్=అది, క్షితేః=భూమియొక్క, వపుః=శరీరము, అన్యత్=కారణరూపమైన, సత్త్వమ్=సత్త్వము, తేజసః=తేజము యొక్క, వపుః=వపువు, శివే=ఓ శివా, ఇహ=ఇచట, త్రయోః=వాని (సత్త్వతమస్సుల) యొక్క, మిశ్రణోత్థమ్=కలయికతో పుట్టిన, ఇతరత్= కారణరూపమైన, రజః=రజస్సు, అతః=ఇందువలన, గుణత్రయమ్=ఈ మూడు గుణములు (సత్త్వ రజస్తమస్సులు), త్వత్కసత్త్వజమ్=నీ యొక్క (శుద్ధ) సత్త్వము నుండి పుట్టినదే.

**తాత్పర్యము:–** భూపరమైన నీ స్థూలశరీరమునకు తమస్సు కారణము. తేజోరూపమైన స్థూలశరీరమునకు సత్త్వము కారణము. కారణమైన రజస్సు అసత్త్వ తమస్సుల మిశ్రణము వలన కలిగినదే. అందువలన గుణత్రయము నీ శుద్ధ సత్త్వము నుండి పుట్టినదే.

**వివరణము:–** 1) వశధాతువు యొక్క వర్ణవ్యత్యయమువలన ఏర్పడిన శివా శబ్దము, శివశబ్దమువలె సృష్టి+ఇచ్ఛారూపిణియైన అమ్మవారియందు రూఢము. శివశబ్దము యొక్క సప్తమ్యంతముగా భావించినప్పుడు శివునందలి గుణత్రయ



రూపిణియైన అమ్మవారినుండియే క్షిత్యాది స్థూలభూతము లేర్పడినవి అని అర్థము. 2) అపంచీకృతములైన సూక్ష్మభూతములనుండి స్థూలములైన ఆకాశాది పంచ భూతము లేర్పడినవి. ఈ స్థూల భూతములు పంచీకృతములని చెప్పఁబడును. ఆకాశములోని సగభాగమును, మిగిలిన నాలుగు భూతములలోని సగభాగములను నాలుగు భాగములుచేసి మిగిలిన వాయ్వ్యాది భూతములలో కలుపవలెను. మిగిలిన భూతములలోని సమానభాగములతో ఆకాశములోని సగభాగము పూరింపవలెను. ఇట్లు అపంచీకృతమై ఆకాశము యొక్క సగభాగము అట్టివేయైన మిగిలిన నాలుగు భూతముల భాగములతో పూరింపఁబడిన ఆకాశము పంచ కృతాకాశ మనఁబడును. పంచీకృతాకాశమున మిగిలిన భూతభాగములున్నవి. అవి తక్కువగా, ఆకాశమే అర్ధభాగముగా ఉండుటచే పంచీకృతాకాశ మనియే చెప్పఁబడును. ఇట్లే మిగిలిన అపంచీకృత భూతములను పొందును. ఈ ప్రక్రియను పంచీకరణ మందురు. ఇది తైత్తిరీయోపనిషత్ప్రతిపాదితము. ఛాందోగ్యమున ఆకాశ వాయువులను విడచి తేజో జల భూమి రూప భూతత్రయమే చెప్పఁబడినది.

పై పద్ధతినాశ్రయించి త్రివృత్కరణము చేయగా త్రివృత్కృత స్థూల భూతములైన తేజో జల భూమి రూప భూతత్రయమేర్పడును. ఈ శ్లోకమున త్రివృత్కృతములైన తేజస్సు క్షితి(భూమి) చెప్పఁబడినవి. క్షితి తమస్సు, తేజస్సు సత్త్వము అని చెప్పఁబడినది. ఇందులో చెప్పఁబడిన తమస్సత్త్వములు స్థూల భూతములకు కారణమైనందున అవి స్థూలములు కావు అని చెప్పుటకు 'అన్యత్' అను విశేషణములతో తమస్సత్త్వములు విశేషింపఁబడినవి. పరిశేషన్యాయమున జలము రజస్సు అని గ్రహింపవలెను. క్రమప్రకాశిక (రజస్సు రాగాత్మకము అను భగవద్గీతాసూక్తిననుసరించి) రాగహేతుక శబ్దము నాశ్రయించుటచే ఆకాశము; రాగహేతుక స్పర్శము; నాశ్రయించుటచే వాయువు; రాగహేతుక రసము నాశ్రయించుటచే జలమును రజఃకారణములని చెప్పినది. కార్య రూపములైన పంచభూతములు గుణత్రయ రూపములైనను కారణరూపములు కానందున కారణ భూతగుణ త్రయము అన్యత్ ఇతత్ అను పదములతో గుణ త్రయము యొక్క కరణత్వము సూచింపఁబడినది.

దివ్యచకోరిక ననుసరించి అన్యత్ అనగా వెనుక శ్లోకమున చెప్పఁబడిన సూక్ష్మమునకంటే భిన్నమైన స్థూలము. క్షితిర్వపుః అను పాఠాంతరమున భూమియే

నీ సూక్ష్మతమశ్శరీరము యొక్క రూపాంతరము. ఇట్లే సత్త్వమనగా సద్ధర్మము. సూక్ష్మతత్త్వరూపమైన దేవీశరీరము యొక్క రూపాంతరమైన స్థూలమైన శరీరము తేజస్సు, అపంచీకృత తేజస్సు యొక్క సూక్ష్మరూపము. సూక్ష్మతమో గుణముల యొక్క మిశ్రణమైన రజోగుణము యొక్క సూక్ష్మ రూపాంతరమైన అపంచీకృత సూక్ష్మ భూతముల కంటే అన్యములైన పంచకృత స్థూలాకాశవాయుజలములు అన్యరజోరూపస్థూల శరీరము యొక్క భాగములు. పార్థివ తమస్సు అగ్నేయము. తైజససత్త్వము సౌమ్యము. తామసపృథివి ఆగ్నేయము అనాప్యము. సాత్త్విక తేజము సౌమ్యము ఆప్యము. ఈ ఆప్యానాప్య సమ్మేలనజన్యము స్థూలమునైన రజశ్శరీరము క్షిత్పిపాసాశ్రయము. శుక్ర పరమాణు శరీరమునందలి త్ర్యణుకద్వయ సమ్మేలనము వలన మధ్యమ పరిణామ శరీరమేర్పడును. వాగర్థరూపిణియైన అమ్మవారి యొక్క సత్త్వగుణము నుండి పుట్టు శమము నుండి విధినిషేధోదాసీన వ్యాపారములు గల గుణత్రయమేర్పడినది. త్వత్కసత్త్వజమ్ అనుపాఠమున నీ శుద్ధసత్త్వము నుండి సూక్ష్మసదసద్రూప సత్త్వ తమములు తన్మిశ్రణమైన రజస్సును అను గుణత్రయమేర్పడినది. ఈ గుణత్రయము నుండియే పుం, స్త్రీ, నపుంసక లింగత్రయమును పరిణతమైనది. తేజో జల భూరూప భూతత్రయము గుణత్రయ స్థూలకార్యమని చెప్పుటచేత జలభూతము యొక్క కార్యమైన భూమి కారణమైన తేజస్సు అను రెంటి మధ్య కేంద్రమున తనూనపాత్ అపాంనపాత్ అను మేధ్యామేధ్య సామరస్య రూపమున వాయ్వ్యాకాశ సామరస్య స్థూలోపాధిత్వమువలె మమత అను నామాంతరముగల రజోగుణము స్వకార్యమైన తమస్థూలరూపమైన అన్నమయకోశము (స్థూల శరీరము) యొక్క స్వకారణమైన సత్యస్థూలరూపమైన ఆనందమయ కోశము (కారణ శరీరము=నిద్ర) యొక్కయు మధ్యమున విద్యామయ శబ్ద వర్ణ త్రిపద మంత్రాధ్వ త్రికము యొక్క అవిద్యామయ కలాతత్త్వ భువనాధ్వత్రికముయొక్క సమష్టి రూపములైన విజ్ఞానమనః ప్రాణమయ కోశముల మూడింటి సమష్టియైన సూక్ష్మ (లింగ) శరీరమును అందును మధ్య నున్న మానససరోవర రాజహంస మిథునమునకు ఆశ్రయమగుటచే వీర్యవత్తరమైన సూక్ష్మోపాధిరూపత్వ మూహింపఁదగినది. అనగా జలమున వాయ్వ్యాకాశ సామ రస్య స్థూలోపాధిత్వమున్నట్లు విజ్ఞానమనఃప్రాణమయ సమష్టి మధ్య మనస్సున సూక్ష్మోపాధిత్వమున్నదనుట ఊహింపదగినది.



మాతృకావివేకమున స్వరఖండము జడసుషుప్తిదశా బోధకమైనను చిన్మయషోడశ కాలాబోధకమగుటచే సౌమ్యము స్వయం రాజమానమైనదగుటచే స్వరత్వము, ఖండత్వము అక్షరత్వాది ధర్మములుండుటలో బాధలేదు. పంచేంద్రియ జడజాగ్రద్వశాబోధకమైనను చిన్మయ ముఖ్య ప్రాణసూర్యతురీయ జాగ్రద్దశా బోధకముగా చిన్మయ స్పర్శబోధకము అగుటచేత స్పర్శఖండాదికత్వమునను బాధలేదు. అట్లే అంతస్థోష్మనామముగల వ్యాపక వర్ణవర్ణాఖండము భూతాగ్ని బోధకమగుటతోపాటు జాఠరాగ్ని బోధకమునగుచున్నది. భుక్తాన్న పానజారణమున అంతర్మనః కల్పిత వికల్పరూపమైన వ్యావహారిక సాంసారిక దాహకము అగుటచే అంతర్ముఖ విమర్శాగ్ని ప్రాధాన్యమున అంతఃస్థోష్మ వ్యాపక ఖండత్వమునకు బాధలేదు. ఇత్యాద్యంశములు గురుముఖైక వేద్యములు. వాక్కు తేజోమయమని, ప్రాణము జలమయమని మనస్సు అన్నమయమని ఛాందోగ్యమున చెప్పఁబడినది. కావున ముఖ్య ప్రాణాగ్నియే మండల త్రయ రూపము. సూర్యచంద్రులు తదవయవ జన్యములు మాత్రమే. చెప్పఁబడబోవు ప్రకాశానందమూర్తి చక్రమయ వాగర్థదేవతా స్వరూపవర్ణమునకు ప్రోద్బలకముగా ఇట సూచింపఁబడినది.

**'చన్ద్రమా మనసో జాతః చక్షోస్సూర్యో అజాయత'** ఇత్యాది శ్రుతి చంద్ర సూర్యుల అవయవ జన్యత్వమును చెప్పినది. **యస్మాన్నజాతః పరో అన్యోస్తి య ఆవివేశ భువనాని విశ్వా ప్రజాపతిః ప్రజయా సంవిదానః త్రీణిజ్యోతీంషి సచతే స షోడశీ** ఇత్యాది మంత్ర వర్ణములు చెప్పిన సకల జగత్కారణ షోడశీ కలారూపత్వము జ్యోతిఃశాస్త్రోక్త కోల రూప చంద్రుడు భూమ్యుపిగ్రహమగుట అను కార్యరూపత్వము **'అపాగ్ం రసముదయగ్ం సన్॥ సూర్యే శుక్రగ్ం సమాభృతమ్, ఇమే వై లోకా అపాగ్ం రసః, తేఽ ముష్మిన్నాదిత్యే సమాభృతాః** అట్లే **ఆపో వా ఇదగ్ం సర్వమ్** ఇత్యాది మంత్ర బ్రాహ్మణ వాక్య పర్యాలోచనమున, **ఏకైకస్మిన్యథా దర్శే ప్రాసాదోముహురాంతరైః సహతోదృశ్యతే దేవేష్వేవం లోకస్సురాంతరైః తస్మాత్ స్యుర్దేవతాః సర్వాః ప్రత్యేకం విశ్వయోనయః'। అన్యోన్య యోనయశ్చైవ యథా యాస్కమునీరితమ్** – ఒక్కొక్క అద్దమున ఆంతరములతో కూడిన ప్రాసాదము కనఁబడునో దేవతలలోనూ ఈ విధముగ సూరాంతరములతో లోకమున కనఁబడును. అందువలన దేవతలందరు విశ్వయోనులే. అన్యోన్య యోగులను యాస్క ముని చెప్పిన విధమిది. సర్వభూతాత్మ భూతాత్మభావము చేతనే సర్వులకు సర్వజగత్కారణత్వము సిద్ధించును.

**అవతారిక:-** పై శ్లోకమున త్రిగుణమయమైన (వాగర్థ) ప్రకృతి సూక్ష్మభూత (తన్మాత్రలసృష్టి ద్వారా) స్థూల భూత సృష్టిహేతువని చెప్పఁబడినది. ఈ శ్లోకమున ఆ ప్రకృతి యొక్క అక్షయ పారమైశ్వర్యమును వైరాగ్యపూర్ణత్వమును చెప్పఁ బడుచున్నది.

**శ్లో॥ ఈశ్వరస్య తవ భర్తురక్షయై**
**శ్వర్యరూపమసి తత్త్వమమ్బికే।**
**జ్ఞానమస్య శుచి కర్మ వా ఫలం**
**తే విరాగమయపూర్ణతాఫలే॥ 18**

**ప్రతిపదార్థము:-** అమ్బికే=ఓ అమ్బికా, తవ=నీయొక్క, భర్తుః=భర్తయైన, ఈశ్వరస్య =ఈశ్వరుని యొక్క, అక్షయైశ్వర్యరూపమ్=క్షయములేని ఐశ్వర్య రూపము, అసి= అగుదువు, అస్య=దీని (ఐశ్వర్యము యొక్క), ఫలమ్=ఫలము, శుచి=పరిశుద్ధమైన, జ్ఞానమ్=జ్ఞానము, వా=మరియు, కర్మ=కర్మ, తే=అవి (జ్ఞాన కర్మలు), విరాగమయ పూర్ణతాఫలే=విరాగమయమైన పూర్ణత్వము యొక్క ఫలములు.

**తాత్పర్యము:-** నీ భర్తయైన ఈశ్వరుని అక్షయైశ్వర్య రూపమైన దానవు నీవే. ఆయన తత్త్వము కూడా నీవే. సంసార రూపైశ్వర్యము యొక్క ఫలములు పరిశుద్ధ జ్ఞాన కర్మలు. అవి నీ వైరాగ్య పూర్ణత్వము యొక్క ఫలములు.

**వివరణము:-** 1) అమ్బా శబ్దము సత్త్వతమోంశ మిశ్రణవాగర్థమయ సంపూర్ణ శరీరముగల తల్లిని బోధించగా అమ్బికాశబ్దము దానికన్న కొంచెము అపరిపూర్ణ మైన అనగా ప్రాదేశిక వాగర్థ శరీరముగల తల్లిని బోధించును. అమ్బికా శబ్దములోని అల్పార్థక ప్రత్యయముచే శరీరములోని అల్పత్వము సూచించఁబడును. 2) శివుడు ఈశ్వరుడని పిలువఁబడుటకు నీ అక్షయైశ్వర్య రూపము కారణము. ఈశ్వరుని తత్త్వము ఐశ్వర్యమే. కాని ఆ ఐశ్వర్యము తత్త్వము. అనగా పరోక్షత గలదియే. నీవు మాత్రము ఇంద్రియ గోచరతనొందిన ప్రత్యక్ష సంసారము అయినదానవు. ఈ సంసారము ఒకరిద్దఱు ముక్తులలో క్షయమునొందినను క్షీణించక అక్షయముగానే ఉండును. కావున నీ రూపమైన అది అక్షయమే. ఈ సంసారమునకు పరిశుద్ధములైన ఫలము జ్ఞానము మరియు కర్మ. **నహి జ్ఞానేన సదృశమ్ పవిత్ర మిహ విద్యతే** అను గీతావాక్యము ననుసరించి జ్ఞానము ఎల్లప్పుడును పరిశుద్ధమే. కర్మ మాత్రము ఫలాభి సంధితో కూడినప్పుడు పాపము



వలె పునర్జన్మ హేతువగుటచే మలినము. ఫలాభి సంధి రహితమైనప్పుడు కర్మ శుద్ధమే. అంతేగాదు తాను శుద్ధమగుటయే గాక తనను ప్రేరేపించిన అంతః కరణమునకు సైతము శుద్ధిని కలిగించును. కర్మాణి చిత్త శుద్ధ్యర్థమను సూక్తి నిష్కామ కర్మఫలముల చిత్తఅంతఃకరణ శుద్ధియే ఫలమను తత్త్వమును స్పష్ట మొనర్చుచున్నది. 3)దివ్య చకోరిక జ్ఞానమునకు పరిశుద్ధి అధీతి బోధల ద్వారా కలుగునని, కర్మకు పరిశుద్ధి ఫలమపేక్షించని ఆచరణ ప్రచారణములద్వారా ఏర్పడు నని చెప్పుచున్నది. క్రమప్రకాశిక మాత్రము అమ్మవారే ఈశ్వరుని ఐశ్వర్యము, ఆతని విశుద్ధ జ్ఞానము సృష్ట్యాది కర్మము కూడ అమ్మవారే అని చెప్పుచున్నది. 4) కర్మ క్షణికము. దాని ఫలము కూడా క్షణికము అని ఎఱిగినవానికి కర్మ ఫలములైన ఐహికాముష్మిక భోగముల పట్ల వైరాగ్యము కలుగును. ఇట్టి వైరాగ్యముతో ఫలమును కోరక చిత్తశుద్ధికై నిష్కామ కర్మ మొనర్చును. నిష్కామ కర్మ ద్వారా లభించిన చిత్తశుద్ధి జ్ఞానము కలుగుటకు, దాని యొక్క విస్మరణమును వారించుటకు సహకరించును. ఆ జ్ఞానము పరోక్ష మాత్ర రూపమును గాక అపరోక్ష రూపమును పొందుటలో కూడా సహకరించును. అపరోక్ష జ్ఞానము మాత్రమే పూర్ణజ్ఞానము అని పిలువఁబడును. ఆ జ్ఞానము మాత్రమే పూర్ణముక్తి లేక కైవల్యమునకు హేతువగును. తాంత్రికముగ పూర్ణాహంతయే అమ్మవారి పూర్ణత. ఆప్తకామురాలైన ఆమెకట్టి కామములు లేకపోవుట వలన ఆమె విరాగ పూర్ణురాలు కూడ అనగా ఆమె వైరాగ్యము మందవైరాగ్యము కాక పూర్ణవైరాగ్యమే. ఆమె అనుసంధానము కలవారికి కూడ పూర్ణ వైరాగ్యము పూర్ణాహంత సిద్ధించును.

**అవతారిక:-** పై శ్లోకమున అమ్బిక యొక్క పారమైశ్వర్యము చెప్పఁబడినది. ఈ శ్లోకమున సత్త్వతమోగుణ దేహ స్థూల రూపము చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ జ్యోతిరమ్బ! హృది విద్యయేక్షితం**
**యల్లఘుప్రసృతమర్థమణ్డపే।**
**ధూమలక్ష్మగురు యచ్చ తచ్చ్యుతం**
**తే తు సత్త్వతమసీ వపుస్తవ॥ 19**

**ప్రతిపదార్థము:-**అమ్బ=అమ్మా, అర్థమండపే=విషయ, భూత, కృత్యపంచకమున, లఘుప్రసృతమ్=వేగముగా లేక తేలికగా ప్రసరించు, యత్=ఏ, జ్యోతిః=వెలుగు (ఆత్మ) (కలదో), తత్=అది (జ్యోతి),చ=మరియు, హృది=హృదయమున, విద్యయా

=(అపరోక్ష సాక్షాత్కార రూప) చరమజ్ఞానవృత్తితో, ఈక్షితమ్=సాక్షా త్కరించుకొనఁబడిన, యత్=ఏది కర్మమయజ్యోతి(కలదో), తత్=అది, ధూమలక్ష్మ=పొగచిహ్నము, చ్యుతమ్=జారిన, గురు=బరువైనది, తే=అవి రెండు, సత్త్వతమసీ=సత్త్వతమస్సులు, తవ=నీ యొక్క, వపుః=శరీరము.

**తాత్పర్యము:–** అమ్మా! హృదయాకాశమున సాక్షాత్కరించుకొనఁబడిన అపరోక్ష జ్ఞానము అనెడి నిప్పు, కర్మ అనెడి పొగ అను రెండు నీ యొక్క సత్త్వతమో రూప స్థూల శరీరము.

**వివరణము:–** వాగర్థములు పార్వతీ పరమేశ్వరులు. వాక్కు ప్రమాణము. శివుడు ప్రమేయము. ప్రమాణములలో ఒకటైన వాక్కు అమ్మవారి స్వరూపము. ప్రమాణము కూడ ఆత్మకు ప్రమేయముకావలసినదే. ప్రమాణ ప్రమేయములు రెండునూ ప్రమేయ భాగములోని జ్ఞానము శివ రూపమే. జ్ఞానమునకు ఆశ్రయము ప్రమాత. అదియు శివరూపమే. జ్ఞానము యథార్థజ్ఞానము, అయథార్థజ్ఞానము అని రెండు విధములు. అందు యథార్థ జ్ఞానమునకు ప్రమా అని పేరు. ప్రమకు గోచరమైన శివుడు ప్రమేయము. ప్రమకు ఆశ్రయమైన ప్రమాత శివుడే. ప్రమ స్త్రీలింగము కావున శివునకు అభిన్నమైన పార్వతి (కాలి) ని ప్రమా శబ్దము బోధించును.

ప్రమేయమున అర్థము శివరూపముగా సాధారణముగా భావింపఁబడు చుండును. అర్థమండపమనగా శివుడు కొలువున్న మండపము. అందు శివాకారులైన ప్రమథాది గణములకు సిద్ధ ముక్త నిత్యాదులైన జీవులు కొందఱుం దున్నారు. ఆ అర్థమండపమున ఒక జ్యోతి ఉన్నది. అది బహుశః శివుని వామ భాగమున ఉండవచ్చును. అర్థమండపము వంటి హృదయమును ప్రమాతృ రూపుడైన శివుని అర్థమండపమే. కాని ఇతనికి ప్రమాత జీవుడు సాధకుడు ఇత్యాది వ్యవహారములున్నవి. ఆతని హృదయము ఆకాశమువలె ఎన్నియైన ఇముడగల అవకాశమున్నందున హృదయము ఆకాశముతో పోల్చబడుచుండును. ఈ హృదయాకాశమున ప్రమారూప జ్యోతి వెలుగుచున్నది. ఇందు హృదయమున దానికి బాహ్యమైన కోటవంటి శరీరము లోపలను ఆ ప్రమ జ్యోతి యొక్క వెలుగు నిండియున్నది. అది బహుశః నిరింధన జ్యోతియై యుండవచ్చును. కాని ఆ ధర్మరూప ప్రమ జ్యోతికి ఎదురుగానున్న భాగము వెలుగుచుండును. అయినను



ప్రమాతకు శరీరాంతర్భాగములోని (కోటలోని) లోపలి గోడల వంటి అస్థి మాంసరక్తాదు లేవియు ప్రత్యక్ష (ప్రమేయ) ములగుటలేదు. కాని దీని కిటికీల వంటి పంచేంద్రియ ద్వారముల గుండా ఆ ప్రమాజ్యోతి వేగముగా తేలికగా అనాయాసముగా ప్రసరించుచున్నది. అది ప్రసరించని భాగము పొగవలె నల్లగా అప్రమేయముగా ఉన్నది.

ఈ అంధకారము ధూమలక్ష్మమై ఉన్నది. కిటికీల నుండి ప్రసృతములైన వెలుగులు పడిన గంధాది విషయముల ప్రతిబింబములు హృదయాకాశమున ప్రమాతకు గోచరములగుచున్నవి. ఆ వెలుగుల కిటు అటు చీకట్లు పొగలవలె వ్యాపించియే యున్నవి. సాధారణ చీకటికిగాని, వెలుగునకు గాని బరువుండదు. కాని హృదయములోని పొగ బరువుగానున్నది. వెలుగు ఇంద్రియ గవాక్షముల ద్వారా బయటకు, బయట గన్ధాది విషయ ప్రతిబింబములను ప్రమాతకు సమర్పించుటయే వృత్తి జ్ఞానమనఁబడును. వృత్తి జ్ఞానపరంపరలోని జనించిన ఈ వృత్తి జ్ఞానమే ఇట విద్యయా అని చెప్పఁబడినది. వృత్తిచే ఈక్షితమైనదంతయు సత్త్వమనఁబడును. అట్లు ఈక్షిత కానిదంతయు ధూమము అని చెప్పఁబడును. పొగ ఉన్నచోట నిప్పు ఉన్నట్లే ఈ పొగ కూడ నిప్పువలననే తెలియఁబడు చుండును. కాని ఆ పొగ (చీకటి) మరొక వస్తువును భాసింపఁజేయలేదు. అందుకే అది తమస్సని చెప్పఁబడును. లఘుప్రసారముగల జ్యోతియైన సత్త్వము పొగ అను దాని ఉనికిచే ఊహింపఁబడు తమస్సు ఈ రెండును అమ్మవారి శరీరములైయున్నవి. 2) ప్రమాతకు జీవత్వముతోపాటు శివత్వము కూడ అమ్మవారిచే కల్పించఁబడుచుండును.సత్త్వముచే శివత్వము, తమస్సుచే జీవత్వము, దర్శింపఁజేయబడుచుండును. జీవుని కృత్యములు ఆమె జ్యోతిలోనే నెరవేర్చఁ బడుచుండును. శివుని జగత్సృష్టిస్థితిలయ సంహార తిరోధానానుగ్రహ రూప కృత్యపంచకము కూడ ఆమె జ్యోతిచేత అర్థమండపమున ఈక్షితములగు చున్నవి. కావున దివ్యచకోరిక అర్థమండపే అను శబ్దమునకు పంచేంద్రియ వృత్తి విషయ ప్రమేయములు కృత్య పంచక విశిష్టమైనది అర్థమండపమని వివరించినది. ధర్మరూపమైన ఈ జ్యోతి నీవారశూకమువలె సన్నగా సూక్ష్మతేజస్తంతువు వలె వెలుగుచున్నది. దాని శిఖయందు వృత్తి జ్ఞాన నిరపేక్షముగా ప్రకాశించు పరమాత్మ వెలుగుచున్నాడు. ఆయనను బ్రహ్మ, శివుడు, హరి, అక్షరుడు, స్వరాత్ ఇత్యాది

నామములతో వ్యవహరింపఁబడు ఈ ఆత్మజ్యోతి వెనుక చెప్పఁబడిన సత్త్వరూప జ్యోతి కాదు. ఇది ద్వైరజోరూపమైన ఆత్మ జ్ఞానజ్యోతియని దివ్య చకోరిక వివరించినది. 3) **స ఈక్షత లోకాన్నుసృజా** అని ఉపనిషత్తు చెప్పిన సృష్ట్యాదులు కర్మమయ జ్యోతులని దివ్యచకోరిక వివరించినది. **ధూమో భూత్వా అభ్రం భవతి ధూమధ్వజం లోహితాక్షమ్**–ఇత్యాది శ్రుతిస్మృతులు అతీంద్రియము లైన గూఢాభిసన్ధి ద్యోతితములైన కృతికర్తృఫలభోక్తృ రూపములైన బహు భేదములతో కర్మమయ జ్యోతి విస్తృతమైనది. ఈ విస్తృతమైన కర్మమయ జ్యోతి యంతయు ఆత్మ జ్ఞానానంతరము ఆగి పోవునదే గనుక శ్లోకమున అది చ్యుతమని గురు అని చెప్పఁబడినది.

విద్యేక్షితమైన ఆత్మయొక్క జ్ఞానము జ్ఞానజ్యోతుల ప్రసృతము అని ధూమలక్ష్మచ్యుతము గురువు అయినది. కర్మమయ జ్యోతి అని చెప్పినను అది తమస్సే. విద్యావిద్యా రూపములైన జ్ఞానకర్మలు సత్త్వతమస్సులు అని వ్యవహరింప బడు ఈ రెండు అమ్మవారి స్థూల శరీరరూపములు. ఆత్మయందలి కర్తృత్వ భోక్తృత్వములు కర్మజ్ఞానరూపములు. రెండు కలసి అమ్మవారి ధూమ ధ్వజ అగ్ని శరీరము అని గమనింపవలెను. సత్త్వము జ్యోతిర్మయము, తమస్సు దాని ధూమము గురువు తచ్చుతమ్ అను పాఠమున ప్రమేయ రూపమైన అర్థ మండపము గురు వైనది. ప్రమారూపమైన జ్యోతి లఘువైనది. ఎందుకనగా తామసాహంకారము నుండియే శబ్దాది విషయములు పరిణమించినట్లు సాంఖ్యము చెప్పును గదా! సుఖము సత్త్వరూపమైనను దానికి సాత్త్విక రాజస తామస భేదములు భగవద్గీత యందు పేర్కొనబడినవి. ఆ దృష్టితో జ్ఞానము సత్త్వరూపమైనను దానికిని సాత్త్విక రాజసతామసాది భేదములు చెప్పవచ్చును.

ఈ శ్లోకమున చరమ జ్ఞానవృత్తియే విద్య అని దానిచేత జ్ఞానమయాత్మ సాక్షాత్కృతమగునని, అజ్ఞానము వైదికోపనిషన్మహా వాక్యజన్యమై చరమవృత్తి రూప విద్య వలన కులుగు ఆత్మ సాక్షాత్కారరూపము. వైదిక జ్ఞానమే ఈ శ్లోకమున సత్త్వమని వైదికమైన కర్మయే తమస్సని అవి రెండు అమ్మవారి శరీరభూతములని ఈ శ్లోకమున ప్రతిపాదింపఁబడుట ముఖ్యముగా గమనింపఁదగినది. లౌకిక జ్ఞానకర్మలలో సత్త్వతమస్సుల ఆధిక్యమున్నను అవి యిట వివక్షితములు కాలేదు. విద్య అనగా తంత్రగమ జన్య జ్ఞానము. అదియే లఘువు ప్రసరణశీలము. దాని



నుండి అగ్ని నుండి పుట్టు గురువైన ధూమము పుట్టును – అని చెప్పఁబడినది. శుద్ధసత్త్వము నుండి తమస్సు పుట్టుటలో అభ్యంతరము లేదు. కాని తమస్సునకు సాధారణ సత్త్వమే కాని శుద్ధసత్త్వమును ప్రతిద్వంద్విగా పేర్కొనఁబడినట్లు ఈ వ్యాఖ్య ననుసరించి భావింపవలసియుండును.

**అవతారిక:–** పై శ్లోకమున అమ్మవారి జ్యోతిర్ధూమరూప, వైదిక జ్ఞానకర్మరూప, సత్త్వతమోరూప శరీరము చెప్పఁబడినది. ఈ శ్లోకమున వైదిక సాంఖ్య యోగ జ్ఞాన కర్మ నివృత్తి ప్రవృత్తి మార్గద్వయము యొక్క ఫలైక్యము చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ త్వం (తు) హి రుద్రజకటాక్ష వర్తినీ**
**జాయమానమవలోక్య చణ్డికే।**
**సాంఖ్యయోగపథదేశికద్వయం**
**జాతసమ్మతి సమాధికం యథా॥ 20**

**ప్రతిపదార్థము:–** భవతి చండికే=పూజ్యురాలవైన ఓ చండికా!, త్వంతు(హి)= నీవు మాత్రము, సాంఖ్యయోగపథదేశిక ద్వయమ్=సాంఖ్యయోగమార్గములే గురువులుగా గల లేక సాంఖ్యయోగ మార్గముల గురుద్వయమును, యథా జాతసమ్మతి సమాధికమ్=మంచి జ్ఞానము ఆచరణము కలుగునట్లుగా, జాయమానమ్=పుట్టు చున్నదాని, అవలోక్య=చూచి, రుద్రజకటాక్షవర్తినీ=రుద్రు నుండి పుట్టు కటాక్షమున ఉండుదానవు.

**తాత్పర్యము:–** వైదిక సాంఖ్యయోగ గురువులు గల నివృత్తి ప్రవృత్తి రూపములైన జ్ఞానకర్మ మార్గములు ఇచ్చుచేత పుట్టుచుండగా నీవు రుద్రుని కటాక్షమున వర్తించెదవు.

**వివరణము:–** 1) చండిక అనగా కోపించునది. ఆమె ఎవరిని కోపించును? స్వస్వరూపమైన శివుని విడచి ఇతరమును కోరువారిపై కోపించునది. కావున చండికయను సంబోధనము సముచితముగానేయున్నది. 2) సాంఖ్యము – సంఖ్యయనగా సమ్యగ్జ్ఞానము. సమ్యగ్జ్ఞానమును బోధించు దర్శనము సాంఖ్యము. లేక ప్రకృతి, ప్రకృతి పరిణామముల మొత్తము సంఖ్యను (ఇరువదినాలుగు అని) నిశ్చయించి చెప్పు దర్శనము సాంఖ్యము. సమ్యగ్జ్ఞానమనగా పై ప్రకృతి ప్రకృతి పరిణామములను పట్టించుకొనక దానికి వేరుగా పురుష తత్త్వజ్ఞానము అను

సమ్యగ్జ్ఞానము అనగా ప్రకృతి పురుష వివేకము. దానిని ప్రధాన ప్రమేయముగా ముక్తి హేతువుగా నిరూపించు దర్శనము సాంఖ్యము.

ఒక్క మాటలో ఆత్మ యొక్క సమ్యగ్జ్ఞానము అనగా యథార్థ జ్ఞానము సాంఖ్యము. కర్మలనుండి నివృత్తిని బోధించి, సంఖ్యగా చర్చ లేక విచారణను ప్రతిపాదించు దర్శనము సాంఖ్యము.

యోగము – జీవేశ్వరుల భిన్నరూపులను, అనాదియైన అజ్ఞానమును విస్తరింపఁజేయుటను నిష్కామ కర్మోపాసనలను ప్రతిపాదించునది యోగమని భగవద్గీత చెప్పినది. విషయముల నుండి మనస్సును విస్తరింపఁజేసి స్వరూపము నందు ఏకాగ్రముచేసి చివఱకు దానిని ఆత్మయందు విలీనముచేయుటకు కావలసిన అష్టాంగములను బోధించు దర్శనము యోగము. అని లోక వ్యవహారము ననుసరించి చెప్పనగును. యమ నియమాదుల నభ్యసించి ఆసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యానములతో మనస్సును స్వరూపమున (సమ్) చక్కగా, (ఆధి) ఉండునట్లు చేయు దర్శనము యోగము. ఆత్మయందు మనస్సు నిలిపిన సందేహములుండవు. ప్రశ్నలుండవు. అదియే సమాధి. సమాధి పర్యంతములైన అష్టాంగములతో స్వస్వరూప లాభము కలిగి స్వరూపానందానుభవము సిద్ధించు మార్గమును బోధించు దర్శనము యోగము. ఇందు ఈశ్వరుడు అను ఇరువది యాఱవ పదార్థమంగీకరింపఁబడును.

సాంఖ్యము చెప్పిన ఇరువది నాలుగు ప్రకృతి తత్ (ప్రకృతి) పరిణామము లను (24) జీవాత్మను (25) ఈశ్వరునికి వేరైన (26) ని అంగీకరించుటచే ఈ దర్శనము సేశ్వర సాంఖ్యమనియు వ్యవహరించఁబడును. భగవద్గీత ననుసరించి నిష్కామముగా శరీరముతో యజ్ఞ యాగాది కర్మలను మనస్సుతో ధ్యాన (ఉపాసనా)ది కర్మలలో ప్రవర్తింపఁజేయు ప్రవృత్తి మార్గము యోగము. వానినుండి నివర్తింపఁజేయు విచారణ అనగా స్థూల సూక్ష్మ శరీర నిర్వర్త్యమును విడువుమని బోధించగా వినుట అనగా సన్యసించి ఆత్మజ్ఞాననిష్ఠ పొందవలెనని విచారించుటచేత కర్మ నివర్తించుటయే సాంఖ్యము. సత్కర్మలందు ప్రవృత్తి సకల దుష్కర్మలనుండి నివృత్తి అను ఈ రెండు అనఁబడు ప్రవృత్తి నివృత్తులు కర్మమార్గాంతరములే. జ్ఞానమార్గము సకర్మ నివృత్తి ఉండును. ఇదియే సాంఖ్యము.



ప్రవృత్తిని బోధించు గురువులు ముఖ్యముగా ధ్యాన(ఉపాసన)మును బోధించు గురువులు యోగమార్గ గురువులు. ఉపనిషద్వాక్యార్థ విచారణము ద్వారా జీవ పరమాత్మైక్య జ్ఞానము నుపదేశించు గురువులు సాంఖ్య మార్గ గురువులు.

సాంఖ్య యోగ మార్గములే గురువులు. లేక సాంఖ్యయోగ మార్గముల నుపదేశించు గురువులు త్రివిధ గుర్వొఘములలో చేరియుందురు. వీరివలన వైదిక యోగ సాంఖ్యములు బోధింపఁబడును. వైదికకర్మ జ్ఞానము లేక వైదిక ప్రవృత్తి నివృత్తులు జీవుల పుణ్యపాపముల నాశ్రయించి ఈశ్వరుని అనుగ్రహ నిగ్రహముల ననుసరించి పుట్టుచుండును. అట్లు పుట్టుచున్న మార్గము వలన చరించువారికి మరల వారివారి ప్రవృత్తి నివృత్తులు వాని లౌకికాలౌకిక ఫలములు పుట్టుచుండును.

రుద్రునుండి పుట్టు అనగా బయలుదేరు కటాక్షములందే అమ్మవారుండును. లేక ఆ కటాక్షములను కర్తుమకర్తుం అన్యథాకర్తుమ్ (చేయుటకు, మానుటకు, మరొక విధముగా చేయుటకు) సామర్థ్యము గల శక్తి అమ్మవారు కటాక్షముల ప్రవర్తింపఁజేయునవి కావున రుద్రజ కటాక్షవర్తినియైనది. ఆ రెండు మార్గముల ఫలించుచుండగా ఆ మార్గముల నవలంబించువాని గుర్వొఘములలో సమీప్సితము జాయమానమగుచుండగా చూచి రుద్రుని కటాక్షములలో నేత్ర నాయకురాలై వర్తించునది. కావున ఆమె రుద్రజకటాక్షవర్తిని అని చెప్పఁబడినవి. ఈశ్వరస్థితి నుండి జీవస్థితి వఱకు చేరుట ఒక స్రోతస్సు జీవస్థితి నుండి ఈశ్వరస్థితికి చేరుకొను స్రోతస్సు మరొకటి అధీతి బోధలు ఒక స్రోతస్సునకు, ఆచరణ ప్రచారములు మరొక స్రోతస్సునకు చెందినవి. అధీతి బోధలు నివృత్తికి, ఆచరణ ప్రచారములు ప్రవృత్తికి చెందినవి. పరస్పరము విరోధులుగా కనిపించు ఈ రెండు మార్గములు ఏకవ్యక్తి యందు భిన్నకాలములలో కనిపించును.

అయిదు ఋతువులే ముఖములుగాకల రుద్రుడు వత్సరస్వరూపుడు, పక్షాంతరమున ఆఱు ఋతువులు ఆరుముఖములు కలవాడు (కుమారస్వామి) షణ్ముఖుడు. ఏకకాలిక ద్వాదశ కటాక్షుడు పరశంభువు, షణ్ముఖుడు అని పరశంభు మహిమ్నస్తోత్రము చెప్పినది. రుద్రజకటాక్షములనగా ప్రవృత్తి నివృత్తుల కలిగించు ఋతువులు. అట్టి కాల స్వరూప ఋతువులలో వర్తించు కాలి రుద్రజ కటాక్షవర్తిని. ఉన్మేషనిమేషముల మధ్య అర్ధనిమీలితదృష్టి కటాక్షము. శాంతివైపున ప్రసరించునది కటాక్షము. సంవత్సరము ద్వాదశ మాసాత్మకము. ఒక్కొక్క ఋతువున రెండేసి

మాసములు. ఉన్మేష నిమేషములు వాని మధ్యలోని పూర్ణిమామావాస్యలు ఆయన కటాక్షములు. అమ్మవారి దాగుడుమూతలు. వైదికులు అమావాస్యనాడు దర్శేష్టిని, పూర్ణిమయందు పూర్ణమాసేష్టిని ఆచరించెదరు. రుద్రజ కటాక్షముల నుండి దేశిక ద్వయమును ప్రవర్తింపఁజేయునది కావున రుద్రజ కటాక్షవర్తిని అమ్మవారు ప్రకృతి రూపిణియైన అమ్మవారు. రుద్రుని ఉన్మేష రూపమైన సృష్టిని రుద్రుని నిమేష రూపమైన సంసారమును ప్రవర్తింపఁజేయునది కావున అమ్మవారు రుద్రజ కటాక్షవర్తిని.

త్వంతురుద్రజకటాక్షవర్తినీ జాతసమ్మతి సమీప్సితం యథా అను పాఠాంతరములలో అమ్మవారు వెనుక జెప్పినట్లు పరమైశ్వర్యరూపిణియైనను రుద్రుని కటాక్షముల ననుసరించి ప్రవర్తించును. సాధ్వీత్వ ధర్మమువ్యక్తమగును. పారమైశ్వర్య శక్తిచేత ఏదియైనను చేయగలదానవైనను రుద్రకటాక్షపాత్రుల నుంచి ఈప్సితములు మాత్రము ఫలించునట్లు ప్రవర్తించెదవు అనియు వ్యంగ్యము.

**అవతారిక:–** పై శ్లోకమున సాంఖ్యయోగ మార్గముల ఫలైక్యము చెప్పఁబడినది. ఈ శ్లోకమున ఆ సాంఖ్య యోగములే (జ్ఞానకర్మలే) పూర్ణిమామావాస్యా రూపమున అనులోమప్రతిలోమ సృష్టి సంహార హేతువు(జ్ఞాపకము)గా చెప్పఁబడుచున్నవి.

**శ్లో॥ స్వ (స) ప్రకాశకృతమజ్జనం జగ**
**త్కుర్వతీ భవతి పూర్ణిమా శివే।**
**పూర్ణమేవ తవ రూపమన్యథా**
**కుర్వతీ కిల కుహూః ప్రతీయసే॥ 21**

**ప్రతిపదార్థము:–** భవతి=సంసారమువలె లేక శివునివలె ఆచరించుదానవు, సంసార రూపివి, పూజనీయవునైన, శివే=ఓ మంగళ స్వరూపురాలా!, జగత్= జగమును, సప్రకాశకృత మజ్జనమ్=నీ వెలుగున చేయఁబడిన మజ్జనముతో కూడిన దానినిగా, కుర్వతీ=చేయుచున్నదానివై, పూర్ణిమా=పూర్ణిమా, పూర్ణమ్ ఏవ= పూర్ణమే (అయిన), తవ=నీ యొక్క, రూపమ్=రూపమును, అన్యథా=మరొక విధముగా, (ప్రకాశరాహిత్యమున మునుగు దానినిగా), కుర్వతీ=చేయుచున్న, కుహూః =అమావాస్యగా, ప్రతీయసే కిల=తోచుచున్నావు కదా.

**తాత్పర్యము:–** ప్రపంచమంతటిని వెలుగుని నింపిన పూర్ణిమగాను, చీకటి యందు నింపు అమావాస్యగాను నీవు తోచుచున్నావు.



**వివరణము:–** క్రమప్రకాశిక ననుసరించి 20, 21 శ్లోకములు రెండు కలిపి ఒకే వాక్యము. దాని భావమిట్లుండును. 'ఓ చండికా! పూజ్యురాలా! శివా! రుద్రుని కటాక్షమున నుండు దానివై పుట్టుచున్న సాంఖ్యయోగ గురు ద్వయమును చూచి సమ్మతి సమాధి కలుగునట్లుగా చూచి జగమును వెలుగును నింపు పూర్ణిమ వగుదువు. చీకటితో నింపు అమావాస్యగా కనఁబడుచున్నావు. భవతి అను పాఠమునకు బదులుగా భవసి అనుపాఠాంతరమిందు స్వీకరింపఁబడినది. దివ్యచకోరిక ననుసరించి అమ్మవారి శరీరము సత్త్వతమః సమ్మేళనాత్మక మైన రజస్సుగుటచేత జ్ఞానక్రియాత్మకమైన సంసారమునకు హేతువుగుట వలన భవతి అను అమ్మవారి సంబుద్ధి భూధాత్వర్థమైన సంసారసత్తారూపిణీ అను అర్థము నిచ్చును. శివే అను సంబుద్ధి శివ జీవులందలి మంగలము స్వరూపముగా గలదానా! అను అర్థము నిచ్చును. 2) సప్రకాశకృత మజ్జనమ్ అను శబ్దము ప్రకాశమున తలంటుకొన్నది యైన మునిగినదియైన అను అర్థమునిచ్చును. స్వప్రకాశ కృతమజ్జనమ్ అను పాఠమున తన ప్రకాశమున లోకమును ముంచు పూర్ణిమా తిథిరూపమని అర్థము నిచ్చును. సాంఖ్యయోగ మార్గ ద్వయాత్మకమైన వాగర్థమయ విద్యా ప్రపంచమున, లేక కృత్యపంచకాత్మకమైన జగమున వర్ణోత్పత్తి స్థానములైన కంఠాదుల ప్రేరేపించి వాగర్థములకు సంబంధించిన జ్ఞానకర్మలకు సంబంధించిన కృత్యపంచకమున వెలుగుల నింపు పూర్ణిమ కాలక్రమమున జగమున ననేక మార్పుల కలుగజేయుచున్నను అమ్మవారి పూర్ణరూపమే అనుట పూర్ణిమా శబ్దము బోధించును. అవిద్యా సంబద్ధమైన కామమును ఫలింపఁజేయుట ద్వారా తన పూర్ణతను తిరోధమింపఁజేయునట్టి అమావాస్యా రూపము కూడ అమ్మవారిదే. కావున అమ్మా నీవు అమావాస్యగా దోచుచున్నావు. అని 'కుహూః కిల ప్రతీయసే' అని శ్లోకభాగమున చెప్పఁబడినది. మాహేశ్వరము, నారాయణీయు, స్వాయమ్భువము అను భేదములు గల వర్ణముల యొక్క తురీయ విమర్శమున హాదికాది విద్యల అచ్చులు, హల్లులు మొదలైన వర్ణాల అనులోమ, ప్రతిలోమ ప్రత్యాహారముల భేదమున విద్యావిద్యల సకామాహంకార నిష్కామాహంకార అనులోమ ప్రత్యాహార ద్వయమున హకార కకారముల గోపనమున అమానామ కల స్ఫురణము వలె క్రమ ప్రతినివర్తనము చేత సకారహకారాది శాక్త శాంభవ విసర్గ పూర్ణానుస్వరము వఱకు, విలోమ ప్రత్యాహారమున క్రమమును విడువగా నేర్పడు సోహమాత్మకము, హంసోహమాత్మకమునైన హకార మాత్ర గోపనమున

సోమ అని హల్‌వర్ణముల రెండింటిని విడుచుటచే ఓమ్ అను పూర్ణ సోమకల ప్రతీతమగును. పూర్ణ రూపము యొక్క అన్యథా ప్రతీతి పదేను (తిథిరూప) అవయవాల (కలలు) రూపమున ప్రకాశించును. చిన్మయ సూర్యమూర్తి యందు కః (స్రష్ట) ప్రజాపతి సృష్ట్యర్థము అపానపోమమండలమున హూయతే (హోమింపఁ బడును) లేక ఆహూయతే (పిలువబడును) అను వ్యుత్పత్తిచేత హోమకీర్త్రి కుహూ అని చెప్పఁబడును. సృష్టిసంహారాది కాల సంకర్షిణే పర్యంతమైన మహాకాల శక్తియే కుహూ అనుట రహస్యము. వైతానిక వైదికోపాసన యందు దర్శక వేది మొదలు కొని సౌమికవేది వరకు గల వాస్తు కల్పములందు నిమేషము, కల, కాష్ఠమొదలగు ముప్పది ముహూర్తముల అహోరాత్రాది సావన మాసాది వత్సరాంత కాలము లందును వ్యాప్తమైయుండును. **త్రిగ్ంశత్పదాని పశ్చాత్తిరశ్చీ భవతి షట్త్రిగ్ంశత్ప్రాచీ చతుర్విగ్ంశతిః పురస్తాత్తిరశ్చీ దశదశ సమ్పద్యన్తే దశాక్షరా విరాడన్నం విరాడ్ మాజైవాన్నాద్యమవరున్ధేః.**

**అవతారిక:–** పై శ్లోకమున అమ్మవారు పూర్ణిమగా అమావాస్యగా భాసించునని చెప్పఁబడినది. బ్రహ్మయొక్క పగలు జ్ఞానరూపిణిగా, రాత్రి అజ్ఞానరూపిణిగా అమ్మవారే వెలయునని చెప్పఁబడినది. ఈ శ్లోకమున సృష్టి ప్రలయముల (పూర్ణతాకృశతల) సంధికాలమందలి కాలమును కాలిమింగుట చెప్పఁబడు చున్నది.

**శ్లో॥ పూర్ణతా కృశతయో ర్యదన్తరం**
**తత్ర కాలి విజహ త్క్రమే స్థితా।**
**దర్శిత క్రమ విభాగ సంభ్రమం**
**కాల మధ్యతన మత్తుమీహసే॥ 22**

**ప్రతిపదార్థము:–**కాలి=ఓ కాలీ!, పూర్ణతాకృశతయోః=పూర్ణత్వకృశత్వములయొక్క, అంతరమ్=నడుమ, యత్=ఏది(సంధి) కలదో, విజహత్క్రమే=విడుచుచున్న క్రమముగల, తత్ర=అందు, స్థితా=ఉన్న దానవై, దర్శనక్రమ విభాగ సంభ్రమమ్ =కనఁబడుక్రమము యొక్క విభాగమునందు త్వరగల, అద్యతనమ్=అప్పటి, కాలమ్=కాలమును, అత్తుమ్=మింగుటకు, ఈహసే=కోరెదవు.

**తాత్పర్యము:–** పూర్ణతయనగా జ్ఞానపూర్ణత, కృశతయనగా జ్ఞానరాహిత్యము, ఈ రెంటి యొక్క అంతరము అనగా సంధికాలము అనగా అప్పుడు కాలము



క్రమమును విడచుచుండును. అట్టి సంధియందు క్రమవిభాగమును చూపించు **త్వర** గల కాలమును మ్రింగ గోరెదవు.

**వివరణము:–** 1) క్రమప్రకాశిక ననుసరించి పగలు రాత్రిక్రమము కనఁబడును. సంధికాలమున క్రమము విడవఁబడుచుండును. రాత్రిందివముల సంధిలో క్రమము దర్శించులోపలనే సంధికాలము అమ్మవారిచే మ్రింగఁబడును. 2) వాస్తవమున సంధియనునది రాత్రిందివముల మధ్యన మాత్రమే కాక క్రమము కానవచ్చు నిమేషముల మధ్యనను సంధియుండును. ఆ సంధిని గుర్తించుటయే మిక్కిలి కష్టము. ఇక ఆ సంధిలోని క్రమమును గుర్తించుట ఎంతకష్టమో చెప్పనక్కఱలేదు. ఇవి రెండు క్షణములని గుర్తించగలిగినప్పుడు వాని మధ్య సంధి ఉండి తీరవలెను. అదిలేనిచో అవి రెండని చెప్పుటకే సాధ్యము కాదు. బ్రహ్మదేవుని పగలు చతుర్యుగ సహస్రావధికము. రాత్రి కూడ అంతియే. ఆయన ప్రాతస్సంధ్య సృష్ట్యారంభకాలము. అప్పటి సృష్టి విషయమున యుగపత్సృష్టి వాదమొకటి యున్నది. యుగపత్సృష్టి అనగా క్రమము లేని సృష్టి. ఆకాశాది క్రమ సృష్టి వాదము మరొకటి. ఇందు క్రమము కనఁబడును. ఇది క్రమాక్రమముల యొక్క ఒక ప్రకారము. స్థితికాలము పగలు. ఇది తేజోమయము. ఇందు క్రమము కనఁ బడును. ప్రలయకాలము రాత్రి. ఇందు బ్రహ్మవ్యాపారమేమియు ఉండదు. ఇది తమోమయము. ఇందు కర్మయే యుండదు. కావున క్రమము కనఁబడదని వేరుగా చెప్పనక్కఱ లేదు. ఇది క్రమాక్రమముల యొక్క మరొక ప్రకారము. 3) సృష్టి స్థితి ప్రలయములు నిరంతరము జరుగుచుండును. ఆత్యంతిక ప్రలయమున మాత్రమే వీని క్రమముండదు. ఈ ఆత్యంతిక ప్రలయము ముక్తునికి సంబంధించినది. ముక్తాత్మునిలో కర్మలు వాని క్రమము అనునవి ఉండవు. ఇది మరియొక ప్రకారము. 4) సృష్టి స్థితులు అజ్ఞాన కార్యములు. వానిలో క్రమముండును. ఈ క్రమము అనులోమము.సంహారాభిముఖ క్రమము. ఆత్మయందు సర్వజగముల యందు ప్రతిలోమ క్రమమున భూతములు లయించును. ఈ ప్రపంచ ప్రలయమే వాస్తవ జ్ఞాన పూర్ణిమావస్థ. సృష్ట్యభిముఖ క్రమము. కర్మబహులత గలది. తత్క్రమమును బహుముఖము. కర్మబాహుల్యము పూర్ణత్వము నందినపుడు ప్రకాశకృశత ప్రతిలోమక్రమమున సంభవించును. ఇది అమావాస్యా స్థితి. ఈ రెండింటి మధ్యన ప్రకాశాప్రకాశముల దాగుడుమూతల ప్రతి పదాది తిథులు

అనులోమవిలోమక్రమమున సంభవించి ప్రకాశ పూర్ణావస్థను అనులోమక్రమమున చేరుకొనును. విలోమ క్రమమున అమావాస్యా (కుహూ) స్థితిని చేరుకొనును. ఈ అమావాస్యా స్థితి చంద్రుని (జీవుని) సూర్యుని (పరమాత్మ) లోనికి చేరుకొనుట సంభవించుటచే ఇదే జ్ఞాన పూర్ణత అని,ప్రకాశ పూర్ణావస్థగా జీవుని అజ్ఞానావస్థయే పూర్ణిమ అనుట తాంత్రిక రహస్యములలో నొకటి. ఈ అంశమే మరొక విధముగా ప్రతిపాదించవచ్చును. సంసారరూపిణి అమ్మవారి పూర్ణత శివత యొక్క అసంపూర్ణత లేదా శివుని పూర్ణత అమ్మవారి యొక్క అపూర్ణత. శివుని పూర్ణత పరమార్థ జ్ఞానాకాశ సంపూర్ణత. అజ్ఞానపూర్ణత అమ్మవారి పూర్ణత. వాస్తవమునకు ఈ రెండు స్థితులు అమ్మవారే క్రమమున కలిగించుట చేత అమ్మవారికే చెందినవి. శివుడే కేవలము సాక్షి మాత్రమే. అన్ని స్థితులలో ఆయనకు సాక్షిత తప్ప పూర్ణతా పూర్ణతలు లేవనుట పరమార్థము. 5) సంధి రాత్రిందివముల మధ్య అగుచో ప్రాతః సంధి అని, దివారాత్రముల మధ్య అగుచో సాయంసంధ్య అని చెప్పఁ బడును. కాని వీనికి చెప్పఁబడిన మూడు గడియల అవధి వ్యావహారిక సంధికి మాత్రమే సరిపోవును. పరమార్థమున సంధి పగలు కాదు. రాత్రి కాదు. అని చెప్పవలెను. అందు కాలమనునది ఉన్నదనుకొన్నచో దానిని అమ్మవారు మ్రింగ గోరును. కాలమేమో క్రమదర్శనమునకై సంభ్రమించుచుండును. అందలి క్రమమేమో కాలమునే నడపు చుండును.అట్టి తాని ఆ కాలము యొక్క క్రమదర్శన సంభ్రమేమి ఉపయోగము? ఉపయోగమున్నను లేకున్నను కాలము యొక్క స్వభావమది. అందుచేత శ్లోకమున క్రమదర్శన సంభ్రమమైన కాలమును కాళి మ్రింగివేయుట చెప్పబడినది. వాస్తవమున కాల ఖండములందు వ్యాపించిన అఖండకాలము శివరూపమే. కావున ఆ కాళి కోరిక ఎన్నటికిని తీరుట సంభవించదు. అని వర్తమానకాలకమైన ఈహసే అని వ్యంజించును. 6) సాంఖ్య మార్గము జ్ఞానమను గమ్యము కలది. యోగ మార్గము కర్మగమ్యముగా గలది. జ్ఞానము (శివోహం జ్ఞానము అదియే జ్ఞానపూర్ణస్థితి, శివపూర్ణత) యోగము కర్మగమ్యముగా కలదైనను ఆకర్మ నిష్కామ కర్మ. అది చిత్తశుద్ధి ద్వారమున శివోహం జ్ఞానమునకు సహకరించును. కావున వానిలో స్థూలముగా కనిపించు విరోధము ఆభాసము మాత్రమే. అందుకే భగవద్గీత **ఏకం సాంఖ్యం చ యోగం చ యః పశ్యతి న పశ్యతి** అని చెప్పినది.

సకామ కర్మ మాత్రము చతుర్వింశతి కాజ్ఞాన పూర్ణతకే దారీతీయుచు.



నరకము వంటి స్వర్గమునకు చతుర్వింశతి దారి తీయును. అందుకే దర్శనములలో సుఖము (విషయసుఖము) దుఃఖములలోనే చేర్చఁబడినది. దివ్యచకోరిక ననుసరించి పూర్ణిమ; అమావాస్య, చంద్రమాసతిథులు, బ్రాహ్మము, దివ్యము, పిత్ర్యము, బార్హస్పత్యము, సౌరము, సావనము, చాంద్రము, ఆరము, అను తొమ్మిది మానములలో చాంద్రమానమొకటి.

కాల పురుష త్రిపుటీశక్తి ద్వయాత్మకమైన అధ్వషట్కమును త్రిగుణము లతో గుణిత మొనరించగా వచ్చిన పదునెనిమిది నిమేషములు కాష్ఠ అనఁబడును. అట్టి కాష్ఠలు ముప్పది కలిపి కల అనబడును. నిమేషముల యొక్క అవధి బ్రహ్మాది పిపీలికాంత జీవులలో భిన్న భిన్నములుగా నున్నను మనుష్య నిమేష మానము మానములలో మిక్కిలి చిన్నది. నిమేషమునకన్న చిన్న మానములును ఉండవచ్చును కాని మనుష్య నిమేష మానమే, చిన్న మానమే ఇట స్వీకరింపఁబడినది. పైన చెప్పఁబడిన మానము లన్నిటికన్న పెద్దదైన మానము గూడ ఉండవచ్చును. ఈ మానము లన్నియు ఆ మహా మానము కన్న చిన్నవి. మహామాన (కాలరూప) శ్రీ చక్రము నందలి శైవచక్ర చతుష్కోణాత్మతో సామరస్యము నొంది కర్మోపాసనోపయుక్త మగు విద్యావిద్యక్రమాక్రమములు అని చెప్పఁబడు సృష్టి సంహారముల క్రమభేదము ఈ శ్లోకమున సూచింపఁబడినది. విద్యావిద్యావస్థల యౌవనవార్ధక ప్రాదుర్భావ రూపము మనుష్యుల యౌవన వార్ధకావస్థాదుల సంధివంటిదే కాలదశాసంధి. శుక్ల కృష్ణాష్టమీ ప్రదోష కాల సంధి విభాగమును కాలక్రమము నందలిదే.

శివాత్మక ప్రకాశ సృష్టిక్రమము శక్త్యాత్మక విమర్శ సంహారక్రమమును విజహత్క్రమ మనఁబడును. విద్యావస్థా యౌవనముయొక్క ప్రాదుర్భావకాలము కాని వినాశకాలము గాని విజహత్క్రమ మనఁబడును. లేక అవిద్యావస్థ వార్ధకము యొక్క ప్రాదుర్భావకాలము గాని వినాశకాలము కాని విజహత్క్రమ మనఁబడును.

కాలక్రమము నందును చంద్రికామయ సృష్టిప్రకాశక్రమము కాని తమోమయసంహారక్రమమును అనగా పూర్ణిమాతిథి ప్రాదుర్భావ కాలము అమావాస్యా తిథి ప్రాదుర్భావ కాలము అను ఈ రెండు సంధులు విజహత్క్రమము లనఁబడును. విద్యాయౌవనముయొక్క అవిద్యావార్ధకముయొక్క ప్రాదుర్భావ కాలము శుక్లాష్టమి సంధికాలభాగము ఆ విద్యాయౌవన వినాశము వంటిది. కృష్ణాష్టమీ సంధికాల భాగము ఆ ఉభయ పక్షాంత పూర్ణిమామావాస్యాతిథులందును అధికార

యోగ్యతగల విషయాధికరణములందు ఉన్నదై అని విజహత్ క్రమే స్థితా అను పదముల కర్థము చెప్పబడినది. విద్యాసృష్టి సంహార కాలమునందు లేక అవిద్యా సంహార సృష్టి కాలము నందు క్రమ విభాగము దర్శించుటలో త్వరగలది అని దర్శితక్రమ విభాగ సంభ్రమమ్ అను పదమునకు అర్థము చెప్పఁబడినది. ప్రకాశింపఁజేయఁబడినది అని దర్శిత శబ్దార్థము.క్రమవిభాగమనగా దివ్యాది మానములలో రాత్రిందివముల సంధి అని అర్థము లేదా దర్శాది (ప్రతిపదా) తిథులు పుట్టినవి అని మరొక అర్థము.

అద్య అనగా భక్షింపఁబడునది. తనమనగా విస్తరింపఁబడునది. అసంపూర్ణా విద్యా విద్యా సృష్టి సంహారాద్యాత్మకమైన కాలమును అనగా వ్యావహారికమైన ఖండకాలమును తినుటకు కోరుదువు అని నాలుగవ పాదము యొక్క అర్థము.

శుక్లాష్టమి మొదలుకొని కృష్ణపక్షాష్టమి వఱకుగల మరియు కృష్ణాష్టమి మొదలు శుక్లాష్టమి వఱకుగల పితృమాసము ననుసరించిన పితృమానమునకు చెందిన రాత్రిందివముల మధ్య సంధిగాని, దేవతామానము ననుసరించిన ఉత్తరాయణాంత, దక్షిణాయనాంత రాత్రిం దివ సంధికాలములుగాని అంతర శబ్దార్థములు. ఈ రాత్రిందివ సంధ్యాది కాలములు అంతర శబ్దార్థములు. ఈ రాత్రిందివ సంధ్యాది కాలమును విభజించుటలో సంభ్రమముగల పిత్ర్యదివ్యాది నవవిధమానములు గల కాలమును మ్రింగగోరుచున్నదనుట మొత్తము శ్లోకము యొక్క సంగ్రహభావము.

ఈశతే అను పాఠాంతరమున అంతరపదమే వాక్యమున కర్త అని గ్రహింపవలెను. కృష్ణాష్టమి పితృమానము యొక్క ఆరమ్భము అనగా శుక్లాష్టమి అంతము తదుభయ సంధులును ఈ ఈ పక్షమున అంతర శబ్దార్థములు. మనుష్యమానముతో పోల్చినపుడు మనష్యుల ముప్పదిరెండు చంద్రమాసములు పితరుల సంవత్సరము. మనుష్య మాసము పితరులకు రాత్రిందిన కాలము. మనుష్యుల శతవత్సర కాలము పితరులకు మూడు సంవత్సరములు. అమావాస్య పితరులకు మధ్యాహ్న కాలము కావున అమావాస్యా శ్రాద్ధ విధాన మేర్పడినది. కృష్ణాష్టమి పితరుల సూర్యోదయ కాలము కావున అది పంచ పర్వములలో నొకటిగా గణింపఁబడినది.







# ద్వితీయ విమర్శః

**అవతారికః–** సూత్రప్రాయమైన ప్రథమ విమర్శ యందు కాలీ యొక్క శుద్ధ సత్త్వ స్వరూపము శుద్ధ సత్త్వజన్యమైన సత్త్వరజస్తమోమాప త్రిగుణాత్మికత ఖండకా రూప తిథ్యాత్మకత ఆమెయొక్క సాంఖ్య యోగ మార్గద్వయ గమ్యత ఇత్యాద్యంశములు చెప్పఁబడినవి. అవైదిక దర్శన నిరాస పూర్వకముగ వైదిక దర్శన ప్రామాణ్య ప్రతిపాదనము చేయదలచి ఇందు ముందుగా ప్రథమ శ్లోకమున అమ్మవారి యొక్క స్వస్వరూపము వికల్పబుద్ధిచేత కలంకితము కాజాలదను అంశము ఆ స్వస్వరూప మైన ఆత్మ సహజముక్తతా ద్వారమున అజ్ఞానముక్తతయు చెప్పఁబడుచున్నవి.

**శ్లో॥ మాతృమేయమితిసాధనాత్మికా**
**త్వత్కృతోన్మిషతి యా వికల్పధీః**
**త్వత్స్వరూపమకలఙ్కితం తయా**
**కస్య దేవి! విదుషో న ముక్తతా॥ 23**

**ప్రతిపదార్థము:–** దేవి= ఓ దేవీ!, మాతృమేయమితి సాధనాత్మికా=మాతృమేయము మితికాని అను త్రిపుటిని సాధించునట్టి, త్వత్కృతా=నీచేత లేక నీయందు చేయఁ బడిన, యా=ఏ,వికల్పధీః=వికల్పబుద్ధి, ఉన్మిషతి=వికసించుచున్నదో, తయా= దానిచేత, అకలంకితమ్=కలంకితము కాని, త్వత్స్వరూపమ్=నీస్వరూపమును, విదుషః=ఎరిగిన, కస్య=ఎవనికిని, ముక్తతా=ముక్తత్వము, న(భవతి)=కలుగదు.

**తాత్పర్యముః–** మాతృమేయమితి అను త్రిపుటి అమ్మ వారి యందు అమ్మవారి చేత కల్పింపఁబడినను అమ్మవారి స్వరూపము ఆ వికల్పబుద్ధి చేత కలంకితము కాజాలదు.అట్టి స్వస్వరూపమును తెలిసికొనిన ఏ సిద్ధునికి ముక్తి కలుగకుండును?

**వివరణము:–** మాత మేయము మితి అను మూడు కలిపి త్రిపుటి యగును. ఈ త్రిపుటి ఆత్మయందు వికల్పబుద్ధి రూపమున కల్పింపఁబడినది. అంతఃకరణము అనునది మాతృ సాధనము.అంతఃకరణములేనిదే ఆత్మ మాత కాజాలదు. ఆత్మ యందు మాతృత అను వికల్పబుద్ధి కలుగుటకు అంతరంగమే కారణము (సాధనము). మేయత ఆత్మయందు కల్పింపఁబడిన శబ్దాది విషయములకు జ్ఞానకర్మేంద్రియముల వలన కలుగును. కావున జ్ఞానకర్మేంద్రియ (గోళ)ములు మేయత సాధనములు అగును. అట్లే మితి అనగా విషయజ్ఞానము. ఈ జ్ఞానమున

విషయప్రతి ఫలమునకు సాధనములు ఇంద్రియములు లేనివాని వృత్తులు. ఇంద్రియ గోళములు స్థూలములు కంటికి కనఁబడునవి. వానిలోని ఇంద్రియములు సూక్ష్మములు. అవి కంటికి కనఁబడవు. అయినను విషయజ్ఞానములు కలుగుటకు అను హేతువునకు అవి అనుమేయములగును.

ఆత్మసత్యము. తదితరమంతయు అసత్యము. కావున ఆత్మేతరబుద్ధి యంతయు వికల్పబుద్ధి అనఁబడును. వికల్పబుద్ధులవలన సత్యముననే మాత్రము మార్పురాదు. మాతృమితి మేయములకు స్వరూపమైన వికల్పబుద్ధి అనిగాని, విలక్షణకల్పబుద్ధి అనిగాని అర్థాంతరములు చెప్పవచ్చును అని దివ్యచకోరిక వికల్పధీ శబ్దమును వివరించినది. దేవి అను సంబుద్ధిని క్రీడాది ప్రయోజక వాగర్థ రూపిణి అని వివరించినది. **రోగైశ్చ క్షయితో దేహః కల్ప ఇత్యభిధీయతే** (రోగముల క్షీణించిన దేహము కల్పఁమనఁబడును) అను సూక్తి ననుసరించి విగతకల్ప (దేహ) బుద్ధి అనియు వివరింపవచ్చును. త్వత్కృతా అను శబ్దము త్రయి కృతా త్వయ కృతా అను ద్వివిధములైన వ్యుత్పత్తుల ననుసరించి నీయందు నీ చేత చేయఁ బడినది అని వికల్పబుద్ధికి విశేషణముగా చేయదగును. ఉన్మిషతి అనగా వ్యక్తిలోన కలిగే ప్రాతిభాసికము మాత్రమే కాక బయట కనఁబడుచు అందరికిని (సంవాది) భ్రమను కలిగించు అను అర్థమును బోధించును. ఏమైనను వికల్పబుద్ధి అధిష్ఠాన మైన స్వరూపమును మార్చజాలదు కావున ఈ వికల్పబుద్ధులచే నది ఎట్లును కలంకితము కాజాలదు. ఇట్టిది స్వరూపము. దీనినెఱిఁగిన విద్వాంసునకు ముక్తత కలుగకుండ నెట్లుండును. ఎవనికి ముక్తత కలుగదు అను కాకుస్వరము వలన సర్వులకు ముక్తత కలుగును అను అర్థము సిద్ధించును. బద్ధుడను అని అనుకొను వానికి బద్ధబుద్ధి పోవుటయే ముక్తి. బద్ధుడనుకొనువాడును, ముక్తుడను అనుకొనువాడును, నిత్యముక్తుడను అనుకొనువాడును, ఎవడైనను వాస్తవమునకు బంధము లేనివాడే అను అద్వైత సిద్ధాంతము ఈ శ్లోకమున ఫలితార్థము.

క్రమ ప్రకాశిక ననుసరించి ప్రమాత, ప్రమేయము, ప్రమితి అను త్రిపుటితో పాటు ప్రమాణము అను మరొక వికల్పము భాసింపకున్నను ఆ నాల్గవ వికల్పము యొక్క ఉనికి అనివార్యమని తెలిసిన చిచ్ఛక్తి ఒక్కటే నిర్వికల్పమని వివరించినది.

**అవతారిక:-** పై శ్లోకమున స్వస్వరూపజ్ఞానికి కళంకముండదని స్వస్వరూపజ్ఞానికి ముక్తత సిద్ధమని చెప్పఁబడినది. ఈ శ్లోకమున ఆ స్వస్వరూప ప్రకాశముయొక్క విమర్శ అమ్మవారియొక్క క్రమాక్రమ ప్రకారములు చెప్పఁబడుచున్నవి.



**శ్లో॥ అక్రమక్రమవిమర్శలక్షణం**
**యా క్రమాక్రమమయీ క్రమాక్రమమ్।**
**అక్రమం శివమవేక్ష్య మధ్యగం**
**త్వాఞ్చ సత్కులమిదం తవాన (స) నమ్॥ 24**

**ప్రతిపదార్థము:-**యా=ఏ, క్రమాక్రమమయీ=కాది క్రమము హాదియైన అక్రమము స్వరూపముగా గల (వికల్పబుద్ధి), అక్రమక్రమ విమర్శ లక్షణమ్= అక్రమ విమర్శ క్రమవిమర్శ లక్షణము పైన చెప్పఁబడిన మాతృకా క్రమములను గుణములుగల, మధ్యగమ్=నడుమనున్న, అక్రమమ్=క్రమరహితు డైన, శివమ్=శివుని, ఇదమ్=ఈ, తవ=నీ యొక్క, ఆననమ్=ముఖమైన (ఆసనమ్=ఆసనమైన), సత్కులమ్= సత్కులమును, త్వామ్ చ=నిన్నును, అవేక్ష్య= చూచి.

**తాత్పర్యము:-** కాదిహాది విద్యారూప క్రమాక్రమములు స్వరూపముగా గల వికల్ప బుద్ధి క్రమవిమర్శ అక్రమవిమర్శ లక్షణములుగాగల వాగర్థ క్రమా క్రమములను పొందక మధ్యలోనున్న శివుని ఓ అమ్మా నిన్నును నీ ఆసనమైన సత్కులమును ఎఱిగినవానికి ఎవనికి ముక్తత కలుగదు?

**వివరణము:-** క్రమశబ్దానికి గల అర్థవిశేషములతో ఈ శ్లోకము వ్యాఖ్యానింపఁ దగియున్నది. 1) క్రమమనగా అకారాది హకారాంత వర్ణక్రమము. అక్రమమనగా హకారాది అకారాంత వర్ణముల విలోమ క్రమము. అనులోమ వర్ణక్రమము కాది విద్య (అనులోమ మాతృక). విలోమ వర్ణక్రమము హాదివిద్య (విలోమ మాతృక). పంచదశి భేదములలోని కామరాజ విద్యకు కాది విద్య అను పేరున్నది. పై కాది విద్యలోని రెండవ కూటములోని మొదటి మూడు వర్ణములను మొదటి కూటములోని మొదటి మూడు వర్ణముల స్థానములో చేర్చిన హాది విద్యయగును.

పంచదశులలోని వర్ణములును మాతృకలోనివే కావున వానికిని మాతృకలను వ్యవహారమున్నది. మాతృకలోని వర్ణములనుండి సమస్త పదార్థములు జనించినట్లే పంచదశ వర్ణముల నుండి కూడ సమస్త పదార్థములు జనించునని చెప్పుట సంప్రదాయమే. పై విద్యలలోనేదైనను వాగధ్వత్రయములోని మొదటి వర్ణాధ్వమునకే చెందినవనుట స్పష్టము. పైన చెప్పఁబడిన విద్యలు అన్ని బ్రహ్మాయందలి వికల్పములే కావున వానికి సంబంధించిన వికల్పముల బుద్ధి వాగ్వికల్పబుద్ధి అనఁబడును.

పై శ్లోకమున చెప్పబడిన వికల్పబుద్ధి అర్థవికల్పబుద్ధియే అని భావించి నపుడు **గుర్వాయత్తం క్రమజ్ఞానం ఆజ్ఞాసిద్ధికరమ్ పరమ్ క్రమజ్ఞానామ్మహా దేవి త్రైలోక్యం కవలీకృతమ్ క్రకారః క్రోధరూపస్తు మకారో మంగలప్రదః క్రోధేతు మంగళం కుర్యాత్క్రమః కాలక్రమో భవేత్ –** క్రమజ్ఞానము గుర్వాయత్తము. అది ఆజ్ఞాసిద్ధికరము. ఉత్కృష్టము. ఓ మహాదేవి! క్రమజ్ఞానము వలన ముల్లోకములు మ్రింగబడినవి. క్రకారము క్రోధరూపము. మకారము మంగళప్రదము. (క్రోధమున మంగలము చేయునదే క్రమము అది కాల క్రమము) అని తంత్రాంతరమున చెప్పఁబడిన క్రమాక్రమ విజ్ఞానము గురు ముఖైక వేద్యము. అట్టి క్రమాక్రమముల వికల్పబుద్ధి అని అర్థము. 2) సర్వనాద మాతృక యొక్క సృష్టి లక్షణముగా గలది అక్రమ విమర్శము. వర్ణమాతృక యొక్క నాదసంహారము లక్షణముగా గలది క్రమ విమర్శము. ఈ రెండు విమర్శలు లక్షణములుగా గలది అని 'అక్రమక్రమ విమర్శ లక్షణమ్' అను మాటకు అర్థము. పై రెంటిలో అక్రమవిమర్శ లక్షణముగా గలది క్రమము. క్రమవిమర్శ లక్షణముగా గలది అక్రమము అని క్రమాక్రమమ్ అను పదమునకు అర్థము. అక్రమక్రమ విమర్శలు లక్షణములుగా గలవి క్రమా క్రమములు. ఇవి రెండును శక్తి రూపములే. ఈ రెంటికి మధ్యనుండువాడు శివుడు.

శక్తికి సంబంధించిన క్రమాక్రమములు రెండును క్రమమని చెప్పఁదగినవే. వానికి మధ్యనున్న శివుడు అక్రముడు అని శ్లోకమున చెప్పఁబడినది. ఇట్టి శక్తి శివ స్వరూపజ్ఞానమే సత్కుల సంప్రదాయమున లభించును. అట్టి జ్ఞానము కలవానికిని ముక్తత ఎట్లు కలుగకుండును అను కాకుస్వరము వలన అట్టి జ్ఞానముకల వానికెవనికైనను ముక్తత కలుగుననుట శ్లోక ప్రతిపాద్యము. 3) సత్కులమనగా సత్తులయొక్క గుంపు. సత్ అను శబ్దము సత్తగల పదార్థమును బోధించును. ఇక్కడ వ్యావహారిక సత్తగల పదార్థములను బోధించును. అట్టి వ్యావహారిక సత్తగల మాతృ మేయ మితుల యొక్క సత్కులమని గ్రహింప దగినది. ఆత్మ భాస్కరునియందలి కిరణములే ఈ మాతృమేయమితి త్రిపుటి. ఒక విధముగా ఆత్మ భాస్కరునియందలి నక్షత్రములే (అంశములే) ఈ కిరణములు. మరొక విధముగా సముద్ర రూపాత్మయందలి తరంగములే మాతృమేయ మితులు. తరంగములు వికల్పములనుకొన్నచో సముద్ర మొకటే సత్యము. తరంగము



లున్నంత కాలము వ్యావహారికముగ సత్యములని చెప్పఁబడును. కిరణములు అమ్మవారి పాదముల నుండి బయలుదేరును. కావున ఈ మాతృ మితిమేయముల కులము అమ్మవారికి పాదపీఠమో లేక దేహోర్ధ్వ భాగమునకు ఆసనమనియో చెప్పఁదగినది. లేక 'ఆననమ్' అను పాఠమున పంచేంద్రియాధిష్ఠానమైన సప్తద్వార (రంధ్ర)ములకును అధిష్ఠానమైన ప్రాణమే అమ్మవారి ఆననమని చెప్పఁదగినది. లేక మానవ ప్రాజాపత్య బ్రహ్మరూప గుర్వాఘ పంక్తియే అమ్మవారి ఆననమని చెప్పఁదగినది.

సత్కులమనగా మాతృమితిమేయమను త్రిపుటి మాత్రమే కాక పెక్కు విధములైన త్రయముల కులమని దివ్యచకోరిక వివరించినది.

అ) తల్లి తండ్రి కొడుకు ఈ మూడు కులము.

ఆ) అంగ త్రయము కులము.

ఇ) తేజో చిన్నములు మూడు కులము.

ఈ)బ్రాహ్మణ క్షత్రియ వైశ్య జాతులు మూడును కులము.

ఉ) ద్రవ్య గుణ కర్మలు మూడు లేక ద్రవ్య జాతి కర్మలు మూడు కులము.

ఊ)సత్తు చిత్తు ఆనందము అను అంశములు మూడు కులము.

ఋ) ఆణవ, శాక్త శామ్భవ విసర్గములు మూడు కులము.

పై విధములు సజాతీయ త్రికము కులమని తంత్రములలో చెప్పఁబడినది. ఇది అంతయు ఇదమ్ అను స్ఫురణకు సంబంధించినట్టిదే.అట్టి దేదైనను కులమని తంత్రముల అభిప్రాయము. ఇట్టి వికల్పబుద్ధి శివునందు గాని, శివాభిన్నము లేక క్రమాక్రమరూపిణి లేక చిదచిదాత్మక అని చెప్పఁబడు శక్తియొక్క వాస్తవ స్వరూపమునందుగాని ఎట్టి వికల్పము కల్పింపఁజాలదు. అనగా నిత్యముక్తమైన ఆత్మయందుగాని శివత్వజీవత్వములను స్వీకరించు శివుని వాస్తవ స్వరూపము నందుగాని వికల్పమును కల్పింప జాలదు అని గుర్తించిన వారి ముక్తతయు అనివార్యము అని సారము.

క్రమప్రకాశిక ననుసరించి క్రమమనగా సృష్టి. సంహార ధ్వాంసాభావము కావున ప్రలయము అక్రమము. ఆ సృష్టి ప్రలయముల మధ్య నుండు సత్తయే శివుడు. దృష్టి సృష్టి వాదమున క్రమము లేకపోవుట వలన దృష్టి కూడ అక్రమమని చెప్పఁదగును. ఆవాదములను అంగీకరించు అద్వైతప్రక్రియలో సృష్టి

ప్రలయములు విమర్శాత్మకములు మాత్రమే అగుట చేత వానికి క్రమ ముండదు. వానికధిష్ఠానమైన క్రమాక్రమమయి అని చెప్పబడు ఆశక్తి శివున కుపాధి కావున శివుడా శక్తి మధ్యగుడే (ఘటమధ్యగతాకాశమువలె). ఆ శక్తియే జగమున కుపాదాన కారణమగుటచేత నిమిత్తకారణమైన శివునకభిన్నయగుట చేతను క్రమమును అక్రమమును సృజించును. అది క్రమాక్రమముల మధ్యనున్న శివునిగాని, ఆ వికల్పబుద్ధికి ఆశ్రయమైన శక్తివైన నిన్ను (అమ్మ వారిని) గాని చూచి వాస్తవము నెఱిగినవానికి ముక్తత నిత్యసిద్ధమను తాత్పర్య మేర్పడును. ఆనన శబ్దము ప్రాధాన్యమును సూచించును. కావున రజో గుణోద్రేకమున కలుగు సృష్టిని (క్రమమును) తమోగుణోద్రేకమున కలుగు ప్రలయము (అక్రమము) ను కలిగించుటలో శక్తికి గల ప్రాధాన్యమును సూచించును.

**అవతారిక:–** పై శ్లోకమున వికల్పబుద్ధిచే అకలింకితుడైన క్రమస్వరూప శివ సాక్షాత్కారము నొందినవానికి ముక్తి చెప్పఁబడినది. ఈ శ్లోకమున వికల్పబుద్ధి వలన కలిగిన అణుతను నశింపజేయుటకై కాళీదేవి ప్రార్థింపఁబడుచున్నది.

**శ్లో॥ వేద్యవేదకవిభేదదక్షయా**
**మాయయా క్రమవదఙ్గ గామినీ।**
**యా స్థితామ్బ! బహిరక్షకాఙ్క్షిణీ**
**తాం జహి త్వమణుతాం మయి స్థితామ్॥ 25**

**ప్రతిపదార్థము:–**వేద్య వేదక విభేద దక్షయా=వేద్యమును వేదకమును వేరుచేయుట యందు సమర్థమైన, మాయయా=మాయచేత, క్రమవదంగగామినీ=క్రమముతో కూడిన అంగములందు ప్రసరించు, బహిరక్షకాంక్షిణీ=బయటి ఇంద్రియముల అపేక్షగల, యా=ఏది(అణుత) స్థితా=ఉన్నదో, అమ్బ=అమ్మా, త్వమ్=నీవు, మయి=నా యందు, స్థితామ్=ఉన్న, తామ్=ఆ, అణుతామ్=అణుత్వమును, జహి=నశింపఁజేయుము.

**తాత్పర్యము:–** అమ్మా! క్రమముకల అంగములలో ప్రసరించు బహిరింద్రియముల అపేక్షగల, వేద్యమును వేదకమును వేరుచేయుటలో నేర్పరియైన మాయచేత నా యందు కల్పింపఁబడిన అణుతను నీవు నశింపఁజేయుము.

**వివరణము:–** లోకమున వస్తువుల కర్మల సమూహములలో క్రమము కానవచ్చును. ఆ క్రమము వానిలో దేశకాలముల వలన ఏర్పడినది. అఖండమైన



దేశము, పై క్రింద నడుమ అష్ట దిక్కులు మొదలగు కల్పితములైన భేదములతో ఖండముగా గోచరించుచున్నది. అట్లే అఖండ కాలము నిమేషాది కల్పాంత బహువిధ కల్పిత భేదములలో గోచరించుచున్నది. వస్తువులు పొడవు వెడల్పు ఎత్తు అను కొలతలు దేశ మాధారముగా గణింపఁబడును. ఆ వస్తువుల పుట్టుక మార్పు, వినాశము మొదలైన క్రియల ననుసరించి భూతవర్తమాన భవిష్య కాల భేదముల ననుసరించి క్రమము గోచరించును. ప్రాణులకు అంగములలో శిరః పాదాది ఊర్ధ్వాధః క్రమములు గోచరించుచున్నవి. అన్ని వస్తువుల దేహముల అవయవములలోను దేశమును బట్టి క్రమము కనఁబడును. ఆ దేహములు వస్తువులు వాని వర్తమానస్థితి గోచరించును. భూతకాలమున అవి ఎప్పుడు జనించినవో ఊహననుసరించి లేక ఇతర మార్గముల ద్వారా ఎప్పుడు పుట్టినవో, వానిననుసరించియే అవి ఎప్పుడు నశించునో లెక్కలు వేయఁబడును. కనుక కల్పిత దేశకాల విభాగముల ద్వారమున వస్తువులలో కల్పిత కాల విభాగముల ద్వారమున కర్మలలో క్రమము మనకు గోచరించును. ఇట్లు నిమిత్త సాపేక్షముగ ఆ వస్తువులను మాత్రమే చూడగలుగుట మన యొక్క అణుత్వమునకు అల్పత్వము నకు నిదర్శనము.

అట్లే ఇంద్రియముల ద్వారా వస్తువులను, వానిలోని శబ్ద స్పర్శాదులను మాత్రమే గుర్తించ గలుగుట మన అణుత్వమునకు మరొక నిదర్శనము. జీవులమైన మనము తెలిసికొను వారము. తెలియబడునది వేద్యము. తెలిసికొనునది వేదకము. ఇది వేదకము, ఇది వేద్యము అను విభాగము ఆత్మ మాయచేత ఆత్మయందే కల్పింపఁబడినది. ఈ మాయచేత దేశకాలేంద్రియాపేక్ష లేకుండ సర్వమును ప్రకాశింపఁజేయగల స్వతస్సిద్ధ మహిమను కోల్పోయిన మనయందు అణుత్వము అనగా జీవత్వము కల్పింపఁబడినది. దానిని నశింపఁజేయునది ఆ కాళీ శక్తియే. కావున ఓ అమ్మా! మాయ చేత కల్పింపఁబడిన నా అణుత్వమును నశింపఁజేయు మని కవి ఈ శ్లోకమున ప్రార్థించుచున్నాడు. 2. అణుత్వమునకు ఆణవ మలమని తాంత్రిక వ్యవహారము. (అ) జ్ఞానమున స్వాతంత్ర్యము తొలగుట (ఆ) స్వాతంత్ర్యము యొక్క బోధ కలుగకుండుట అను రెండు విధములైన ఆణవమలము జీవులలో నుండును. ఈ ఆణవ మలము నశించనిదే ముక్తి కలుగదు. (3) దివ్యచకోరిక అపరిచ్ఛిన్నమైన ఆత్మ మీయతే పరిచ్ఛిద్యతేఽ నయా (ఆత్మ దీనిచే

పరిచ్ఛేదింపఁబడుచున్నది) అను మాయా శబ్దము యొక్క వ్యుత్పత్తిని చెప్పినది. మాయ చేత దేశకాలవస్తు పరిచ్ఛేదము లేని అనంతమైన ఆత్మయందు దేశ పరిచ్ఛేదము కాల పరిచ్ఛేదము వస్తు పరిచ్ఛేదము అను త్రివిధ పరిచ్ఛేదము లేర్పడినవి. ఒకచోట నున్నాను. ఇంకొక చోట లేను–అనునది దేశపరిచ్ఛేదము. ఇప్పుడున్నాను. వంద ఏండ్ల పిదప ఉండును–అనునది కాల పరిచ్ఛేదము. నేను పశువును కాను మనుష్యుడను అనునది–వస్తు పరిచ్ఛేదము. ఈ త్రివిధ్య పరిచ్ఛేదములు లేనిదైన ఆత్మయందు మాయచేత కల్పింపఁబడినవే ఈ పరిచ్ఛేదములు. నేను అస్వతంత్రుడను. చచ్చువాడను. అనుభావములు స్వతంత్ర మైనవి గావు. ఆత్మయందు మాయ చేత కల్పింపఁబడినవి. ఇట్టి భావములను కల్పించునది ఆణవమలము అని తాంత్రికులు చెప్పెదరు. తాంత్రికుల దృష్టిలో వాగర్థ రూప శక్తియే అద్వైతుల చేత మాయయని చెప్పఁబడినది. నామ రూపములని వాగర్థములకు నామాంతరము, నామమే వాక్కు, అర్థమేరూపమని అర్థము చేసికొనవలెను. వాక్కు అర్థమే రూపము అని అర్థము చేసికొనవలెను. 3. దివ్యచకోరిక ననుసరించి వాగర్థమయమైన శరీరము క్రమ పదజ్ఞము. ఇదియే వేద్యము. వేదకము తెలిసికొను ఆత్మ. వేదకమైన ఆత్మయందు మాయ చేత కల్పింపఁ బడిన అణుత్వ(మల)ము వలన దేశకాల క్రమాపేక్షతో పాటు బహిరింద్రియాపేక్ష కూడ ఏర్పడినది. దేశకాల క్రమ వాదజ్ఞగామిత్వ మొక విధమైన ఆణవ మలము. బహిరింద్రియాపేక్ష మరొక విధమైన ఆణవ మలము. వాక్కు అక్ష (ఇంద్రియ)ము అను రెండు వాగక్ష మనఁబడును. ఇది ఆణవమలాంతర్గతము.

బహిర్ముఖ వాగక్షము మాతృకావర్ణ ప్రత్యాహార సిద్ధము. అనగా అకారము మొదలు క్షకారమువఱకు వర్ణముల ప్రత్యాహారము అక్షము. ఇది శుద్ధ ప్రత్యాహారము. అహంప్రత్యయము యొక్క మన ఇంద్రియముల యొక్కయు వృత్తుల ప్రత్యాహారముచే సిద్ధములైన అర్థముల సమ్మేలన బహిరక్షము దానిని కోరు అల్పతయే ఆణవమలము. ఆణవమలము వలననే ఆత్మకు సర్వమును ప్రకాశింపఁజేయు శక్తి యున్నను ఆణవమలావృతమగుటచే బహిరింద్రియముల సహకారమున మాత్రమే ఇంద్రియార్థములను ప్రకాశింపఁజేయ గలుగుచున్నది. అనగా తెలిసికొన గలుగు చున్నది. అమ్మవారు జీవుని ప్రార్థన నాలకించి ఈ ఆణవమలావరణమును తొలగించెనేని జీవునికి ఇంద్రియ నిరపేక్ష ప్రకాశనము యథాపూర్వముగ



సిద్ధించును. క్రమప్రకాశిక ననుసరించి చితి రూప స్వతంత్ర శక్తియైన కాళి జీవుని యందు ఆవిర్భవించుట ద్వారా అణుతను తొలగింపుమను ప్రార్థన ఈ శ్లోకసారము.

**అవతారిక:–** పై శ్లోకమున అణుతా వినాశము ప్రార్థింపఁబడినది. ఈ శ్లోకమున కర్మ వాసనా విలాపనము ప్రార్థింపబడుచున్నది.

**శ్లో॥ కర్మ యద్వివిధవాసనాత్మకం**
**మాయయా సహ కృతాణు భావయా।**
**వృత్తిభి స్తవ విలాప్యతే హి త**
**ద్దేవి! భానురుచిభి ర్యథా తమః॥ 26**

**ప్రతిపదార్థము:–** యత్=ఏ, కర్మ=కర్మ, వివిధవాసనాత్మకమ్=వివిధములైన వాసన స్వరూపములుగా గలది, సహకృతాణుభావయా=అణుభావముతో సహకరింపఁ బడిన, మాయయా=మాయతో పాటు (కూడియున్నదో), తత్=అది, తవ=నీయొక్క, వృత్తిభిః=వృత్తులతో, దేవి=ఓ దేవీ!, భానురుచిభిః=సూర్యకిరణములతో, తమః యథా=చీకటివలె, విలాప్యతే హి=నశింపఁజేయుఁబడును గదా!

**తాత్పర్యము:–** అణుభావముతో సహకృతయైన మాయతో పాటు వివిధ వాసనాత్మక మైన కర్మయు నీ వృత్తులతో సూర్యకిరణములతో చీకటి వలె నశింపఁజేయఁ బడును.

**వివరణము:–** మాయా జీవ భావములు అనాదులు. ఏది కారణమో ఏది కార్యమో నిర్ణయింపరాదు కావున ఆ రెండు పరస్పర సహకారము కలవై జీవునికి స్వస్వరూప జ్ఞానము లేకుండజేయుచున్నవి, జీవభావము అనగా అణుభావము. తాను మహిమ లేనివాడనను భావము. ఇది విక్షేపశక్తి విలాసము. విక్షేపశక్తి స్వప్న జాగ్రత్కాల రూపములుగా తన విలాసమును (ప్రభావమును) చూపును. జీవునితో నానా విధములైన కర్మలను చేయించుచు, వానిఫలముల ననుభవింపఁజేయును. జాగ్రద్వాసనలతో స్వప్నమున జీవుడు కొన్ని కర్మలను చేయును. కొన్ని ఫలముల ననుభవించును. స్వప్నమున జాగ్రద్వాసనలతోడనే జీవుడు కర్మప్రవృత్తుడగును. పూర్వజన్మ వాసనానుగుణముగా జీవుడు జాగ్రద్దశలో కొన్ని కర్మలను చేయును. కొన్ని ఫలముల ననుభవించును. కావున స్వప్న జాగ్రద్దశలలోని కర్మ యంతయు వాసనత్మకమే.

సద్వాసనలుద్బుద్ధములై జీవునితో సత్కర్మలను, దుర్వాసనలుద్బుద్ధములై జీవునితో దుష్కర్మలను చేయించును. కావున కర్మ కూడ అనాదియే. కర్మ వాసనలును అనాదులే. ఈ విధ వాసనాత్మక కర్మ కార్వణమలమని తాంత్రిక వ్యవహారము.

అణుభావము అభానము. ఇది చీకటి. వస్తువులును కనఁబడకుండ చేయునట్లు ఆత్మ మహిమ నావరింపఁజేయును. అందువలన అణుభావము ఆవరణ రూపమని కొందఱి భావము. అణుభావము అజ్ఞాన కార్యము. అజ్ఞానమే కారణము. స్వప్న జాగ్రద్దశలందు మాత్రమే భాసించు అణుభావము విక్షేపము మాత్రమే. అది అజ్ఞానావరణ (నిద్ర) నుండి జనించును. కావున స్వప్నజాగ్రద్దశలలోనే జీవుడు తన అణుభావము ననుభవించును అని మరికొందఱు భావించెదరు. మాయయొక్క ఆవరణశక్తి నిద్ర. మాయయొక్క విక్షేప్యశక్తి స్వప్న జాగ్రద్దశలు. అని వీరి నిర్ణయము. అయినను వీని విలాపన క్రమము పౌర్వాపర్యంకమునకు విపరీతముగా నుండును. ఆత్మజ్ఞానమున ముందు అజ్ఞానమే నశించును. దాని తరువాత విక్షేపము నశించును. ఇది యట గోచరించు వ్యావహారిక సత్యము. ఆత్మజ్ఞానము కలుగగానే అజ్ఞానము నశించిన పిమ్మట జీవన్ముక్తుని కర్మరూప విక్షేపదర్శనము ఆభాసము మాత్రమే. ఇది దగ్ధపట తుల్యము మాత్రమే. జీవన్ముక్తుని కర్మ విక్షేపము జన్మాంతర హేతువు కాజాలదు అనుట అద్వైత సిద్ధాంతము. 2. దివ్యచకోరిక అణుభావమునే ఆవరణముగా చెప్పినది. వేద్యవేదక ప్రథనే మాయగా చెప్పినది. వేద్యే వేదక ప్రథ విక్షేపమని, ఇది ఆణవావరణము లేనిదే సంభవింపదని చెప్పినది. దివ్యచకోరిక దృష్టిలో మాయ యనగా విక్షేపశక్తి మాత్రమే. అది ఆణవావరణశక్తి లేనిదే పనిచేయఁ జాలదు. కావున శ్లోకమున సహకృతాణుభావయా అను విశేషణము మాయకు ప్రయోగింపఁబడుటలోని సామంజస్యమును వివరించినది. మరియు అణుభావమే జీవుని సంసరణమునకు హేతువని నిరూపించినది.

అమ్మవారి అనుగ్రహమున కలుగు అమ్మవారి వృత్తుల చేత సూర్య కిరణములవలన చీకటి తొలగునట్లు తామోనుమయాణు భావము తొలగునని చెప్పుట వలన ఈ శ్లోకమున ఉపమాలంకార మేర్పడి యున్నది. సూర్య కిరణములు ఉపమానము. అమ్మవారి వృత్తులుపమేయములు. యథా అనునది ఉపమావాచకము, తమః అను పదము శ్లేషచే చీకటిని ఆవరణమును బోధించుటచే తమోనాశము అనునది సాధారణ ధర్మ మయినది. కావున ఈ ఉపమాలంకారము పూర్ణోపమా లంకారము.



నీ వృత్తులు కర్మను విలాపింపఁజేయును. తమస్సు సహజముగా వృత్తి తోడనే నశించును. కావున నా ఆణవవృత్తి నశింపఁజేయుము అను పూర్వ శ్లోకముతో అన్వయింపవచ్చునని మరొక విధముగా గూడ వివరించినది. సర్వులు (పురుషులు) విడచిన తరువాత స్త్రీ యొక్క శీలము రక్షింపఁబడుట సహజ సిద్ధము అయినట్లు తమస్సు తొలగుట సహజ సిద్ధము అగుట అమ్మవారి వృత్తుల చేత స్వప్న జాగ్రద్దశలలోని విక్షేప వృత్తులు విలాపన మొందుటయే ఆవశ్యకము. సాధకుని ఈ స్థితి భైరవ భాక్త్య స్థితి. దీనిని పొందిన వారిని కాలవృత్తి కాని మాయా వృత్తిగాని ఏమీ చేయఁజాలవు. వారికి ప్రకాశతాదాత్మ్యము కలిగినదిగదా! ఈ స్థితి అద్వైత సిద్ధాంతము నందలి జీవన్ముక్త స్థితివంటిది. వారి వేద్య వేదకములను కాలము భేదింపఁజేయ జాలదు. క్రమప్రకాశిక అమ్మవారి వృత్తులనగా ఉపనిషన్మహా వాక్య జన్య చరమవృత్తులని చెప్పినది. వాని వలన సూర్యకిరణములచే చీకటి తొలగునట్లు సంసారము తొలగునని వివరించినది.

3. చిత్తమున ఒక వృత్తి ఉన్నప్పుడు మరొక వృత్తి ఉండదు. కావున సాంసారిక వృత్తులను అమ్మవారి వృత్తుల వలన అనగా ధ్యానము వలన లేక మహా వాక్య వృత్తి జన్య **'అహం బ్రహ్మాస్మి'** అను చరమ వృత్తుల వలన అజ్ఞానము నశించును. అను రెండు మతములు ధ్యాన ప్రాధాన్యమును, జ్ఞాన ప్రాధాన్యమును క్రమముగ తెలుపును. ధ్యాన ప్రాధాన్యమున దేహపాతానంతరమున ముక్తి కలుగునను పక్షము తాంత్రికుల చేత ఆదరింపఁబడలేదు. వీరు బ్రదికి యున్నప్పుడే శివ భావమున శివతాదాత్మ్య మేర్పడగా జీవునకు బ్రదికి యుండగానే శివభావము సిద్ధించు నందురు. ఈ స్థితి అద్వైతుల జీవన్ముక్త స్థితి నంగీకరింపగా దివ్యచకోరిక తాంత్రిక సిద్ధాంతానుగుణ జీవన్ముక్త స్థితిని వివరించినది. ప్రారబ్ధగామిసంచిత కర్మలకు మాయలకు ఆణవ కార్మణమలములతోడి అభేదమును సూచించినది.

అద్వైత సిద్ధాంతమున జీవన్ముక్తస్థితిలో ప్రారబ్ధానుభవముండును. బద్ధజీవునకు ప్రారబ్ధకర్మ ఫలానుభవ ముండును. 25వ శ్లోకమున అజ్ఞానావరణ భంగము ప్రార్థింపఁబడగా 26 వ శ్లోకమున సమస్త కర్మ ప్రవిలాపనము అమ్మవారి వృత్తుల వలన కలుగునని చెప్పఁబడినది.

**అవతారిక: –** పై శ్లోకమున అమ్మవారి వృత్తులలో కర్మ విలాపనము చెప్పఁబడినది. ఈ శ్లోకమున ఆమె అనుగ్రహమున స్వస్వరూప సాక్షాత్కారము గూడా కలుగునని చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ చిన్మయీకృతమతోక్షదృశ్యయా**
**గుహ్యయామ్బ! విపరీతచర్యయా।**
**లభ్యతే సమరసీకృతాఖిల**
**ద్వైతవృత్తి తవ ఘస్మరం వపుః॥ 27**

**ప్రతిపదార్థము:–** అమ్మా! అతః=అందువలన, చిన్మయీకృతమ్=చిన్మయముగా నొనరింపఁబడిన,అక్షదృశ్యయా= ఇంద్రియగోచరమైన, గుహ్యయా=రహస్యమైన, విపరీతచర్యయా=లోకవిరుద్ధ ప్రవర్తన చేత, సమరసీకృతాఖిలద్వైతవృత్తి= సమరసముగా చేయఁబడిన అన్ని ద్వైత వృత్తులు గల, ఘస్మరమ్=నశింపఁజేయు, తవ=నీ యొక్క వపుః=స్వరూపము, లభ్యతే=లభించును.

**తాత్పర్యము:–** లోక విరుద్ధ రహస్య వర్తనముతో చిన్మయీకృతమైన అఖిల ద్వైతవృత్తుల సామరస్యముతో అజ్ఞాననాశకమైన జ్ఞానస్వరూపము (ఆత్మజ్ఞానము) లభించును.

**వివరణము:–** అజ్ఞానికి(అనగా ఇంద్రియములకు) లోకమెట్లు గోచరించునో, ఆత్మ జ్ఞానికిని అట్లే గోచరించును. కావున ఆత్మజ్ఞానమనగా దృశ్యాప్రతీతి గాదు. దృశ్యమిథ్యాత్వ నిశ్చయమని అద్వైత సిద్ధాంతులు భావించెదరు. అట్లే శాక్త మోక్షమైన శివానుభవస్థితిలో ద్వైతవృత్తి నిరాసముండదు. కాని వాని సామరస్య మేర్పడి యుండును. సామరస్య మనగా దు:ఖ మేఘము భేదము లేని తాదాత్మ్యస్థితి. ఇంద్రియములు విషయము చూడలేని అశక్తి మోక్షము కాదు. అక్ష దృశ్యమంతయు దృక్తాదాత్మ్యముతో ఒప్పుట. అజ్ఞానావస్థలో అమ్మవారే ప్రపంచ శరీరిణియై దృశ్యముగా నుండిన, శివానుభవస్థితిలో ఆమె శరీరమంతయు చిన్మయాకృతమై ఉండును. అజ్ఞానావస్థలో స్వభిన్నముగా గోచరించులోకము అంతశ్చైతన్యముతో నిండియున్నరీతి గోచరించును. బహిర్దృశ్యమే రహస్యమైన దహర స్పందముగా భాసించును. ఆ స్థితిని పొందినవాని చేష్టలు అన్ని లోక విపరీతములుగా గోచరించును.

ఆత్మజ్ఞాని దహరాకాశముగ భావి వాగర్థమయ జగత్తు యొక్క బీజము నాటబడు అమ్మవారి స్వరూపమే "ఉప్యతే=నాటబడును అను వ్యుత్పత్తితో వపువు అనగా అమ్మవారి శరీరమనియే ఈ శ్లోకమున చెప్పఁబడినది. దివ్యచకోరిక వపుః



శబ్దమును వివరించినది దహరవ్యోమమయమైన ఆమె స్వరూపము వపువు (శరీరము) అని చెప్పఁబడుటకు భావిలోక బీజావాపన క్షేత్రమై యుండుటయే కారణము.

అచిన్మయముగా లోకము భాసించుట ఒక స్థితి. చిదచిన్మయముగా భాసించుట మరొక స్థితి. చిన్మయముగా భాసించుట మరొకస్థితి. ఈ మూడు స్థితులలో అచిన్మయమై చిన్మయముగా చేయబడినట్లు కనఁబడుటను సూచించుటకు చ్వి ప్రత్యయముతో కూడిన చిన్మయీకృత శబ్దము ప్రయోగింపఁబడినది. అజ్ఞానికి అచిన్మయముగా, జ్ఞానికి చిన్మయముగా గోచరించు అమ్మవారు చిదచిన్మయిగా తంత్రములలో వివరింపఁబడినది. చిన్మయముగా చేయున దెవరను ప్రశ్నము 'కృత' శబ్దము చేత ఉత్థితమగును. సాధకుని చేతనే అని సమాధానము చెప్పవలెను. దీనికి కారణము పైశ్లోకమున 'అణుతావినాశము' అను లింగము చెప్పఁబడుటయే. జ్ఞానికున్న వాగర్థమయ శరీరము గౌణము. అజ్ఞానికున్న ఆ వాగర్థ శరీరము ముఖ్యము. జ్ఞానియందు ఆ ఉభయ వాగర్థైక్య సిద్ధి కలిగియుండునని వేరుగా చెప్పనక్కఱలేదు. సమరసీకృతాఖిల ద్వైతవృత్తి అను సమాసమునకు కూడ చ్వి ప్రత్యయమున్నది. చిన్మయీకృత అనుచోట చ్వి ప్రత్యయము మరొకటున్నది. ఈ రెండు చ్వి ప్రత్యయముల చేత శివాద్వైతాను భవము కలిగిన శాక్తునకు జన్మ సిద్ధ వాగర్థమయ శరీరమే సాధకునిచే సమరసీకరణాభ్యాసము చేత తొలుత అచిన్మయమైన ఆ శరీరమే చిన్మయీకరింపఁబడునని సూచించుటకై ప్రయోగింపఁ బడినవని అభిప్రాయపడినది. క్రమప్రకాశిక విపరీతచర్యను **వామదేవీయమ్** అను ఛాందోగ్యమున చెప్పఁబడిన వామాచారముగా చెప్పినది. గుహ్యయా అను పదము 'ఫలము తెలియనందున' రహస్యమైనది అని వివరించినది. ఘస్మర శబ్దమును సర్వభావ ప్రవిలాపకము అను అర్థము కలదిగా వివరించినది.

**అవతారిక:–** పై శ్లోకమున (లలో) అణుతను నశింపఁజేయుట వలన సాధకునకు ఆవరణ విక్షేప నివృత్తి స్వస్వరూప ప్రాప్తి చెప్పఁబడినవి. ఈ శ్లోకమున జీవన్ముక్తిని పొందిన లేక శివానుభవమునొందిన సాధకునకు కలుగు అసంగిత్వసిద్ధి చెప్పఁ బడుచున్నది.

**శ్లో॥ యాశ్చరన్తి తవ ఖే చిదాత్మకే**
**శక్తయః కరణలక్షణాశ్శివే।**

**ముక్తబాహ్యపదజృమ్భణోద్యమా**
**త్వం హి తిష్ఠసి తదూర్ధ్వగే పథి॥ 28**

**ప్రతిపదార్థము:–** శివే=ఓ మంగళ స్వరూపురాలా!, యాః=ఏ, శక్తయః=శక్తులు, తవ=నీయొక్క, చిదాత్మకే=చిదాత్మకమైన, ఖే=ఆకాశమున, కరణలక్షణాః =కరణములను లక్షణములు కలిగియున్నవై, చరన్తి=తిరుగుచున్నవో, తదూర్ధ్వగే= వానికి పై భాగముననున్న, పథి=మార్గమున, ముక్తబాహ్యపదజృమ్భణోద్యమా= బాహ్యపదముల ఉల్లాసమునకై ప్రయత్నమును విడచిన దానవై, త్వమ్=నీవు, తిష్ఠసిహి=నిలచియున్నావుగదా!

**తాత్పర్యము:–** ఓ శివా! ఏ శక్తులు కరణ రూపములుగా నీ చిదాత్మకాకాశమున తిరుగునో వాని కూర్ధ్వమున నున్న మార్గమున నీవు నిలచియున్నావు గదా!

**వివరణము:–** 1) కరణము లనగా అంతర్బాహ్యేంద్రియములు వాగాది కర్మేంద్రియములు ఐదు, శ్రోత్రాది జ్ఞానేంద్రియములు ఐదు, అంతరింద్రియమైన మనస్సు ఒకటి కలిపి మొత్తము పదునొకొండింద్రియములు అంతఃకరణములు. మనోబుద్ధిచిత్తాహంకారములు నాలుగనుకొన్నచో మొత్తము అంతర్బాహ్యేం ద్రియములు పదునాలుగు. ఇవి వానివాని విషయములను ప్రకాశింపఁజేయు వ్యాపారములను (వృత్తులను) కలిగియున్నవై **వ్యాపారవత్ కారణం కరణమ్–** వ్యాపారముగల కారణమే కరణము అను లక్షణము ననుసరించి విషయ ప్రకాశక కరణములు. కావున శ్లోకమున 'కరణలక్షణాః' అని చెప్పఁబడినది.

శివభావము కలిగిన సాధకునిలో అమ్మవారు బాహ్యపదములను అనగా జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థల నుల్లసింపఁజేయు యత్నమును విడచి యుండును. కావున మూడవపాదము ఆ అంశమును స్పష్టము చేయుచున్నది. 2) కర్మేంద్రియము లొనర్చు కర్మలు జ్ఞానేంద్రియములు కలిగించు విషయ జ్ఞానములు అన్నియు జడా ప్రకృతికి సంబంధించినవైనను అవి చిదాకాశ విహరులే అన్న విషయమును మఱువరాదు. ఎందుకనగా బాహ్య విషయ జ్ఞానములు ఏవియు చిత్సంబంధ రహితములు కావు గదా. బాహ్య రూపాదులు నీ మనస్సులోనికి ప్రవేశింపలేవు. వాని ఆభాసములను మాత్రమే ఇంద్రియము లాత్మకు నివేదించును.

3) శివభావము నొందిన సాధకునికి జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలు



ప్రారబ్ధాధీనములుగా అనుభవనీయములై యున్నను వాని ననుభవింపఁజేయుటలో అమ్మవారికి ప్రత్యేకమైన ప్రయత్నముండదు. ఆమె ప్రత్యేక ప్రయత్నమంతా వానిలో శివతాదాత్మ్య స్వరూప సామరస్యమును సాధకునకు గోచరింపఁజేయుట యందే యుండును. పైగా ఆ శివభావావస్థలో సర్వశక్తి సమష్టి వ్యోమ శరీరిణియైన అమ్మవారు కరణశక్తుల కూర్ధ్వముననున్న మార్గమున నిలచి శివో (వ+ఉ) న్ముఖయై యుండును. లేక శివోన్ముఖ మార్గమున నిలచియుండును. లేక ఆమార్గమున శివతాదాత్మ్యాపత్తిస్థితిలో నిలచియుండును. కావున బాహ్య పదమనగా జాగ్రత్స్వప్న స్థితి నుల్లసింపఁజేయు ప్రయత్నమున నిలచియుండును. 4) విషయముల ఆభాసములను ఇంద్రియములు మనస్సు ద్వారా ఆత్మకు నివేదించును. అందువలన కరణ శక్తులన్నియు చిదాకాశ సంచారిణులే. ఇంద్రియములు స్థూల (సూక్ష్మ) విషయములు గ్రహించినను అవి మాత్రము సూక్ష్మములే. తాముగోచరింపక తమ విషయములను మాత్రమే గోచరింపఁజేయును. కావున కరణ శక్తులు అనుమేయములే. కావున ప్రత్యక్షములు కావు. వాని నివాసములైన శ్రోత్రగోళాదులు మాత్రము స్థూల శరీరావయవములుగా నుండును. అంతమాత్రమున అవి (ఇంద్రియములు) స్థూలములు కావు. ప్రత్యక్ష ప్రమాణ విషయములును కావు. ఇంద్రియములు (కరణశక్తులు) సూక్ష్మ శరీరగతములే కాని స్థూలశరీరగతములు కావు. 5) ప్రకృతికి బాహ్యపద జృంభణమనగా జాగ్రదాది దశాత్రయమును జీవున కనుభవింపఁజేయుటలో ఆసక్తి ఉండుట సహజము. ప్రకృతినిదాటినముక్తుల విషయమున ప్రకృతిరూపిణియైన అమ్మవారికా బాహ్యపదముల నుల్లసింపఁజేయు ప్రయత్నమును మానియుండును. పైన చెప్పఁబడిన ఆ ఆసక్తియే సంసారముగా జీవుల బోధించుచుండును. ఆ ఆసక్తి విడిపోవుటయే అసంగము. ఇది ముక్తులలో విరాజిల్లు చుండును. 6) మూడవ పాదము నింకొక విధముగా కూడా దివ్యచకోరిక వ్యాఖ్యానించినది. ముక్తులనగా విజజాన (విదేహ) కేవలులు. బాహ్యపదమనగా సంసారాంతర్గతములైన జాగ్రదాద్యవస్థలకు అతీతమైన తురీయ స్థితి. దాని నుల్లసింపఁజేయుటలో అమ్మవారి ప్రయత్నముండుననుటయే ఆ వ్యాఖ్యాంతరము. మనస్సు పంచభూతములును అను ఆరింటిలోనున్న మూడువందల అరువది కిరణములకు పైనున్నవి నీ పాదాంబుజమని శంకరులు సౌందర్య లహరిలో చెప్పుట ఈ తురీయస్థితినే సూచించును. క్షితౌషట్పంచాశదిత్యాది శ్లోకమును ప్రమాణముగా నుదహరించినది. నివృత్తికలామయియా ప్రకృతిలో తద్రూపముగా కరణశక్తుల

కూర్ధ్వభాగమున అమ్మవారు నిలిచియున్నదని వివరించినది. 7) **చరభక్షణే** అను ధాతువు నుండి పుట్టిన చరంతి అను క్రియా పదమును ప్రయోగించుట ద్వారా బద్ధజీవుని విషయభోగమునకు ముక్తజీవుని (శివతాదాత్మ్యము నొందిన జీవుని) శరీర ఈక్షణార్ధపరిమిత విషయభోగమునకు గల భేదమును వ్యంజించును. 8) క్రమప్రకాశిక ననుసరించి విశ్వోపాదాన భూతమైన చితిశక్తికి మూడురూపములు. (1) కార్యరూపము (2) కా(క)రణ రూపము, (3) మహాకారణరూపము. కార్యరూప స్థూలవిగ్రహముగల దుర్గా తారాకాల్యాది బ్రహ్మాండాంతరావతీర్ణలైన శక్తులు కార్యారూపలు. సూక్ష్మ శరీరోపహితులై చిదాకాశమున స్వేచ్ఛగా విహరించు వాఙ్మనస్సులకు అందని అతీంద్రియలైన శక్తులు బ్రహ్మాండము పైభాగమున సంచరించునవి కరణ రూప శక్తులు. పరాకాశమునకంటెను పైనున్న మార్గమున సంచరించునవి పరమకారణ శక్తులు. చిదాకాశములైన మూడు అండములున్నవి (1) ప్రకృత్యండము, (2) మాయాండము, (3) శక్త్యండము. కార్యకారణోపహితశక్తి ప్రకృతిరూపమున, మాయారూపమున, శక్తిరూపమున అమ్మవారు చిదాకాశమున కంటెను ఊర్ధ్వముగానున్న మార్గమున విహరించును. లేక అండత్రయమున కంటెను ఊర్ధ్వముననున్న మార్గమున పరాశక్తి విహరించును. 'హి' శబ్దము ఆగమ ప్రసిద్ధిని తెలియఁజేయును. దివ్యచకోరిక సమ్మతి బోధకనిహితము 'హి' శబ్దము అని చెప్పినది. 9) చిదాకాశమనగా హృదయగతాకాశము. సంవిత్కమలము అనాహత చక్రము అని చెప్పఁబడినది. ద్వాదశ దలాత్మకమైన కమలము. ఇది ప్రాణ(వాయు) స్థానము. దాని క్రిందనున్న కమలములు మూలాధార స్వాధిష్ఠాన మణిపూరములు తేజోబన్నాత్తకములు మూర్తాభూతాత్మకములు. అమూర్త భూతములు వాయ్వ్యాకాశములు వాయ్వ్యాత్మకమైన అనాహతచక్రముపైన ఆకాశాత్మకమైన విశుద్ధ చక్రము దీనికిపైన నుండును. ఆ ఆకాశము భూతాకాశమే గాని చిదాకాశము కాదు. పంచభూతములు మనస్సు అన్నియు చిదాకాశముననున్నవి. సంవిత్కమలమున ప్రాణవాయు వనుహతముగానే ధ్వనించును. కుండలిని ప్రయాణించు మార్గమున మూర్తములు అమూర్తమున లయించుచోట ఇది ఉన్నది. దీని కూర్ధ్వముననున్న భూతాకాశగుణమైన నాదము ఇట అనాహతమై నినదించును. దీనికి పైనున్న విశుద్ధచక్రము నుండి అగోచరమైన నాదము యొక్క గోచరస్థితి బహిర్గతమగును. దీనిని బహిర్గతము కాకుండ దానిపైనున్న ఆజ్ఞాచక్రమందలి మనస్సున లయింపఁ జేయు ప్రయత్నమున నాదము తారనవనాదరూపమున సూక్ష్మ సూక్ష్మతర స్థితి



నొందును. ఈ శ్లోకమున చిదాకాశమున కూర్ధ్వమైన పథమనగా అనాహతము నుండి పైనున్న సహస్రారమును చేరబోవుటకు సుషుమ్నా మార్గమున పైకిక్రిందికి కుండలిని ప్రయాణించుచున్నను సుషుమ్నా మార్గమును వీడిపోవుట సంభవించదు. కావున తిష్ఠసి అను క్రియ సార్థకముగా ప్రయోగింపఁబడినది. ఈ శ్లోకమున కిది కుండలినీ యోగపరమైన వ్యాఖ్యాంతరము.

**అవతారిక:–** పై శ్లోకమున అమ్మవారు చిదాకాశోర్ధ్వగపరాకాశస్థ అని చెప్పఁ బడినది. ఈ శ్లోకమున సర్వోర్ధ్వస్థితయైన ఆమె సప్తధా (సృష్టి) వమన రూపమైన అధోమార్గస్థితి చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ సప్తధా వమసి యా త్వమీశ్వరి!**
**వ్యోమశాన్తముఖచిద్గుణాస్పదమ్।**
**ఆశ్రితాన్ నయసి నాపరం శివం**
**ద్వన్ద్వయాద్వయపథాతిలఙ్ఘినీ॥ 29**

**ప్రతిపదార్థము:–** ఈశ్వరి=ఓ ఈశ్వరీ!, యా=ఏ, త్వమ్=నీవు, శాంతముఖ చిద్గుణాస్పదమ్=శాంతస్థితి ఆరంభమునగల చైతన్యము గుణములకు స్థానమైన, వ్యోమ=ఆకాశమును, సప్తధా=ఏడు విధములుగా, వమసి=వహించుచున్నావు, నా=మనుష్య (గురు) రూపవై, ఆశ్రితాన్=ఆశ్రితులను, పరమ్=సర్వోత్కృష్టమైన, శివమ్=శివుని, నయసి=చేర్చుచున్నావు, ద్వంద్వయా=ద్వంద్వవృత్తిలో, అద్వయ పథాతిలంఘినీ=అద్వయమార్గమును దాటుదానవు.

**తాత్పర్యము:–** ఓ ఈశ్వరి! చైతన్యమునకు గుణములకు ఆస్పదుడగునట్లు శివునొనరించి తద్ద్వారమున సప్తవిధసృష్టి నొనరించెదవు. గురురూపిణివై ఆశ్రితులను శివుని చేర్చెదవు. ద్వంద్వవృత్తితో అద్వయ మార్గమును దాటుదువు.

**వివరణము:–** 1) శివునకు (ఆత్మకు) ఈశ్వరత్వ జీవత్వములు లేవు. ఆయనకు ఈశ్వరత్వము లేక జీవత్వము కల్పింపగల సామర్థ్యము అమ్మవారికే ఉన్నది. కావున ఐశ్వర్యమిందుమౌలేః ఇత్యాది శ్లోకములలో అమ్మవారే ఐశ్వర్యమని చెప్పియుండుట చేతను, శివుని ఈశ్వరత్వము అమ్మవారి అధీనమైనదే కావున ఈశ్వరి అని సంబోధింపబడుట సాభిప్రాయము. 2) సర్వవికల్ప శాంతత్వము చిత్తునందుండును. కావున చిత్తు శాంతముఖము అని విశేషింపఁబడినది. గుణములు ఈశ్వరగతములు

అని ఇచట గమనింపఁవలెను. సమగ్రమైన ఐశ్వర్యము, వీర్యము, యశస్సు, సంపద, జ్ఞానము, వైరాగ్యము అను గుణములు కలవాడు భగవానుడని చెప్పఁబడినది. పై ఆరు గుణములకు భగమనిపేరు. ఇటువంటి మరికొన్ని గుణములను కలిపి భగమని భాస్కరరాయలు చెప్పినారు. శ్వేతాశ్వతరోపనిషత్తున సర్వజ్ఞత స్వాతంత్ర్యము మొదలైన ఆరుగుణములు ఈశ్వరుని షడంగములుగా చెప్పఁబడినవి. ప్రాణుల ఉత్పత్తి వినాశములు, జడముల గమనాగమనములు జీవుల బంధమోక్షహేతువులైన క్రియాద్వంద్వములు రెండు గుణద్వయమొకటి (విద్యా విద్యలు) మొత్తము మూడు ద్వంద్వములను అనగా ఆఱుగుణక్రియల నెఱుగు వాడు భగవానుడని భగవచ్ఛబ్దము మరొక విధముగా నిర్వచింపఁబడినది. ఈశ్వర భగవచ్ఛబ్దములు పర్యాయములుగా లోక వ్యవహారమున నుండుటచే ఈ త్రివిధ మైన షట్కమును గుణశబ్దముచే గ్రహింపనగును. ఐశ్వర్యాది షడ్గుణములు, ఉత్పత్త్యాది షట్క(జ్ఞాన)ము అనుత్తర ప్రాణవనాదబిందు కలా షడధ్వ మార్గమునకు చెందినవని, ఈశ్వరగతమైన సర్వజ్ఞత్వాది షట్కము మోక్షార్థి సాధకగతమైన శమాదిషట్కము ఆజ్ఞ సాధారణ లౌకిక జీవగత మైన కామాది (అరి) షట్కము సంవిత్ షడధ్వమార్గమునకు చెందినవని, అపరామర్శ షట్కాత్మక సంహితాదులలోని మాతృకార్ణషడధ్వమునకు చెందిన సంధి విగ్రహ యానాసనద్వైధీభావ సమాశ్రయములనెడి పర్యాయములు గల వాగర్థ కార్యాత్మక షట్కమును గుణశబ్దముచే గ్రహింపనగునని దివ్యచకోరిక చెప్పినది. జీవ సమష్టిత్వమే ఈశ్వరత్వమను అభిప్రాయమున పై షట్కముల నన్నిటిని గుణశబ్దముచే గ్రహించుట ఉచితమని దివ్యచకోరిక అభిప్రాయము కావచ్చును. వాగధ్వములైన వర్ణముల పదముల మంత్రముల అర్థాధ్వములైన కలల తత్త్వముల భువనముల మొత్తము ఆఱు త్రిపుటులు. వాని సమష్టి ఒకటి, మొత్తము ఏడు త్రిపుటుల రూపమున అమ్మవారు చేసిన వమనము (సృష్టి) సప్తధావమన మనియు దివ్యచకోరిక చెప్పినది. మరొక విధమున చిద్వ్యోమ ధామమున మనోబుద్ధి పంచేంద్రియ వృత్తులనెడి సప్తస్రోతస్సుల ప్రవాహ ప్రకారమున సప్తధావమనమును చెప్పినది. మరొక విధముగా సంవిత్తున ఆరమ్భ, తరుణ, యౌవన, ప్రౌఢ, ప్రౌఢాంత, ఉన్మన, అనవస్థలనెడి ఉల్లాస సప్తక రూపమున సప్తధావమనమును చెప్పినది. మరొక విధముగా నాదమున షడ్జాదిస్వర సప్తక రూపమున బింద్వర్ధచంద్ర రోధినీ, నాద, నాదాంత, శక్తి, వ్యాపికా, సమనోన్మన, ఆది, సూక్ష్మనాద నకమునందలి ఒక్కొక్క దానియందు అ, ఇ, ఉ, ఋ, ఌ, ఏ, ఓ అను ఏడింటి సృష్టి అను



సప్తధావమనమును చెప్పినది. పై వమన ప్రకారములు రెండును వాగధ్వమునకును సంబంధించినవి.

అర్థాధ్వ సృష్టియందును**‘సప్తప్రాణాః ప్రభవంతి తస్మాత్ సప్తార్చిషః సమిధః సప్తజిహ్వాః సప్తఇమే లోకా యేషు చరన్తి ప్రాణాః గుహాశయా న్నిహితా స్సప్తసప్త, అతస్సముద్రాగిరయశ్చ సర్వేఽస్మాత్స్యన్దన్తే సింధవః సర్వరూపాః అతశ్చ విద్యా ఓషధయో రసాశ్చ యే నైషభూతస్తిష్ఠత్యన్తరాత్మా, సప్త తే అగ్నే సమిధస్సప్త జిహ్వాః సప్తర్షయ స్సప్త ధామప్రియాణి’** – ఇత్యాది వేదమంత్రములు సప్తధావమనమునే చెప్పు మంత్రములను పేర్కొన్నది. వీనిలో సముద్రములు గిరులు లోకములు ఋషులు మొదలగునెన్నియో సప్త సంఖ్యాకములు పేర్కొనఁబడినవి. ఇవి తైత్తిరీయ సంహితాంతర్గత మహానారాయణీయోపనిషన్మంత్రములు. ఇంతేకాక శ్రుతులలో సప్తవ్యాహృతులు పేర్కొనఁబడుట బహుజన విజ్ఞాతము. సాంఖ్య దర్శనమున **మూల ప్రకృతిరవికృతిః మహదాద్యాః ప్రకృతి వికృత యస్సప్త** (మహత్ అహంకారము పంచతన్మాత్రలు మొత్తము ఏడు ప్రకృతి వికృతులు) అవి కార్యకారణోభయావస్థలు కల పదార్థములు పేర్కొనఁబడినవి. హరివిల్లులోని వర్ణములేడు. ఇత్యాదిగా దివ్యచకోరిక సప్తధావమనమును బహుధా వివరించినది.

2) ఓ ఈశ్వరి! నీవు ఆకాశరూపిణిగా నుండియు వివిధాకృతులుగల ప్రణవానుత్తర ప్రకృతిని సృజించుచున్నావని మరొక విధముగా పూర్వార్థమును వివరించినది. శాంతముఖ చేతనులకు, గుణములకు ఆస్పదముగా వ్యోమముగా ఉన్న నీవు సప్తప్రకారముగా సృజించినావు అన్నట్లుగా కూడ పూర్వార్థమును మరొక విధముగా వివరించవచ్చును. శాంతముఖమును చేతన విశేషణముగా శకారము అంతమందు గల ఈశుడు (రాజు) మొదలైన చేతనులు అను అర్థము వచ్చునట్లు చేయవచ్చును. గుణాస్పద విశేషణముగా శకారము అంతమందుగల ఆకాశ(ము) మొదలైన సత్త్వరజస్తమో గుణాస్పద జడములు అను అర్థము వచ్చునట్లు చేయవచ్చును. **‘మూల ప్రకృతి రవికృతిర్ మహదాద్యాః ప్రకృతి వికృతయస్సప్త షోడశకశ్చ వికారో న ప్రకృతిర్న వికృతిః పురుషః’** – అను సాంఖ్యకారికను తాంత్రికముగా ఈ క్రింది విధముగా వ్యాఖ్యానించినది. ఓంకారము లేక ప్రణవము సర్వహక్కులకు వికారములేని మూల ప్రకృతి (కారణము). దివ్యచకోరిక మూల ప్రకృతిని సాంఖ్య ప్రణవమని పేర్కొన్నది. వైదిక వాగర్థ భేద వివక్షతో అనుత్తరాకార

వికృతి రూపమున ఏడవదానవు, ఎనిమిదవ దానవును అగుచున్నావు. వైదిక హక్కు మాత్రము వికృతిరహిత కావున ఏక రూపయే. అది వికారరహితమైన తొమ్మిదవదానవగు చున్నావు. అట్లే ఆయా మాతృకార్ణ సమామ్నాయ భేదమున నవమివి, దశమివి, ఏకాదశివి, ద్వాదశివి, త్రయోదశివియునై సృజించెదవన్నట్లు వ్యాఖ్యానించినది. దీనినింకను ఇట్లు వివరించవచ్చును. మాతృకార్ణ సమామ్నాయ ప్రకార భేదములున్నవి. వైయాకరణ మాతృకార్ణ సమామ్నాయమున అచ్చులలో హ్రస్వములు మాత్రమే ఉన్నవి. ఉదాహరణమున కింరు 'ఓ' అనునది సప్తమి (ఏడవమాతృక) ఇట్లే పదునాఱచ్చులుగల మాతృకార్ణ ప్రకారము మరొకటి ఉన్నది. ఇందు ఆ, ఓ అను మాతృకయే త్రయోదశి అగును. ౯ కారమునకు దీర్ఘములేదు. అను పక్షము నాశ్రయించి పై త్రయోదశియే ద్వాదశియని చెప్పఁబడుట కవకాశ మేర్పడును.

ఋ, ౯ వర్ణముల సావర్ణము ననుసరించి ౯ వర్ణమును తొలగించి లెక్కించినచో ఆ ఓకారమే ఏకాదశి అని చెప్పఁబడుట కవకాశమేర్పడును. ఇట్లు ఏ నీవు వ్యోమమును సృజించుచున్నావో ఆ నీవు ద్వంద్వవృత్తితో గుప్త భాషిత విజృమ్భణ వ్యవహారమున సాధారణమనుష్య వ్యవహారమునను వ్యవహరింపఁ బడినావన్నట్లుగా కూడ వ్యాఖ్యానించినది. 3) వ్యవహార భేదమిట్లు ప్రసక్తము కాగా **'అద్వైతం కే చిదిచ్ఛంతి ద్వైతమిచ్ఛంతి చాపరే మమ తత్త్వం నజానంతి ద్వైతాద్వైత వివర్జితమ్'** (కొందరద్వైతమును, ఇతరులు ద్వైతమును కోరెదరు. ద్వైతాద్వైత వివర్జితమైన నా తత్త్వము నెఱుగరు) అను సూక్తి అమ్మవారి అద్వైత తత్త్వమును వారించదు. కాని అద్వైత తత్త్వ వ్యవహారమును మాత్రము వారించును. ఈ అంశమే 'అద్వయ పథాతి లంఘినీ' అని నాల్గవ పాదమునందలి విశేషణము సూచించును – అని క్రమప్రకాశిక చెప్పినది. ప్రతి దర్శనమునకు పారిభాషిక ప్రక్రియాదికమైన పథముండును. అట్లే అద్వయ దర్శనమునకున్న పథము అద్వయపథముండును. ఈ విశేషణమున 'పథాతిలంఘిని' అని చెప్పఁబడినదే కాని అమ్మవారు అద్వయ కాదు అని చెప్పఁబడలేదు. తత్త్వమద్వయమై ఉండగా వ్యవహార మెట్లున్ననేమి? వ్యవహారము తత్త్వమున ప్రకారాంతరమును కలిగించలేదు గదా! మరియు 'స్వాశ్రితాన్ – పరం – శివం – న – యసి – న – అపరం – శివం – నయసి' – అమ్మవారు తననాశ్రయించిన వారిని పరశివుని చేర్చునే కాని



అపరమ్ అనుత్కృష్టుడైన సంసారియైన శివుని ననయసి అనాపరమ్ అను పదశబ్దమును న+అపరమ్ అని విభజించి వ్యాఖ్యానించినది. శాంతముఖ చిద్గుణాస్పదమ్ వ్యోమ అను సమాసమును శాంతముఖం చిద్గుణాస్పదమ్ అని ఉభయపద కర్మధారయగా విగ్రహించినది. 4) రెండు వ్యాఖ్యానములును రెండవ పాదమును ముఖ్యముగా **శాంతముఖ** అను విశేషణమును సరిగా వివరింపలేక పోయినవని అనిపించుచున్నది. పాఠముననేదైన మార్పు కాలక్రమమున సంభవించినదేమో, మూలపాఠమిది కాదేమో అనిపించుచున్నది. అస్తు. స్థితగతిశ్చింతనీయా అని కూడా పెద్దల సూక్తి. 5) **శివమద్వైతం చతుర్థమ్మన్యంతే** అను మాండూక్యోపనిషదర్థము జాగ్రత్స్వప్న సుషుప్తులు అను ప్రథమ ద్వితీయ తృతీయ అవస్థల కవతలనున్న స్థితిని చతుర్థమనుట. ఇది సమాధ్యవస్థ ఇది మొదటి మూడవస్థలలోని అనుభవాలకన్న భిన్నమైన అనుభవాన్ని కలిగిస్తుంది. అని కొందఱి అభిప్రాయము. ఆ అనుభవాన్ని వాక్కుల కందరాని అనుభవాన్ని అందించు అవస్థగానే పెద్దలు చెప్పుతారు. అందు భేదానుభవము లేకపోవుట చేత అది అభేదానుభవమని కొందఱి అభిప్రాయము. అది అభేదస్థితి యొక్క అనుభవము అని మరికొందఱి అభిప్రాయము. మరియు సమాధ్యవస్థ తొలగుట కూడ ఉన్నది. కావున అది అద్వైతానుభవమని చెప్పఁబడినందున దాని కవతలనున్నదే అమ్మవారి తత్త్వమని శాక్తేయులు దానిని 'సర్వావస్థా వివర్జితా' అని సమాధ్యవస్థ కూడా అనగా అద్వైతానుభవావస్థ ఆమెకు లేదనుభావమున అమ్మవారి తత్త్వమునాలుగు అవస్థల దాటినదే అని చెప్పెదరు. ఈ ఉద్దేశము తోడనే ఈ శ్లోకమున **'అద్వయ పథాతిలంఘినీ'** అను విశేషణము ప్రయోగింపఁబడినదని 'లఘిభోజననివృత్తే' అను ధాతువునుండి యేర్పడిన లంఘినీ శబ్దము అది అనుభవ సహితతత్వమునే బోధించునని దివ్యచకోరిక అభిప్రాయపడినట్లు తోచుచున్నది. భోగరాహిత్యమనగా స్వేతర విషయభోగ రాహిత్యమే, స్వరూపానుభవస్థితి మాత్రము కాదు. అట్లు అంగీకరించుట శూన్యవాదాంగీకారమే అగును. అలంఘినీ శబ్దము అనశ్నన్నన్యో అభిచాకశీతి అను కఠోపనిషద్వాక్యార్థము తోడి అభేదము కల అర్థమునే బోధించును.

ద్వైతపదమున ప్రవేశించియు ఈశ్వరాభేదమున భోగము నుండి నివర్తించుటతో తత్పరయగునది అనియే లంఘినీ పదార్థమని దివ్యచకోరిక వివరించినది. అనుత్తర

నాదమాతృకార్ణ క్రమమున సృష్ట్యాదియందు అద్వైక్యము గల ఏక ద్విమాత్రకములైన రెండు అకారములు అ-ద్వయ పదార్థమని మరొక విధముగా అద్వయపదమును వ్యాఖ్యానించినది. అనగా అ ఆ ఆరంభింపబడు వర్ణక్రమమున మొదటి అకారము ఏక మాతృకము రెండవ అకారము (ఆ) ద్విమాతృకము. అందువలననే అమ్మవారిని బోధించు పదము (కామకల) బిందుమాత్రయాత్మకమైయున్నది.

6) ప్రాప్యుడైన శివుడు ప్రాపకాభిన్నుడు కావున ప్రాపణార్థక ద్వికర్మక నీ ధాతువు యొక్క ప్రయోగము ననుసరించి శివుని విశేషణమైన పరశబ్దము ప్రాప్యశివుని బోధించును. లేక అకారమును ప్రశ్లేషించి వరుడు కాని అనగా స్వరూప భూతుడైన శివుని అపరమ్ అను విశేషణము బోధించును. స్వాశ్రితులు సిద్ధులు అయినచో ఇచ్ఛానుసారముగా అపరుడైన అనగా స్వాత్మయైన శివుని నయసి పొందించవు. పరశివునే పొందించెదవు. లేక అపర శివుడు స్వాత్మభిన్న శివుడు, వానిని పొందించవు. స్వాత్మరూప శివునే పొందించెదవు అని వ్యాఖ్యానించినది.

సిద్ధావస్థలోని ద్వంద్వవృత్తితో అద్వయ పదావలంబనము కాని అద్వయ పదాతి లంఘ్యము కాని సిద్ధుల ఆనందమున భేదము కలిగింపఁజాలవనుట సారము. మరొక విధముగా ద్వయపదములనగా జాగ్రదాదులు లేక సృష్ట్యాదులు వానిని స్వాశ్రియులతో దాటించనది. అంతర్భావి తణిజంతముగా లంఘినీ శబ్దమును భావించి వ్యాఖ్యానించినది. **'నహీమూషు మాతరగ్ం సువ్రతా నామృత స్యపత్నీ మవసేహు వేమ తు విక్షత్రామ జరంతీ వరూచీగ్ం సుశర్మాణమదితిగ్ం సుప్రణీతమ్'** అను మాత్రమున చెప్పఁబడినట్లు దేవమాతృ రూపిణి అదితి నామిక సిద్ధులను స్వాత్మ శివునే పొందించును. అని ఉత్తార్థమును వేదమంత్రముతో ప్రమాణీకరించినది.

**అవతారిక:-** పై శ్లోకమున సృష్టి కర్త్రియై బంధమును కలిగించు అమ్మవారే శివునిజేర్చి, మోక్షమును కూడ కలిగించునని చెప్పఁబడినది. ఈ శ్లోకమున ఆమె చతుర్విధ వాగ్రూపిణి అయ్యు తగ్వాచ్యయు తల్లక్ష్యయు అగునని చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ యా ప్రమాతరి నిషేదుషీ పరా**
**ప్రత్యగాత్మని విమర్శ విగ్రహా।**



**వాగియం త్రివిధభావ భాసితా**
**త్వాం స వక్తి కిముతామ్బ! వైఖరీ॥ 30**

**ప్రతిపదార్థము:-** అమ్బ=అమ్మా!, యా=ఏది, (కాలి) ప్రమాతరి=ప్రమాతయైన, ప్రత్యగాత్మని=ప్రత్యగాత్మయందు, పరా=పరయై, నిషేదుషీ=కూర్చొన్నదో, విమర్శ విగ్రహా=విమర్శ విగ్రహము కలదైనదో, త్రివిధ భావ భాసితా=మూడు విధములైన భావములతో భాసించియున్నదో,ఇయమ్=ఈ, వైఖరీ=వైఖరియైన, వాక్=వాక్కుగా నున్న, సః=అది(శబ్దము), త్వామ్=నిన్ను, వక్తి=చెప్పును అని, కిముత=వేరుగా చెప్పవలెనా!

**తాత్పర్యము:-** ప్రమాతయగు ప్రత్యగాత్మయందు పరగా కూర్చొనియుండు విమర్శ విగ్రహమును ధరించి మూడు విధములయిన భావములతో భాసించిన వైఖరీ వాగ్రూపగానున్న శబ్దము నిన్ను చెప్పునని వేరుగా చెప్పనక్కఱలేదు.

**వివరణము:-** ప్రమామ్ అతాతీతి ప్రమను వ్యాపించును. అను వ్యుత్పత్తి నాశ్రయించి యథార్థ జ్ఞానమును పొందువాడు ప్రమాత అని చెప్పఁబడును. జ్ఞానము స్వతః ప్రమాణము అను పక్షము నాశ్రయించిన అయథార్థ జ్ఞానమును పొందువాడు గూడ ప్రమాతయే యగును. ప్రత్యగాత్మయే ప్రమాతయగును. అట్టి ప్రమాతృరూప ప్రత్యగాత్మయందు పరావాక్కు అభిన్నగానుండును. ఈ పరావాక్కు సంవిద్రూపిణి ప్రత్యగాత్మాభిన్న మూలాధారమున ఇచ్ఛావశ వాయు ప్రేరణమున జనించు వాక్కు కూడ పర అని పిలువఁబడును.

ప్రత్యగాత్మ యందుండి పరాగ్గతిని ఆరంభించిన తొలి వాగ్దేవియొక్క అవతారము ఈ రెండవ పర సంవిద్రూపమున నుండి విమర్శ రూపమును ధరించుట కీ పర పశ్యంతిగా పరిణమించును. ఇది శరీరము నుండి బహిర్గమనము చేయుటకు ముందు స్ఫోట(ము) మధ్యమ అను మధ్యస్థితి నొందును. ఈ శ్లోకంలోని మూడవ పాదమున త్రివిధ భావభాసితా అను విశేషణమున పరా పశ్యంతీ మధ్యమలే త్రివిధ భావములని లేక ప్రమాతృ ప్రమాణ ప్రమేయములే త్రివిధ భావములని రెండు విధములుగా ఆ విశేషణమును వివరించినది. ఇట్లు త్రివిధ భావభాసితమైన వైఖరి, త్రిపుట్యధిష్ఠానమైన నిన్ను (చతుర్విధ వాక్సమష్టిరూపను) ప్రత్యగ్రూప అని ఏల చెప్పదు. తప్పక చెప్పునని వివరించినది.

ప్రమాతరి అనుపదమును ప్రత్యగాత్మకు విశేషణము గాకుండ కూడ పరమాత్మ రూపిణి మాతలకందతికన్న పెద్ద (తల్లి) మాత కావున ప్రమాత అనఁబడునని స్త్రీ వాచకముగా కూడ వ్యాఖ్యానించినది.

పరా పశ్యంతీ మధ్యమా వాక్కులు వాచకములు. నీవు వాచ్యమైనదానవు. లోకమున వాచకత్వ వాచ్యత్వములు కలుగుటకు వానిమధ్య సంకేతముండ వలెను. ఆ సంకేతము లేకుండగనే అవి నిన్ను చెప్పుటకు యత్నించుచుండగా వైఖరి నిన్ను చెప్పుననుట పునరుక్తిప్రాయమే అని కిముత శబ్దము వ్యజించును. నవక్తి అను పాఠాంతరమును స్వీకరించి పరయే చెప్పలేక భాసనము మాత్రమే చేయునప్పుడు దాని యొక్క నాల్గవ అవతారమై మిక్కిలి బహిర్భూతయైన వైఖరీ వాక్కెట్లు చెప్పును, చెప్పలేకపోవుటలో వింతయేమున్నది. అను అర్థము వచ్చు విధముగా కూడ వ్యాఖ్యానించినది.

**యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ** మనస్సుతో పాటు వాక్కులును ఆత్మను చెప్పలేవు – అను శ్రుతిని ఈ అర్థమునకు ప్రమాణముగా పేర్కొన్నది. అందువలన అమ్మవారు వాచ్యగాక లక్ష్యమాత్రమే అగును. అది వాక్కు. వాక్కు వచనకర్త తదభిన్నయైన అంతరాత్మయైన అమ్మవారే. కావున ఒకే పదార్థము కర్మ కర్తయునగుట కర్మకర్తృ విరోధమనఁబడును.

క్రమప్రకాశిక పరాపశ్యంతులు రెండు ప్రత్యగాత్మ విమర్శ రూపము. ప్రత్యగాత్మ యందుండునవి. కావున పరమాత్మను భాసింపఁజేయుట ద్వారా మధ్యమ (స్ఫోట) కు అమ్మవారికి వాచక వాచ్యత్వావకాశముండుట చేతను అన్న వాక్కులును వాచకములని చెప్పుట కవకాశముండగా వాచ్య వాచకత్వము సంకేతస్వరమున రూఢమైన వైఖరి నిన్ను చెప్పుననుటలో వింతయేమియు లేదు. అదిగాక సర్వరూపిణివైన నిన్ను సర్వశబ్దములు చెప్పుచుండగా వైఖరీవాక్కేల చెప్పదనుటలో వింతలేదు. ఈ అర్థమునకు ప్రమాణ శ్రుతి **'సర్వే వేదా యత్పద మామనంత'** వాక్య పదీయమున జ్ఞానరూప పరావాక్కునకు పరిణామము చెప్పఁబడినది. పరా పశ్యంతీ మధ్యములకు వాచ్యవాచక భావము రూఢము కాకపోయినను, అవి అమ్మవారిని చెప్పునని పెద్దలు చెప్పుచుండగా వైఖరి చెప్పుననుటలో ఆశ్చర్య మేమున్నది. అని మధ్యమావాక్కు (స్ఫోటము) వ్యంజకమని వ్యాకరణశాస్త్రము



చెప్పును. వైయాకరణుల అడుగు జాడలలోనే సాహిత్య శాస్త్రకారులు వ్యంజన నంగీకరించినారనుట అభియుక్తోక్తి.

**అవతారిక:–** పై శ్లోకమున కాలిక పరాది సర్వశబ్ద ప్రతిపాద్య అని విమర్శ విగ్రహ అని చెప్పఁబడినది. ఈ శ్లోకమున ఆమెను ప్రతిపాదించు వాక్కులు నాద బిన్దు లిపి విగ్రహాలు అని చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ నాదబిన్దులిపివిగ్రహా గిర**
**స్తిస్ర ఊర్ధ్వగ విమర్శశీకరాః।**
**సంహృతిస్థితివిసృష్టిధామసు**
**వ్యాహృతాస్త్వదధ ఈశవల్లభే॥** **31**

**ప్రతిపదార్థము:–** ఈశవల్లభే=ఓ ఈశ్వరుని ప్రియురాలా!, నాదబిన్దులిపి విగ్రహాః =నాదబిన్దులిపులే విగ్రహములుగా గల, తిస్రః=మూడు, గిర=వాక్కులు, ఊర్ధ్వగ విమర్శశీకరాః=పైనున్న విమర్శ శక్తి యొక్క అల్పాంశములు, త్వదధః=నీ క్రింద, సంహృతి స్థితి విసృష్టి ధామసు=సంహార స్థితి సృష్టులు అను ధామములందు, వ్యాహృతాః=చెప్పఁబడినవి.

**తాత్పర్యము:–** విమర్శ రూపిణియైన అమ్మవారు అను సముద్రమందు నాద బిన్దులిపులు శరీరభాగములుగాగల మూడు వాక్కులు (పశ్యంతీ మధ్యమా వైఖరులు) సంహారస్థితి సృష్టిధామములందు చెప్పబడినారు.

**వివరణము:–** పరావాక్కు విమర్శ రూపిణి. సంవిద్రూప పరామర్శ రూపిణి. రెండును విమర్శ రూపములే. కావున అవి అభిన్నములుగా వ్యవహరింపఁబడుట గలదు. మరియు అన్ని వాక్కుల సమష్టియే సంవిద్రూపిణి కావున వ్యష్టుల యందభిన్న వ్యవహారము ఉచితమగుచున్నది. పరాశక్తి సముద్రమునందు పశ్యంతీ మధ్యమా వైఖరులు జలకణముల వంటివి. పరావాగుత్పద్యతే అని తంత్రాలలో చెప్పఁబడకున్నట్లయితే లేదా ఉత్పద్యతే అన్నమాటకు అభివ్యక్తమగును అని అర్థము చెప్పినప్పుడును ఈ రెండు రకాల పరల అంగీకరింపవలసిన ఆవశ్యకతలేదేమో. అస్తు.

దివ్యచకోరిక ననుసరించి లిపి అనే పదానికి కల అని అర్థము. నాద బిన్దు కలలు అనే పదానికున్నంత ప్రాచుర్యము నాద బిన్దు లిపులు అను మాటకు లేదు. కావున లిపి శబ్దము కలా పర్యయముగా ఈ కవిచేతనే భావింపఁబడినదేమో!

మహావిరాడ్ గాయత్రీ వాగర్థ ప్రథమాంశ రూపమున వాణీ రూపిణీ! అని ఈశవల్లభా శబ్దార్థము. గిరః అను పదమునకు వాగ్దేవతలు అని అర్థము.

ఊర్ధ్వగ విమర్శాశీకరములు ఊర్ధ్వభూమియందున్న విమర్శ సముద్ర మందలి జలకణములు సంహారస్థితి సృష్టులు శీకరశబ్దము త్రసరేణువులు అను అర్థమును బోధించును. త్రసరేణువులనగా త్రింశత్పరమాణువుల సమూహ మని అర్థము. ఆ మహా విమర్శ సముద్రములలో ఒక బ్రహ్మాండము యొక్క సంహారస్థితి సృష్టులు శీకరములగుచున్నవి అని భావము.

నాదమనగా వివక్ష అనగా చెప్పదలచుకున్నప్పుడు కలిగే అవ్యక్త ధ్వని. ఇది జన (లోక) వ్యాహృతి స్థానీయములు.వ్యాహృతులేడు.భూః, భువః, సువఃమహః, జనః, తపః, సత్యమ్ అనునవి వీనిలో ఐదవది జన (లోకము). బిన్దువనగా చెప్పదలచుకొన్న శబ్దము యొక్క ఆకారముగల నిశ్చయాత్మక బుద్ధి వృత్తి. బిన్దతి స్పన్దతి అను వ్యుత్పత్తి ననుసరించి ఇది తపోలోక వ్యాహృతి, తప ఆలోచనే అను ధాతువు నుండి పుట్టిన ఈ శబ్దము ప్రాణస్పందాత్మక బుద్ధి విశేషము అను అర్థము నిచ్చుటచే బిన్దు శబ్దము తపోలోక స్థానీయమైన పై బుద్ధి వృత్తిని బోధించును. అహంతా మమతాధ్యవసాయ రూపములైన సత్యలోక వ్యాహృతి స్థానీయమైనది లిపి. ఈ నాదబిన్దు లిపులు విగ్రహముగా గలవి సచ్చిదానంద స్వరూపిణియైన అమ్మవారికి క్రిందుగా నుండునవి యని త్వదధః అను శబ్దము బోధించును. ఇవి సువః, భువః, భూః, మూడు విలోమ స్థానములందు జనస్తపస్సత్యములను వ్యాహృతులు పఠింపఁబడినవి.

నాద బిన్దు లిపులుగా వ్యవహరింపఁబడినందుననే అర్థ ప్రక్రియయందు సంహార స్థితి సృష్టులుగా వ్యవహరింపఁబడినవి. అట్టి వాగర్థ శరీరములు గల పర ఆ ఉభయమునకు కేంద్రమునందున్నది. ఉభయమనగా భూః, భువః, సువః అనువానికి సత్యమ్ తపః, జనః, అను వానికి మధ్య కేంద్రమనగా మహః అను కేంద్రమునందు పర ఉండునను విషయము ప్రౌఢపద్ధతిలో ఈ శ్లోకమున చెప్పఁ బడినది. పరయొక్క బహిః పదములైన పశ్యంతీ మధ్యమా వైఖరీ రూప త్రైవిధ్యము అంతఃపదమున నాదబిన్దుకలా రూపముగా కూడ త్రైవిధ్యము విమర్శరూపిణికున్నది. చతుర్థ వ్యాహృతియైన మహ అనునది తురీయతత్త్వము. **'భూర్భువ స్సువరితివా ఏతాస్తిస్రో వ్యాహృతయః తాసా ముహస్మైతాం చతుర్థీమ్ మాహాచమస్యః ప్రవేదయతే**



**మహ ఇతి తద్బ్రహ్మ స ఆత్మా అంగాన్యన్యా దేవతాః'** అని తైత్తిరీయ శ్రుతి నాదమయ మహా వ్యాహృతియైన మహ అనుదాని వాగర్థములు బ్రహ్మత్వమును చెప్పినది. ఈ అంశమును ముగించుచు **తా వా ఏతాశ్చ తస్రశ్చతుర్ధా చతుస్రశ్చతస్రో వ్యాహృతయః తా యో వేద సవేద బ్రహ్మ సర్వస్మై దేవా బలిమావహంతి** అని ఈ నాలుగు వ్యాహృతులనెఱిగిన వారు బ్రహ్మజ్ఞుడని, బ్రహ్మయని వానికితర దేవతలు బలిని సమర్పించెదరని చెప్పినది క్రమప్రకాశిక. నాదమునకు స్థితితో, బిన్దువునకు సంహారముతో సంబంధము. శ్లోకమునందలి లిపి శబ్దము బీజ వాచకముగా భావించి దానికి సృష్టితో సంబంధమును చెప్పినది. ప్రథమ పాదములోని నాద బిన్దు లిపులకు మూడవ పాదములోని సంహార స్థితి సృష్టులకు క్రమసంబంధము చెప్పనక్కఱలేదని భావించినది. ప్రపంచ సారమనే తంత్ర గ్రంథమున జ్యోతీ రూప సన్నిధానమునుండి చిన్మాత్రశక్తి ప్రకృతి. దాని నుండి తద్వికృతియైన బిందువు ఏర్పడినదని, ఆశక్తి యొక్క విచికీర్షా రూపము, చిన్మాత్రయొక్క ఘనీభావమే బిందువు. కాలక్రమమున భిద్యమాన బిందువు నుండి స్థూల సూక్ష్మపరములు అను త్రైవిధ్యమేర్పడినది అని చెప్పఁబడినది.

స్థూలము బిందువు, సూక్ష్మము నాదము, పరము బీజము. శారదా తిలకమున పరమేశ్వరు నుండి శక్తి, శక్తి నుండి నాదము, నాదము నుండి బిందువు ఏర్పడినవి. కారణబిందువు నుండి బిందు నాద బీజములేర్పడినవి.

కలకు బదులుగాగాని బీజమునకు బదులుగాగాని లిపి శబ్దమును కవి ఏల ప్రయోగించినాడో రెండు వ్యాఖ్యలలోను కారణము చెప్పఁబడలేదు.

**అవతారిక:–** పై శ్లోకమున విమర్శ రూపిణి పరాశక్తికి బ్రహ్మాండ సృష్ట్యాదులన్ని క్రిందవేనని చెప్పబడినది. ఈ క్రింది శ్లోకమున ఊర్ధ్వశిఖరస్థుడైన శివుని దర్శింపఁ జేయునదైన అమ్మవారు ప్రార్థింపఁబడుచున్నది.

**శ్లో॥ దృక్క్రియాత్మశశిభానుమధ్యగం**
**ఖే చరత్యనలవత్సుధామ యత్।**
**యత్తదూర్ధ్వశిఖరే పరం నభ**
**స్తత్ర దర్శయ శివం త్వమమ్బికే॥** **32**

**ప్రతిపదార్థము:–** అమ్బికే=అమ్మా!, దృక్క్రియాత్మశశిభాను మధ్యగమ్=దృక్క్రియలు

స్వభావముగాగల ఆత్మయైన, చంద్రునకు సూర్యునకు మధ్యనున్న, యత్=ఏ, సుధామ=మంచి, ఖే=ఆ ఆకాశమున, అనలవత్=నిప్పువలె, చరతు=చరించెదవు, పరమ్=గొప్పనైన, నభః=ఆకాశము, యత్=ఏదో, తదూర్ధ్వశిఖరే=ఆతనికన్న ఊర్ధ్వశిఖరమున, తత్ర=అక్కడ, శివమ్=శివుని, త్వమ్=నీవు, దర్శయ=చూపుము.

**తాత్పర్యము:-** శశి(దృక్స్వరూపము) ఇడయందు, భానుడు క్రియయగు పింగల యందు వాని మధ్యనున్న సుధామము సుషుమ్న దానిలోని పరాకాశమున సూర్యచంద్రులకు ఊర్ధ్వమునను ఏతేజము నిప్పువలె తిరుగునో దాని ఊర్ధ్వ శిఖరమున పరమశివుని నాకు అమ్మా! చూపుము.

**వివరణము:-** దివ్యచకోరిక ననుసరించి దృక్ఛక్తి స్వరూపుడు చంద్రుడు. క్రియాశక్తి స్వరూపుడు భానువు. ఈ ఇరువురు దృక్క్రియాత్మలు ఇడాపింగలలయందు సంచరించెదరు. వీరి నడుమ, ఇడాపింగళానాడుల నడుమ, జఠరాగ్ని ఉన్నది. అది ఒక అగ్ని స్తంభమువలె మూలాధారము నుండి సహస్రారము వఱకు వ్యాపించియుండును. అనలధామయత్ అనుపాఠము ఈ అర్థమునకు మరింత అనుకూలము అనలవత్సుధామ అనుపాఠమును ప్రతికూలము కాదు. అనిలవత్ అను పాఠము ప్రాణవాయువు వలె అను అర్థమునిచ్చును. ప్రాణమునకు అగ్ని అను వ్యవహారము కూడ నున్నది. కావున అనలవత్ అనిలవత్ అను రెండు పాఠములును ఉచితముగనే ఉన్నవి.

ఉచ్ఛ్వాసనిశ్శ్వాస రూపమునగల అగ్నిషోమములను రెక్కలు గల ప్రాణపక్షి సంచరించును అని కూడ చెప్పcబడినది. సోమమనగా అమృతము. ఇది బయట వాయువులో వ్యాపించియుండును. కావున ఆకాశామృతము. ఆకాశగంగామృతము ఇత్యాది విధముగ చెప్పుకొనవచ్చును. సోమమనగా ఈ అమృతము. ఉచ్ఛ్వాస రూపమున ఈ అమృతమునే ప్రాణము శరీరమునకు దానియందలి (70) డెబ్బది వేల నాడులకు అందించి సంతోషపఱచును. **అహం వైశ్వానరో భూత్వా** అను భగవద్గీతా శ్లోకము ప్రాణము వైశ్వానరాగ్నియని స్పష్టముగానే చెప్పినది. చతుర్విధాన్నములను బయట పక్వము ఐనను భుజించిన వానిని మరల పచింపc జేయును. ఈ విధముగానే వైశ్వానరుడు (ప్రాణాగ్ని) చతుర్విధాన్నముల పాచకత్వమును వహించుచున్నాడు.



**'సోఽగ్రభుక్'** అని తైత్తిరీయమున చతుర్విధాన్నముల భోక్తృత్వమును కూడ చెప్పినది. భౌతికాగ్నికాదు. గనుక శ్లోకమున అనలవత్ (అగ్నివలె) అని చెప్పc బడినది. ఏమైనను అది సుధామ తేజోమయమగుటచేత అది సుధామ అనియే చెప్పcదగినది. పైగా తేజమే సూర్యచంద్రులలో వ్యాపించి యుండుటచే వానికి ఇది ఉపజీవకమైనది. సూర్యచంద్రమండలములలో కూడ వ్యాపించియున్న ఈ వైశ్వానరాగ్నిశిఖ (యష్టి) పై (శిఖరమున) ఉన్న ఆకాశము శ్రేష్ఠమైన ఆకాశము. సూర్యచంద్రులు కూడ ఆకాశచారులే. వారు తిరుగు ఆకాశము భౌతికాకాశము. ఈ శ్లోకమున చెప్పcబడిన 'ఖే' అనునది అదే. దాని ఊర్ధ్వశిఖరముననున్న ఆకాశము పరమాకాశము,**పరమేవోమగ్** అని శ్రుతిచే చెప్పcబడినది. ఇక్కడి అగ్ని సంకర్షణాగ్ని. 2) క్రమప్రకాశిక ఇక్కడి అగ్నిరూపము అక్కడ శివరూపమున రుద్రతేజమొకటే అని చెప్పినది. దృక్క్రియాత్మ శబ్దము శశికి విశేషణము. దృగ్రూపత్వము చెప్పును. 3)శివుడూర్ధ్వ శిఖరమునఉన్నాడనగా మిగిలిన సూర్యచంద్రులు క్రింది శిఖరములలో నున్నారని అర్థము వచ్చును. సూర్యచంద్రాగ్ని మండలములు అధః శిఖరములలో నుండగా పరశివుడు ఆ మండలములున్న శిఖరములకంటె ఎత్తైన శిఖరమున ఉన్నాడని అర్థము వచ్చును. అందును సూర్యచంద్రమధ్యమున అగ్నిఉన్నట్లు శ్లోకమున చెప్పcబడుటచే క్రింది భాగమున అగ్ని ఉన్నట్లు శ్లోకమున చెప్పc బడుటచే క్రిందిభాగమున అగ్ని ఉన్నను ఆ శిఖరమే ఊర్ధ్వశిఖరమని దాని పై భాగమున కైలాసమున లేక సుషుమ్నోర్ధ్వ సహస్రారమున శివుడున్నాడని అర్థము వ్యంగ్యమగును.

**అవతారిక:-** పై శ్లోకమున అభిన్న పరశివ దర్శనమర్థింపcబడినది. ఈ శ్లోకమున భేదాభేద సామరస్య రూపిణియైన అమ్మవారి వాగర్థాత్మక శరీరము ఆగమాను సారము వర్ణింపcబడుచున్నది.

**శ్లో॥ వైఖరీప్రభృతివాక్త్రయం పరే**
**మేయమానమితి కర్తృలక్షణమ్।**
**ఉద్భవస్థితిలయాత్మకం వపు**
**ర్భూరిభేదమపరం స్మరన్తి తే॥ 33**

**ప్రతిపదార్థము:-** పరే=పరాశక్తీ!, వాక్ స్వరూపిణీ! లేక, పరే=పరశివరూపాత్మ యందు, మేయమానమితి కర్తృలక్షణమ్=మేయము మానము మితి కర్తలు

స్వరూపముగాగల, ఉద్భవస్థితిలయాత్మకమ్=సృష్టిస్థితిలయలక్షణముకల, అపరమ్ =మరొక, భూరిభేదమ్=అధిక భేదముకల, వపుః=శరీరమును, తే=వారు, స్మరన్తి= స్మరించెదరు.

**తాత్పర్యము:–** అమ్మవారి అపరవాఙ్మయ శరీరము వైఖరీ మధ్యమా పశ్యంతీ మయము. అపరజ్ఞానమయశరీరము మేయ మాన మితిమయము. అపరమైన అర్థమయ శరీరము సృష్టి స్థితి లయాత్మికము అని ఆగమవేత్తలు స్మరించుచున్నారు.

**వివరణము:–** 1) పరావాక్కు పరశివ స్వరూపము లేక పరమాత్మ స్వరూపము. ఇది శివునకు పరమాత్మకు అభిన్నమైనది. పరం (శివా/ఆత్మా) భిన్నము. పరాశబ్దము పరాశక్తి అను అర్థమును గ్రహించినను అదియు పరా (శివ/ఆత్మా) భిన్నమే. ఇట్టి పరాశక్తియొక్క పర శివా/ఆత్మా భిన్న శరీరము పరమే అగును. అట్టి పరాశక్తి రూపకాళీదేవికి వాఙ్మయశరీరమున పరావాక్కును విడచి మిగిలిన పశ్యంతీ మధ్యమా వైఖరీ త్రయాత్మకమైన అపరశరీరము అను మరొక వాఙ్మయశరీరము కలదు. ఇది పశ్యంత్యాత్మకము మధ్యమాత్మకము వైఖర్యాత్మకము అను త్రివిధభేదములు కలది అని చెప్పనక్కఱలేదు. ప్రకాశకత్వాంశమును పురస్కరించుకొని సంవిత్తు కూడ వాగాత్మకమే అని భావించినప్పుడు అందలి మేయమాన మాతృ విరాడ్రూపము లైన త్రివిధ భేదములుగలది కావున ఇదియు భేదమయ శరీరమే అగును. భేదరహితమైన జ్ఞానమున మాతృమానమేయ భేదమును కల్పించునది. కావున ఇదియు భేదమయ శరీరమే అగును. భేదరహితమైన జ్ఞానమున మాతృమానమేయ భేదమును కల్పించునది. కావున ఇదియు భేదమయ శరీరమే అగును. ఇతరత్ర అనుపాఠము నాశ్రయించినపుడు ఈ మాతృమానమేయ త్రివిధ శరీరము అమ్మవారి అర్థమయ శరీరమునందలి భాగము అని గ్రహించవలసియుండును. వాఙ్మయ సవిన్మయ త్రిపుట్యాత్మకములైన ఈ శరీరములు భేదమయములే కాని సృష్టి స్థితి లయాత్మకమైన అర్థ ప్రపంచాత్మకమైన అమ్మవారి అపర శరీరము భూరి భేదమయము. ఇందు భేదములు స్పష్టముగా గోచరించును. కావున ఇది భూరి భేదమయమనుట సర్వ(జ్ఞాని) జీవానుభవ సిద్ధము. 3) వేదముల రూపము స్థిరమైన పిమ్మట ఆగమములలో అమ్మవారి వపు (తను) వీవిధముగా చెప్పఁబడినది. అని స్మరంతి అను పదము సూచించును. ఆగమవేత్తలు సర్వజ్ఞ (జ్ఞకల్పు)లు అగుటచేత వారు తమ కాలములలో దర్శించిన వారికి ప్రత్యక్షమైన లేక వారు విన్న వేదభాగము



లోని అర్థములను భావితరములవారికై దీర్ఘకాల జీవులైనవారు స్మరించిరి. అట్టి అర్థములు స్మరణములు, స్మృతులని పేర్కొనఁబడును. ఇవి ప్రత్యక్ష వేదునకు విరుద్ధములు కాని అంశములందు వేద సమప్రామాణ్యాము కలవి. ఐనను తద్విరుద్ధాంశములందు అప్రమాణములగుటచే వీనియందు అనగా కొన్ని అంశములందు ప్రామాణ్యము మరికొన్ని అంశములందు అప్రమాణ్యముగా ఉన్నందువలన వీనికి వేదమునకున్నట్లు స్వతః ప్రామాణ్యము లేదు. వీని ప్రామాణ్యము ప్రత్యక్ష వేద విరుద్ధాంశములందు అంగీకరింపఁబడదు. కావున స్మృతులు రెండవ తరగతికి చెందిన ప్రమాణములు. అదిగాక వేదముల వలె ఇవి అపౌరుషేయములని చెప్పఁబడక పోవుటచేత తత్తన్నామ (స్మరణ) పూర్వకముగా అందలి విషయములు ప్రతిపాదింపఁబడినందున ఇవి పౌరుషేయములు అని చెప్పఁబడుట చేతను ఇవి రెండవ తరగతికి చెందిన ప్రమాణములు. మరియు వేదమున చెప్పఁబడిన విషయములందును స్మృతులకు ప్రామాణ్యము లేదు. ఆ విషయములు అబాధితములైన అవి వేదముచే జ్ఞాతములే కావున ప్రామాణ్య నిర్ణాయకములైన అబాధితత్వ అజ్ఞాతత్వాంశములలో అజ్ఞాతత్వాంశము లేనందున ఆ విషయములలో వేదములే ప్రమాణములు కాని స్మృతులు కావు. కాని వేదములలో చెప్పినవానికి విరోధము లేకుండ వేదములలో చెప్పఁబడని విషయములలో మాత్రము వీనికి అజ్ఞాతత్వా బాధిత్వములు రెండునుండుటచే వేద సమప్రామాణ్య (ప్రాధాన్య)ము సిద్ధించును. వీనిలోని పౌరుషేయత్వాంశము అప్రామాణ్య హేతువు కాదు. 3) వాక్కునకు జ్ఞానమునకు ప్రకాశకత్వాంశమును పురస్కరించుకొని పరావాక్కు పరాసంవిత్తు అనఁబడు పరాశక్తియొక్క వాక్సంవిద్రూపములకు వెనుక భేదాభేదములు సూచింపఁపబడినవి. ఆ రెండును పర అని చెప్పఁదగినవనుటలో కొంత అభేదము తోచుచునేయున్నది. ఈ రెండు విధములైన పరత్వమును ఆత్మ యందలి పరత్వమునకు అభిన్నములనియు చెప్పఁజాలము. అట్లే ప్రకాశములైన వాక్సంవిత్తులకు వాని విషయములైన ప్రకాశ్యములైన అర్థములకు పూర్తిగా భేదముకాని అభేదముకాని చెప్పరాదు. కావున పరాసంవిద్రూపిణి పరాశక్తి భేదాభేద సామరస్యరూపిణి అని తంత్రములందు చెప్పఁబడినను ఆత్మకు ఆత్మశక్తి రూపిణియైన పరకు పారమార్థిక భేదము కూడ లేదు. వాని యొక్క పారమార్థిక మైన అభేదమునకు భేదాభేద సామరస్య రూపిణి అను వ్యవహారము కూడ ఏమాత్రము అనుచితము కాదు. 4) క్రమప్రకాశిక రెండవ పాదమునకు ఉపక్రాంత త్రిపుటిత్వమునకు

భిన్నముగా మాత, మానము, మేయము, మితి అను నాలుగు విభాగములు చెప్పినది. ఉద్భవ సంహారరూప విరుద్ధాంశములుగల అర్ధ ప్రపంచమయమైన అమ్మవారి అర్థమయ శరీరము భూరిభేదము కలదని స్పష్టీకరించినది. మొదట అమ్మవారి యొక్క శరీరమున పరాపరద్వైవిధ్యము, తర్వాత అపరవపువు యొక్క త్రైవిధ్యమును చెప్పినది.

**అవతారిక:–** పై శ్లోకమున అమ్మవారి యొక్క పరాపర వపుర్ద్వైవిధ్యము, అపర వపువు యొక్క త్రైవిధ్యము ప్రకాశ్యార్థమయ ప్రపంచరూప అపరవపువు యొక్క భూరి భేద మయత్వము మొత్తము మీద వాగర్థ ప్రపంచముల యొక్క భేదాభేద సామరస్యము చెప్పఁబడినది. ఈ శ్లోకమున భూరిభేదమయమైన అర్ధ ప్రపంచము యొక్క (ప్రాణాదిరూప) పంచవాహత్వము చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ విశ్వమూర్తి యదదృష్ట విగ్రహం**
**త్వత్ప్రశాన్తిపరమైశ్వరం వపుః।**
**తత్ర తే య ఉదయః కులేశి! తం**
**సృష్టిరాశ్రయతి పఞ్చవాహతా॥** 34

**ప్రతిపదార్థము:–** కులేశి=ఓ కులేశ్వరీ!, యత్=ఏ, వపుః=శరీరము, విశ్వమూర్తి= విశ్వరూపమో, అదృష్టవిగ్రహమ్=ఆకృతి కనఁబడని, స్వప్రశాన్తిపదమ్=తన ప్రశాన్తికి చోటైనదో, ఐశ్వరమ్=ఈశ్వరసంబంధమయినదో, తత్ర=దానియందు, తే=నీయొక్క, యః=ఏ, ఉదయః=ఉదయమో, తత్/తమ్=దానిని, పంచవాహతా=అయిదు ప్రవాహములు కలిగియుండుటయైన, సృష్టిః=సృష్టి, ఆశ్రయతి=ఆశ్రయించును.

**తాత్పర్యము:–** ఓ కులేశ్వరీ! విశ్వాకారముగలదైన నీ శరీరము ఆకృతిరహితమై ప్రశాన్తిపదమై ఈశ్వరసంబంధమై లేక ఈశ్వరమయమైనప్పుడు అక్కడ నీ ఉదయము అను సృష్టి పంచవాహతారూపమై యుండును.

**వివరణము:–** ఈ ప్రపంచమంతయు కాళీ శక్తిమయము. ఆమె శరీరము స్థూలము, సూక్ష్మము, కారణము, అని త్రివిధముగానుండును. ఈ త్రివిధ శరీరము విశ్వముననున్నను ఇంద్రియ గోచరమగునది స్థూలశరీరము మాత్రమే. (అమ్మవారి) స్థూలశరీరము నేను అభిమానించు ఈశ్వరాంశము వైశ్వానర నామకము, జీవాంశము విశ్వనామకము చేతనులైన జీవేశ్వరాంశకులు, అనాది అజ్ఞానవశమున



జడములైన బ్రహ్మాండ పిండాండములందు నేను అను అభిమానము వహించెదరు. బ్రహ్మాండ పిండాండములకు సమష్టి వ్యష్టి భావము కలదు. పిండాండము లేక పిండము వ్యష్టి, బ్రహ్మాండము లేక ప్రపంచము సమష్టి. శ్లోకములోని విశ్వమూర్తి శబ్దము ఈ సమష్టి వ్యష్టి బ్రహ్మాండ పిండాండముల ఆకారమును బోధించును. బ్రహ్మాండము ఈశ్వర స్థూల శరీరము పిండాండము జీవ స్థూల శరీరము. ఈ బ్రహ్మాండము నభిమానించు వాడు వైశ్వానరుడు. పిండాండము నభిమానించువాడు విశ్వుడు. ఈ రెండింటికి అభేదము నాశ్రయించి విశ్వమూర్తి అని అమ్మవారి శరీరము పేర్కొనఁబడినది. 2) విశ్వునిమూర్తి కలది అను విగ్రహము నాశ్రయించి విశ్వుల శరీరములైన పిండాండములు వాని సమష్టియైన బ్రహ్మాండము వైశ్వానర శరీరమే అయినను సమష్టి వ్యష్టులైన వైశ్వానర విశ్వుల అభేదము నాశ్రయించి విశ్వమూర్తి అని చెప్పఁబడినది. ఈ స్థూల శరీరమున (స్థూలము అనగా ఇంద్రియ గోచరము అట్టిది కాని) సూక్ష్మశరీరమున్నది. ఇది ప్రాణేంద్రియమనోబుద్ధి మయము. మరణ సమయమున ఇది జీవుని స్థూల శరీరమును విడచివేయును. ప్రలయ సమయమున బ్రహ్మాండమయ విగ్రహము దృష్టము కాదు (కానిపింపదు). కావున శ్లోకమున అదృష్ట విగ్రహమని చెప్పఁబడినది. ఆ ప్రలయ సమయమున విశ్వవైశ్వానరులు మృతులు అని చెప్పదగినవారే కాని హిరణ్యగర్భునందు తమ శరీరములతో సహా లీనులై ఉన్నారని చెప్పుట ఎక్కువ శాస్త్రీయము. ప్రలయ కాలమున స్థూలమంతయు సూక్ష్మమున లీనమగును. వ్యావహారికముగ స్థూలము సూక్ష్మముగ విపరిణతమైనది అని చెప్పవలయును.

మూడవ పాదమున తే ఉదయే అనగా లీనమైన ఆ స్థూలము మరల మరల ఇంద్రియగోచరమగునట్లు పరిణమించును. సూక్ష్మశరీరము కూడ లీనమగు స్థితి మహా ప్రలయ మనఁబడును. అట్టి స్థితిలో తైజస హిరణ్యగర్భులు అనఁబడు సూక్ష్మవ్యష్టి సమష్టి శరీరాభిమానులు అవ్యాకృతము అనఁబడు ఈశ్వరుని (కారణ) శరీరమున తమ సూక్ష్మశరీరములతో సహా లీనులై యుందురు. సృష్టిక్రమమున సూక్ష్మశరీరము కారణశరీరము నుండి పరిణామముగా వేర్పడి పిదప స్థూలములుగా పరిణమించును. అప్పుడు ప్రాణేంద్రియాది మయ సూక్ష్మ శరీరము స్థూలముగా పరిణమించి స్థూలమగును. 3) దివ్యచకోరిక ననుసరించి విశ్వమూర్తి అనగా వ్యోమవ్యాప్యాదికమైన ఏకాశీతి (81) పదాత్మకమైన మూర్తి అని ఒక అర్థము.

విశ్వము అనగా ప్రపంచము యొక్క మూర్తి అనగా ఆకారము గలది అని మరియొక అర్థమునున్నవి. అదృష్ట విగ్రహా అను శబ్దమునకు చర్మచక్షువులకు గోచరము కాని వివిధ గ్రహములు అనగా భేదాజ్ఞానములు గలది అని అర్థము. ఇది అర్థ క్రమమునకు సంబంధించినది. అమ్మవారి విశ్వమూర్తి భేదవాసనా రూపము. అది స్థూలమైనను సూక్ష్మమైనను అది కారణమైనను వాసనా రూపమున భేదముండును. ఒకవేళ భేదము స్థూలముగా ఇంద్రియగోచరము కాకపోయినను తద్వాసన సూక్ష్మ కారణములలో లీనమైయుండునని భావము. అనుత్తరమైన అకారముచేత దృష్టమయ (శబ్దార్థ మయ) శరీరమని మరొక అర్థము కూడ ఉన్నది. ఈ అర్థము శబ్దక్రమమునకు సంబంధించినది. త్వత్ / తత్ ప్రశాన్తి పదమ్ అను రెండు పాఠములలోని ప్రశాన్తి పదము ఈశ్వర వపువే. తత్ అను పాఠమున పరోక్షమైన అను అర్థము విశేషించి చెప్పఁబడినది. అది ఎట్లును అదృష్ట విగ్రహమే కదా! పరోక్షమనగా అచక్షుర్గోచరమేయని కదా అర్థము. ఇది విజ్ఞులకు విస్పష్టమే. అట్టి అదృష్ట విగ్రహము నుండి ఉదయమనగా పంచాక్షమాలామయ జ్ఞానేంద్రియపఞ్చక వికాసరూపము లేక చెప్పఁబడఁబోవు ఖేచర్యాది వృత్తి పంచకరూపము. 1) జ్ఞానగర్భిత క్రియాశక్తి రూపమునయినది కర్మేంద్రియ వృత్తి ప్రవాహతరూపము. 2) క్రియా గర్భితమైన జ్ఞానశక్తి వికాసరూపమైన కర్మేంద్రియవృత్తి ప్రవాహతా రూపము 3) ఉభయ సామరస్య వికాసరూపిణి ఖేచర్యాది శక్తి పంచక ప్రవాహ రూపము అనునవి పంచవాహతా శబ్దార్థములు అనగా సృష్టి పైమూడు విధములైన పంచవాహతాత్మకము అని భావము.

'సువేశితమ్' అను పాఠమున అమ్మవారే ఈశ్వరరూపమున జగమును సృజించి **తత్సృష్ట్వా తదేవానుప్రావిసత్** అను ఉపనిషద్వాక్యము ననుసరించి తాను సృజించిన జగమున తానే ప్రవేశించినది అని భావము ఏర్పడును. కులేశి అను కాలీ సంబోధము చేత విశ్వమూర్తి అదృష్ట విగ్రహమ్ అను వపుర్విశేషణముల చేత శ్రీ చక్రము నందలి బిందు త్రికోశములు అంతస్త్రిపుటీ సామరస్యమయములని అష్టారాష్టదలములు అంతర్బహిర్బుద్ధీంద్రియ త్రిపుటీ సామరస్యరూపములని దశారద్వయషోడశదలములు అంతర్బహిర్విమర్శ క్రియాసాధన ప్రాణేంద్రియమండల ధీసూర్య మనశ్చంద్రయసామరస్య రూపములని చతుర్దశార భూపురములు అంతర్బహిరహఙ్కార చతుర్దశ విధాహంకార సామరస్యరూపములని సూచితమగును.



ఆ సామరస్యము వీనిలో ఈ క్రింది జంటలకు అని గమనింపవలెను.

| | |
|---|---|
| శైవము | శాక్తములు |
| బిందు | త్రికోణములు |
| అష్టదలము | అష్టకోణము |
| షోదశదలము | దశారద్వయము |
| భూపురము | చతుర్దశారము |

క్రమప్రకాశిక ననుసరించి ఈశ్వర(రి) శరీరము. శక్త్యుదయమున సవిశేషము అనగా ప్రశాన్తి పదమున శక్తి ప్రశమమున లేక ప్రలయమున నిర్విశేషము. అని ద్వివిధము. **ప్రాక్ సంవిత్ ప్రాణే పరిణతా** అను సూక్తి ననుసరించి సృష్టి క్రమమున ప్రాణసృష్టియే ప్రథమమను ఆగమ సిద్ధాంత మీ శ్లోకమున చెప్పఁబడినది.

**అవతారిక:–** పై శ్లోకమున అమ్మవారియొక్క విశ్వమూర్తి వపువు చక్షుర్గోచరమని, ప్రశాన్తిమయ వపువు అదృష్ట విగ్రహమని చెప్పఁబడినది. ఈ శ్లోకమున సృష్టి కాలి అని చెప్పఁదగిన ఆమె సముద్రము వంటిదని వాగర్థ సూక్ష్మ (స్థూల) పదార్థము లన్నియు తరంగములవలె ఆమెయందున్నవని చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ యా పరా స్ఫురతి శక్తిరమ్బికే**
**తత్ర హి త్వయి పయోధివీచివత్**
**శిఞ్జికావయవకార్థపఞ్చకం**
**వర్తతే వివిధసూక్ష్మవిగ్రహమ్॥ 35**

**ప్రతిపదార్థము:–** అమ్బికే=అమ్మా, యా=ఏ, పరా=పరారూపిణియైన, శక్తిః=శక్తి, స్ఫురతి=ప్రకాశించునో, తత్ర=ఆ, త్వయి=నీయందు, పయోధి వీచివత్= సముద్రమున తరంగములవలె, వివిధసూక్ష్మవిగ్రహమ్=అనేక విధములైన సూక్ష్మ శరీరములుగల, శిఞ్జికావయవకార్థ పఞ్చకమ్=మాతృకా (వర్ణమాలా) వయవముల యొక్క కార్యముల (భూతముల) పఞ్చకము, వర్తతే=ఉన్నది.

**తాత్పర్యము:–** అమ్మా! పరావాక్కుగా స్ఫురించు సముద్రమువంటి నీయందు వివిధ సూక్ష్మ శరీరములుగల వర్ణముల కార్యములైన పంచభూతమయ పదార్థము లన్నియు అలలవలె వర్తించుచున్నవి.

**వివరణము:–** అర్థ సృష్టి శబ్దముల నుండి యేర్పడినదని శాక్తతంత్ర సిద్ధాంతము

వాక్కు యొక్క స్థూల భేదములైన పశ్యంతీ మధ్యమా వైఖరులు పద వాక్యరూపమైన శబ్ద ప్రపంచము వాని అర్థములై స్థూలభూతమయ పదార్థములు, వాని సూక్ష్మ రూపములైన తన్మాత్ర పంచకము, ఇవి అన్నియు అమ్మవారి (శివుని) యందు స్ఫురించు పరావాక్కు అను సముద్రమందు అలలవలె వర్తించును. పరావాక్కు సూక్ష్మాతి సూక్ష్మము. దానియందు సూక్ష్మ పశ్యంతీ మధ్యమలు జనించును. దాని తరువాత జనించు వైఖరి వాని కన్న స్థూలము. ఇది చతుర్విధ వాక్కుల సూక్ష్మతాతార అతిసూక్ష్మతమ్యస్థితి. ఇందు వైఖరి పదములకన్న వాక్యములు స్థూలములు. వర్ణముల కన్న పదములు స్థూలములు. పదములకన్న సూక్ష్మములు వర్ణములు. ఈ చతుర్విధ వాక్కులు కూడ నిత్యములని వర్ణ(శబ్ద) నిత్యత్వ సిద్ధాంతము చెప్పును. 1) పదములు వర్ణ సమూహ రూపములు. వాక్యములు పద సమూహ రూపములు. ఒక్కొక్కప్పుడు ఒక్కపదము కూడ వాక్య రూపమును ధరించి యుండును. 2) అర్థపఞ్చకమ్ అనుపదము వివిధ సూక్ష్మవిగ్రహమ్ అను విశేషణము యొక్క సామర్థ్యముచేత తన్మాత్రలని చెప్పదగిన పృథివ్యాది పంచభూతముల సూక్ష్మ రూపములైన శబ్ద స్పర్శరూప రస గంధములను అయిదు సూక్ష్మభూతములను బోధించును.

సముద్రమున లోపల ధ్వనియుక్తములుగా తరంగములున్నట్లు (స్థూల) సూక్ష్మ పదార్థములన్నియు శబ్దయుక్తముగానే వర్తించునని దివ్యచకోరిక అభిప్రాయపడినది. మరియు సృష్టి కాలి అని చెప్పఁదగి, సృష్టికాలికశక్తియందు చతుర్విధ వాక్కులచే అభిధేయములైన పఞ్చభూతము లందు అభిధాయక శక్తి (అభిధ) యందును పంచవిధత్వముండునని ధ్వనించు అను అర్థమునిచ్చు శింజికా శబ్దముతో కూడిన శిఞ్జికావయవ అను విశేషణము యొక్క బలము వలన సూచించఁబడినట్లు తెలిపినది. అర్థపఞ్చకమ్ అను శబ్దమునకు జాతి, వ్యక్తి, ద్రవ్య, గుణ, క్రియలు అను పదార్థములైదు అను మరొక అర్థము కూడ చెప్పినది. పురుషార్థములు నాలుగు (ధర్మ అర్థ కామ మోక్షములు). వాని సామరస్యము అను అయిదు పదార్థములు అని మరొక అర్థము చెప్పినది. వివిధసూక్ష్మవిగ్రహమ్ అను సమాసమునకు అనేక విధములైన ఆకారములు గల సూక్ష్మములైన జ్ఞానములకు విషయములైన భూత పంచకమను అర్థము వచ్చునట్లు వ్యాఖ్యానించినది. క్రమప్రకాశిక శిజి అవ్యక్తే శబ్దే అను ధాతువునుండి శిఞ్జికా శబ్దము నిష్పన్నమైనదని చెప్పినది.



**అవతారిక:–** పై శ్లోకమున సముద్ర స్థానీయ పరాశక్తియందు, తరంగస్థానీయ అర్థ ప్రపంచము వర్తించునని చెప్పఁబడినది. ఈ శ్లోకమున ఆ ప్రపంచము యొక్క చతుస్త్రిక క్రమమున ద్వాదశ క్రమపదముగా జృంభితమగుట చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ త్వన్ముఖం త్రిపథనేత్రి! భాత్మకం**
**శక్తిబృన్దమిహ తుర్యథాగమమ్।**
**ద్వాదశ క్రమపదం పదాదిభి**
**ర్జృమ్భితం జగతి తచ్చతు స్త్రికైః॥** **36**

**ప్రతిపదార్థము:–** త్రిపథనేత్రి!=మూడు మార్గములకు నాయకురాలా!, త్వన్ముఖమ్= నీవు మొదలుగాగల, తుర్యథాగమమ్=నాల్గవ ప్రకారమునకు చెందినదిగా తెలిసికొనదగిన, శక్తిబృన్దమివ=శక్తిబృన్దమువలె, తత్=అది (అర్థపంచకము), పదాదిభిః=పదములు మొదలైన, చతుఃస్త్రికైః=నాలుగు మూళ్ళచేత, ద్వాదశక్రమ పదమ్=పన్నెండగు క్రమముయొక్క పదముగా, జగతి=లోకమున, జృమ్భితమ్= విజృమ్భించియున్నది.

**తాత్పర్యము:–** ఓ త్రిపథనేత్రి! నాల్గవదానిగా తెలిసికొనదగిన నీవు మొదలైన శక్తి చక్ర బృందమువలె అర్థపంచకము కూడ నాలుగు మూళ్ళ పదాదులతో పన్నెండగు క్రమము యొక్క పదమున లోకమున విస్తరింపఁబడినది.

**వివరణము:–** క్రమ ప్రకాశిక ననుసరించి పర, పరాపర, అపర, కాలాకర్షిణి అనునవి నాలుగు శక్తులు శక్తిబృన్దమనఁబడును. అది ఒక్కొక్కటి సృష్టికి, స్థితికి, ప్రలయమునకు అనగా మూడవస్థలకు విడివిడిగా చెందియుండునవి అగుటచేత అది పన్నెండు శక్తులుగల శక్తిబృన్దమగును. ఇవియే షడధ్వలుగా జగమున విస్తరించునపుడు నిత్యత్వ విభుత్వములు గలవగుట వలన క్రమరహితములైనను క్రమము కలవగును. త్వన్ముఖమ్ అనగా పరమొదలైన శక్తి బృన్దము. భాత్మకమ్ అనగా సంవిద్రూపము. అది షడధ్వములుగా లోకమున విస్తరించినపుడు విషయ రూపముగ పరిణమించును. త్రిపథనేత్రి! అనగా మూడు మార్గములకు నాయకురాలు. మానమేయ మితులే ఆ మూడు మార్గములు. వానికి నాయకురాలు అమ్మవారు. కావున ఆమె త్రిపథనేత్రి అని సంబోధింపఁబడినది. తుర్యథాగమమ్ అను పాఠమునకు బదులు యద్యథాగమమ్ అను పాఠము నంగీకరించి

ఆగమములలో చెప్పఁబడిన రీతిగా నాలుగు శక్తులు ఒక్కొక్కటి మూడు విధములై ద్వాదశ విధములుగా లోకమున శక్తిబృన్దము విస్తరించినది.

దివ్యచకోరిక ననుసరించి త్రిపథమనగా 1) ప్రతినీజయోనివర్ణ ప్రక్రియ యందలి అకారకార ఉకారవర్ణపరామర్శ. త్రికరూపమున 2) శామ్భవ శాక్తాణవ విసర్గత్రయ విలాసాత్మకములైన ప్రమాతృ ప్రమాణ ప్రమేయాంశములైన జ్ఞానోపాసనా మార్గత్రయము. వానికుపయోగపడు స్థూలసూక్ష్మకారణ శరీరత్రయము, వానికి సంబంధించిన జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థా త్రయము, తత్సర్వమునకు కారణమైన భూతభావి వర్తమానరూపకాలావయవ త్రయము మరియు వీని సమాహార రూపములైనదే మార్గముల త్రయము, వానికి నాయకురాలు లేక పై మూడు మార్గములనఁబడు నేత్రముల త్రయము కలది అని అర్థము.

పూర్వశ్లోకోక్త అర్థములు అనఁబడు విషయముల పఞ్చకమున వానిని చెప్పు చతుర్విధవాక్కులు అనఁబడు సముద్రచతుష్టయమునగాని, నాదనవకము నకు అభిన్నమైన స్వరనవకమును బోధించు అ, ఇ, ఉ(ణ్) ఋ ఌ (క్) ఏ ఓ (ఙ్) ఐ, ఔ (చ్) అను నాలుగు సూత్రముల రూపమున అని తుర్యధా అను శబ్దమున కొక అర్థము. మాతృకాస్వర ఖండమున నప్రంసకములైన ఋ, ౠ, ఌ, ౡ అను నాలుగు స్వరముల రూపమున అని మరొక అర్థము లేక ఏ, ఐ, ఓ, ఔ అను నాలుగు సంధి స్వరముల రూపమున అని మరొక అర్థము. పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరులు అను నాలుగు వాక్కుల రూపమున అని మరొక అర్థము. ఉదాత్తము అనుదాత్తము స్వరితము, దీర్ఘస్వరితము అను నాలుగు శబ్దబ్రహ్మమయ వేదచతుష్టయగతాక్షరగత స్వరముల రూపమున అని మరొక అర్థము. వాగర్థ క్రమమున స్థూల సూక్ష్మకారణ మహాకారణములనఁబడు నాలుగు ఉపాధుల రూపమున అని మరొక అర్థము. వానికి సంబంధించిన జాగ్రత్స్వప్నసుషుప్తి సమాధులు అనఁబడు నాలుగు అవస్థల రూపమున అని మరొక అర్థము. జగన్మయ వాగర్థక్రమమున తదిగ్దేశకాలముల సృష్టిస్థితిలయ తిరోధానములనఁబడు నాలుగు (ఈశ్వర) కృత్యముల రూపమున అని ఇంకొక అర్థము చెప్పఁబడినది. తుర్యధా పదమీ శ్లోకమున చతుర్ధా అను అర్థమున వాడబడినది. నేను చూచినంతవఱకు నిఘంటువులలో నీ పదము కనిపింపలేదు. ద్విధా త్రిధా చతుర్ధా ఇత్యాది పదములు సంఖ్యావాచకములకు 'ధా' ప్రత్యయము చేర్చగా ఏర్పడినట్టివి. కాని తుర్యపదము



సంఖ్యావాచకము కాదు. అది సంఖ్యేయవాచకము. దానిని సంఖ్యా వాచకమునకు వలె 'ధా' ప్రత్యయము చేర్చి ప్రయోగింపఁబడిన ప్రయోగములు నా దృష్టికి రాలేదు.

తుర్యధాగమమ్ అను పాఠమునకు బదులు యత్ యథాగమమ్ పాఠమును క్రమప్రకాశిక స్వీకరించినది. ప్రస్తుతమునకు తుర్యధా పదమునకు నాలుగు విధములుగా అనే అర్థమును రూఢపరచి దివ్యచకోరిక వ్యాఖ్యానించినది. ఇంతేగాక తుర్యధాగమమ్ అను దానిని సమాసముగా కూడ భావించి ఈ క్రింది విధముగా అర్థముల దివ్యచకోరిక చెప్పినది. తుర్యధా అనగా చతుర్విధ రూపముగా ఆగమయతి స్వస్వరూపమ్ (స్వస్వరూపమును బాగుగా తెలుపునది) అని ఆ సమాసమును విగ్రహించినది. త్వన్ముఖమ్ అనుదానికి విశేషణమైన తుర్యధాగమమ్ అను సమాసమునకు నాలుగు విధములుగా వేదము స్వయముగా ఆవిర్భవించినట్లు స్వయముగా ఆవిర్భవించినది, అని ఒక అర్థము. చతుస్వరముల యొక్క లేక చతుర్వర్ణములయొక్క సమాహారమువలె స్వరూపమును తెలుపునది అని మరొక అర్థము చెప్పినది.

భాత్మకమ్ అను పదమునకు అకారము, ఉకారము, బిందువు, అర్ధ చంద్రము మొదలైన తొమ్మిది నాదములు ద్వాదశాంతము అనురూపమున లేక పన్నెండు స్వరముల పరామర్శల రూపముననున్న ప్రకాశ చక్రము అని అర్థము చెప్పినది. ద్వాదశ రాశి చక్రాత్మకమగుటచే శక్తిబృందము భాత్మకమని చెప్పఁబడును. నీవు ఆదిగానున్న ఆశక్తి బృందము నీ ముఖమో యన్నట్లున్నది. పదాదిభిః అను సమాసములోని పదమునకు జాగ్రద్ అని అర్థమును చెప్పి దాని తరువాతనున్న ఆది పదము చేత – జాగ్రజ్జాగ్రత్, జాగ్రత్స్వప్న, జాగ్రత్సుషుప్తి, స్వప్నజాగ్రత్, స్వప్నస్వప్న, స్వప్నసుషుప్తి, సుషుప్తి జాగ్రత్, సుషుప్తి స్వప్న, సుషుప్తి సుషుప్తి, తుర్యజాగ్రత్, తుర్యస్వప్న, తుర్యసుషుప్తి అను పన్నెండు పదములు గ్రహించి చతుస్త్రికైః – నాలుగు మూళ్ళచేత ద్వాదశ క్రమపదమ్ – పన్నెండు అను క్రమము ఏర్పడునని శ్లోకము యొక్క అర్థమును వివరించినది. ఈ అర్థమును జయరథుడను పండితుడు ఈశ్వరకృత్యముల కన్వయించి – స్వరూప రూప మొకటి. అది ప్రసరస్థితి లయ భేదమున త్రివిధము. మరల ఒక్కొక్కటి ఉదయ సంస్థితి లయ విశ్రమ భేదమున చతుర్విధము అని చెప్పినాడు. హ్రస్వ దీర్ఘ ప్లుతములు అ ఇ ఉ ఋ అను వర్ణములలోని ఒక్కొక్క వర్ణమున గణింపగా మొత్తము పన్నెండగును. ద్వాదశ

క్రమముల చేత సృష్ట్యాది తత్త్వముచే పొందదగిన స్వరూపపదము ద్వాదశ క్రమపదమనఁబడునని ఆ పదమును స్వస్వరూపమున కన్వయించి చెప్పినది.

బృంహతమ్ అను పాఠమును స్వీకరించి పదారు, **(షోడశ కళాత్మకః పురుషః ),** పదేడు – **(సప్తదశకం లింగమ్),** ఇరువదిఒకటి అను వర్ణస్వర ఖండాంత వాహముల క్రమమున **'దశ హస్త్యాంగులయో దశ పద్యా – ఆత్మా ఏకవిగ్ంశః** (పది చేతివేళ్ళు, పది కాలివేళ్ళు ఆత్మ ఇరువది ఒకటవది), మరొక విధముగా **'ద్వాదశమాసాః పంచర్తవః త్రయ ఇమే లోకాః అసావాదిత్య ఏకవిగ్ంశః** (పన్నెండు నెలలు ఐదు ఋతువులు మూడు లోకములు ఇరువది ఒకటవ వాడే సూర్యుడు), మరొక విధముగా మొదటి అయిదు ఛందస్సులను వదలి గాయత్రి మొదలుకొని బృహతివరకు ఏడు ఛందస్సులుగా విస్తరింపఁబడినది. ఇత్యాదిగా అర్థములు చెప్పినది.

భాత్మకమ్ అను కాలీ ముఖ విశేషణముచే సూచింపఁబడిన నక్షత్రకాల మాన పక్షమునను ఒక్కొక్క నక్షత్రము నాలుగు పాదములు కలదగుటచేత ద్వాదశ రాశి చక్రమందలి ఒక్కొక్కరాశిలో తొమ్మిదేసి పాదములు చేర్చగా ఒక్కొక్క రాశిలోని నవాంశములతో చక్రరూపమున

చిత్తా నక్షత్రయుక్త పూర్ణిమగల చైత్రము
విశాఖ నక్షత్రయుక్త పూర్ణిమగల వైశాఖము
జ్యేష్ఠా నక్షత్రయుక్త పూర్ణిమగల జ్యేష్ఠము
ఆషాఢ నక్షత్రయుక్త పూర్ణిమగల ఆషాఢము
శ్రవణ నక్షత్రయుక్త పూర్ణిమగల శ్రావణము
భాద్రపద నక్షత్రయుక్త పూర్ణిమగల భాద్రపదము
అశ్వనీ నక్షత్రయుక్త పూర్ణిమగల ఆశ్వయుజము
కృత్తిక నక్షత్రయుక్త పూర్ణిమగల కార్తికము
మృగశిర నక్షత్రయుక్త పూర్ణిమగల మార్గశిరము
పుష్యమి నక్షత్రయుక్త పూర్ణిమగల పుష్యము
మఘా నక్షత్రయుక్త పూర్ణిమగల మాఘము
ఫల్గునీ నక్షత్రయుక్త పూర్ణిమగల ఫాల్గుణము



అను పన్నెండు మాసముల చాంద్రమాన సంవత్సరము గూడ భాత్మ కాలీ ముఖమే. మేషాది మీన పర్యంత ద్వాదశ మాసాత్మక సౌరమాస వ్యవహారము ననుసరించియు కాలీ ముఖము భాత్మకమగును. సంవత్సరము యుగాది రూప కాలీముఖము రశ్మిరూప శక్తి బృందరూపము. అయనద్వయము విషువ సంక్రాంతి ద్వయముతో కలిసియు నాలుగేసి విధములగును. మాసత్రయ సమష్టులు నాలుగు కలిసియు చతుస్త్రికమగును. హరిపదము షడశీతి ముఖము అను రెండు సంక్రాంతాలు రెండేసి మాస త్రికములతో కలసియు చతుస్త్రికమగును. ఇట్లు కాలరూప బృంహణము చతుస్త్రిక (ద్వాదశ) క్రమ రూపమున బహుధా వివరించినది. ఈ క్రమమున చతుర్యుగ సహస్రమితిగల బ్రహ్మదిన రాత్రి వత్సరాదులు కాలీముఖ బృంహణ రూపముగా ఊహించుకొనదగినవని చెప్పినది.

**అవతారిక:–** పై శ్లోకమున చతుస్త్రిక పదాదులతో ద్వాదశక్రమపదమైన శక్తి బృందము యొక్క భాత్మకత దేశ (ఆకాశ) కాల సామరస్యమున వివరించఁబడినది. ఈ శ్లోకమున అమ్మవారు అను ఆత్మ సముద్రమందు వికల్పబుద్ధితో భిన్నములైన మాతృమానమేయ లక్షణములైన అగ్ని సూర్య సోమ నామక త్రిధామముల బిందు రూపత చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ మానమేయమితినేతృలక్షణా**
**స్సోమసూర్యదహనాస్త్రిధామగాః।**
**రాశిరాజివిధిభఙ్గిభిః స్వరై**
**ర్లక్షితాస్తవ హి విప్రుషోఽమ్బికే॥** 37

**ప్రతిపదార్థము:–** అమ్బికే=అమ్మా, మానమేయమితినేతృలక్షణాః=మానము, మేయము, మితి అనువానికి నాయకత్వము వహించులక్షణముగల, త్రిధామగాః =మూడు ధామములలో నుండు, సోమసూర్యదహనాః=చంద్రసూర్యాగ్నులు, రాశిరాజివిధిభఙ్గిభిః=(స్వర) సమూహములయొక్క వరుసల ఏర్పాటుచేత విడగొట్టబడిన, స్వరైః=స్వరములచేత, లక్షితాః=లక్షితములైన, తవ=నీ యొక్క, విప్రుషః=బిందువులే.

**తాత్పర్యము:–** త్రిధామములందలి మానమేయమితులకు నాయకులైన సోమ సూర్యాగ్నులు స్వరసమూహముల యొక్క వరుసలచే విడగొట్టఁబడిన (సముద్రము వంటి) నీ యొక్క బిందువులే నమ్మా.

**వివరణము:–** దివ్యచకోరిక ననుసరించి మాన (ప్రమాణముల) నేత సోముడు (ప్రమాత), మేయ (ప్రమేయ) ములనేత సూర్యుడు, మితినేత అగ్ని. త్రిధామము లనగా ఇదివఱకు చెప్పఁబడినట్లు జాగ్రత్స్వప్నసుషుప్తులు. జాగ్రదవస్థ యొక్క వ్యష్ట్యభిమాని విశ్వుడు. స్వప్నావస్థ యొక్క వ్యష్ట్యభిమాని తైజసుడు. సుషుప్త్యవస్థ యొక్క వ్యష్ట్యభిమాని ప్రాజ్ఞుడు. పై అవస్థల సమష్ట్యభిమానులు క్రమముగా వైశ్వానరుడు హిరణ్యగర్భుడు అవ్యాకృతుడు. శ్లోకమున జాగ్రదవస్థ **మితి,** దానికి నేత అగ్ని, స్వప్నావస్థ మేయము, దానికి నేత సూర్యుడు, సుషుప్త్యవస్థ మాత, దానికి నేత సోముడు అని చెప్పబడినారు.

త్రిధా అనగా మూడు విధములుగా ఆమ అనగా అమ అమావాస్య (దర్శము) నకు సంబంధించిన కల. అదియే ఆమ అనగా కామకల. అది పూర్ణానుస్వారాత్మిక. దానిని పొందువారు ఆమగులు. మూడు విధములుగా అనగా మాన మేయ మితి నేతృత్రిపుటీ రూపముగా అని అర్థము. దివ్యచకోరిక ఈ రెండవ అర్థము కూడ చెప్పినది. పూర్ణానుస్వారము శమ్భుని నైసర్గికత. అది అనుత్తర సకార సంహిద్రూప స్థితిని అనగా (విసర్గరూప) శాక్తనైసర్గిక స్థితిని కూడ క్రమముగా పొందును. విసర్గలోని రెండు బిందువులు అనుస్వారములోని బిందువు మొత్తము బిందువులు మూడు; అనుస్వారము సోమరూపము; విసర్గము లోని రెండు బిందువులు సూర్యాగ్నులు మహాప్రమాణమైన మహాక్షమయ అను పేరుగల కల. తృతీయ విమర్శమున చెప్పబోవు శామ్భవకలను నాల్గవ విమర్శనమున చెప్పఁబడబోవు శాక్త అహమక్షమయయైన కలను మహామాత (ప్రమాత) లోనికి ప్రతి నివర్తించు క్రమమున పొందువారగుటచేత సోమసూర్యాగ్నులు త్రిధామగాః అని చెప్పఁ బడినారు.

లోకమున చంద్రుడు సూర్యునితో కలయుట దర్శమని చెప్పఁబడును. కాని ఇచట సోమనామక చంద్రుడు పరచంద్రుడు. ఆతడే మహామాత. ఆతనిలోనికి సూర్యాగ్నులు ప్రతినివర్తించెదరు. ఉమా సహితుడైన సోమశబ్ద వాచ్యుడు ఈ అంశము శివుని పరచంద్రత్వమును సూచించునని వేరుగా చెప్పనక్కఱలేదు. అందుచేతనే అమావాస్యనాడు సూర్యునందు, పూర్ణమునాడు చంద్రునందు కనఁ బడు కలలకన్న సాదాఖ్యచంద్రకలవేరని సాధారణముగా తంత్రములందు తెలియఁ బడు అంశమే. ఇప్పటి సోమసూర్యదహనులు అపాన ప్రాణ వ్యాన త్రిపుటీ



భేదాభిన్నులు. ఇదంతయు శ్లోకములోని పూర్వార్ధము యొక్క స్థూలమైన వివరణము. 2) రాశి అనగా వర్ణముల సమూహములు. వాని యొక్క రాజులు అనగా పంక్తులు. వాని నుండి భంజితైః అనగా వేరు చేయఁబడినవి. అ, ఇ, ఉ, మొదలైన స్వరముల (అచ్చుల) చేత లక్షితురాలైన మహాకాళీ, మహాలక్ష్మీ, మహాసరస్వతులు మొదలైన రూపములు అమ్మవారు అను సముద్రమునందలి బిందువులు మాత్రమే అనుట ఉత్తరార్ధము యొక్క స్థూలమైన వివరణము. 3) పూర్వకల్పాంతమందు అంతర్లీన విమర్శ శక్తియైన సుషుప్త్యభిమానియైన అనాదినాద నాదానుత్తురాకార స్వరూపియైన చంద్రుడు తన ఉపాధియైన సమష్టి సుషుప్తి (మహా ప్రలయము) నుండి బయటకు వచ్చి అనుత్తరాధ్వర విమర్శరూపము నొందుదును అని కోరినపుడు అకార రూపు డగును. ఆతడే అకారరూపుడు. అంతరానుభూతానుత్తర నాదానందమును బయట గూడ కోరినవాడై దీర్ఘాకారరూపుడుగా పరిణమించును. వెంటనే ఇచ్ఛాబోధకమైన ఇకారము తదున్మేష బోధకమైన ఉకారమును పుట్టును. ఈ ఇచ్ఛ లేకుండగా అంతఃక్రియాశక్త్యాత్మయైన ఊర్మిలేకుండ ఉన్మేషము, ఆనందము లేకుండ అనూత్తరాకారమునకు వలె విశ్రాంతిరస్యానుభవ(సామరస్య)ము కుదరదు. కావున ఈకారోకార దీర్ఘ స్వర పరిణామము జరిగినది. ఇట్లు అంతర్బహిర్భేదాభేద త్రిపుటీద్వయ బోధక హ్రస్వదీర్ఘములైన పై మూడు స్వరముల జంటలలో అంతరక్షర సామరస్య రూపమున ప్రమాతృత్వ రూపత బహిరక్షరముగల రూపమున ప్రమేయ ప్రమాణ రూపత, సిద్ధించును. ప్రతిధామ (సుషుప్త్యాది త్రిక) త అనుభవైక వేద్యమగును. ఇట్లే ఈశ్వరునకు వలె ఇతరుల విషయమునను ఊహించదగినది. తంత్రసారమున మిగిలిన పదస్వరముల ఉత్పత్తి ప్రక్రియయు చెప్పఁబడినది. అది ఆ గ్రంథమునుండియే గ్రహింపనగును.

పరమేశ్వరుని మూడు శక్తులు ముఖ్యములు. (1) అనుత్తరము (2) ఇచ్ఛ (3) ఉన్మేషము. ఇదియే పరామర్శత్రయము. అందువలననే మహేశ్వరసూరి ప్రథమ సూత్రమున అ ఇ ఉ (ణ్) గా రూపొందింపఁబడినది. నందికేశ్వరకారికలో కూడ సోపపత్తిక నిర్ణయము చేయఁబడినది అని తెలియఁదగినది. అందువలననే పరామర్శ త్రయము నుండియే సర్వశక్తి ప్రపంచము పరమేశ్వరుని చేత చర్వింపఁబడును. అనుత్తరమందు విశ్రాంతియే ఆనందము. ఇచ్ఛయందు విశ్రాంతియే ఈశనము. ఉన్మేషమందు విశ్రాంతియే ఊర్మి. క్రియాశక్తి ప్రారంభమే పరామర్శ. (ఆ ఈ ఊ

ల) త్రయము మొదటి పరామర్శ త్రయము. ప్రకాశభావ సారము. కావున సూర్యాత్మకము. చివరిది (పరామర్శ త్రయము) విశ్రాంతి స్వభావము. కావున అది ఆహ్లాద ప్రాధాన్యము కలది. కావున సోమాత్మకము. (ఇంతలో) మొత్తము కర్మాంశము యొక్క అను ప్రవేశము లేదు.

ఇచ్ఛయందును ఈశనమందును దానికి అనుప్రవేశమున్నప్పుడు ఇష్యమాణము ఈశ్యమానమనియు చెప్పఁబడినప్పుడు దాని భేదములు రెండు. ప్రకాశమాత్రముచే 'ర' అను ధ్వని, విశ్రాంతియందు 'ల' అను ధ్వని వినఁబడును. అవి రెండు ప్రకాశస్వాభావ్యములే. ఇష్యమాణము బాహ్యమువలె స్పష్టము కాదు. స్ఫుటమైనచో అది ఇష్యమాణమనఁబడక నిర్మాణమనియే అనఁబడును. అప్పుడు ఇచ్ఛ అనిగాని, ఈశనమనిగాని అనఁబడదు. ఆ అస్ఫుటత్వ కారణము వలననే ర, ల లకు శ్రవణము మాత్రమే, వ్యంజనములవంటి స్థితిలేదు. ఈ నాలుగు ఋ, ౠ, ఌ, ౡ అను వర్ణచతుష్టయమున పుంసకమని చెప్పఁబడినది. అనుత్త రానందములు రెండు ఇచ్ఛాదులలో ప్రవేశించినప్పుడు రెండు వర్ణములు ఏ, ఓ అనునవి ఇక్కడను వర్ణముల సంఘట్టనముతో ఐ ఔ అనునవి. ఇదియే క్రియాశక్తియైన ఏ ఐ ఓ ఔ అను వర్ణచతుష్టయము.

క్రియాశక్త్యంతమున కార్యభూతమంతయు అనుత్తరమున ప్రవేశించు నంతలో ప్రకాశసారములైన సంవేదన సారమగుటచే ప్రకాశమాత్రమగుటచే బిందువుగా ఉండును. అదియే 'అం' అనునది. అందువలన అక్కడ అనుత్తర విసర్గమున అః అనునది ఏర్పడును. ఈ విధముగా పదునాఱు వర్ణముల సమాహారము బీజ స్వరూపమని చెప్పఁబడును. దానినుండి వెడలిన హల్ వర్ణముల సమాహారము యోని స్వరూపమని చెప్పఁబడును. దీనిలోని అనుత్తర నుండి కవర్గము, శ్రద్ధనుండి ఇచ్ఛనుండి చవర్గము, సక్రమికేచ్ఛనుండి ట వర్గ త వర్గలు, ఉన్మేషము నుండి ప వర్గము ఇట్టి శక్తిపంచక యోగము వలన పఞ్చక పఞ్చకము ఏర్పడునని త్రివిధేచ్ఛ నుండి యరలలు, ఉన్మేషము నుండి వకారము, వివిధమైన ఇచ్ఛనుండి శషసలు, విసర్గము నుండి హకారము, యోని సంయోగము నుండి ఏర్పడును. ఇట్లు భగవదనుత్తరమే కులేశ్వర రూపము. దానికి ఒకే కాలిక శక్తి విసర్గశక్తి ఎట్లు ఆనందరూపమునుండి బహిస్సృష్టిపర్యంత ప్రస్పందము వలన వర్గాది పరామర్శమే బహిస్తత్త్వ రూపతను పొందినది. అట్లే విసర్గము త్రివిధము.



1) శక్తి సంబోధోపలక్షణమైన విసర్గము
2) శామ్భవ చిత్త ప్రలయరూప విసర్గము.
3) ఆణవచిత్త విశ్రాంతి లక్షణ విసర్గము.

ఈ విసర్గమే శివుని విశ్వసర్జనమున నిమిత్తశక్తియై అవిభాగ పరామర్శముగా ఉండునప్పుడు ఒకే భగవానుడు బీజయోని ప్రాధాన్యమున శక్తిమంతుడుగా, శక్తిగా అగును. వేరైన అష్టపరామర్శమున చక్రేశ్వర సహితతత్వమున మొత్తము నరవర్గములుగా రూపొందును. ఒక్కొక్క వర్గము యొక్క పరామర్శమున ఏబది వర్ణములుగా విభాగము నొందును. ఇక్కడను సంభవించు భాగముల పరామర్శమున ఎనుబది యొక్కటిగా రూపొందును. కాని వాస్తవముగా ఆఱే పరామర్శలు. ఇవి ప్రసరణ ప్రతిసంచరణ యోగమున ద్వాదశ విధములు. పరమేశ్వరుని విశ్వశక్తి పూర్ణతను పోషించును. ఆ ఈ పరామర్శ శాక్త శ్రీకాలికా భాగవత రూపములుగా నిర్వచింపఁబడినవి. ఈ పరామర్శ శక్తులే శుద్ధ విద్యా విశ్వేశ్వర రూపతను పొందును. ఇవి మాయయందు స్ఫుటీభూత భేద విభాగములై మాయీయవర్ణ రూపతను గూడ నొందును. పశ్యంతీ మధ్యమా వైఖరులందు వ్యావహారికతనొంది బహిరూపతత్వ స్వభావమున కనఁబడునప్పుడు జీవిత స్థానీయములైన శుద్ధములైన పరామర్శములలో ప్రత్యుజ్జీవింపఁబడినప్పుడు వీర్యవంతములగును. అప్పుడా ద్వాదశశక్తులే భోగమోక్ష ప్రదములగును. ఈ విధముగా సకల పరామర్శ విశ్రాంతి మాత్ర రూపమైన ప్రతిబింబిత సమస్త తత్త్వభువన భేదమునొంది తనను చూచుచున్న వారికి నిర్వికల్పము అగుటచేత శామ్భవ సమావేశమున జీవన్ముక్తత సిద్ధించును. ఈ విషయమంతయు తంత్ర సారమున **అంతర్విభాతి సకలాం జగదాత్మనీహ యద్వద్విచిత్ర రచనాముకురాంత రాలే, బోధః పరం నిజ విమర్శ రసానువృత్యా విశ్వం పరామృశతి నో ముకురస్తయా తు** అను శ్లోకమున వర్ణప్రవాహమాత్ర పరామర్శ పరముగా శామ్భవోపాయము విస్తరింపఁబడినది. అందువలన అన్ని వర్ణములకు ప్రమాతృరూపత సహజ సిద్ధమైనదిగా గమనింపఁదగినది. చెప్పఁ బడఁబోవు ధామ సంవిద్వర్ణ సంక్రమములు ఉపాసకోపయోగములని ఇప్పుడే సంగ్రహముగా వివేచింపఁబడుచున్నవి.

ఇట్లు శబ్దోత్పత్తి ప్రక్రియయందును చెప్పఁబడబోవు అక్షమాలా మూల భూత సౌమ్యస్వర ఖండస్థమైన అకారాది విసర్గాంత చంద్ర స్వరములలో షోడశకల

వ్యాప్తి వలె (స్థూల భూత) మనస్సునకు గూడ ప్రాణ శ్రద్ధా ఆకాశ వాయు తేజో జల పృథివీ + ఇంద్రియ మనో – అన్న వీర్య తపో మంత్ర వీర్య లోక నామరూపములైన కలలలో కూడ షోడశ సంఖ్యా వ్యాప్తిచేత సుషుప్తియందు నామమాత్రావశిష్టమైన మనస్సు లీనమై ఉన్నట్లే ప్రలయమునందును అన్ని కలలలో కూడ ఆ విద్యక ప్రాణాత్మయందు లీనమగునట్లే నామమాత్రావశిష్ట చంద్రుడును అవిద్య రాత్రి తుల్యమైన అమావాస్య అనఁబడు సూర్యాత్మయందు లీనమగును. మరల విద్యామయమైన పగలు షోడశకలోపేత మనస్సువలె షోడశకలోపేత మనశ్చంద్రుడును విద్యాపూర్ణిమయందు దీయమానుడై ప్రకాశించును.

చంద్రుడు దర్శమున సూర్యునందు సంగమించుటవలననే జడ సౌషుప్తిక జాగ్రదవస్థాపన్న విశ్వమయచేతన ప్రాణసూర్యసంగమలయము కూడ మనస్సునకు పునర్జన్మను కలిగించును. అట్లే చంద్రునకు సంకర్షణాత్మకాగ్ని సూర్య సంగమమువలె మనస్సునకును ముఖ్య ప్రాణ సూర్యునందు చిదగ్ని మూర్తి సంగమము అనావృత్తి అని చెప్పఁబడు మోక్షము నిచ్చునఁదగును. అట్లే దేవీ మానము కూడ షోడశ మాసాత్మక సంవత్సరకాల చక్రాకాయవములకీ ఆత్మ యందు షోడశ కలాత్మకసూక్ష్మ మనోరూపమున షోడశ సంఖ్యతో, మనోబుద్ధి యుక్త దశేంద్రియముల ద్వాదశ సంఖ్యతో విలయము సంభవించును.

బయటి వ్యావహారిక సౌరచాన్ద్రమానాదిక కాలపురుషుడుగా నిమేష కలా తిథి వార నక్షత్రయోగకరణములు మొదలు అయన విషువద్ద్వయముతో కూడిన మేష చైత్రాది వ్యవహారమున ద్వాదశ సంక్రాంతిరూపమున విరాజిల్లును. **అస్తి వా హి షష్ఠ ఋతుర్నవా** అను వేదోక్తి పఞ్చర్తు షడృతు మతభేదమున విరాజిల్లును. **షడహైర్మాసాంత్సమ్పాద్యాహరుత్సృజన్తి** అను శ్రుతిచేత చెప్పఁబడిన షడహ సమ్మతమైన మాసమానాదులలో సంవత్సర పరివత్సరాంత దిన మాసాది వర్షాంత కల్పముల వ్యావహారిక, బార్హస్పత్యాది సావనాంత మానముల పారమార్థిక పిత్ర్య దివ్య ప్రాజాపత్య దైరాజ బ్రహ్మాది మాన సామరస్య గణనాసం వ్యవహారమున దేవీ మానోక్త తిథి పక్ష మాసాది సామరస్యములును విగక్షితములు. అట్లే ఏబదిఐదు విసమష్ట త్రయాత్మక పఞ్చదశ తిథిమయ సంక్రాంతి ద్వయ మేలనమున వ్యావహారిక త్రిరాశుద్ధినాత్మక చాంద్రసౌర వానాత్మక మాస శరీరమున రాకా అనుమతి అని రెండు విధములుగా ఉన్న పూర్ణిమ యొక్క కహూ సినీవాలి అను రెండు విధములైన



అమావాస్య రెండేసి భేదములగుటచేత పదునాఱు సంఖ్యయగుటచేత శుక్ల కృష్ణ పక్షములు రెండును పదునాఱు తిథులు కల వగుటచేత దిన నిత్యా కలానిత్యలతో కలిపి లెక్కించుటచేత అనేక సంబంధములు కలుగుట వలన వివిధ మానములు వానికి సంబంధించిన వ్యవహారము భిన్న భిన్నములుగ ఏర్పడియున్నవి. ఇట్లు సంవత్సరాత్మ కల్పకాల పురుషులలో చాంద్రసౌర సావనాది ప్రాకృత మాన భేదములలో యోనులననుసరించి యథేచ్ఛగా ప్రాకృతమాసార్ధమాస తిథిగత ద్వాదశ చతుర్వింశతి షోడశాష్టాదశాది దిన సంఖ్యలవలె పారమార్థిక దివ్యమానవ ప్రాజాపత్య బ్రహ్మపర పర్యాయములైన దేవమానములలోను క్రమముగా 36, 18 మొదలైన తిథి దివస మాస ఋత్వాది లాభము యొక్క వత్సర పరివృత్తి యుగాయన పూర్ణ మండలాంత దేవీమాన పరిభాషతో అష్టాంగ ద్వాదశ షోడశాంగ గణితములు లభించుట వలన **'షడహేనయన్తి, షడ్వా ఋతవ ఋతుష్వేవ ప్రతితిష్ఠన్తి, ద్వౌ షడహౌ భవతస్తాని ద్వాదశాహాని సంపద్యతే ద్వాదశో వై పురుషో ద్వే సక్థ్యౌ ద్వౌ బహూ ఆత్మా చ శిరశ్చ చత్వార్యంగాని స్తనౌ ద్వాదశౌ, షోడశకలో వై పురుషః, తత్పురుషమనుపర్యావర్తన్తే త్రయష్షడహా భవన్తి తాన్యష్టాదశాహాని సంపద్యన్తే నవాన్యాని నవ వై పురుషే ప్రాణాస్తత్ప్రాణాననుపరావర్తన్తే చత్వారష్షడహా భవన్తి, తాని చతుర్విగ్ంశతిరహాని సంపద్యన్తే చతుర్వింగ్ంశతిరర్ధమాసాస్సంవత్సర స్తత్సంవత్సరమనుపర్యావర్తన్తీ౽ ప్రతిష్ఠితస్సంవత్సర ఇతి ఖలు వా ఆహుర్వర్షీయా న్ప్రతితిష్ఠాయా ఇత్యేతావద్వైసంవత్సరస్య బ్రహ్మణం యావన్మాసో మాసి మాస్యేవ ప్రతితిష్ఠన్తోయన్తి** ఆఱు దినములలో వెడలుచున్నవి. ఆఱు ఋతువులు ఋతువులలోనే ప్రతిష్ఠిత మగుచున్నవి. రెండు షడహములు అగుచున్నవి. అవి పన్నెండు దినము లగుచున్నవి. పురుషుడు ద్వాదశుడు రెండు తొడలు రెండు బాహువులు ఆత్మ శిరము నాలుగు అంగములు రెండు స్తనములు షోడశ కాలుడు పురుషుడు. ఆ పురుషుని కూడ షడహములు చుట్టివచ్చును. అవి పదునెనిమిది అహములు అగుచున్నవి. ఇతరములు తొమ్మిది. ఇతరాదులు తొమ్మిది. పురుషునందు తొమ్మిది ప్రాణములు. ఆ ప్రాణముల చుట్టి వచ్చుచున్నవి నాలుగు షడహములు అగును. అవి ఇరువదినాలుగు అహములగుచున్నవి. ఇరువది నాలుగు అర్ధమాసములు సంవత్సరము. ఆ సంవత్సరమును (అవి) చుట్టివచ్చును. అందువలన సంవత్సరము అప్రతిష్ఠితము అని గదా చెప్పినారు. వృద్ధులకు సంవత్సర ప్రతిష్ఠ యొక్క వైవిధ్యము

చేత భిన్నభిన్న వర్ణములు గలవారిగా చెప్పుచున్నారు. సంవత్సరము బ్రహ్మను ప్రతిమాసమున ప్రతిష్ఠించుచు పోవుచున్నవి అని అశ్వమేధాద్యుత్తర ప్రకరణమున తైత్తరీయ సంహితయందు సప్తమకాండమున చతుర్థ ప్రశ్నమున ఏకాదశాను వాకమున చెప్పఁబడిన పురుషకాలకల్పవిభవములు పోలికతో వాగర్థమూలత్వమును, వాగర్థకల్పరహస్యమును చెప్పదలచుకొన్నట్లు తెలియనగును. అందువలననే సామిధేనీ బ్రహ్మణమున పదునైదు అను సామిధేనీ సంప్రతిపన్న సంఖ్య త్రిపాదాయత్రీ సంఖ్యానమున వత్సరాహోరాత్ర సహసంఖ్యాకమగుటచే వత్సర దేవతా వాప్తి కలనయు సృష్టీకరింపఁబడినది. **తాసాం త్రీణి చ శతాని షష్టిశ్చాక్ష రాణి తావతీ స్సంవత్సరస్య రాత్రయోఽ క్షరశ ఏవ సంవత్సర మాప్నోతి** (మూడువందల అపంచి రాత్రుల సంఖ్యయే సంవత్సరమును పొందుచున్నది). సౌందర్యలహరి యందు 'క్షితౌ షట్పంచాశత్' అను శ్లోకమందు శంకరులు దేవీ పాదాంబుజమును స్తుతించున్నప్పుడే 360 సంఖ్యగల కిరణముల పైన అమ్మవారి పాదకమల మున్నట్లు చెప్పిరి. మానసోల్లాసమందును **దశపఞ్చక భేదేన ప్రపఞ్చస్యవిలాసినః సాక్షిణీ చాక్షరీ యస్మాత్ తస్మాత్పంచదశాక్షరీ** (ప్రపఞ్చ మంతయు దశపఞ్చక సంఖ్యతో విరాజిల్లుచున్నందున దానికి సాక్షిణియగు అమ్మవారును పఞ్చదశాక్షరి (విద్య) అని చెప్పఁబడినది. అమ్మా! పాతాలము పాదద్వయముగా గల, అవని జఘనముగా గల, సూర్యచంద్రులు వక్షోజములుగా గల, మేఘములు కేశములుగా గల, దిక్కులు ముఖములుగా గల, నీ వైరాజ్య దివ్యరూపమును పూజించువారికి హరిబ్రహ్మేన్ద్రాది సురకోటి కీట ఇత్యాది కాళిదాసాది వచనములు గర్భి గర్భ భావమునే వక్కాణించు చున్నవి.

క్రమప్రకాశిక ననుసరించి పరాశక్తికి మానమేయమితి రూపములైన సోమసూర్యాగ్నులు మూడు నేత్రములు. ఇవి ఇడా పింగళా సుషుమ్నలనఁబడు మూడు ధావములందుండును. ఆగమోక్తమైన ద్వాదశ రాశిరాజ విధానమున ఇవి భేదింపఁబడి శివరూప షోడశ స్వరములతో కూడి యుండును. ఇవి శివ శక్తి యోగ ప్రభావములగుటచే శక్తి సముద్రమునందలి బిందువులుగా మాత్రమే భావింపఁబడదగినవైయుండును. మానమేయమితి రూపుడు సోమసూర్యాగ్ని రూపుడునైన శివుని షోడశ స్వర (వ్యంజన)ములతో సామరస్యమును పొంది యుండును.



అంతర్బహిర్విభాగమున రాశిమండలము రచింపఁబడును. ఈ భూ చక్రమే మానుష వ్యావహార యోగ్యమైన మేషాది రాశి చక్రముగా తెలిసికొనఁదగినది. అ ఆ ఇ ఈ లతో మేషరాశి, ఉ ఊ ఋ ౠ లతో వృషభరాశి ఌ ౡ ఏ లతో మిథునరాశి, ఏ ఐ లతో కర్కటరాశి, (ఇవి రెండు అ+ఇ, అ+ఏ లతో ఏర్పడిన సంధులలో నాలుగు స్వరములు), ఓ ఔలతో (అ+ఉ, అ+ఓ) సింహరాశి, అం శ ష స ల నుండి కన్యారాశి, క చ ట త ప య వర్గల నుండి తుల, వృశ్చిక, ధనుర్మకర కుంభ మీనములు ఏర్పడినవి. వ శ ష స క్ష అనునవి మీనరాశి గమము. వీనిలోని మొదటి నాలుగు పృథివీతత్త్వమైన మూలాధారము నందలి చతుర్దలములు. ఈ రాశులు శక్తి జృమ్భణమున నేర్పడినవి.

**అవతారిక:–** పై శ్లోకమున బిందుత్రయాత్మకమైన ఆహానాహత కాళీకానాత్మక వాగర్థముల గర్భి గర్భ భావము చెప్పఁబడినది. ఈ శ్లోకమున సృష్టి స్థితి సంహారాత్మక కాళీకాల వాచ్య వాచక భావ సంబన్ధమున అనుత్తర ప్రణవమగుట చేత అభేద భావనకూడ సాధ్యమని చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ ఆహతేతరదురుత్తరాశ్రయ**
**స్త్వత్పదాదుదయతే శివాత్మి (త్మ) కే।**
**అద్వయాద్విషయ చిత్ప్రదాతను**
**ర్దృగ్విమర్శ ఇవ వాచకః స్వరః॥ 38**

**ప్రతిపదార్థము:–** ఆహతేతరదురుత్తరాశ్రయః=అనాహతమై దాటుటకు సులభము కాని దానికి (నాదమునకు) ఆశ్రయమైన, విషయ చిత్ప్రదాతనుః=విషయమును ప్రకాశింపఁజేయుటయే శరీరముగాగల, వాచకః=వాచకమైన, స్వరః=(అకార) స్వరము, దృగ్విమర్శ ఇవ=దృక్కు (ఆత్మ) యందు విమర్శవలె, శివాత్మకే=ఓ శివస్వరూపిణీ, అద్వయాత్=భిన్నముకాని, రెండు లేని, ఏకమైన, త్వత్పదాత్=నీ స్థానము (మూలాధారము) నుండి, ఉదయతే=ఉదయించును (ఆవిర్భవించును, పైకిపోవును).

**తాత్పర్యము:–** అనాహత నాదాత్మకమైన ప్రాణస్పందరూపమైన అకార స్వరము లేక ఓంకార స్వరము యొక్క ఆశ్రయమైన అనాహత కమలమును దాటుట ప్రయత్న సాధ్యము. ఆ ప్రయత్నమున అనాహత కమలమును దాటి విశుద్ధ చక్రస్థానమైన

కణ్ఠమున ఆహాంతముగా ఇతరులకు వినఁబడు వైఖర్యాత్మక వాక్కుగా మారుటకై ఆధార కమలమున ఆవిర్భవించి పైకి పోవును.

**వివరణము:–** 1) చెవులలో వేళ్ళు పెట్టుకొన్నప్పుడు ప్రాణస్పంద ధ్వని వినిపించును. ఆ ధ్వని అనాహత నాదమనఁబడును. ప్రాణవాయువు శరీర మంతట వ్యాపించి యుండును. అది అపంచీకృత వాయుస్వరూపము అనగా శుద్ధమైన స్పర్శము అనఁబడు తన్మాత్ర రూపము అది సూక్ష్మ భూతము. పంచభూతములలో రెండవది. మొదటిదైన సూక్ష్మమైన అపంచీకృతాకాశము నుండి ఇది పుట్టినదగుట చేత కారణ భూతాకాశగుణ శబ్దము ఈ అపంచీకృత సూక్ష్మమహా వాయుభూతము నకు కారణగుణములు కార్యమున సంక్రమించును అను న్యాయము ననుసరించి సూక్ష్మమహావాయుభూతమున సంక్రమించును. ఆకాశము నుండి ప్రాణ వాయువున సంక్రమించిన చెవులను స్పృశించుచున్నను సాధారణులకు తెలియని ఆ స్పర్శము స్టెతస్కోపు యంత్ర ద్వారమున డాక్టరు చెవులను స్పృశించుననుట లోకమున ప్రసిద్ధమే. ఒక వస్తువు మరొక వస్తువును స్పృశించునప్పుడు శబ్దము వినఁబడును. ఒక వస్తువు మరొక వస్తువుతో బాగుగా కొట్టినప్పుడు వినఁబడు శబ్దము ఆహత శబ్దము (ధ్వని) అనఁబడును. ఆకాశమున శబ్దమున్నను అది దేనిని స్పృశించదు. అది సంపూర్ణముగా అనాహతమైనదే. అనాహత కమలమున లేక చక్రమున ఉచ్ఛ్వాసము నాసికాదుల స్పృశించుచు దానిని తాకును. అంతియేగాక అది శరీరాంతర్భాగమునంతను వ్యాపించును. స్పృశించును. మరల శరీరములో ముఖ్యముగా రక్తమందలి మలమును తీసికొని నిశ్వాసము నాసికాదుల స్పృశించుచు బయటికి వచ్చును. గతి ప్రధాన లక్షణమైన వాయువున ప్రాణవాయువున కీలక్షణము సహజము. గతి సమయమున అడ్డుగానున్న వస్తువుల గుండా ప్రయాణించునప్పుడు ఆ వస్తువుల స్పృశించుట తప్పనిసరియగును. ఆహత శబ్దము వాయులక్షణ స్పర్శ యందోత ప్రోతమైయున్నదనుట ఇట ప్రతిపాద్యాంశము. 2) ఆహతేతర శబ్దమనగా అనాహత శబ్దము. ఆహతి నిమిత్తములేకయే ఇది ధ్వనించును. తరంగ రూపమున ప్రయాణించును కూడ. ఆ ప్రయాణించుదారి ఊర్ధ్వముఖ మైనచో ఊర్ధ్వముగా అధోముఖమైనచో అధోముఖముగా ప్రయాణించును. సాధారణముగా దారి అనగా ముఖ్యముగా ఆకాశమే. సాధారణముగా ఊర్ధ్వాధోముఖములుగా గాక అడ్డముగానే ప్రయాణించునట్లు సర్వులకు ప్రసిద్ధమేయైనను ప్రాణవాయువు యొక్క



ఊర్ధ్వాధోముఖ గమనము సర్వజన విదురము. ఈ అనాహత శబ్దము పుట్టుటకు ఆహతి కారణముగా కలది కాదనియే ఇట ముఖ్యముగా గమనింపఁదగినది. దానితో అది ఇతరుల స్పృశించునప్పుడు వానిని ఢీకొట్టునప్పుడు అది ఆహత శబ్దముల సృజించుట కూడ సంభవమని గమనింపవలసియున్నది. వాస్తవముగా దీని సంపూర్ణమైన అనాహతత్త్వము చిత్తాకాశముననే సంభవమగును. కొందఱు దార్శనికులు ధ్వని వాయుగుణముగా భావించుటచే ఇంతగా వివరింపవలసి వచ్చినది. పఠితృకౌతూహలము నారాధించుటయే ఈ వివరణము యొక్క ప్రయోజనము. అస్తు.

3) ఆహతేతరమైన ఈ అనాహత శబ్దము అచటి వాయువు సాయమున వక్తృవిపక్ష (పలుకుట లేక బహిర్గతపఱచు యత్నము) వర్ణపదవాగాది వివిధ విన్యాసముల నారంభించుటకు ముందు దాని మూలమైన పరారూపమైన అకారము మూలాధారము నందావిర్భవించును. అదియే నాభిస్థానమున ఉకారముగా ఆవిర్భవించును. ఆ రెండు కలసి ఓకారముగా మారి కంఠము నందావిర్భవించిన మకారమును కలిపికొని ఏర్పడిన త్రివర్ణాత్మక ఓంకార నిత్య శబ్దము నాదాత్మక శబ్దముగా తాల్వాదిముఖస్థానీయ పదార్థముల స్పర్శాది ప్రయత్న సహకారమున వైఖరీ నాదాత్మకోంకారముగా పరిణమించి బహిర్గత మగును. వర్ణాత్మక శబ్దము సర్వవ్యాపక ద్రవ్యమనియే కొందరి దార్శనికుల మతమైయున్నది. ఏది ఏమైనను అనాహతచక్రమును స్పృశించు ఉచ్ఛ్వాస నిశ్వాసములు ఓంకారమునకు సకార హకార ధ్వనుల సంయోజింపఁజేసి అజపాఖ్యను పొందును. ఉచ్ఛ్వాస నిశ్వాసముల నాపినప్పుడది భ్రూమధ్యమున ఓంకార మాత్రముగానే ఉన్నను దాని యొక్క చివఱి బింద్వాదినవకము ద్వాదశాంతము దాక వ్యాపించియుండును. 4) వాస్తవమునకు అకారము తొలి రూపము బిందువే. ఉకారము యొక్క మకారము యొక్క తొలి రూపమును బిందువులే. మాతృమానమేయముల తొలిరూపమైన మితియే సర్వ వాగర్థములకును మూలము. ఈ శ్లోకమునకు అన్యవపాత పూర్వశ్లోకమున నీ బిందువులు సోమసూర్యాగ్ని రూపములని చెప్పఁబడినవి. కోట్లకొలది జీవుల మూలాధారాదుల లోని ఆ బిందువులు సంవిచ్ఛక్తి సముద్రమునందలి బిందువులు అనియు కూడ చెప్పఁబడినవి. శివాత్మక బిందువుల పరిణామమైన ఓంకారము యోగసూత్రమున చెప్పఁబడిన విధముగా శివవాచకమగుటలో వింతలేదు. అది

శివునివలె ప్రకాశలక్షణ వాగ్రూపమగుటచే ప్రకాశ్యమైన అర్థముతో అభేద సంబంధము కూడ కలిగియున్నది.

మితి ఇంద్రియ వ్యాపారముచేత విషయదేశమున విషయాకారము నొంది మనస్సున అది విషయచిత్రధాతనువగును. దృగ్విమర్శమువలె ఆ స్వరము (అస్వరము) అమ్మవారి పదము (స్థానము) అని చెప్పఁదగిన మూలాధారమున ఆవిర్భవించి ఊర్ధ్వగామియై పశ్యంతీ మధ్యమా వైఖరీ రూపముల నంది చివఱకు బహిర్గతమగును. ఆయాస్థానములలోని బిందువులు కూడ నాదరూపిణియైన వాక్కులోని పశ్యంత్యాది పరిణామములనొందును అని వేరుగా చెప్పనక్కఱలేదు. సంవిత్తునకు వలె వాక్కునకు ప్రకాశకత్వమున్నదని పైన చెప్పఁబడినది. అందుచేతనే అది సంవిత్తువలె స్వరాట్టు స్వయము రాజిల్లునదను అర్థమున అది స్వరమని చెప్పఁబడినది. కాని దివ్యచకోరిక శివాత్మకే అను శబ్దమునకు దహరాకాశము అను అర్థమును చెప్పినది. శివాత్మికే అను పాఠాంతరమున ఆ శబ్దము కాలికి విశేషణ సంబుద్ధ్యంతముగానే పేర్కొన్నది. విషయచిత్రధాతను శబ్దమును విషయ జ్ఞానమును విస్తరించునది అను అర్థమును చెప్పినది.

మొదట ఈ స్వరము (వాక్కు) విషయములను జ్ఞాతకు భిన్నములు అని మొదట తోచునట్లు చేసినను తరువాత విమర్శబలమున తదభిన్న బుద్ధి కలుగఁ జేయునను తాత్పర్యమునావిషయ చిత్రధాతనుః అను సమాసము బోధించును. దృగ్విమర్శమువలె విషయ విమర్శయు జ్ఞానకార్యమే అని ఇవ ఏవకారార్థమును బోధించుననియు వివరించినది. కొంచెమీ అర్థమును స్పష్టపరచు శబ్దము జ్ఞాన విమర్శవలె అస్ఫుట విమర్శమే అని చెప్పినది. దీనివలన విమర్శ జ్ఞాతృధర్మమని తెలియుచున్నది. ఇహ అను పాఠాంతరము నాశ్రయించి ఆ పదమునకు మండల త్రయమున అని అర్థము చెప్పినది. వాచక అను పదమునకు ప్రాణస్పందాత్మ వక్తృవ్యాపారమునకంటె వేరైనది శబ్దము అని చెప్పినది. స్వరమనగా ఓంకారప్రణవ నాదమని చెప్పినది. ప్రథమపాదమందలి దురుత్తర శబ్దము దుఃఖరూప మరణము నుండి తరింపఁజేయు జ్ఞానమని చెప్పినది. అద్వయ శబ్దమునకు దహరాకాశమని అర్థము చెప్పినది. ఉదయతే అను క్రియ స్వరము హ్రస్వదీర్ఘప్లుత ప్లుతతరరూప చతుర్మాత్రలు కలదిగా ఆవిర్భవించునదని అర్థము చెప్పినది. అది ఆత్మనేపదిగా ప్రయోగించుటచే తత్ఫలమాత్మగామియని ఆత్మ యొక్క సాక్షిత్వమును సూచితమని



చెప్పినది. ఉచ్ఛ్వాస నిశ్శ్వాసలలోని అజపాఖ్యమంత్రములోని సోఽహం శబ్దములు అనాహత నాదరూపములని హల్పరిత్యాగమున అదియే ఓంకారమగునని చెప్పినది. ఉచ్ఛ్వాస నిశ్శ్వాస రూపములగుటచే సోఽహం శబ్దముల ఉచ్చారణమున స్థాన ప్రయత్నాదులు లేకుండగానే జరుగుటచే అది అనాహత నాదరూపమని వివరించినది. సృష్టి స్థితి సంహారములందు వాగర్థోభయ సామరస్యరూపమున అది ఏకరూపమని పేర్కొన్నది. సోహంలోని సకార హకార ద్వయము చిత్తప్రబోధశక్తి విసర్గ స్థానీయమని విశేషించినది. క్రమప్రకాశిక ననుసరించి ఇహ అనుపదము శరీరమును బోధించును. ఇవ అనుపాఠము స్వీకరింపఁబడలేదు. ప్రథమ పాదమునకు దుర్భేదమున అనాహత చక్రమునాశ్రయించునట్టి అని అర్థమును చెప్పినది. అద్వయాత్ అను శబ్దమును అద్వయ భావోపలబ్ధి మూలమైన మూలాధారముగా వివరించినది. అది అద్వయోపలబ్ధికి మూలాధారమగుటచే దానికాపేరు వచ్చినదని మూలాధార శబ్దవ్యుత్పత్తిని చెప్పినది. విషయ చిత్రధాతనుః అను శబ్దమును విషయబోధోభయరూపముగా అని వివరించినది. అనగా స్వరము జ్ఞాన విషయము కావున విషయరూపమని, చైతన్య విషయముగా రూపొందిన అంతఃకరణముచే వ్యక్తము కావున బోధరూపమని, అనాహత చక్రమున స్వరము విషయ బోధలు అను రెండు రూపములలో నుండునని క్రమప్రకాశిక తాత్పర్యము. మూలాధారమందలి సంవిత్తు యొక్క విమర్శమే వేదాంతులచేత వివర్తమనఁబడునని వివరించినది.

**అవతారిక:–** పై శ్లోకమున అనాహత ప్రాణనాదము యొక్క ఉదయము చెప్పఁబడినది. ఈ శ్లోకమున దాని మానసత్యము అహతశబ్దకాభివ్యంజితమని చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ అమ్బ! ధామకరణప్రయత్నజో**
**వైఖరః స్ఫురతి శబ్ద ఆహతః।**
**మానసః పునరసావనాహతో**
**వాసిత స్త్వదుపలక్ష్య ఉత్తరః॥** **39**

**ప్రతిపదార్థము:–** అమ్బ=అమ్మా, ధామకరణప్రయత్నజః=కంఠతాల్వాది స్థానము లందు ఆయాకరణములయొక్క ప్రయత్నమువలన పుట్టిన, వైఖరః=స్పష్టమైన, ఆహతః=ఆహతమనఁబడు, శబ్దః=శబ్దము, పునః=కాని, అసౌ=ఈ, అనాహతః

=అనాహతము, మానసః=మనస్సున, స్ఫురతి=ప్రకాశించును, వాసితః=వాసితమై, త్వదుపలక్ష్యః=నీవు ఉపలక్ష్యముగా గలదై(నచో), ఉత్తరః=శ్రేష్ఠము.

**తాత్పర్యము:–** అమ్మా! కంఠతాల్వాది స్థానముల కరణముల ప్రయత్నమువలన పుట్టిన శబ్దము వైఖరస్వరము ఆహతశబ్దము. అనాహతశబ్దము మాత్రము మానసమున ప్రకాశించును. అది నీవు లక్ష్యముగా గలదగుచో రెండవది (శ్రేష్టము).

**వివరణము:–** 1) క్రమప్రకాశిక ననుసరించి వైఖరీ వాక్కుచే స్పష్టముగా శబ్దము వినఁబడును. గావున వైఖరము అనఁబడునని, **వై** అనగా నిశ్చితముగా **ఖ** కర్ణములోని ఆకాశమును **ర** చేరునది కావున వైఖరము అని వైఖర శబ్దవ్యుత్పత్తిని చెప్పినది. మానస శబ్ద మనాహతమని తాల్వాది స్థాన ప్రయత్న జన్య శబ్దము ఆహతమని వివరించినది. పూర్వము ఉచ్చరింపఁబడిన శబ్దము మనస్సున తోఁచఁబడినప్పుడు అది వాసిత మనఁబడును. తదుపలక్ష్య శబ్దమును అమ్మవారే పరమ కరణముగా ఉపలక్ష్యముగా గలది అనాహతశబ్దము అని అనాహతశబ్ద విశేషణముగా వివరించినది.

దివ్యచకోరిక ననుసరించి ఆహత శబ్దము మనసున స్మృతమైనపు డనాహత శబ్దమనఁబడును. గురూపదిష్ట శబ్దము ఆహతమేయైనను శిష్యుని కర్ణభేరియందు పునరాహతమై మనసున జ్ఞానమును జనింపఁజేయుట ద్వారా మోక్ష హేతువు కూడనగుచున్నది. ఇట్లు గురుపరంపర చేత పూర్తిగా హతః క్షుణ్ణమైనది. పరంపరా ప్రాప్తమైనదని ఆహహత శబ్దము యొక్క ఉత్తరత్వ శ్రేష్ఠత్వమును వివరించినది. (ఆ=కొంచెము, అనా=పూర్తిగా).

2) పరావాగ్రూప శబ్దము వాసితమై పశ్యంతియగు చున్నది. త్వదుప లక్ష్యమై మధ్యమయగుచున్నది. కంఠము దాటిపోవు వైఖరి యగుచున్నది. అనుట ఉత్తర శబ్దము వాసితత్వదుపలక్ష్య క్రమమును వ్యంజించును. 3) ఆహత శబ్దము గురూచ్చరిత తత్త్వమసీత్యాద్యుత్తమ శబ్దముల శిష్యకర్ణభేర్యాహతత్వమునే గాక గర్భభేద్యుచ్చరితముల యొక్క నింద్య వాక్యముల (అశాస్త్రీయ దుష్ట శబ్దముల) శ్రోతృ కర్ణభేర్యాహతత్వమును కూడ బోధించును. ఈ విషయము **కుతీర్థాదాగతం, దగ్ధం సుతీర్థాదాగతం** మొదలగు వేదాంగ జ్యౌతిషవాక్యములు స్పష్టపరచుచున్నవి. కుతీర్థసుతీర్థ శబ్దములు వక్తయొక్క యోగ్యతా అయోగ్యతలను తెల్పును. 4) మానస



అను శబ్దము మనస్సున వాసనారూపముననున్న శాక్త విసర్గ స్థానీయము. వాసనా రూపమున విశ్రమించియున్న శబ్దము అను అర్థమును బోధించును. 5) అనాహత శబ్దము అనుభూత స్వరూపము మరియు హృదయోద్యోగ సంతానరూపము. తైత్తిరీయ బ్రహ్మణము రెండవ కాండము రెండవ ప్రశ్నము సప్తమానువాకమునందలి **'తస్మాత్పుత్రో హృదయం తస్మాదస్మాల్లోకమముం లోకం నాభికామయన్తే పుత్రోహి హృదయమ్'** (అందువలన ఈ లోకము నందలి పుత్రుని కోరరు. హృదయమే పుత్రుడు. దానినే సాధకులు కోరుదురు.) అను శ్రుతి వాక్యము ననుసరించి చిత్తశాంతి లక్షణ విసర్గ జ్ఞాన సంతాన రూపముననున్న పుత్రుడే మానస శబ్దార్థము అనియు చెప్పవచ్చును. ఆధ్యాత్మిక మైన హృదయోద్యోగ రూప జీవశక్తి యజ్ఞార్థము కానందుననే దేవతలను వదలి వినసయలలో ప్రవేశించుట ఆ సందర్భమున చెప్పఁబడినది.

ఆహత రూపశబ్దశక్తియు హృదయోద్యోగముగా పరిణమించి పుత్రులు లేని సకామకర్మపరులకు కలుగునట్టి పుత్ అనఁబడు నరకము నుండి కాపాడుట అనఁబడులక్షణము హృదయోద్యోగ రూపమునకు ఉన్నందుననే **పుత్రో హృదయమ్** అను వేద వాక్యమున హృదయమునకు పుత్రత్వము చెప్పఁబడుట సార్థకమయిన దని గమనింపవలెను.

**వాగ్వై దేవేభ్యః అపాక్రామత్ యజ్ఞయా తిష్ఠమానా సా వనస్పతీన్ ప్రావిశత్ సైషా వాగ్వనస్పతిషు వదతి యా దుందుభౌ యా తూణవే యా వీణాయాం యద్దీక్షితోదణ్డం ప్రయచ్ఛతి వాచమేవావరున్ధే** (దేవతలందున్నచో యజ్ఞమున కుపయోగపడకపోవుటచే వారి నుండి తొలగెను. వనస్పతులలో ప్రవేశించెను. ఆ వాక్కు వనస్పతులలో ఉండును. అదియే దుందుభియందు వీణయందు బూరయందు కనిపించును. దీక్షితునకు దండమునీయగానే వాక్కును నిరోధించును. ఇత్యాది శ్రుతివాక్యములు పై ప్రతిపాదమునకు ప్రమాణములు. 5)వాసితః అనుశబ్దము వాసనారూపమున ఉన్న పరావాగ్రూపమును బోధించును. త్వదుపలక్ష్యః అను శబ్దము పశ్యంతీ రూపమున స్వ సంవేద్యమేయగును. పరాస్థితిలో అర్థము స్వాభిన్నముగా ఉండును. పశ్యంతీ స్థితిలో ఉచ్ఛూన బీజము నందు వలె భేదము కనిపించుచున్నను శబ్దార్థముల పరస్పరావినాభావము కూడ గోచరించు చుండును. మధ్యమాస్థితియందు శబ్దము అర్థము వెంబడి ప్రయాణించుట యుండును.

ఇతరులకు వినఁబడు వైఖరీస్థితిలో శబ్దము శ్రవణానంతరమే శ్రోతకు తదర్థము గోచరించు క్రమము. అనగా భిన్న కాలికత్వము స్పష్టముగానే ఉండును. అప్పుడును వాని అవినాభావము లేక సహభావము సూక్ష్మదృష్టికి గోచరించుచునే యుండును. తరణ త్వదుపలక్ష్యవిత్ అను పాఠమున అసంపూర్ణముగా స్వరూపము గోచరించు స్థితి (మధ్యమగా కూడని స్థితిని) బోధించు త్వదుపలక్ష్యఉత్తరః అని శబ్దములు వైఖరియందలి స్వరూపము స్పష్టముగా గోచరించు స్థితిని బోధించును. పైన చెప్పఁబడిన వాక్కు యొక్క చతుర్విధ స్ఫురణ పక్షముగ మహర్తమంజరీ పరిమలమున చెప్పఁబడినది. పఞ్చవిధ స్ఫురణన పక్షమున (1) నష్టార్ధ చతుష్టయ భావాభాసనము, (2) లీనమేయత్రయ భాసనానువృత్తత్వము, (3) మేయమాన ఘస్మర వేత్తృత్వము, (4) సవికల్పకమేయ విమర్శము, (5) నిర్వికల్పకమేయా వభాసము – అను పంచవిధ స్ఫురణములను స్ఫురతి అను శబ్దము బోధించును. ఇది చతుర్విధ స్ఫురణపక్షమును **త్రీణినిహితా నేఙ్గయన్తి తురీయం వాచో మనుష్యా వదన్తి** (మూడు వాక్కులు పరా పశ్యంతీ మధ్యమల గుహయందుండును. నాల్గవదానిని మనుష్యులు పల్కెదరు) అను వేదవాక్యము **విమర్శో బిన్దునాదౌ చ స్ఫోటః, శబ్దశ్చ వాక్క్రమః** (విమర్శము, బిన్దువు, నాదము, స్ఫోటము, శబ్దము (బహిర్గతము అనునది వాక్క్రమము) అను ఆగమ వాక్యమును ప్రమాణములు వేదచతుష్టయ వేదపఞ్చక (పురాణాదివాఙ్మయ సహిత) వ్యవహారము ననుసరించియు వాక్కు యొక్క చాతుర్విధ్య పాంచవిధ్యములను సమర్థింపవచ్చును. 6) ఉత్తమః అనుపాఠమున ఉన్నిద్రిత మాతృకాకుండలిన్యవభాసము చేత ఉద్గత మనస్కమైనది అని ఆ పదము బోధించును. 7) నాడీ చక్రమున అనేక విధములైన నాడులున్నను ప్రాణాపానాది వాయుపంచకమును ప్రసరింపఁజేయు ఐదు నాడులు ముఖ్యములు. ఆ నాడులు శబ్దాత్మకములని అగ్నిపురాణము అనాహత నాదోపాసనోపయుక్తమై పఞ్చవిధ శబ్దోపాసనా క్రమమును చెప్పియున్నది. విద్ ధాతువు యొక్క విచరణార్థము ననుసరించి ఆత్మ విచారోపయుక్త సర్వవేదములందలి ఉపనిషద్వాక్యములు విచారణీయములు. కావున త్వదుపలక్ష్య విస్/ఉత్ (తరః) అను పదములు శ్రుత స్మృత ఆహతాహత) శబ్దముల (వాక్యములు) చాతుర్విధ్యపాంచవిధ్యముల సమర్థింప వచ్చును.

**అవతారిక:–** పై శ్లోకమున ఆహతానాహత శబ్ద స్వరూపము విచారింపఁబడినది. పై శ్లోకమున తద్రూప మాతృకాస్వరఖండము పూర్వతమ శ్లోకమున చెప్పఁబడిన



ధామత్రయకలారూపమగుటచే పరస్పరయోనిబీజధర్మద్వయముగల దగుటచే అది స్వతో రాజన (లేక) స్వతో రంజన ధర్మముగలదిగా ఈ శ్లోకమున చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ షణ్ఢవర్జమహిమద్యుతేః కలా**
**స్సర్గ బిన్దురహితాశ్చ యే శుభేః(చేః)।**
**సర్వ ఏవ శశినః కలాశ్శివే**
**యోనయో విధృతబీజత త్స్వరాః (త్పరాః)॥ 40**

**ప్రతిపదార్థము:–** శివే=ఓ శివా!, షణ్ఢ వర్జమ్=నపుంసకములు కాక, అహిమద్యుతేః =సూర్యుని యొక్క, యే=ఏ, కలాః=కలలు (కలవో), చ=మరియు, సర్గబిన్దు రహితాః =విసర్గబిన్దువులులేని, శుచేః=అగ్నియొక్క, యే=ఏ, కలలు (కలవో) (తే=అ), సర్వే=అన్ని, శశినః=చంద్రునియొక్క, కలాఏవ=కలలే, యోనయః= యోనులు, విధృతబీజతః=ధరింపబడిన బీజములు కలవగుటచే, స్వరాః= స్వరములు లేక విధృతబీజ తత్పరాః=అనేక విధములుగా ధృత బీజములందు తాత్పర్యము కలవి.

**తాత్పర్యము:–** ఓ శివా! నపుంసకములు తప్ప మిగిలిన సూర్యాగ్ని కలలు అన్ని యోనిబీజ లక్షణ ద్వయము కల స్వరములు.

**వివరణము:–** దివ్యచకోరిక ననుసరించి శివాశబ్దము యొక్క సమ్బుద్ధియైన శివే శబ్దము యొక్క మంగలేచ్ఛారూపిణీ అను అర్థముగలది అని శివశబ్దము యొక్క సప్తమ్యేకవచనాంతమైన శివే శబ్దము (సాధక) శివునందు అని రెండు విధములుగా వ్యాఖ్యానింపఁబడినది. శుభే అను పదము కూడ శుభా శబ్దము యొక్క సంబుద్ధిగా మంగల స్వరూపురాలా అను అర్థము కలదిగా శుభ శబ్దము యొక్క సప్తమ్యేకవచన అంతముగా శుభరూపుడైన అను అర్థము కలదిగా రెండు విధములుగా వ్యాఖ్యానించఁబడినది. 2) షణ్ఢస్వరములు ఋ ౠ ఌ ౡ అనునవి. ఇవి ప్రకాశమను (శివ) పుంధర్మమును, విమర్శమను స్త్రీ (శక్తి) ధర్మముకలవగుటచే నపుంసకస్వరములు అని చెప్పఁబడినవి. మిగిలిన స్వరములు సూర్యకలలు. ఇవి పన్నెండు. వీనిలో విసర్గ బిందు రహితములు అనగా అం అః అనువానిని విడచివేయగా మిగిలినవి (పది స్వరములు) (అఁ) అను అర్ధబిందువుతో కూడిన పదునొకండు స్వరములు అగ్నికలలు అని చెప్పఁబడును. పైన పేర్కొనఁబడిన నపుంసక స్వరములతో కలిపి మొత్తము స్వరములు పదునాఱు. అవి అన్నియు

చంద్రకలలే. 3) విధృత బీజ తత్పరా అను పాఠమున వివిధముగా ధరింపఁబడిన బీజములు కలవానియందు తత్పరములు అని సమాసార్థము. అనగా వీనిలోని కొన్ని త్రివిధపరామర్శ కలవి, కొన్ని షడ్విధపరామర్శ కలవి. ఇట్లు వివిధ పరామర్శలు కలవి ధృతబీజములు. వీనియందు తాత్పర్యములు కల స్వరములు అని ఆ సమాసము స్వరముల వివిధ పరామర్శల సూచించుచున్నది. 4) యోనిశబ్దము సాధారణముగ హల్లును బోధించును. యోనయః అను శబ్దము యోని, మహా యోని శఙ్ఖపద్మ దివ్యయోనులు అను అర్థమును బోధించును. పై యోనులు (స్వరములు) అన్ని వ్యావహారిక పారమార్థికమూర్తిద్వయాత్మకమైన హ్రస్వదీర్ఘ భేదము గల అనుత్తరాకారరూప శశి (సోముని) – చన్ద్రుని (శివుని) కలలే అని గమనింపవలసియున్నది. వ్యావహారిక మూర్తి కలల రెండింటిని విడచినచో వాని సంఖ్య ముప్పది మూడు. అమ్బ అనునది స్త్రీ మూర్తి కల (కర్తృ, కర్మ కారకములలో ఏదో ఒకటి). అభిజిత్ అనునది కర్తృ అధికరణకారకములలో ఏదో ఒకటియైనట్టిది. పురుషమూర్తి కల తైత్తిరీయసంహిత నాల్గవ కాండము, నాల్గవ ప్రపాఠకము పంచమానువాకమందు; తైత్తిరీయ బ్రాహ్మణము సప్తమకాండమున ద్వితీయ కాండమున మరియు సంహితయందు **అమ్బాదులాని తస్త్రిరభ్రయన్తీ మేఘయన్తీ వర్షయన్తీ చుపుణీకానామాసి** అని సప్త కృత్తికల యొక్క **బ్రాహ్మణోవా అష్టావిగ్ంశో నక్షత్రాణాం'** అని మరియు **అభిజిన్నామ నక్షత్రమ్** అని, **ఉపరిష్టాదషాఢానాం, అవస్తాత్ శ్రోణాయై** అని, మరియు **ప్రజాపతే స్త్రయస్త్రిగ్ంశత్దుహితర ఆసన్ తాస్సోమాయరాజ్ఞే అదదాత్ తాసాగ్ం రోహిణీముపైత్'** అని ఇత్యాది శ్రుతులలో అక్షరముల యొక్క దక్షసుతాత్వము చెప్పఁబడినట్లు తెలియును. యోని శబ్దము హల్లులను బోధించునట్లు బీజ శబ్దము అచ్చులను బోధించును. అందువలన యోనయోవిధృతబీజతత్పరా అనుపాఠముగల పాదము అర్థాంతరన్యాససమాసోక్త్యలంకారాలంకృతమైయున్నది. స్త్రీ – పురుష తత్పరయైనట్లు యోని బీజ తత్పర అను నను ఔపమ్యము నీపాదము ధ్వనించును. బీజ శబ్దమొకప్పుడు సబిన్దుకాక్షరబోధకముగా లోక ప్రసిద్ధమైయున్నది. బీజాక్షరమను శబ్దము నీ అర్థమున బోధించుట సాధారణ వ్యవహారగోచరము.

స్త్రీ తన యోనిలో బీజమును ధరించుటకై పురుషతత్పరయగునట్లు యోని అనబడు హల్లు బీజతత్పరమగును. బీజము అనగా స్వరము లేకుండ కేవల



యోని అనగా హల్లు వాఙ్మయమున ప్రయోగింపబడుట అరుదుగానే జరుగును. బీజమును లేక వీర్యమును ధరించిన స్త్రీ విధృతమైన ఆ బీజమును పదిలముగా కాపాడుకొనుటలో తాత్పర్యముకలదైయుండును. యోని గతమైన బీజమునందు అనగా దాని రక్షణ పోషణములందుకలదగును అను అర్థాంతరమును సమాసోక్తిచ్ఛాయలో వివాదము న్యసించినది. కాని కవి ఈ అర్థాంతరన్యాసమును వివక్షించినట్లు కానరాదు. వేదాన్తశాస్త్ర వ్యవహారమున యోని బీజ శబ్దములు ప్రకృతిపురుష బోధకములు. ఈ శ్లోకమున స్వరములకు యోనిత్వము వాచ్యమైనది. కొన్ని తంత్రములలో ఇట్టి వ్యవహారము తంత్రజ్ఞ సమ్మతమే. వాస్తవమును విచారించగా బీజమే ఉపాదానకారణము. అదియే స్థూలశరీరముగా పరిణమించు సూక్ష్మస్థితి కలది. స్త్రీయోని గర్భముల సూక్ష్మమైన బీజము స్థూలముగా పరిణమించుటలో సహకారమును మాత్రమొనరించును. మఱ్ఱి విత్తనము మహత్వముగల వట వృక్షముగా పరిణమించుటలో క్షేత్రము సహకరించునట్లు పురుషబీజ రూప సూక్ష్మశరీరము స్థూలముగా పరిణమించుటలో స్త్రీయోని గర్భములు సహకరించును. అందువలన బీజమును ప్రధానముగా మాతృత్వము ప్రకృతిత్వము సిద్ధించును అనుటలో సంశయముండనక్కర లేదు. అందువలన స్త్రీ–పురుషులిరువురకు యోని(గర్భ) బీజముల రెండింటికి అనగా అచ్చులకు హల్లులకు రెండు విధములైన వర్ణములను కలిపి మాతృవ్యవహారము ఉపపన్నమగు చున్నది. గర్భాధానానంతరమున పురుషుడు దూరముగా అనగా బీజ రక్షణ పోషణలకు దూరముగా ఉన్నంత మాత్రమున ఆతనియందు అవ్యావహారికమైనను మాతృత్వము అనగా ఉపాదానత్వము లేదన రాదు. సాక్షివలె దూరముగా ఉన్న కారణమున పురుషుని సాక్షిత్వము వ్యవహారమైనది. జగదుపాదానత్వము ఈశ్వరరూప పురుషగతబీజమునకే ఉన్నది. పరిణమించుటలో సూక్ష్మజగము స్థూలముగా పరిణమించుటలో ప్రకృతి నిమిత్తత్వమే సిద్ధించును. వాస్తవమున కీ యోనిబీజములు రెండును స్త్రీ–పురుష శరీరగతములే కావున శరీరాంతర్వర్తియైన బ్రహ్మకు కేవల సాక్షిత్వము మాత్రమే శాస్త్ర సమ్మతము. కావుననే శాక్తేయ తంత్రములలో స్త్రీ–పురుష పరంపరగా హేతువైన ప్రకృతిని లేక మాయకు ఉపాదానత్వము తదుభయ శరీరియైన కేవలాత్మకు సాక్షిత్వము చెప్పుటయే సముచితము. అంతేగాక జగన్నిర్మాణత్వమున ఉపాదానత్వము వహించిన బ్రహ్మ శరీరభూత మాయా ప్రకృతి శబ్దవాచ్యమైన కాల్యాది శాబ్దప్రాధాన్యము తంత్ర సమ్మతమైనది. జీవేశ్వరోభయ

సాధారణమున ఆత్మగత సాక్షిత్వము పురుష ప్రాధాన్యమునకు చెప్పుదర్శనముల కన్న తంత్రగత ప్రకృతి ప్రాధాన్యము సముచిత తరమై యొప్పుచున్నది.

క్రమప్రకాశిక ననుసరించి నలుబదియొక్క శ్లోకములు కలసి యొక వాక్యము. ఇందు వర్ణమాతృకలచే నిర్మితమైన క్రియామయ మాతృకా శక్తియు పరమేశ్వర శక్తి కన్న భిన్నముకాదు అను తాత్పర్యము కలది. అ, ఇ, ఉ, సూర్య స్వరములు. ఆ, ఈ, ఊ (విసర్గ బిందు రహితములు) అనునవి చంద్ర స్వరములు. విధృత బీజతః స్వరాః అనుపదములకు మాతృలక్షణ క్రియామయ శక్తి నిర్మాణమున సహాయముగా స్వీకరింపఁబడిన స్వబీజ భూతములు నపుంసకములుకాని స్వరములు ధరించిన యోనులు అని అర్థము చెప్పఁబడినది. యోనులు అను పదమునకు వ్యంజనములు (హల్లులు) అని అర్థము చెప్పఁబడినది. విసర్గ బిన్దురహితములైన స్వరములన్న చంద్రకలలని చెప్పఁబడినది.

**అవతారిక:–** పై శ్లోకమున స్వరములకు యోనిత్వము, వ్యంజనములకు బీజత్వము స్వర వ్యంజనముల భేదము చెప్పఁబడినది. అట్లు భిన్నమైన మాతృక క్రియాశక్తిమయ మైన పరమేశ్వర శరీరమే అని చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ బీజయోనివిధిభేదభేదితా**
**మాతృకా (మనుజ) సుకృతమాతృలక్షణా।**
**శక్తిరమ్బ! భవతి క్రియామయీ**
**త్వత్తనుర్జయతి పారమేశ్వరీ॥ 41**

**ప్రతిపదార్థము:–** బీజయోని విధి భేదభేదితా=బీజవిధి యొక్క యోనివిధి యొక్క భేదమున వేరైన, మాతృకా=వర్ణమాలా, మనుజ మాతృలక్షణా=మానవుల మాత లక్షణములు కల, శక్తిః=శక్తి, అమ్బ=అమ్మా, క్రియామయీ=క్రియామయమైన, పారమేశ్వరీ=పరమేశ్వర సంబంధముగల, త్వత్తనుః=నీ శరీరమే, భవతి=అగుచున్నది. జయతి=విజయము చేయుచున్నది.

**తాత్పర్యము:–** అమ్మా! బీజవిధి యోనివిధి అను రెండు విధుల భేదమున వేరైన మనుష్యుల మాత యొక్క లక్షణములుగల మాతృకా పరమేశ్వర సంబంధమైన మాతృకాశక్తి నీ శరీరమే అగుచున్నది.

**వి:–** క్రమప్రకాశిక ననుసరించి అచ్చులతో దీర్ఘములు స్త్రీ రూపములు, హ్రస్వములు



పుంరూపములు అని చెప్పిన శారదాతిలక గ్రంథాంశము నుటంకించినది. మాతృకయందు మాతృ లక్షణములున్నట్లు పేర్కొన్నది. కాని అందు ఆ లక్షణములు పేర్కొనఁబడలేదు. యోని బీజరూపములైన హల్లులు, అచ్చులు అన్ని కలసిన మాతృక పరమేశ్వర క్రియాశక్తి రూపమైన అమ్మవారి శరీరమే. అ ఇ ఉ అనునవి ప్రకాశ భాగ సారములు. కావున ప్రధానములు కావున అవి సూర్యాత్మకములని ఆ ఈ ఊ అనునవి విమర్శ భాగసారములు స్వవిశ్రాంతి ప్రధానములు. కావున అప్రధానములగుటచే సోమాత్మకములు అని చెప్పు తంత్రసార వాక్యములనుల్లేఖించినది. దివ్యచకోరిక ననుసరించి యోని (హల్) సంయోగము లేకున్నను స్వయంరాజకత్వము స్వరములందుండును. అదియే బీజవిధి స్వయం రాజమానత్వమునకే ఆనందమయత్వ మనిపేరు. కాదిక్షాంత వర్ణములు (హల్లులు) స్వరాపేక్షతోనే స్వయంరాజమానత్వమును పొందును. ఇట్లు స్వరసహితములైన పిమ్మట వానికి స్వయం రాజముండునని వేఱుగా చెప్పనక్కఱలేదు. ఇట్టి ఆనంద పారతంత్ర్యమే యోనివిధి. మూర్తి సంభవము యోనుల నుండియే. ఆ మూర్తుల మహా యోని బ్రహ్మము. దానికి బీజమునిచ్చువాడను నేనే అని శ్రీకృష్ణుడు భగవద్గీతలో చెప్పియున్నందున యోనుల సమష్టి మహత్తు అని మహాయోని యొక్క ఉనికి మరియు యోనుల మాతృత్వము మహాయోని యొక్క పరమమాతృత పరమేశ్వరుని బీజ ప్రధాన రూపత్వము స్పష్టములగుచున్నవి. 2) మాతృకయనగా వ్యక్త ధ్వని గల వర్ణమాల. ఈ వర్ణములు అకారాది క్షకారాంతములు. వీని వరుసయే వర్ణమాల. ఈ వర్ణములు పదములకు, వాక్యములకు హేతువులు. కావున వానికిని మాతృకత్వమున్నది. పదమాతృక వాక్య(భాషా)మాతృక అని వానిని పేర్కొనవచ్చును. లోకమున స్త్రీ మాతృకయని పేర్కొనఁబడును. మనుజులందరికి స్త్రీ మాతృక యనఁ బడుట సహజమే. మనుజులనగా మానవులు. అనగా మానవుల నుండి పుట్టినవారు. వీనికి మాత స్త్రీ అని ఇది వఱకే చెప్పఁబడినది. మన జ్ఞానే అను ధాతువు నుండి పుట్టిన మను శబ్దమునకు మంత్రములనియు అర్థమున్నది. కావున **మనవః జాయంతే అస్మాత్** అను వ్యుత్పత్తిననుసరించి మంత్రముల వర్ణములకు మాతృకత్వము ఉపపన్నమగుచున్నది. **మాతి పరిచ్ఛినత్తి ఆత్మానమ్** అను వ్యుత్పత్తి ననుసరించి మాధాతు నిష్పన్నమైన అనగా క్విప్ప్రత్యయాంతముగా నిష్పన్నమైన **మా** శబ్దము నామ మన్త్రాది రూపిణియైన వాగర్థలక్ష్మియైన ప్రకృతి మా అనఁ బడును. నాదాత్మక పూర్వ స్వరూపమును విడచి వర్ణభూమికకు దిగు పురుషతత్త్వము

పితృ అనఁబడును. మా యనగా ప్రకృతి అని తృ అనగా పురుషుడని మాతృశబ్దము. ప్రకృతి పురుషోభయ వాచకమగునని చెప్పఁబడినది. నామ మన్త్రపదవాక్యముల వర్ణములకు స్త్రీకిని మనుజ మాతృ లక్షణము సిద్ధించును. ప్రకృతి పురుషులిరువురు 'మాతృ' అను పదము యొక్క అర్థములని ఈవఱకే చెప్పఁబడినది. కావున మాతృకా శక్తి మనుజ మాతృ లక్షణమని శ్లోకమున విశ్లేషింపఁబడినది. 3) అట్లే పారమేశ్వరీ శబ్దము పరమేశ్వరీ పరమేశ్వరోభయమును ఏక శేష వృత్తితో బోధించు పరమేశ్వర శబ్దము పరమేశ్వరీ పరమేశ్వరోభయ గత క్రియాశక్తి పారమేశ్వరి అని చెప్పఁబడును. సృష్ట్యాది పఞ్చకృత్యములనొనరించు క్రియాశక్తి అమ్మవారి శరీరమే అని ఉత్తరార్ధము యొక్క భావము. 4) సుకృత మాతృ లక్షణా అను పాఠమును స్వీకరించి **తదాత్మానగ్ం స్వయమకురుత, తస్మాత్తత్ సుకృతమ్'** అను తైత్తిరీయ శ్రుతి వాక్యములననుసరించి సుకృత్ శబ్దమునకు ఆత్మ అనియే అర్థము. ఆత్మమాతృ (జ్ఞాతృ) లక్షణము కలదనుట ప్రసిద్ధమే. కావున ఆ విశేషణము స్త్రీ పురుషో (ప్రకృతి పురుషో) భయ వాచి మాతృకా శబ్దమునకు విశేషణముగా చెప్పుటలో విప్రతిపత్తి ఉండనక్కఱలేదు.

**అవతారిక:–**పూర్వశ్లోకమున క్రియామయ మాతృకాశక్తి అమ్మవారి శరీరమని చెప్పఁబడినది. ఈ శ్లోకమున ఆ క్రియామయ శరీరమునకు బిన్దునాదబీజత్రితయ ధర్మము కల అమ్మవారే కారణమని చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ బిన్దురక్షరమయం క్రియామయం**
**యో నియన్త్రయతి బుద్ధిలక్షణః।**
**నాద ఇష్టతనురస్య కారణం**
**త్వం పరే త్రితయధర్మరూపిణీ॥ 42**

**ప్రతిపదార్థము:–** యః=ఏ, బుద్ధిలక్షణః=బుద్ధి అనఁబడు, బిన్దుః=బిన్దువు అక్షరమయమ్=అక్షరమయమైన, క్రియామయమ్=క్రియాశక్తిమయము (శరీరము) ను, నియంత్రయతి=నియమించునో, నాదః=నాదము, ఇష్టతనుః=ఇష్టతనువో, అస్య=దీనికి (బిన్దువుకు) త్రితయధర్మరూపిణి=నాదబిన్దు బీజములను మూడింటి ధర్మములు రూపములుగాగల లేక కారణక్రియాకార్య ధర్మములు రూపములుగా గల, పరా=ఓ పరాశక్తీ, త్వమ్=నీవు, కారణమ్=కారణమవు.

**తాత్పర్యము:–** నాదబిన్దుబీజములను మూడు ధర్మములు లేక కారణ క్రియాకార్య



ధర్మములు రూపములుగా గల ఓ పరాశక్తీ! బుద్ధి అనఁబడు ఏ బిన్దువు క్రియామయ శబ్దమయ శరీరమున నియమించునో, నాదమే దేనికి ఇష్టతనువో, ఆ బిన్దువునకు నీవే కారణమవు.

**వివరణము:–** క్రమప్రకాశిక ననుసరించి అమ్బ పరాశక్తిమయ బిన్దురూపిణి ఆమె కార్యములైన నాద బిన్దు బీజములు మూడింటికి శ్రవణగోచరము కాని నాదము ఇష్టమైన శరీరముగా గల బుద్ధి అను బిందువు కారణము. వాగర్థ (శబ్దార్థ) మయ జగమునకు నియామకము గూడ. కార్యములైన నాదబిన్దు బీజములలో నాదమునకు బిన్దువు, బిన్దువునకు బీజమును కారణములు. బీజమునకన్న సూక్ష్మము బిన్దువు. బిందువునకన్న సూక్ష్మము నాదము. పూర్వపూర్వము కార్యము. ఉత్తరోత్తరము కారణము సూక్ష్మము. చిన్మాత్రకు తత్త్వమని పేరు. అది జ్యోతిస్సన్నిధానమున సృష్టీచ్ఛగలదైనప్పుడు ఘనీభవించి బిందురూపమునందును, కాలక్రమమున ఆ బిన్దువు (కారణము) భేదించి కార్య బీజ బిన్దు నాదములుగా విభాగముల నందును. వానిలో బీజము స్థూలము. బిందువు సూక్ష్మము. నాదము పరము.

దివ్యచకోరిక ననుసరించి పరాశబ్దము యొక్క సంబుద్ధియైన పరే అను శబ్దము త్రితయ ధర్మరూపిణీ శబ్దము యొక్క సంబుద్ధియైన త్రితయధర్మ రూపిణి అను శబ్దములు అమ్మవారిని బోధించును. లేదు పరశబ్దము యొక్క సప్తమ్యేక వచనాంతమైన పరే అను శబ్దము త్రితయ ధర్మ రూపిన్ అను శబ్దము యొక్క సప్తమ్యేకవచనాంతమైన త్రితీయ ధర్మరూపిణి అను శబ్దములు శివునకు విశేషణములై అట్టి విశేషములుగల శివునందు అను అర్థమును బోధించును. అమ్మవారు పరావాగ్రూపిణి, నాదాత్మకుడు పరశివుడు. త్రితయ ధర్మ రూపిణీ అనుపాఠము నాశ్రయించి అమ్మవారికి విశేషణముగా కూడ త్వమ్ పదముతో అన్వయింపవచ్చు. 2) నాదము స్వరూపము. కావున అది శివుని ఇష్టతనువని చెప్పఁబడినది. శరీరమునకన్న స్వరూపమునందే ఆత్మబుద్ధి ఉచితము. కావున అది తన శరీరముగా లేక రూపపఞ్చకముగాంచునది. కావునను నాదము ఇష్టతనువు అని చెప్పఁబడినది. స్వరూపమైన ఈ ఇష్టతనువు స్వర వర్ణ బిన్దు నాదకలలు అనఁబడు రూప పఞ్చకముగా విస్తరించిన శరీరముగా అంగీకరింపఁబడినది. క్రియామయమైనను శరీరము తనలోని బుద్ధిని లక్షించుటకు సాధనము. కావున ఆ నాదము బుద్ధి లక్షణమని చెప్పఁబడినది. 3) స్పన్దార్థకమైన **బిది** ధాతువు

నుండి పుట్టిన బిన్దుశబ్దము జ్ఞానస్పన్దమును క్రియాస్పన్దమును బోధించును. జ్ఞాన శరీరము అక్షరమయము అనగా శాశ్వతత్వ స్వరూపము కలది. వేదాంతులలోని ఒక పక్షమున ఆనన్దమయ ఇత్యాదౌపనిషద శబ్దములందు వలె ఇచట అక్షరమయ శబ్దమునందలి మయట్ప్రత్యయము స్వరూపార్థకమే కాని ప్రాచుర్యార్థకము కాదు. పరశేష న్యాయమున క్రియామయ శబ్దము, అవినాశి అని వేరుగా చెప్పనక్కఅలేదు. వినాశి ధ్వన్యాత్మక వర్ణమయ క్రియామయ శరీరమును అవినాశిజ్ఞాన (మూలకరణ) శరీరము నియంత్రించును. అనగా ఆత్మ అనఁబడు జ్ఞానము సమస్తమునకు మూలకరణము కావున అది బుద్ధి (వినాశిజ్ఞాన) మయ క్రియామయ (వినాశివర్ణ ధ్వనిమయ) శరీరద్వయమును నియంత్రించును. యోనియన్త్రయతి అనునది మొత్తమేక పదముగా భావించినప్పుడు నాదము నియంతవలె ఆచరించును. అని ఆచారార్థక క్విబంతనామధేయ నిష్పన్న క్రియాపదము జ్ఞానమున లీనమై ఉన్ననాదమే క్రియామయవినాశిశరీరమును నియంతవలె నియంత్రించును అను అర్థము లభింపఁజేయగలదు. 4) అన్యకారణమ్ అనుపాఠమును స్వీకరించినప్పుడు ఆ పదము క్రియామయ శరీరమునకు వలె కార్యమయము కూడ అమ్మవారే కారణము అను అర్థమునిచ్చును. అమ్మవారే క్రియా కార్యోభయముగా పరిణమించును అనునది తాత్పర్యార్థము. అస్య కారణమ్ అనుపాఠమును స్వీకరించినపుడు క్రియామయమునకు వలె కార్యముగా పరిణమించిన నాదానుత్తరమైన అకార నాదమునకు అమ్మవారే కారణమను అర్థము లభించును. అందువలన కార్యకారణ క్రియాత్రిపుటీ రూపమైన నాదనాథ నవక సమష్టి ధర్మధర్ములైన పరావాక్ పరనాద స్వరూపులైన కాలీకాలుల స్వరూపభేదము కూడ ఐచ్ఛికమే అని తెలియదు. వారికి గల శేషశేషిభావము ఐచ్ఛికమే అనియు తెలియును. గజ చిత్రము కారణముగా గజమని పిలువబడు పటమే, వృషభచిత్రము కారణముగా వృషభమని పిలువ బడును. అట్లే వృషభ చిత్రము కారణముగా వృషభమని పిలువబడుపటమే, గజచిత్రము కారణముగా గజమని పిలువఁబడును. ఈ గజవృషభ (గజ) చిత్ర న్యాయమున కాలీకాలుర పారమ్యము ఒకప్పుడు కాలీగతము కాగా మరొకప్పుడు కాలగతముగా వ్యవహరింపఁబడినంత మాత్రమున వారి ఏక స్వరూపమును భేదలేశమును కలుగజాలదు.

**అవతారిక:–** పై శ్లోకమున క్రియామయశరీరమునకు జ్ఞానమయశరీరము



నియామకమని చెప్పఁబడినది. ఈ శ్లోకమున జ్ఞానక్రియాస్పన్దములకు ప్రథమ స్పన్దమైన ఇచ్ఛయే హేతువని చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ ఉద్యమః ప్రథమ ఊర్మిరుత్తరో**
**నిస్తరఙ్గశివచిత్పయోనిధేః।**
**ప్రాగచిత్పదపరిగ్రహోత్తవ (తో)**
**వ్యోమనీశ్వరి తనుర్మహోదయః॥ 43**

**ప్రతిపదార్థము:–** ఈశ్వరి=ఓ ఈశ్వరీ!, నిస్తరఙ్గశివచిత్పయోనిధేః=అలలు లేని శివుడను జ్ఞానసముద్రునియొక్క, ప్రథమః=మొదటి, ఉద్యమః=ప్రయత్నము, (స్పన్దము) ఊర్మిః=తరఙ్గము, తవ=నీ యొక్క (లేక), తతః=పిమ్మట, అచిత్ పద పరిగ్రహాత్=జడత్వస్వీకారమునకు,ప్రాక్=పూర్వము, వ్యోమని=(దహర) ఆకాశము నందు, మహోదయః=గొప్పఉదయము, తనుః=శరీరము, ఉత్తరః=తరువాతిది.

**తాత్పర్యము:–** ఓ ఈశ్వరి! నీవు జడత్వమును స్వీకరించుటకు పూర్వము నిస్తరఙ్గ శివసముద్రము యొక్క మొదటి యత్నము లేక స్పన్దము తరఙ్గము. మహోదయ రూపమైన నీ తనువు తరువాతి తరఙ్గము.

**వివరణము:–** క్రమప్రకాశిక ననుసరించి నిస్తరఙ్గ శివసముద్రమునందలి మొదటి స్పన్దము ఇచ్ఛాశక్తిరూపము. రెండవది జ్ఞానశక్తి రూపము. ఇది క్రియాశక్తి కన్న ముందు పుట్టునది. క్రియాశక్తి తృతీయ స్పన్దము. విశ్వమునకు హేతువు. శివుని జగద్ధరణ హేతు ధాతువు శక్తి. అది శివునందు విడదీయరాక సమవాయ సంబంధమున సమవేతమై సమవాయినియై ఉండును. అందుచేత ఓ దేవీ! నీవు ఆ శివునకు ఇచ్ఛయని చెప్పఁబడెదవు. శివునందేకమై యున్నను ఆ ఇచ్ఛాశక్తి ఇది ఇట్లే అని తెలియదగిన జ్ఞేయమును తెలుపుచు జ్ఞానశక్తియని ఇదివఱకిట్లే యైన వస్తువు ఇకముందును ఇట్లు అగుగాక అను ఆ ఇచ్ఛ కారణముగానే అట్లే చేయుచు క్రియాశక్తియని పిలువఁబడును, అని చెప్పిన **మాలినీవిజయతంత్ర** వాక్యములు ప్రమాణముగా చూపఁబడినది.

దివ్యచకోరిక ననుసరించి అనుత్తరేచ్ఛోన్మేషాత్మకమైన అంతస్త్రిపుటీ ప్రాణస్పందమునకు ఆనందేశనోన్మేషాత్మకమైన బాహ్యాత్రిపుటీ ప్రాణస్పందమునకు మధ్య నుండి వానికిని నియామకురాలను అర్థమున ఇచ్చట ఈశ్వరి అను

సంబోధనము సముచితముగానున్నది. చిన్మయానుత్తర ప్రాణనాదాత్మికయైన అమ్మవారు అచిత్పదమును స్వీకరించుటకు పూర్వము అని ప్రాగచిత్పద పరిగ్రహాత్ అను పదములకు అర్థము చెప్పఁబడినది. శబ్దక్రమమున ఆనన్ద త్రిపుట్యాత్మక బాహ్యానుత్తర ప్రాణస్పందకారక అచిత్పద పరిగ్రహమునకు పూర్వము అని పై పదములకు భావార్థము. నిస్తరఙ్గ శివచిత్పయోనిధి అను సమాసమునందలి శివశబ్దము **వశకాంతౌ** అను ధాతువులోని వశి అను అక్షరముల వ్యత్యయమున సిద్ధించినది. కావున ఆ ధాతువు యొక్క అర్థమైన ఇచ్ఛకు విపరీతేచ్ఛగా అనగా ఇచ్ఛాభావన గ్రహింపఁదగినది. అందువలన తరఙ్గరూప కార్యమునకూ క్రియా పరిణామము సముద్రమునందు కలుగలేనిదైయున్నదని శివసముద్రము యొక్క నిస్తరఙ్గతకు హేతువు ఇచ్ఛాభావము అను అర్థమిట వ్యంగ్యమగుచున్నది. ఊర్మి (తరఙ్గ) మయ క్రియా పరిణామము లేని ఆ సముద్రమున సాధకశివునందలి శరీరము ఇచ్ఛోన్మేషమాత్రము శరీరముగా గల జ్ఞానసముద్రము అట్టి విపరీతేచ్ఛాత్మకము. కావున అది నిరన్తర కార్యక్రియా తరఙ్గమయమైనది. మరొక విధముగా అది బహిర్ముఖ శివచిత్పయోనిధియునైనది. దాని ప్రథమ స్పన్దము ఉద్యమము. అనుత్తరేచ్ఛా శరీరోన్మేషము అనగా బాహ్యపరిదేశనాత్మకమైన విపరీతానందోన్మేషము అనిగాని ఉద్యమముగా ఇట చెప్పఁబడదగినది. లోపల బయటను కారణాత్మకమైనను ఆభ్యంతరకృతి మాత్రముగా ఉన్మేషము యమించునది అని ఉద్యమశబ్ద వ్యుత్పత్తిననుసరించి పై అర్థము సరిపోవుచున్నది. సారాంశమే మనగా ఉద్యమశబ్దము ఉన్మేషపర్యాయమనుట.

ఇట్లు ఉద్యమము ప్రథమస్పన్దము ఉన్మేషము (ప్రథమోర్మి ఏకార్థములు కాగా) ఉత్తరోర్మి ఉత్తరస్పన్దము మహోదయము ఏకార్థములని చెప్పనగును. అచిత్పరిగ్రహోత్తర కాలికము కావున అది ఉత్తరమని చెప్పఁదగినది. సాధకుడు అంతర్ముఖుడుగా గాని, బహిర్ముఖుడుగా గాని ఈ మహోదయముతో ఉత్తరించును. కావున ఇది ఉత్తరము. శబ్దానంద త్రిపుట్యాత్మకముగా గాని అర్థానంద త్రిపుట్యాత్మకముగా గాని అది ఉత్తరకాలికమే కావున ఉత్తరమే. ఊర్మి అనగా కార్యక్రియా తరఙ్గము. వ్యోమని అనగా దహరాకాశమున అని అర్థము. మహ అనగా ఉత్సవములు. వాని యొక్క ఉదయము మహోదయము. మహస్ ఉదయ అని విడదీసి సకారలోపముగల ఆర్షప్రయోగముగా మహోదయ శబ్దము తేజస్సు



అను అర్థమునిచ్చును. అమ్మవారి శరీరము ఉదయమాన తేజోరూపమనిగాని ఉదయనోత్సవరూపమనిగాని వాక్యార్థము. శబ్దానంద త్రిపుటి ఉద్యమాత్మక కారణస్పన్దము. ఆర్థికానంద త్రిపుటియు ఉద్యమాత్మక కారణస్పన్దమే. ఊర్మి రూపమున లోపలిది కాని బయటిది కాని క్రియాకృతి రూపమే. సాధకుడు పార్వతీర్ణుడగుచో ఆతడుదీయమాన తేజోరాశి రూపమున యోగీశ్వరుడైన యతిగాని ఉదయనోత్సవరాశి రూపమున ఆతడు భోగీశ్వరుడైన రాజు కాని అగును. వ్యోమనీశ్వరి అని ఒక పదముగా స్వీకరించు పక్షమున దహరాకాశమున వృత్తులను నియమించు అమ్మవారి నా పదము బోధించును. అప్పుడది విభక్తి లోపము లేని అలుక్సమాసము అగును. ప్రాగచిత్పద పరిగ్రహోత్కృతః అనుపాఠమున శాబ్దికాకార చిన్మయ పదపరిగ్రహమునకు ముందు శబ్దజ్ఞానజడమైన ఉద్యమమాత్ర శరీరకమైనట్లే ఆర్థిక జడక్రియా పద పరిగ్రహమునకు ముందు అర్థక్రియా జడమైన ఉద్యమమాత్ర శరీరక మగును. పిమ్మట శాబ్దిక జ్ఞాన స్పన్దముగాని ఆర్థిక క్రియా జడస్పన్దముకాని విశ్వోత్తర్ణమై మహోదయమనెడి ఊర్మి (క్రియా కార్యతరఙ్గ రూపము) అగును. మహోదయా అనుపాఠమున స్త్రీలింగ తను శబ్దమునకు విశేషణమగును.

**అవతారిక:–** పై శ్లోకమున నిస్తరంగ శివసముద్రమునందలి తరఙ్గము ప్రథమ స్పన్దము. ప్రథమోద్యమమునైన ఇచ్ఛాశక్తియని చెప్పఁబడినది. ఈ శ్లోకమున అగోచరమైన (ఇచ్ఛయొక్క) స్థితినుండి గోచరస్థితిని పొందవలసినదిగా అమ్మవారు ప్రార్థింపఁబడుచున్నది.

**శ్లో॥ స్ఫారితా జనని సేయమేషణా**
**ఖేచరత్వసముపాశ్రితా దిశి।**
**అక్షచక్రమనుజగ్మృషీ గవీ**
**ప్రాప్తగోచరపదా భవ (వః) స్వయమ్॥ 44**

**ప్రతిపదార్థము:–** జనని=అమ్మా!, సా ఇయమ్=ఆ ఈ, ఏషణా=ఇచ్ఛ (శక్తి), స్ఫారితా=స్ఫురత్తను పొందించఁబడినదై, (స్వాదితా=ఆస్వాదించబడినదై) ఖే=ఆకాశమున, చరతు=చరించుగాక (చరతి=చరించును), అసముపాశ్రితాదిశి (అస్+అమ్) ఉపాశ్రితా=అస్ అమ్ అను స్థితిని పొందినదై (అసుమ్=ప్రాణమును ఉపాశ్రితా=ఆశ్రయించినదై), దిశి=దిక్కునందు, చరతు=చరించుగాక!, అక్షిచక్రమ్ =అకారాది క్షకారాంత వర్ణచక్రమును, అనుజగ్మృషీ=అనుగ్రహించునదై, గవి=

భూమియందు (గవీ=భూమి లేక వాక్కు), ప్రాప్త గోచరపదా=పొందిన గోచర స్థితి గల దానవుగా, స్వయమ్=స్వయముగా, త్వమ్=నీవు, భవ=అగుము, (భవః =శివుడవే)

**తాత్పర్యము:–** ఇచ్ఛాశక్తివై నీవు జ్ఞానక్రియాశక్తి రూపములు పొందెదవు. ఖేచరివిగా నున్న నీవు దిక్చరివిగా నుండి అక్ష (వర్ణ) చక్రము (ఇంద్రియచక్రమును అనుసరించి దృక్చరివిగా భూచరివిగా కూడనై నాకు కనcబడు దానివి కమ్ము (కనcబడినా నేను గుర్తించలేక పోవుట వేరుమాట). కనcబడిన అనుభూతిని కలిగించుము. లేక శివుడవై నీవు నాకాస్థితినే కలిగింపుము. నేయమేషణా అనుపాఠమును ఈ ఇచ్ఛాశక్తి స్వాదితా న అనగా ఆస్వాదింపcబడినది కాదు అని భావము.

**వివరణము:–** దివ్యచకోరిక ననుసరించి ప్రథమ స్పన్దోద్యమాత్మికమైన ఇచ్ఛయను నిస్తరంగ శివసముద్రమందలి తరంగము ద్వితీయ స్పన్దాత్మకోర్మిని కలిగించుటయే స్ఫారణము. ఇట్టి స్ఫారణము పొందినది అని స్ఫారితాశబ్దార్థము. అంతర్గతముగా నున్న ఇచ్ఛ ప్రకటితమైనది అని స్ఫారితాశబ్దము తెలుపును. బహిర్గతమగుటయే ప్రకటితమగుట. ఇట్లు ప్రకటితమైన పిదప ఆ ప్రకటితమైన ఇచ్ఛయున్నట్లు ప్రకటితమైనట్లు తెలిసినవారికి అనుమేయమగును. కొన్ని ఇచ్ఛలు కలుగగానే అవినెరవేఱబోవునప్పటి స్థితి నూహించుకొని ఇచ్ఛగలవారిచే ఆ ఇచ్ఛ ఆస్వాదించ బడుచుండును. ఆ ఇచ్ఛ నెరవేరినప్పుడు అది ఆస్వాదితమగునని వేఱుగా చెప్ప నక్కఱ లేదు. లోకమున ఇట్టి ఇచ్ఛలు ఫలించుట ఫలించకపోవుట అను రెండు స్థితులు నుండును. కాని ఈశ్వరేచ్ఛ విషయమున ఫలించకపోవుట అనునదే ఉండదు. కావున ఊహించుకొని దానిని నాస్వాదించుట యనునది ఉండదు. సర్వసంకల్పుడైన ఈశ్వరుని ఆనందమెప్పుడు నేకరూపముగానే ఉండును. కావున ఫలించిన తరువాత ఆస్వాదింపcబడునను మాట ఉండదు అని నేయమేషణా స్వాదితా అని స్వాదితా జనని నేయమేషణా అను పాఠాంతరమున అన్వయము చెప్పికొనదగును. సాధారణులకు క్రీడలలో గెలిచినప్పుడు మాత్రమే ఆస్వాద ముండును. కాని ఉత్తములోడినను క్రీడారసము నాస్వాదించుట లోకమున నుండునను కొన్నప్పుడు వైఫల్యము లేని భగవంతుని విషయమున గెలిచినను అనగా సంకల్పానుసారముగా జగము సృష్టమైనప్పుడు ఆస్వాదముండదు. అనగా అంతకు ముందులేని ఆస్వాదము కొత్తగా పుట్టదు అని భావము. పరమాత్మ



నిరహంకృతి రూపుడు. కావున ఆయనకు విషయలౌల్య ముండదు. ఆయన నిత్యానందియైయుండును. **అనశ్నన్నన్యో అభిచాకశీతి** అను శ్రుతి **ఇంద్రియాను భూతి** లేకయే ఆయన నిత్యజ్ఞానానందియై యుండునని తెలుపుచున్నది. నేయమ్ అనుటచే నా ఇయమ్ అని విభజించిన విషయముల నాస్వాదించువాడు మనుష్యుడగునే కాని పరమాత్మ కాజాలడు అను విషయాంతరమును వ్యంజించును. 2) రెండవ పాదమునందలి అసముపాశ్రితా అను పదమును అస్ అమ్ ఉపాశ్రితా అని విభజించిన అస్ అనునది అని అర్థమేర్పడును. అట్టి అమ్మవారు ఖే అనగా దహరాకాశమున లేక భూతకారణము నందు చరతు చరించుగాక అని ద్వితీయ పాదార్థమేర్పడును. ఆకాశమునందు తిరుగు శక్తికి ఖేచరి అని పేరు. ఇచ్ఛాశక్తి జ్ఞానశక్తి దహరాకాశమున విరాజిల్లు చుండును. ఇవి రెండు అంతర్దహరాకాశ స్థితి (గతి) గల శక్తులు. ఇవి పరమాత్మ యందు సంపూర్ణముగా జీవునందు అసంపూర్ణముగా నుండును. యోగాభ్యాసవశమున భగవదుపాసన వలన వీనిని దాదాపు సంపూర్ణముగా సాధింపవచ్చును. అట్టివారు భగవంతుని సాధర్మ్యమును పొందినవారిగా భగవద్గీత పేర్కొన్నది. భగవదనుగ్రహము లేక యోగాభ్యాసమున కొందఱు మునులు భూతాకాశ సంచారణ సామర్థ్యము సంపాదించినట్లు పురాణము లలో పెక్కు దృష్టాంతములున్నవి. యంత్ర తంత్ర మంత్ర బలమునకు వీని నాపాదించిన వారున్నారని విశ్వసించువారు కలరు. ఖేచరీశక్తిని సాధించు సాధనలో అమ్మవారి పూజా కార్యక్రమాల్లో ఖేచరీముద్ర ఒకటి ఉన్నది. ముద్ర అనగా దేవతకు సంతోషాన్ని కలిగించే శరీర అవయవవిన్యాసమును హస్త విన్యాసము అంగుళీ విన్యాసము అక్షివిన్యాసము మొదలైనవి (విన్యాస) ముద్రలు అని పిలువcబడుతాయి. వానిలో ఖేచరీ ముద్ర లక్షణం ఒక తంత్ర గ్రంథములో **అంతర్లక్షోబహిర్దృష్టిర్ నిమేషోన్మేష వర్జితః, ఇయం సా ఖేచరీ ముద్రా సర్వతంత్రేషు గోపితా** (కన్నులు తెరచియుండి బయటకు చూచుచునే లోనిదృశ్యమునందు లక్ష్యమును కలిగియుండు కంటి ఱెప్పలను మూయక తెఱవక యుంచుకొన్న స్థితి ఖేచరీముద్ర. ఇది అన్ని తంత్రములలో రహస్యముద్రగా చెప్పcబడినది) అని చెప్పcబడినది. చరతు అనుపదమును దిశి అనుపదముతో అన్వయించి అసముపాశ్రితా అనుపాఠమును స్వీకరించినను దిక్చరీశక్తి లేక దిక్చరీముద్రవుగా ఉండుమని అమ్మవారిని ప్రార్థించుట అను అర్థము ద్వితీయ పాదమున నేర్పడును. మూడవ పాదములోని అక్షచక్రమ్

అనుపదము అక్షములనగా ఇంద్రియములు.వాని చక్రములు అనగా సమూహమును బోధించును. అకారాది క్షకారాన్త మాతృక (వర్ణమాల) కూడ అక్షచక్రమ్ అనుపదము బోధించును. అక్షచక్రమును అనుసరించిన దానివై అక్షము ఒకటిగానున్న దృక్కుతో చరించు దృక్చరీ శక్తివిగా ఉందుము అని అర్థము చెప్పవచ్చును. సర్వేంద్రియ గోచరివిగా ఉందుము అను అర్థము గవీశబ్దమును గోపర్యాయముగా గ్రహించి చెప్పవచ్చును. లేక గవీ శబ్దమును భూవాచకముగా గ్రహించి భూచరీశక్తివిగా ఉందుమనియు అర్థము చెప్పవచ్చును. లేదా దిక్చరీ దృక్చరీ భూచరీ ముద్రారూపిణివై ఉందు మనియు చెప్పవచ్చును. భవే అనుపాఠమున లిఙ్ (అంతము) అనిగాని భవ అనుపాఠమున లోట్ (అంతము) అని గాని గ్రహింపనగును.

భవః స్వయమ్ అనుపాఠము నీవు స్వయముగా శివుడవే అను అర్థము గ్రహింపవచ్చును. భవశబ్దమునకు సంసారము కామము అను అర్థములుండుట వలన నీవు సాధకుని యోగ్యత ననుసరించి శివుడవుగా గాని జీవుడవుగా గాని ఉందుము అని అర్థము లభించును. దృక్చరీ అంగీకార విషయమున అభిప్రాయ భేదమున్నను మిగిలిన ఖేచరీ దిక్చరీ గోచరీ భూచరీవిషయమున అంతగా అభిప్రాయ భేదములు లేనందున చతుః పఞ్చవాహములలో నేదైన వాహము నంగీకరింప వచ్చును.భవశబ్దార్థమైన శివుడు పఞ్చబ్రహ్మాత్మకుడు. కావున ఖేచర్యాది చతుష్టయము నంగీకరించి ఈ శివశక్తుల నవచక్రాత్మక శ్రీచక్రమయత్వము ఇట వ్యంగ్యమగు చున్నదని త్రికోణములు శివమయములని,అధోముఖములైన త్రికోణము లైదు శక్తిమయములను విషయము శాక్తలోకమున సుప్రసిద్ధమే.

దివ్యచకోరికా వ్యాఖ్యాకారునిచే నాలుగు, అయిదు అను రెండు వికల్పములతో వ్యాఖ్యానించుటలో మరొక ఉద్దేశమేమనగా రూపాంతరములే యైన జీవిత పురుషార్థపంచకము శ్లోకమున వ్యంజింపజేయుటయే. ఫలితార్థమేమనగా ఓ అమ్మా! నీవు చతుర్విధ లేక పఞ్చవిధ స్వశక్తి లేక ముక్తి స్వరూపణివి. సాధకులయోగ్యతానుసారము ఉందుము. క్రమప్రకాశిక ననుసరించి ఇచ్ఛాశక్తి దహరాకాశమున స్పందించఁబడినది. కావున అది (చిద్) గగనచరి, వాగ్వ్యవహార గోచరత్వమును పొందును. ఖేచరత్వసముపాశ్రితా అను ద్వితీయ పాదమునందలి పదబన్ధమునేకపదముగా స్వీకరించి చిద్గగనచరత్వము నాశ్రయించినదానవై దిశిస్ఫారితా అనగా ఓడినదానవై క్రియాశక్తి ద్వారమున దిక్కులలో అర్థాకారముగా



వృద్ధిగా పొందింపఁబడిన దానవై ఇంద్రియచక్రము ననుసరించి గవి అనగా వాక్కునందు ప్రాప్త గోచరపదా అనగా వాగ్వ్యవహార విషయత్వమును పొంది తెలియఁబడిన దానవగుము, అని అర్థము చెప్పఁబడినది. మరొక విధముగా ఇచ్ఛాశక్తియే పశుభూమికయందు ఖేచరీ దిక్చరీ గోచరీ భూచరీ అనురూపముల ప్రమాతగా అంతఃకరణముగా బహిరింద్రియ భావ స్వభావముల తత్తత్ పారమార్థిక రూపములను క్రమముగా చిద్గగన చరత్వమును అభేదనిశ్చయాద్యాత్మకతను అభేద ప్రధాత్వమును సార్వాత్మ్య స్వరూపమును దాచుచు ప్రకాశించును అను ఆగమార్థము ననుసరించి ఆయా చక్రములచే దాచబడిన పారమార్థికరూపమును స్వయముగానే ప్రకటించుము, అని అమ్మవారు ఈ శ్లోకమున ప్రార్థింపఁబడుచున్నది. – అని అవతారికతో ఇచ్ఛాశక్తి ఖేచరత్వము నాశ్రయించి పశుభూమికయందు కించిత్కర్తృత్వ రూపమైన కలాది శక్త్యాత్మకముగా పారమార్థిక చిద్గగన చరత్వము దాచి ఖేచరి చక్రిభావమును పొందినదై దిక్కులలో విస్తరించి భేదాలోచనాది బహిష్కరణ దేవతాత్మక దిక్చరీ చక్రరూపమునొంది అక్ష చక్రమును అనగా అక్షగోచరత్వమును పొంది వ్యవచ్ఛిన్నాభాసత్వము అను ప్రమేయరూపమునొంది సర్వాత్మభావమున దాని పశుహృదయమోహినియై భూచరీ చక్రరూపమునొందినదై చివఱకు వాగ్వ్యవహార గోచరత్వమును పొంది భేదనిశ్చయము అభిమానము వికల్పనము ప్రధానములుగా గల అంతఃకరణ దేవీరూపమున అభేద నిశ్చయాదులను దాచి గోచరీ చక్రిరూపము నొందును. ఇట్లు తన పారమార్థిక స్వస్వరూపమును దాచిన ఓ జననీ! నీవే స్వయముగా ఆవిర్భవించుము. అని శ్లోకమున లేని కొన్ని పదముల నధ్యాహరించి అర్థము చెప్పఁబడినది.

**అవతారిక:–** పై శ్లోకమున కించిత్కర్తృత్వాది పశుభూమిక చెప్పఁబడినది. ఈ శ్లోకమున సర్వకర్తృత్వాది శక్త్యాత్మక ఖేచరిగా అసు నిశ్చయాత్మక గోచరిగా అభేదాలోచనాత్మక దిక్చరిగా అభేద ప్రధాసార ప్రమేయాత్మక భూచరిగా ఉన్నది శివుని బహిర్వపువు అని చెప్పఁబడుచున్నది. ద్వైయద్వైతాది వ్యవహార రహితము నిరంశమైన శివతత్త్వము వాగ్వ్యవహారగోచర, బహిరంశము కాదని చెప్పఁ బడుచున్నది.

**శ్లో॥ ఖేచరీప్రభృతి యచ్చతుష్టయం**
**సాంశమమ్బ! తవ తద్బహిర్వపుః।**

**యద్ద్వయాద్వయవిభాగఘుస్మరం**
**తద్విమర్శమబహిర్న వాక్పదమ్॥** 45

**ప్రతిపదార్థము:–** అమ్బ=అమ్మా!, ఖేచరీ ప్రభృతి=ఖేచరి మొదలగునది, యత్=ఏ, చతుష్టయమ్=నాలుగు (కలవో), తత్=అవి, సాంశమ్=భాగములుగల, తవ= నీయొక్క, బహిర్వపుః=బయటిశరీరము, ద్వయాద్వయ విభాగఘుస్మరమ్=భేదా భేద వ్యవహార్యమైన, యత్=ఏ, వపుః=శరీరము (కలదో), తత్=అది, విమర్శమ్= విమర్శరూపము, అబహిః=బయటిది గాదు, వాక్పదమ్=వ్యవహారగోచరము, న=కాదు.

**తాత్పర్యము:–** ఖేచరీ ప్రభృతి విభాగములు గలది నీ బాహ్యశరీరమే. రెండు ఒకటి అనువ్యవహారమునకు రూపమైన నీ శరీరము బాహ్యము కాదు. వ్యవహార గోచరము కాదు.

**వివరణము:–** దివ్యచకోరిక ననుసరించి ఖేచరి మొదలుకొని ఏనాల్గింటికి మొదట ఖేచరియున్నదో ఆనాల్గు భూచరి, గోచరి, దృక్చరి, దిక్చరి (మొత్తమైదు) అనునవి ఘనీభూతక్షీరమైన నవనీతమో, ఘనీభూత జలద్రవమైన మంచుగడ్డయో యన్నట్లు (సారమ్ అనుపాఠమును స్వీకరించి) అనగా స్థిరాంశ రూపమో దేహేన్ద్రియ సంఘాత రూపమైన వ్యష్టి జీవి శరీరము కాని భూతసంఘాతరూపమైన ఈశ్వర సమష్టి బ్రహ్మాండము (శరీరము) కాని నీ బాహ్యశరీరమే అగును. అనగా నీ బహిర్నాద శరీరమే. హంస మమ్బ అను లేక సాంశమమ్బ అను పాఠాంతరములలో శామ్భవ విసర్గ విలాసముగా గాని శాక్త విసర్గ విలాసముగా గాని ప్రాణసంచార రూపము లేక నిరామ రూపములు అను అంశములతో (అవయవములతో) కూడినది అని అర్థము చెప్పఁబడినది.

నామరూపవిభాగము ద్వయవిభాగము, ప్రాణస్పన్దము అద్వయవిభాగము ఈ రెండు విధములైన విభాగములను మ్రింగివేయలేక ఆ రెండు విభాగములను ప్రకాశింపఁజేయు విమర్శ పరనాదాత్మకమైన ఏ శరీరము గలదో అది బయటిది కాదు. అందుచేతనే అది వాగ్వ్యవహార గోచరము కాదు. వాచాపద్యతే (వాక్కుచే పొందబడునది) అను వ్యుత్పత్తి ననుసరించి వాక్పద శబ్దము వాక్కునకు అందునది అను అర్థమును బోధించును. వాక్పదము కాదు అనగా వాక్కునకు అందనిది అని అర్థమేర్పడును.



ఆనిరంశమైన నీ శరీరము అబహిః అనగా అభ్యంతరము కాదా అని కాకుస్వరముగా భావించియు అర్థము చెప్పఁబడినది. ఆభ్యంతరమే తాత్పర్యము (ఎట్లు చెప్పినను)మారదు. బిందువు, అర్ధచంద్రము, రోదిని, నాదము, నాదాంతము, శక్తి, వ్యాపిక, సమన ఉన్మన అను తొమ్మిదినాదముల రూపమునగాని, వాగ్రూపమున గాని పొందబడినది బాహ్యశరీరమే కాని ఆభ్యంతర శరీరము కాదు. అకారమున కంటె బయటి అను అబహిః అనుపదమును విభజించి అకారమునకంటె బహిర్భూత మైనందువలన బాహ్యము కాదో, అందువలననే నిరంశము. ఎందువలన నిరంశమో అందువలననే ద్వయాద్వయ విభాగరహితము. అందువలన ఆభ్యంతర శరీరము వాక్పదమ్ అనియు చెప్పఁబడవచ్చును. అనగా నిత్యవాగ్రూపమున నిత్యానోప్తము కావున ఆరాధ్యాంతర వాఙ్మయ శరీరము ఎల్లప్పుడు ఉండును అని అర్థాంతరము అన్వయాంతరము కూడ చెప్పఁబడినవి. అబహిర్నవాక్పదమ్ అనుపాఠాంతరము నాశ్రయించి మనోగమ్యమగుటచే అది వాక్పదము కూడ అగునని భావము. తాత్పర్యమేమనగా ఆభ్యంతర బాహ్యశరీరములు రెండును శక్తిరూపములే. అంతర్బహిర్విభాగాతీతము నీ శివమయ తనువు అని భావము. **యతో వాచో నివర్తంతే** అని చెప్పిన శ్రుతియే **మనసైవాను ద్రష్టవ్యమ్** అని చెప్పియుండుటచే శివస్వరూపము కూడ వృత్తివ్యాప్యము కావున మనస్సుచే తెలియదగినది ఫల వ్యాప్యము కాదు మనో వాక్కులు దానినించేరునని శివస్వరూపము మనోవాగమ్యము అయ్యు మనోవాగ్గమ్యము కాదు అని ద్వివిధముగా నీ శ్లోకము వ్యాఖ్యానింపవచ్చును.

**అవతారిక:–** పై శ్లోకమున అమ్మవారి ఖేచర్యాదిశక్తి చతుష్టయాత్మక బహిశ్శరీరము సాంశము వాగ్వ్యవహారగోచరమని ఆభ్యంతర శరీరము నిరంశము వాగ్వ్యవహార గోచరమని చెప్పఁబడినది. ఈ శ్లోకమున బహిరంతర్గమనములతో కులాకుల భావమునొందు అమ్మవారి స్వభావ స్వరూపములు చెప్పఁబడుచున్నవి.

**శ్లో॥ పఞ్చవృత్తితనురమ్బ! నిర్గతా**
**శక్తిరర్పితకులప్రభాసనా।**
**త్వం శివాదకులతస్సమేయుషీ**
**తేన తత్ర పునరేషి (ష) విశ్రమమ్ (మః)॥** 46

**ప్రతిపదార్థము:–** అమ్బ=అమ్మా, పఞ్చవృత్తి=అయిదు వృత్తులు గలదైన,

నిర్గతా=బయటకు వచ్చినదై, అర్పితకుల ప్రభాసనా=అర్పింపఁబడిన కుల ప్రకాశనము కలదై, అకులతః=కులరహితుడైన, శివాత్=శివుని నుండి, సమేయుషీ =వచ్చిన, శక్తిః=శక్తివైననీవు, పునః=మరల, తత్ర=అక్కడ, విశ్రమమ్=విశ్రాంతిని, ఏషి=పొందెదవు – లేక, ఏషః=ఇది, తత్ర=అక్కడనే, విశ్రమః=విశ్రాంతి.

**తాత్పర్యము:–** అమ్మా! పంచవృత్తులే తనువులుగా గలదానివై కుల శివుని నుండి బయటకు వచ్చి కులమును ప్రవేశింపఁజేసి తిరిగి అక్కడ (కుల శివునందే) విశ్రమించెదవు లేక శివుని చేరుటయే నీకు విశ్రాంతి.

**వివరణము:–** క్రమప్రకాశిక ననుసరించి సాంఖ్యయోగదర్శనముల ననుసరించి ప్రమాణము, విపర్యయము, వికల్పము, నిద్ర, స్మృతి అను ఐదు వృత్తులు తనువులుగా గల అమ్మవారు పఞ్చవృత్తి తనువు ఐన శక్తికులమును ప్రకాశింపఁ జేయుట అను పనిని శివునకర్పించి అకులశివునుండి బయటకు వచ్చి తన కృత్యములను నిర్వహించిన అనంతరము తిరిగి ఆ శివునందే చేరి విశ్రమించును.

దివ్యచకోరిక ననుసరించి కులమనగా మూలాధారమందలి అధః సహస్రారము. అది జీవస్థానము. ఆ సహస్రారమున నుండు కారణమున జీవుడు కూడ కులమని చెప్పఁబడును. మూలాధారచక్రము మొదలు ఆజ్ఞాచక్రము వఱకు నున్న ఆఱు చక్రములు కులమనియే చెప్పఁబడును. మూలాధారము (భూతత్త్వము), స్వాధిష్ఠానము (జలతత్త్వము) ఇవి రెండు కలసి బ్రహ్మ గ్రంథి అని చెప్పఁబడును. మణిపురము (అగ్నితత్త్వము), అనాహతము (వాయుతత్త్వము). ఇవి రెండు కలసి విష్ణుగ్రన్థి. విశుద్ధము (ఆకాశతత్త్వము.) ఆజ్ఞ (మనస్తత్త్వము) ఇవి రెండు కలసి రుద్ర గ్రంథి. కుల నామకమైన ఈ షట్చక్రమునకు పైన ఊర్ధ్వ సహస్రారము శిరమున కలదు. అది పరశివస్థానము. అది అకుల సహస్రారము అని చెప్పఁ బడును. అక్కడ నివసించు శివునకు కూడ అకుల అను పేరు కలదు.

కుల శబ్దమునకు బ్రాహ్మణాది చాతుర్వర్ణ్యమని మరొక అర్థము చెప్పఁ బడినది. నాద వాగర్థ త్రిపుటీ పఞ్చవాహతాది సమూహము కులమని మరొక అర్థము చెప్పఁబడినది. అర్పితకుల ప్రభాసనా అను శబ్దమునకు శివుడు శక్తి ఇద్దఱు కలసి పరస్పరము కల ప్రభాసన మొకరికొకరు సమర్పించినప్పుడు అమ్మవారు పఞ్చేన్ద్రియవృత్తిమయ తనువును విస్తరించును. శివునందు శక్తికుల



ప్రభాసనమును సమర్పించినప్పుడు శక్తి అక్కడనే ఉండి పఞ్చేంద్రియ పఞ్చప్రాణ పఞ్చభూత వృత్తులను సమర్పించును అని రెండు విధములుగా భావార్థము చెప్పఁ బడినది. అకులతః శివాత్ అను పదములకు 1) మూలాధారగతమైన అనుత్తరాకార రూపుడైన జీవరూపుడైన శివునుండి అని ఒక అర్థము. 2) ఊర్ధ్వ సహస్రారగతుడైన కులాతీతుడైన అకులుడైన బ్రాహ్మణాదికులహీనుడైన పరశివుని నుండి మరొక అర్థము చెప్పఁబడినది.

అ+కులతః (1) మూలాధారస్థ అనుత్తరమైన అకారనాదరూప కుల సహస్రారమునుండి (2) అకారము వర్ణధర్మము మొదలగు రూపములు గల కులములేని జీవుడుగానున్న (3) నాద ప్రాధాన్యమున కుల ధర్మమున్నను వర్ణ ప్రాధాన్యమున కులముతో కూడిన ధర్మముతో సంబంధములేని (4) బ్రహ్మరన్ధ్రములో అకారనాద సహస్రారము నుండి అని అర్థములు చెప్పఁబడినవి. శివాత్ అనుపదము నకు వశ్‌కాంతౌ అను ధాతువు నుండి వర్ణవ్యత్యయమున నేర్పడిన కాంతి అను మరొక పేరుగల ఇచ్ఛగల జీవ శివు నుండి అని అర్థము చెప్పఁబడినది.

జీవ శివు నుండి (అధస్సహస్రార (కుల) స్థితి నుండి) గాని, పరశివు (ఊర్ధ్వ సహస్రార (అకుల) స్థితి) నుండి గాని బయలుదేరిన శక్తి దేహ బ్రహ్మాండము లందలి కులములను షట్చక్రమును లేక కులాకులములను ప్రకాశింపఁజేసిన అనంతరము తిరిగి ఆ ద్వివిధ శివునందు విశ్రమించును. ప్రకాశసమయమునకు ఆ (ద్వివిధ) శివునితో చేరిన దయయే ఉండును అని సమేయుషీ అనుపదము బోధించును. ఇట్లు చెప్పకపోయినచో నిర్గతా శబ్దమునకు మాత్రమే సార్థకత ఏర్పడి సమేయుషీ పదము నిరర్థకమగును. విశ్రాంతి సమయమునగాని కుల ప్రకాశన సమయమున గాని శక్తి శివునితో కలసియేయుండునని భావము.

కులప్రధాసనా అనుపాఠమున లేక కులప్రభాసనా అనుపాఠమున కులప్రథ లేక కుల ప్రభ ఆసనముగాగలది అను అర్థము చెప్పఁబడినది. ప్రథా శబ్దమునకు విడిగా ప్రకాశించుట అను అర్థము చెప్పఁబడినది. పునరేష విశ్రమః అనుపాఠమున జీవ శివ పరశివ నిర్గమాగమ రహితమైన విశ్రాంతి మరల మరల అమ్మవారిచేత పొందఁబడును అని అర్థము చెప్పఁబడినది. అందుకే తంత్రములలో కుల మనగా శక్తి లేక జీవుడని అకులమనగా శివుడని చెప్పఁబడినది. 2) షట్చక్రములలో

క్రిందనుండి మొదటిది మూలాధారము. దాని క్రిందుగా విషుచక్రము. దాని క్రింద అధస్సహస్రారముండును అని లలితా సహస్ర నామ భాష్యమున భాస్కరులు చెప్పియున్నారు. అయినను కొన్ని గ్రంథములలో అధస్సహస్రారము, మూలాధారస్థ మనియే చెప్పఁబడినది. దివ్యచకోరిక ఉదహరించిన **'మూలాధారాన్తరం షట్చక్రం కులమితి స్థితిః। గ్రన్థిత్రయం తత్ర దేవి చక్ర ద్వితయ గర్భితమ్'** అను శ్లోకమున మూలాధారాన్తరమ్ అను అశబ్దము మరొక మూలాధార మున్నట్లు సూచించును. తంత్రవాసనలేని వారికి మూలాధార శబ్దము సర్వాధిష్ఠాన బ్రహ్మము అను అర్థమే స్ఫురించును. కాని తంత్ర పరిచయమున్న వారి దృష్టిలో మూలాధారము ఆన్తరముగా గలది. షట్చక్రములలో అన్నిటికన్న క్రింద మూలాధార చక్రము కలది అను అర్థము చెప్పక తప్పదు. కాని ఈ అర్థము లక్షణనాశ్రయించియే చెప్పవలసి వచ్చును. ఈ శ్లోకములోని ఉత్తరార్థము ననుసరించి మొత్తము వెన్నెముకలోని సుషుమ్నా మార్గమునంతటిని మూలాధార శబ్దార్థముగా లభించుచున్నది. ఎందువలననగా మొత్తము మూడు గ్రంథులు (బ్రహ్మగ్రంథి, విష్ణుగ్రంథి, రుద్రగ్రంథి)ఒక్కొక్కటి క్రిందినుండి పైగా రెండేసి చక్రములు గర్భములలో కలవి అను అర్థమే అచట లభించుచున్నది. దానినిబట్టి పరబ్రహ్మ (లేక జీవుడు) మూలాధార శబ్దము యొక్క అర్థము కాగా మూలాధారాన్తరమ్ అను శబ్దము మరొక మూలాధారము షట్చక్రాత్మకము గ్రంథిత్రయాత్మకమునైన కులమను అవిరోధార్థము లభించును.

**పృథ్వ్యాపచక్రద్వితయం బ్రహ్మగ్రన్థి పదోదితమ్। వహ్ని సూర్యమయం చక్రద్వయం తేజోమయం మహత్। విష్ణుగ్రంథి పదేనోక్తం తైజసం సర్వసిద్ధిదమ్ వాయ్వాకాశ ద్వయీరూపం చక్రద్వితయ ముత్తమమ్ రుద్రగ్రన్థిపదేనోక్త మ్మజ్ఞలాయ తన మ్మహత్** అని దివ్యచకోరిక ఉదహరించిన మూడు శ్లోకములలో మూలాధారము భూమయము స్వాధిష్ఠానము జలమయములని మొదటి శ్లోకము బోధించును. ఇందు స్వాధిష్ఠానము అగ్ని స్వరూపము అని శంకరులు చెప్పిన దానికి విరోధము న్నను స్వాధిష్ఠానము జలమయమే అను ప్రాచీనయోగ గ్రంథముల కనుకూలముగానే ఉన్నది. రెండవ శ్లోకమున వహ్ని సూర్యమయ మణిపుర, అనాహత చక్రద్వయము తైజసమని చెప్పఁబడినది. కాని మణిపూరము వహ్నిమయము. అనాహతము వాయుమయము. అనుట ప్రాచీన యోగానుకూలము. శ్రీ శంకరుల దృష్టిలోనను అనాహతము వాయుమయమే. తేజస్సును ఒక భూతముగాగాక సూర్యద్వయముగా



చెప్పుట ఇందు విశేషము. ఇట్లు చెప్పుటవలన అనాహత వాయుమయము అని చెప్పుసంప్రదాయమునకు విరోధమేర్పడుచున్నది. దీని పరిహారమునకై వహ్ని సూర్యయుతుమ్ అనుపాఠము నాశ్రయించవలసి యుండును. మూడవ శ్లోకము వాయ్వాకాశద్వయరూపమైన విశుద్ధాజ్ఞాన చక్రద్వయము. వాయ్వాకాశమయమని చెప్పుచున్నది. ఇట్లు చెప్పుట శంకరులు విశుద్ధము ఆకాశమయమని ఆజ్ఞాచక్రము మనోమయములని చెప్పిన పద్ధతికి విరుద్ధముగానేఉన్నది. దివ్యచకోరిక ఈ విరోధములను పట్టించుకొనక ఉపేక్షించియే వ్యాఖ్య కొనసాగించినది. మూలాధార స్వాధిష్ఠానములు తమోమండల మని, అగ్ని మండలమని ద్వివిధముగా చెప్పు పద్ధతులున్నవి. అగ్ని ధూమమును వెలార్చుటచే అది తైజసమని చెప్పఁబడక పోవుటకు కారణమయి యుండవచ్చును.ఆగ్నేయమైన మణిపూరమును తైజస మనుట యుక్తమే. అనాహతము సూర్యమయమని చెప్పినందున ఆ మణిపూర, అనాహతములు రెండు తైజసమనఁబడుట న్యాయమే. కాని అనాహతము వాయవ్యమను ప్రసిద్ధికి విరోధమేర్పడుచున్నది. ఆకాశమయ విశుద్ధమును వాయుమయమనుట, మనోమయాజ్ఞా చక్రమును ఆకాశమనుటయు సంప్రదాయ పద్ధతికి విరుద్ధమే. మొత్తము మీద పంచభూతములను షట్చక్రముల సంఖ్యా వైషమ్యము తేజస్సును వహ్ని సూర్య ద్వయముగా విభజించి పరిహరించుట ఇందలి విశేషము. మనస్సు పంచభూత సాత్త్వికాంశములతో నిర్మితమైనది. కావున దానికి పృథక్స్థానమక్కఱలేదని భావమేమో! అస్తు. మహాకాలికి సాధక జీవాభేదమున కాలార్థ శరీరత్వము క్రియావాగర్థ శరీరుడైనకాల శివునికి కాలీ విశ్రాంతి స్థానత్వము స్పష్టముగా చెప్పఁబడినదనుట దివ్యచకోరిక భావము.

**అవతారిక: –** పై శ్లోకమున అకుల శివనిర్గతమైన పఞ్చవృత్తి తనువైన కులరూపిణి యైన శక్తి తిరిగి అకుల శివునందు విశ్రమించుట చెప్పఁబడినది. ఈ శ్లోకమున పఞ్చభూత గణవృత్తియైన అమ్మవారి వృత్తి పఞ్చకమే ధర్మివృత్తులవలన సిద్ధనామకమగునని ధర్మవృత్తులవలన శక్తి నామకమగునని చెప్పఁబడుచున్నది.

శ్లో॥ **యుక్తితోఽమ్బ! తవ వృత్తిపఞ్చకం**
**పఞ్చభూతగుణవృత్తి లక్ష్యతే।**
**ధర్మివృత్తికృతసిద్ధనామకం**
**ధర్మవృత్తికృతశక్తినామ తే॥** 47

**ప్రతిపదార్థము:–** అమ్బ=అమ్మా!, తవ=నీయొక్క, వృత్తిపఞ్చకమ్=అయిదు వృత్తులు, యుక్తితః=యోగమువలన, పఞ్చభూతగుణ వృత్తి=పఞ్చభూతగుణ వృత్తులుగానే, లక్ష్యతే=కనఁబడుచున్నవి, ధర్మివృత్తి కృతసిద్ధి నామకమ్=ధర్మివృత్తి వలన అని సిద్ధనామము కలది నీదే, ధర్మవృత్తి కృతశక్తి నామ=ధర్మవృత్తి వలన శక్తినామము కలది, తే=నీదే.

**తాత్పర్యము:–** నీ అయిదు వృత్తులు చిత్తవృత్తి విరోధరూప (యోగశాస్త్ర) యుక్తి ననుసరించి పఞ్చభూత గుణ వృత్తులుగానే కనఁబడుచున్నవి. ధర్మివృత్తి వలన వానికి సిద్ధ అనుపేరు, ధర్మవృత్తి వలన శక్తి అనుపేరు కలుగునని, అవి అన్నియు నీవే (శరీరములే).

**వివరణము:–** క్రమప్రకాశిక ననుసరించి ప్రమాణ విపర్యయ వికల్ప నిద్రా స్మృతులు అను వెనుక జెప్పఁబడిన అయిదువృత్తులే ఈ శ్లోకమున వృత్తి పఞ్చకమ్ అని చెప్పబడినవి. అవియే చిత్తవృత్తి నిరోధరూప యోగమున ప్రసరణమువలె నిరోధము కూడ వృత్తికి గుణమే అని భావము. వృత్తులు ప్రసరించినపుడే పఞ్చభూతములు, వాని కార్యములు కులమునందు ప్రకాశించును. వృత్తులు నిరోధింపఁబడినప్పుడు చిద్రూప శివతత్త్వమే ప్రకాశించును. అది చిద్రూపము. స్వయంప్రకాశము. కావున దానికి వృత్తిరూప భాసకమక్కఱలేదు. ఆ వృత్తి పఞ్చకమే సిద్ధి సంపన్న ధర్మి జీవుని ప్రకాశింపఁజేయు నప్పుడు సిద్ధమనుపేరు కలదగును. ఆ ధర్మియైన జీవుని ధర్మములైన సిద్ధులను ప్రకాశింపఁజేయునపుడు అది శక్తి అను నామము కలదగును. 2) వృత్తి నిరోధ మేర్పడినప్పుడు పఞ్చ భూతముల వృత్తి అనగా వానిని ప్రకాశింపఁ జేయుట అనునది గుణభూతమగును. అప్రధానమగును. అనగా నిరోధాభిముఖ వృత్తి. పఞ్చభూత ప్రకాశకము కాదు – అని చెప్పవలెను. వృత్తి ధర్మిని ప్రకాశింపఁ జేయునపుడు సిద్ధి అనఁబడును. ధర్మి యొక్క ధర్మముల ప్రకాశింపఁజేయునప్పుడా వృత్తి శక్తి అనఁబడును. ధర్మములు ప్రకాశితములైనపుడు తత్ ప్రకాశనవృత్తి సిద్ధి అనఁబడును. ఆ ధర్మములు దేనియందు సిద్ధించునో అది ధర్మియనఁబడును. ధర్మసిద్ధ్యనంతరమే ధర్మి సిద్ధి.

ధర్మములనగా ద్రవ్యము నాశ్రయించిన గుణక్రియా జాత్యాదులు, ధర్మి (ద్రవ్యము) ఉత్పన్నమైనప్పుడు క్షణకాలము నిర్గుణము నిష్క్రియముగా నుండుననుట తార్కిక వ్యవహారము. శాక్తేయ తంత్రములలో ధర్మము శక్తి, ధర్మి శివుడని వ్యవహరింపఁబడును. ధర్మి ధర్మములు అవిభాజ్యములని ధర్మమే ధర్మి స్వరూపమని



అద్వైత దర్శనమని వ్యవహరింపఁబడును. క్రమప్రకాశిక వృత్తి పఞ్చకము ధర్మి విషయకమైనప్పుడు సిద్ధనామమును, ధర్మ విషయకమైనప్పుడు శక్తి నామమును పొందునని చెప్పుచున్నది. సిద్ధుని ధర్మములు సిద్ధులని చెప్పుటకభ్యంతరము లేదుగాని ధర్మికి ధర్మభూతములు సిద్ధులని చెప్పుట విచిత్రముగానున్నది. వాస్తవముగా సాధకుడు ధర్మియైన జీవ స్వరూపమును గుర్తించుటయే సిద్ధి. ఆతనికభిన్నములేయైనను ధర్మములను శక్తులను మాత్రమే గుర్తించును. ధర్మి స్వరూపమును గుర్తింపలేక పోవుటయే అసిద్ధి. శక్తి కార్యానుమేయము. కార్యము దృష్టమైనప్పుడు మాత్రమే ధర్మి యందు శక్తి యనుమేయమగును. ఆత్మ కార్యము దృష్టమైనప్పుడు కాని, దృష్టము కానపుడు గాని స్వప్రకాశముగనే ఉండును. జీవుని స్వరూపమైన శివత్వము అనుభవింపఁబడునేని గుణక్రియాది శక్తి ధర్మములేవియు అనుభవింపబడవు. అవి అనుభవింపఁబడుచున్నప్పుడు శివత్వము నావరించియే ప్రకాశింపఁబడును. శివత్వము ప్రకటమగుటయే విశ్రాంతియని పై శ్లోకమున చెప్పబడినది. అద్వైతము వలెగాక కొందఱు తాంత్రికులు సాధనమున శివశక్తులు స్వశక్తులు కాగా కలుగు ఆనందానుభవమే శివయోగికి కలుగునని చెప్పుట విశేషము. ఇదియే శివత్వానుభవమని వారు చెప్పెదరు. వృత్తివలన ధర్మి ధర్మములేక కాలమున ప్రకాశింపఁబడునేని సిద్ధనామ శక్తినామ భేదము అకించి త్కరమే. కావున శ్లోకమున ధర్మివృత్తి ధర్మవృత్తులు భిన్నములనియే చెప్పఁబడినది.

దివ్యచకోరిక ననుసరించి వృత్తి పఞ్చకమనగా ఖేచర్యాదికము. యుక్తితః అనగా మేలాపము అను యోగము వలన లేక జ్ఞానసఙ్గతి వలన – పఞ్చభూత గుణవృత్తి అనగా దేనియందు భూతపఞ్చకము గుణపఞ్చకము (శబ్ద స్పర్శ రూపరస గంధములు). ఈ రెంటియందును ఉండునది అనగా పఞ్చభూత వృత్తి మరియు పఞ్చగుణవృత్తి అని భూతగుణ ద్వంద్వసమాసాంతమునందలి వృత్తి శబ్దమును విడివిడిగా భూతములకు గుణములకు అన్వయింపఁజేసినచో పై అర్థమేర్పడును. పఞ్చభూత వృత్తులు ధర్మివృత్తులు. పఞ్చగుణవృత్తులు ధర్మవృత్తులు. ధర్మివృత్తి కృతసిద్ధులనగా వామదేవాదులు. గన్ధము పార్థివము. రసము ఆప్యము. రూపము తైజసము. స్పర్శము వాయవీయము. శబ్దము నాభసము. అను కృతములచే సృష్ట్యాది కృత్యములచేత సిద్ధులైన బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వర, సదాశివులు అను నామములు గలవారు. ధర్మవృత్తి కృత శక్తులనగా వ్యోమేశ్వరీ ఖేచర్యాదికము. లేక గన్ధవతీ

పృథివీ, రసవత్య ఆపః, రూపవత్తేజః, స్పర్శవాన్వాయుః శబ్దవాన్ ఆకాశ ఇత్యాది గుణకృత నామములు గలవి. లేక కృత త్రేతాది కాల క్రియా శక్తులు కృత శక్తి నామయత్ అనుపాఠమున ఏది ధర్మవృత్తి కృతశక్తి నామకమో అదే ధర్మవృత్తి కృతసిద్ధనామకము అన్నట్లు అన్వయించి అర్థము చెప్పఁబడినది. తే అను పాఠమున ధర్మవృత్తి కృత సిద్ధ నామకము ధర్మవృత్తి కృశక్తి నామకమును నీదే అని అర్థము చెప్పఁబడినది. పై రెండింటిలో సిద్ధనామకము అభ్యర్హితమగుటచే శిక్షిత సిద్ధి నామకమును నీదే అను అర్థము లభించును. ధర్మభేదమున వివక్షతో బ్రహ్మవైష్ణవీ రౌద్రీ, గౌరీ, అమ్బికా శక్తి భేదములు సిద్ధించునట్లే ధర్మైక్య వివక్షతో శివైక్యమును సిద్ధించును. అట్లే ధర్మి భేద వివక్షతో బ్రహ్మ పఞ్చక సిద్ధభేదము ధర్మైక్య వివక్షతో భూత ప్రకృతిః కాలీ ఇత్యాది శక్తుల ఐక్యమును సిద్ధించుట సమానమే. ఇట్లు ఏ జంటయందైనను ప్రకృతికాని పురుషుడుగాని నవవిధత్వము కలిగినవారే. అట్లే గుణక్రియులకును ధర్మి ధర్మ భావ వికల్పము చెప్పవచ్చును. ధర్మి ధర్మ భావము శక్తి శివులకు వికల్పమగును. అనగా శివుడు ధర్మమైనపుడు శక్తి ధర్మి కావచ్చును. శక్తి ధర్మమైనప్పుడు శివుడు ధర్మి కావచ్చును. శక్తియే ధర్మము. శివుడే శక్తి అను సాధారణ శాక్తతంత్రనియమము స్థూలముగా అంగీకరింపదగినది మాత్రమే. ధర్మి ధర్మ భావము మారినను శివశక్త్యైక్యము మారదనుట దివ్యచకోరిక తాత్పర్యము. ఉత్తర శ్లోక ప్రథమపాదంలో బ్రాహ్మణః ప్రభృతిసిద్ధ పఞ్చకమ్ అని ఉండటంచేత ఈ శ్లోకంలో సిద్ధనామకం అనుచోట సిద్ధపఞ్చకం అనుపాఠము సరియైనది కావచ్చును. బ్రహ్మాది పఞ్చకాన్ని పరామర్శించిన దివ్యచకోరిక వ్యాఖ్య సమంజసంగా ఉన్నది. ఎందుచేతనో క్రమప్రకాశిక ఈ పరామర్శ చేయలేదు.

**అవతారిక:-** పూర్వశ్లోకమున సిద్ధనామము ధర్మవృత్తి కృతమని చెప్పఁబడినది. ఈ శ్లోకమున ఆ సిద్ధుల నామములు బ్రహ్మాదులని తత్పత్నులు భారత్యాది నామకశక్తి పఞ్చకము ఈ సిద్ధశక్తి పఞ్చకము అమ్మవారి ఉన్మనగా భావనీయమని చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ బ్రహ్మణః ప్రభృతి సిద్ధపఞ్చకం**
**భారతీ ప్రభృతి శక్తిపఞ్చకమ్।**
**ఉన్మనీం స్మరతి యస్తవాకృతిం**
**సిద్ధవర్త్మని (పర్వణి) జయత్యసౌ జనః॥ 48**



**ప్రతిపదార్థము:-** బ్రహ్మణః ప్రభృతి సిద్ధ పఞ్చకమ్=బ్రహ్మనుండి మొదలైన సిద్ధులైదుగురు, భారతీప్రభృతిశక్తి పఞ్చకమ్=భారతి మొదలైన శక్తులైదుగురు,తవ= నీయొక్క, ఆకృతిమ్=ఆకృతియైన, ఉన్మనీమ్=ఉన్మనివి, యః=ఎవడు, స్మరతి= స్మరించునో, అసౌ జనః=ఆ జనుడు, సిద్ధవర్తని=సిద్ధులమార్గమున, జయతి= సర్వోత్కర్షమునందును.

**తాత్పర్యము:-** బ్రహ్మ విష్ణు రుద్ర ఈశ్వర సదాశివ నామకులైన సిద్ధులైదుగురు, భారతీ జ్యేష్ఠా (విశ్వమ్భరా) రౌద్రీ, ఈశ్వరీ, సదాశివా నామకమైన శక్తి పఞ్చకము నీ ఆకృతియైన ఉన్మనిగా నెవడు స్మరించునో, వాడు సిద్ధుల మార్గమున సర్వోత్కర్షముగా వర్ధిల్లును.

**వివరణము:-** దివ్యచకోరిక ననుసరించి సిద్ధపర్వణి అను పాఠాంతరమును స్వీకరించినపుడు సర్వమనగా సంఖ్యానము లేక అను పాఠాంతరమును స్వీకరించి నపుడు సర్వమనగా సంఖ్యానము లేక గణన సిద్ధుల గణనలో బ్రహ్మాది బ్రహ్మ పఞ్చకము భారత్యాది శక్తి పఞ్చకమును అమ్మవారి ఉన్మనిగా స్మరించువాడు సిద్ధులలో గణనలో సర్వోత్కర్షముగా నొందును. జయతి అను పదమును ఆచారార్థక క్విచిన్తముగా భావించి సర్వోత్కర్షము జయ (కాలి) గా ఆచరించును. అని అర్థము చెప్పినది. క్రమప్రకాశికలో విశేషములు పేర్కొనఁబడినవి లేవు.

**అవతారిక:-** పై శ్లోకమున ధర్మి ధర్మకృత సిద్ధ శక్తి పంచకద్వయము నున్మనీ భావరూపమైన అమ్మవారి ఆకృతిగా స్మరించు సాధకుని ఉత్తమత్వము చెప్పఁబడినది. ఈ శ్లోకమున అమ్మవారు దేనిని ప్రకాశింపఁజేసిన అదియే సృజింపఁబడునని చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ త్వం ప్రకాశయసి యం స సృజ్యతే**
**ధర్మిధర్మతనురర్ధ ఈశ్వరే।**
**యః ప్రకాశ ఇహ స త్వయా కృత**
**స్తత్తదాకృతిరుపైతి సృష్టితామ్॥ 49**

**ప్రతిపదార్థము:-** త్వమ్=నీవు, యమ్=దేనిని, ఇహ=ఇచట, ప్రకాశయసి= వెలిగించెదవో, ధర్మిధర్మతనుః=ధర్మిధర్మ శరీరముకల, సః=ఆ, అర్థః=అర్థము, ఈశ్వరే=ఈశ్వరునియందు, సృజ్యతే=సృజింపఁబడును, త్వయా=నీ చేత, యః

=ఏ, ప్రకాశః=ప్రకాశము, కృతః=చేయఁబడినదో, తత్తదాకృతిః=ఆయా ఆకృతి, సృష్టితామ్=సృష్టిత్వమును, ఉపైతి=పొందును.

**తాత్పర్యము:–** నీవు దేనిని ప్రకాశింపఁజేసెదవో? ధర్మిధర్మరూపమైన ఆ అర్థము ఈశ్వరునందు సృజింపఁబడును. నీచేత ఏ ప్రకాశము చేయఁబడినదో ఆయా ఆకృతి సృష్టితను పొందును.

**వివరణము:–** క్రమప్రకాశిక ననుసరించి ఈ ప్రపంచమంతయు చిదచిద్రూపము. చిత్తు ధర్మి, అచిత్తు ధర్మము. బ్రహ్మయను నామాంతరము గల శివుడు చిద్రూపుడు. ధర్మి. ఆయన బ్రహ్మవిష్ణురుద్రేశ్వర సదాశివ బ్రహ్మ (సిద్ధ) పంచకమని వెనుక చెప్పఁబడినది. ఈ బ్రహ్మ పఞ్చకము భారత్యాది శక్తి పఞ్చకము అను ధర్మ పఞ్చకమును కలిగియున్నది. ధర్మియందు ఉన్న ఈ శక్తి పఞ్చకము అచిద్రూపము. అమ్మవారు దేనిని ప్రకాశింపఁజేయునో ఆ వస్తువే అది. ధర్మి కాని ధర్మము గాని సృజింపఁబడును. ప్రకాశము అమ్మవారిచే చేయబడిన ఆయా ఆకారము సృష్టితను పొందును అను వాక్యము దృష్టి సృష్టి వాదమును నిరూపించు చున్నది. ప్రకాశమే అర్థము. అర్థ ప్రకాశము విభిన్న వస్త్వాకారము. ఆ ఆకారమే సృష్టితను పొందును. ప్రకాశ శబ్దము దృష్టికి నామాంతరము. అది సృష్టితను పొందుననగా దృష్టి సృష్టి యగుచున్నట్లే అని క్రమప్రకాశిక అభిప్రాయము. దివ్యచకోరిక ననుసరించి ఇహ అనగా ఉన్మనీనాదాత్మక శక్తి సామరస్యా కృతి యందు విమర్శ బిన్దు నాదాత్మికయైన అమ్మవారు సాధకునికి ప్రకాశ్య రూపముగా ధర్మిగా ధర్మముగాగాని వాగర్థమయి శరీరము విస్తరింపఁజేయుటయే ప్రకాశించుట అనగా ప్రకాశమువలె ఆచరించుట. నాదమును ధర్మిగా దేవేంద్రియ సంఘాతమనెడి న్దవ వాగర్థ శరీరము ధర్మగాని లేక నాదమును ధర్మముగా దేహేంద్రియ సంఘాతమును దర్మిగాగాని విస్తరింపఁ జేయుట ధర్మి ధర్మోభయము శరీరముగాగాని విస్తరింపఁజేయుట ఈశ్వరుని యంఉ లేక స్త్రీగా పురుషునిగా నున్న జీవరూపమున విస్తరింపఁజేయఁబడినది. ఈశ్వర జీవులిరువురు అర్థమే గావున నరనారీమయ శరీరము అర్థాంశ మగును. కావున అర్థాంశమని అర్థశబ్దార్థము చెప్పఁబడినది. సారాంశమేమనగా ధర్మిధర్మోభయ శరీరముగల అర్థము ఈశ్వరునియందు ప్రకాశింపఁజేయుటయే సృజింపఁబడుట కాంతా కనక ద్వావిద్యక పురుషార్థము. విద్యామయమైన కృత్య పఞ్చక స్వాణిత్య రూపము సుఖరూపమైన పురుషార్థము కూడ అసి అర్థ శబ్దార్థములు చెప్పఁబడినవి.



ప్రకాశమునకు విస్తరణ స్వభావమున్న కారణమున ప్రకాశయసి అను శబ్దమునకు విస్తరించుట అను అర్థము ప్రకాశవదాచరసి అను అర్థమున ఆచారార్థ క్విచిన్తముగా భావించి అర్థము చెప్పఁబడినది. అర్థ శబ్దమునకు కాంతాకనక ద్వావిద్యామయమైన అంతముకల పురుషార్థము మరియు అనంతమైన నిత్యసుఖము అను పురుషార్థము అను అర్థములు చెప్పఁబడినవి. అల్పబుద్ధులచే కోరబడిన అంతముగల కాంతాకనకాదుల వలన కలుగు సుఖము అల్పబుద్ధి కలవారిచే సుఖ (మోక్ష) ము మహా బుద్ధిమంతులచేతను కోరఁబడును. 2) అర్థః సృజ్యతే అను వాక్యమునకు వాస్తవమునకు ఈ విద్యామయావిద్యమయ పురుషార్థములు రెండును అంతము కలవియే అని అర్థము చెప్ప వలెను. అయితే విద్యామయ పురుషార్థము పురుషార్థత్వ దృష్టితో మాత్రమే అంతవత్తు. తన స్వరూపము అనియె ఎఱుగక దుఃఖము ననుభవించు భ్రాంతి నివారణ రూప పురుషార్థ దృష్టితో మాత్రమే విద్యామయ పురుషార్థము అంతవత్తు అని చెప్పబడినది. కాని స్వరూపము నిత్యసుఖమయమే. కావున స్వరూప దృష్టిలో దానికి అంతములేదు. విద్యాఫలము దుఃఖనివృత్తికి పురుషార్థత్వ మెప్పటి వఱకు అను ప్రశ్నకు అది పురుషులచే కోరఁబడునంతవఱకే. కావున అది విద్యాఫలమైనను అంతవత్తే అవిద్యాఫలమెట్లును అంతవత్తే. కాంతాకన కాదులు స్వరూప దృష్టితో అంతవత్తులు కాగా విద్యాఫలమైన భ్రాంతి నివృత్తి స్వరూప దృష్టితో అంతవత్తైనను ఆత్మ స్వరూప దృష్టితో అంతవత్తు అని దివ్యచకోరిక అర్థ శబ్దమునకున్న కామ్యమానత్వ దృష్టితో ఇంత వివరణ మొనర్చినది. అవిద్యా ఫలములైన కాంతా కనకాదులు అనుమాటకు కర్మఫలములు అని అర్థము. అజ్ఞానులకే వైదికకర్మ ద్వారా వానిని సంపాదించు ప్రవృత్తి ఉండును. కాని విద్యావంతులకు అట్టి ప్రవృత్తి ఉండదు. 3) **ఏషత అంతర్యామి + అమృతః** అను అంతర్యామి బ్రహ్మణము కూటస్థతాదాత్మ్యము తోడనే చిదాభాసు (జీవు) ని యొక్క అంతర్యామిత్వము చెప్పఁబడినది. చిదాభాసునికి దేహము యొక్క ఈశత్వమున్నను అది అసంపూర్ణమే కాని అది పూర్ణమైన ఈశత్వము కాదు. దేహగతుడైన చిదాభాసునికి అంతర్యామి కూటస్థాభిన్నేశ్వరుడు ఆ బ్రాహ్మణము కూటస్థ చైతన్యాభిన్నుని మరొకనిని అంతర్యామిగా చెప్పుట లేదు. కూటస్థ చైతన్య తాదాత్మ్యపన్నేశ్వరునకు అంతర్యామిత్వ మంగీకరించినచో ఆయనకు మరొక అంతర్యామి నంగీకరింపవలసి వచ్చుటచే అనవస్థా ప్రసంగమేర్పడును.

**ఈశ్వరో బహిరున్మేషో నిమేషోంతస్సదాశివః** అను తంత్రాంతర వాక్యము బహిరున్మేష తత్పరుడైన ఈశ్వరుడే. అనగా చిదాభాసుడే. అంతర్యామి అని చెప్పుచున్నది. సృజ్యతే అనుపదబంధములోని 'స' అను శబ్దము త్రివిధ సాధక బోధకము. ఆయా వాసనామయమైన అమ్మవారిచే సృష్ట్యవయవముగా సృజింపబడి సృష్టిలో చేరిపోవుదురు. సిద్ధులు మాత్రము ఇచ్ఛానుసారము పైన జెప్పిన ఉన్మనాకృతియందే దాదాపు ఈశాత్మకత్వ రూపమునందే సృజింపఁబడుదురు అనుటచేత కాక శివునకును అస్వాతంత్ర్యము ఈ శివునకు ధ్వనించును. ఇట్టి అస్వాతంత్ర్యమే సౌందర్యలహరియందు **శివఃశక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుం నచే దేవం దేవో నఖలు కుశలః స్పన్దితుమపి** అని శంకరులచే స్పష్టముగానే చెప్పఁబడినది. అట్టి స్వరూప సిద్ధులే ఉత్తమాధికారులుగా తత్తదాకృతి అని ఇందు చెప్పఁబడినారు.

నాకు స్వేచ్ఛచేతనే తత్తద్దేశ కాల పదార్థరూపులై సృష్టితను సృష్టిధర్మతను సృష్టిసారూప్యమును పొందుదురు. స్వేచ్ఛగా పొందుదురు అనుటచే సృష్టి స్వాతంత్ర్యము వారియందు ధ్వనించుచున్నది. పరుల దృష్టి యందు మాత్రమే వారు సృజింపఁబడినట్లు కానఁబడుదురు. కాని పరశివానుభావ దృష్టితో శివ స్వరూపులే. **ధ్యాయతీవ లేలాయతీవ** అను శ్రుతి ఈ విషయమునే చెప్పుచున్నది. ద్వాదశమఞ్జరికాస్తవమందును మనుష్యులు (రజోగుణులు) పశు పక్ష్యాదులు (తమోగుణులు) మరుత్తులు (సత్త్వగుణులు) సంసారసముద్రమున మునుగుచు తేలుచున్నను నీకటాక్షమునకు పాత్రులైనవారు మాత్రము పరమానంద శరీరులయియే ఉందురు అని చెప్పఁబడినది.

**అవతారిక:–** పై శ్లోకమున దృష్టి సృష్టి వాదము ననుసరించి ప్రకాశింపఁజేయ బడినదే. సృజింపఁబడునదని చెప్పఁబడినది. ఈ శ్లోకమున ప్రలయ కాలమునందలి అమ్మవారి సృష్టి సంబంధరాహిత్యరూప బ్రహ్మాత్మకత చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ త్వం హి చిత్తనురతో న చిత్తతా**
**స్వేన తే విషయ చిత్తతాం వినా।**
**శిష్యసే యది వినార్థమణ్డలం**
**సర్గసీమని కుతోఽస్తి చిత్తతా॥** 50



**ప్రతిపదార్థము:–** త్వమ్=నీవు, చిత్తనుః=చిత్తేశరీరముగా గల దానవు లేక చిత్తును క్షీణింపఁజేయు లేక చిత్తును విస్తరింపఁజేయు దానవు, అతః=అందువలన, తే=నీకు, విషయచిత్తతాం వినా=విషయాకారముగా పరిణమించు చిత్తము యొక్క ధర్మము లేకుండ, స్వేన=స్వరూపముతో, చిత్తతా=చిత్తత్వము, న=లేదు, అర్థ మండలం వినా=అర్థ సమూహములేకుండ, శిష్యసే యది=మిగులు దాన వైనప్పుడు, సర్గసీమని =ప్రలయమునందు చిత్తతా=చిత్తత్వము, కుతః= ఎందువలన, అస్తి=కలదు, (అస్తు= ఉండును).

**తాత్పర్యము:–** స్థితి(కాలమున) యందే విషయాగారము తప్ప వేరుగా చిత్తత్వము లేని నీకు ప్రలయకాలమున చిత్తత్వమెట్లుండును.

**వివరణము:–** చిత్తవృత్తి నిరోధమే యోగము అను పతంజలి నిర్వాణయోగము ననుసరించి చితి ధాత్వర్థమైన చింతనము (ధ్యానము) అగుట ననుసరించి అంతః కరణ ప్రభేదమైన చిత్తము ధ్యానోపయోగి అగుట స్పష్టము. మనస్సునకు సంశయించుట బుద్ధికి నిశ్చయించుట, అహంకారమునకు గర్వించుట అను వ్యాపారములున్నట్లే చిత్తమునకు ధ్యానించుట అను వ్యాపారముండుట యుక్తి సహమే అయినను మనోబుద్ధి చిత్త శబ్దములు అభిన్నాంతఃకరణ వ్యాపార వాచకములుగా కూడ ప్రయోగింపఁబడు చుండుట విజ్ఞులెఱిగిన విషయమే.

స్థూలముగా చిత్తు అమ్మవారి అంతఃకరణచతుష్టయ సంబంధరహితము అయినను చిత్ శబ్దమునకు ధర్మార్థకతా ప్రత్యయము (త) చేర్చగా ఏర్పడిన శబ్దముగా చిత్త శబ్దము వ్యుత్పాదింపఁబడుట అక్కడక్కడ కాననగును. మహా కాలు (శివు)ని యొక్క లేక ఆత్మ యొక్క శక్తియైన మహాకాలికి ప్రప్రపంచకారిత్వము ప్రపంచరాహిత్య బ్రహ్మాత్మకత్వము తంత్రప్రతిపాదితములనుటయు తాంత్రికలోక ప్రసిద్ధ విషయమే. చిత్తు చైతన్యమునకు విషయవ్యాప్తి సమయమున విషయ చైతన్యము అను వ్యవహారము కానవచ్చును. అట్టి చిత్తము ధర్మముగా (చిత్+త) చిత్త శబ్దము యొక్క వ్యుత్పాదనము దృష్టియందుంచుకొని అమ్మవారికి స్థితికాలమున చిత్తత్వము సంభవించునను ఆశంక కలుగగా ఈ శ్లోకమున నివారింపఁబడు చున్నది.

చిచ్ఛక్తి చైతన్యము అను ఆత్మస్వరూపమున అభిన్నమైన మహాకాలికి స్థితి సమయమున విషయసహితత భాసించును. అంతమాత్రమున తత్ప్రకాశమునకు

అనిత్యత్వమున్నదని చెప్పజాలముకదా! అయినను విషయాకార వ్యాప్తి ననుసరించి చైతన్యమునకు విషయ చైతన్యము అని వ్యవహారమేర్పడినట్లే విషయ చిత్రత్వము అమ్మవారికేర్పడుననవచ్చును. అంతమాత్రమున అనగా కేవల వ్యావహారికత ననుసరించి అమ్మవారే ప్రపంచస్థితికాలముననే విషయ చిత్రత సంభవించదనగా ఇక విషయములే లేని ప్రలయమున విషయచిత్రత యెట్లు సంభవించునను ఆక్షేపము యొక్క రూపమున విషయచిత్రతలేదని ఈ శ్లోకమున ప్రతిపాదింపఁబడినది. ఇది క్రమప్రకాశిక వ్యాఖ్యయొక్క అభిప్రాయముగా భావించవచ్చును.

దివ్యచకోరిక ననుసరించి నాదానుసంధానము నొనరించు యోగికి కలుగు ఉన్మనీభావావస్థా రూపిణియైన అమ్మవారికి విషయ చిత్రతా నిరాకరణ మీ శ్లోకమున ప్రతిపాద్యము. ఒకవిధముగా ఉన్మనీ భావావస్థ ప్రలయతుల్యమే. విషయ చిత్రతాంవినా అనుపాఠాంతరము నంగీకరించి విషయములకు చిత్రత్వము నంగీకరించి తద్వారా విషయ మిథ్యాత్వము వ్యంజింపఁజేయఁబడినది.

బిందువు, అర్ధచంద్రము, రోధిని, నాదము, నాదాంతము, శక్తి, వ్యాపిక, సమన, ఉన్మన అనునవి సూక్ష్మనాదములు. వీనిలో చివరిది ఉన్మన లేక ఉన్మని అనఁబడు తొమ్మిదవ నాదము సూక్ష్మతమము. ఇట్టి ఉన్మన్యవస్థలోనున్న యోగి మూర్ధమున విలసిల్లు మహాకాళి చిన్మయ శరీరిణి. ఆమె చిత్రమను నామాంతరము గల వాసనా శరీరము కూడ పరమార్థమందలి శేషత్వరూపమైన చిద్విలాసరూప మగుటచేత అనిత్యత్వమును వ్యంజించును. గురుశిష్యసంకోచ క్రమము కూడ వాగర్థ షడధ్వమూలము గురుశిష్యోషమునకును మూలము అని చిత్తను శబ్దము చితంతనోతి (విస్తారింపఁజేయును – క్షీణింపఁజేయును అను రెండు అర్థములు కలదగుటచేత చిత్తును విస్తరింపఁజేయు జ్ఞానము, చిత్తును క్షీణింపఁజేయు క్రియ అను రెండు ఘన శరీరములు కలదను అర్థమున త్వమ్పదార్థమునకు విశేషణముగా చెప్పఁబడినది. విషయచిత్రతాం వినా అను పాఠమునంగీకరించి చిదేవ ప్రథమం చిత్తం విషయాసంగత స్తతః విచిత్రాకారతాణ్యం ప్రాప్తం చిత్ర మిత్యభిధీయతే. చిత్తే మొదట చిత్తము, విషయసఙ్గము వలన పిమ్మట విచిత్రా కారత్వమును పొంది చిత్రమని చెప్పఁబడును అను తంత్రవచనము నుదాహరించి పాఠము సమర్థింపఁ బడినది. చిత్తా నక్షత్రముతో కూడిన పూర్ణిమ చిత్ర అది చిత్రసారకాల ముఖమగుట చిత్రతా అనుపాఠమునంగీకరించి ఆపదమునకు దహరాకాశము లేక భూతాకాశము అని అర్థము చెప్పఁబడినది.



చిత్రతాన అనగా చిత్రవ్యవహారము లేదు. చిత్తతాన అనగా చిత్త వ్యవహారము ఆకాశమున ఉండదు. అని అర్థము చెప్పఁబడినది. చిత్త వ్యవహారము లేదని భావము జపాకుసుమస్ఫటిక సన్నిధానమున జపాకుసుమము యొక్క ఎఱ్ఱదనము స్ఫటికమున కనఁబడినట్లు అమ్మవారికి కల్పిత విషయోపరాగము వాస్తవమున స్థితికాలమున సంభవించదు అని స్థితికాలముననే విషయోపరాగము నిషేధింపఁ బడగా ఇక అంతకాలమున బ్రహ్మమాత్రముగా శేషించిన అమ్మవారికెట్లు సంభవింపగలదు.

**అవతారిక:–** పై శ్లోకమున చిచ్ఛక్తికి సృష్టి స్థితియందే చిత్రత లేదన్నచో విశ్రాంతి వేళయగు ప్రలయమునందు చిత్రతలేదని వేరుగా చెప్పనక్కఱలేదని చెప్పఁబడినది. ఈ శ్లోకమున చిత్తగతవాసన విచిత్రము కాదు. దానికి తల్లివైన నీవు ఏకాకినివి (శక్తిరహితవు) సృష్టికర్త్రివికాజాలవు. జగత్స్రష్టి వగుచో స్వాప్నికస్రష్టిని గాని, జాగ్రత్స్రష్టిని గర్భమునందు ధరించుశక్తిగల నీవు శక్తియుక్తవుగానే జగత్కారణ మగుదువని చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ వాసనా చ న విచిత్రతాపదమ్ (రమ్)**
**తత్ప్రసూస్త్వమిహ కేవలైవ చేత్।**
**శక్తిలక్షణజగద్భృతోదరీ**
**మానసైన్ద్రియకవస్తు (నో) సూరసి॥ 51**

**ప్రతిపదార్థము:–** వాసనాచ=వాసనయు, విచిత్రతాపదమ్=ఆశ్చర్యమనరానిది, న= కాదు, ఇహ=ఈ జగమున, తత్ప్రసూః=దానికి తల్లివి, కేవలా ఏవ=ఏకాకివి, చేత్= అగుచో, శక్తిలక్షణ జగద్భృతోదరీ=శక్తియను జగత్తును భరించు పొట్టగలదానవు, మానసైంద్రియకవస్తు సూః=మానసములైన ఇంద్రియములకు సంబంధించిన వస్తువుల సృజించుదానవు, అసి=అగుచున్నావు.

**తాత్పర్యము:–** వాసన అనునది ఆశ్చర్యకరము అని చెప్పరాదు. కాని ఆ వాసనను సృజించు నీవు ఏకాకివే అగుచో శక్తి అనఁబడు జగమును భరించు పొట్టగల నీవు, ఆ పొట్టలో నుండి సృజింపఁబడు మానస వస్తువులకు (స్వప్నగతములకు) ఐంద్రియక వస్తువులకు (జాగ్రత్తలోని వానికిని) తల్లివనుటలో ఆశ్చర్యమేమున్నది?

**వివరణము:–** అమ్మవారు జగత్సంబంధము లేనిదైనచో వాసనయు జగత్తును

సృజించజాలదు. అందువలన శక్తి స్వరూప సూక్ష్మజగమును గర్భమందు ధరించిన మానసానుభవమునకు ఇంద్రియముల అనుభవమునకు భూతములకు కారణమనుటయు కాదనుట విచిత్రము కదా! 1) దివ్యచకోరిక ననుసరించి పై శ్లోకమున ఉన్మనీధ్యాన ప్రకరము చెప్పఁబడినది. ఈ శ్లోకమున ఆ చిన్మయ త్రిపుటి రూపిణియైన అమ్మవారు సృష్టి అని చెప్పుటకే వీలుండదు. కావున ఆమె భవిషత్సృష్టి నంతను తన గర్భముందుననే నింపుకొన్నది అను అర్థమిచ్చు శక్తి లక్షణ జగద్భృతోదరీ అను విశేషణ బలమున ఆమె చిన్మయత్వము విషయశబలత్వము ఈ క్రింది శ్లోకమున నిరాకరింపఁబడుచున్నవి. 2) శక్తి పదము పూర్వము చెప్ప ఁబడిన ఖేచర్యాది శక్తుల బోధించును. గచ్ఛతీతి జగత్ అను వ్యుత్పత్తిచే గతిగల నాదనవకమయమైన జగత్తు అని అర్థము. నాదనవక మందు శక్తి, వ్యాపిక, సమన అను మూడు నాదముల (ఇచ్ఛా, జ్ఞాన, క్రియా శక్తులు) బోధించునదే శక్తి పదము. శక్తి లక్షణమనగా శక్తులను లక్షింపఁజేయు అని శక్తి లక్షణపదమునకు అర్థము. అట్టిశక్తిని లక్షింపజేయు జగత్తును భరించు ఉదరము గలది అని శక్తి లక్షణజగద్భృతోదరి అను సమాసము యొక్క అర్థము. 3) మానసైంద్రియక వస్తు సూః అను సమాసము ఇంద్రియములే (మనస్సు జ్ఞానేంద్రియము) శరీరముగా గల స్వప్న ప్రాతిభాసిక వస్తువులనుగాని, వ్యావహారిక సత్యములైన జాగ్రదవస్థలోని వస్తువులనుగాని సృజించునది అను అర్థమును బోధించును. మానసైంద్రియక వస్తునోరసి అనుపాఠమున మనోవిషయములు, ఇంద్రియ విషయములు అను రెండు విధములైన వస్తువులకు అను అర్థమును బోధించును. సుఖదుఃఖాదులు మనో విషయము (వస్తువు) లు. శబ్దస్పర్శాదులు ఇంద్రియ విషయములు. ఈ రెండు విధములైన వస్తువులకును అని ఆ సమాసము బోధించును. స్వప్నమందలి వస్తువులుగాని, భ్రాంత వస్తువులు గాని సాక్షిభాస్యము లని చెప్పఁబడును. వ్యావహారిక జగమందు ఇంద్రియ వేద్యములైన బాహ్య వస్తువులు మానసములు (అంతర సుఖదుఃఖాదులు), ఇంద్రియకములు (శబ్దస్పర్శాదులు) అను ద్వివిధ వస్తువులకు లేక మానస ఐంద్రియక వస్తుద్వయమునకు అని ఆ సమాసము బోధించును. మానసైంద్రియక వస్తునా ఉరసి అని విభజించి మన ఇంద్రియములు శరీరముగా గల వస్తువు అనగా ఆత్మచేత అని మొదటి పదమునకు. దహరాకాశము అని రెండవ పదమునకు అర్థములు చెప్పఁబడినవి. 4) సంస్కృత భాషలో ధాన్యేన



ధనవాన్ అను ప్రయోగమున్నది. అందులో తృతీయకు అభేద మర్థము. ధాన్యాభిన్నధనముగలవాడని బోధించును. ఈ శ్లోకము మానసైంద్రియక వస్తునా శక్తి లక్షణజగద్భృతోదరీ అను రెండు సమాసములు మానసైంద్రియక వస్తువులు విషయములు గల ఆత్మతో శక్తి లక్షణ జగద్భృతోదరీ అను సమాసము లోని జగత్తునకు అభేదమును బోధించును. అనగా మానసైంద్రియక వస్తు ప్రకాశ మైన ఆత్మయే ప్రకాశ్యమైన శక్తి లక్షణ జగము అను ఆత్మ జగముల కభేదము బోధించునని చెప్పఁబడినది. (ఆత్మ) (బ్రహ్మ) జగములు సత్యములు వాని భేదము సత్యమనుట శాక్త సిద్ధాంతము) 5) తత్ప్రసూః అనుపదము అమ్మవారు వాసనకు తల్లి అని అర్థమును బోధించును. మానసైంద్రియక వస్తుసూః అను పదము స్వప్న జాగ్రద్విషయములకు తల్లి అను అర్థమును బోధించును. అనగా స్వప్న జాగ్రద్విషయములకు అనగా వాని వాసనలకు తల్లి కేవలయే. అనగా చిద్రూపిణి. ఉన్మనీనాద త్రిపుటీరూపిణియునైన కారణమున ఆమె సజాతీయ విజాతీయ స్వగత భేద రహిత అను తాత్పర్యమును దివ్యచకోరిక సాధించినది. మొదటి పాదములోని చ కారము ద్వితీయ తృతీయపాదములలో బోధింపఁబడిన తల్లి ఒకటియే అను అర్థమును బోధించును. ఇట్లు ఆ రెంటి అభేదము విచిత్రము కాదు. అని విచిత్రతా పదం న అను పదములు బోధించును. **న విచిత్రతా పరమ్** అను పాఠమును స్వీకరించి విచిత్రత పరము (గొప్పది) కాదు. వాసనయే గొప్పది అని బోధించునని వివరించినది. విచిత్రతయు పరమ్ అనగా గొప్పదే కాని దాని పరత్వము తనకు తాత్కాలికము. అమ్మవారే 'పరమ్' గొప్పది. కాని వాసన గొప్పది కాదు అని రెండు మూడు విధములుగా అన్వయభేదమున వివరించినది. 6) సాధారణముగా వాసన విషయోపరక్తియై ఉండును. కాని ఆ వాసన ఏతల్లి నుండి జనించినదో ఆమెకు విషయోపరక్తి ఉండదు. 7) శ్లోకము మొత్తము విషయములను గాని తద్వాసననుగాని జనింపఁజేసిన తల్లి చిన్మయి కావున శివునివలె ఆమెకును ఇట్టి విషయోపరాగము లేదు. కావున ఆమె కేవలత్వమునకెట్టిభంగము లేదు అని శ్లోకము యొక్క భావము. 8) మరొక విధముగా చిన్మయ వాసనకును విషయో పరాగము లేదు. కావున ఆమెకేవలత్వమునకెట్టి భంగము లేదు అని శ్లోకము యొక్క భావము. 8) మరొక విధముగా చిన్మయ వాసనకును విషయోపరాగము లేదు. విషయాసన్నిధానమునందును వాసన ఉండును గదా. వాసనకే లేని

విషయోపరాగము అమ్మవారికెట్లు సంభవించును అని చెప్పవచ్చును. చిన్మయ వాసనకే విషయోపరక్తిలేనిచో జగన్మాతృత్వమెట్లు కుదురును? అను ప్రశ్న మొకటి కలుగును. ఆమె యొక్క జగన్మాతృత్వము శక్తిద్వారకమేగాని సాక్షాత్తుగా గాదు అని సమాధానము చెప్పినచో పై శంక నిరస్తమగును.

**అవతారిక:–** పై శ్లోకమున చిన్మయ వాసనకు చిద్రూపిణియైన విషయ ప్రసవిత్రియైన అమ్మకు అభేదము చెప్పఁబడినది. ఈ శ్లోకమున నాదనవకాత్మక జగత్ప్రకాశనమే జగన్మాతృత్వమని చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ సార్వకాలికమిదం జగత్త్వయా**
**భాస్యతే విధృతశబ్దరూపయా।**
**ఆన్తరం జనని! బుద్ధిదర్పణే**
**బాహ్యమద్యతనమక్షరూపయా॥** 52

**ప్రతిపదార్థము:–** జనని=ఓ తల్లీ, ఇదమ్=ఈ, సార్వకాలికమ్=సర్వకాలము లందుండు, జగత్=జగము, విధృత శబ్దరూపయా=ధరించిన శబ్దరూపముగల, అక్షరూపయా=ఇంద్రియరూపిణి లేక వర్ణమాలారూపిణియునైన, త్వయా=నీచేత, బుద్ధిదర్పణే=బుద్ధి అను అద్దమందు, ఆంతరమ్=లోపలిది, బాహ్యమ్=బయటిది, అద్యతనమ్=వర్తమానకాలికమును అని, భాస్యతే=ప్రకాశింపజేయబడును.

**తాత్పర్యము:–** సార్వకాలికమైన జగము అంతర్బాహ్యజగముగా శబ్దరూపిణివైన బుద్ధి దర్పణమునందు ఇంద్రియరూపిణివైన నీచేత వర్తమానకాలికముగా ప్రకాశింప జేయఁబడుచున్నది.

**వివరణము:–** దివ్యచకోరికననుసరించి సార్వకాలిక శబ్దము భూతభవిష్యవర్తమాన గతము అగు జాగ్రత్స్వప్నసుషుప్తరూపావస్థాత్రయమునందలి జగములను బోధించును. 'ఆంతరమ్' అను శబ్దము అంతరాత్మయందుండు దానిని, బాహ్యమ్ అను శబ్దము లోకత్రయమధ్యమందుండు దానిని బోధించును. ఆంతరమ్ అను శబ్దము మానసస్వాప్నిక జగమును రెండు జన్మల మధ్యలోని ఆతివాహిక జీవ స్వరూపమును, బాహ్యమ్ అను శబ్దము బహిరింద్రియ వేద్యమైన వ్యావహారికమైన బాహిర జగమును బోధించును. బుద్ధి దర్పణమనగా అద్దము వంటిదని చెప్పఁ దగిన బుద్ధితత్త్వము. అట్టి బుద్ధితత్త్వమునందు ప్రాణాపానాదివృత్తిభేదమును



ఇంద్రియవృత్త్యాది భేదమును శబ్దరూపముగా ధరించు అమ్మవారికి విశేషణముగా విధృత శబ్దరూపయా అను శబ్దము ప్రయోగింపఁబడినది. దశవిధ ప్రాణనాదకాల స్వకాదిరూపమైన శబ్దరూపమును ధరించినది అని ఆ సమాసము బోధించును. మరియు పరావాక్శబ్దరూపుడైన జీవుని ధరించునది అనియు బోధించును. మరియు సాగర మేఘాదుల ధరించినది అనియు బోధించును. మరియు జడేంద్రియ ప్రకృతి రూపిణి అనియు బోధించును. భాష్యతే అను శబ్దము చెప్పఁబడబోవు కాంతి ఆకాశము మొదలగు రూపముల ఉండగలదు అను అర్థమును బోధించును. మరొక విధముగా ప్రకాశింపఁబడగలదు అను అర్థమును కూడ బోధించును. కాంత్యర్థకమైన 'భా' ధాతువు యొక్క లృడ్రూపము భాష్యతే అనునది పై అర్థమును బోధించును. భా ధాతువు యొక్క లృడంతరూపమున స్య అను అక్షరము శషస అభేదోచ్చారణ ప్రాచుర్యముననుసరించి షకారముగా భావింపఁబడినదని భావించ వలెను. ఈ శ్లోకమున అక్షరూపయా అను అమ్మవారి మరొక విశేషణమున్నది. అది అమ్మవారు జ్ఞానకర్మేంద్రియరూపిణి అను అర్థము నిచ్చును. **వబయోరభేదః** అను సూక్తి ననుసరించి బాహ్యమ్ అను శబ్దమును వాహ్యమ్ అను శబ్దముగా భావించి పంచేంద్రియ ద్వారమున అమ్మవారిచే ప్రవహింపఁజేయబడిన జగమను అర్థమును గ్రహింపవచ్చును. జ్ఞానేంద్రియములలో శ్రోత్రేంద్రియమొకటి. మొదటిది కూడ. అట్లే కర్మేంద్రియములలో వాక్కు మొదటిది. పరాశక్తి పరావాగ్రూపమున శ్రోత్రముల ద్వారా ప్రవహించిన అకారాది క్షకారాంత వర్ణమాల అక్షము. అది వైఖరీ రూపము. శ్రోత్రేంద్రియములు అందరికీ వినఁబడునట్టి వర్ణమాల రూపమున దానివలన నేర్పడు వాక్ప్రపంచము తదర్థరూపమున అమ్మవారిచే వాహ్యమైనదీ జగము అని 'అక్షరూపయా వాహ్యమ్' అను శబ్దములు బోధించును. 'అక్షరూఢయా' అను పాఠాంతరము స్వీకరించి అమ్మవారు ఇంద్రియ వృత్తులు అను గుఱ్ఱముల నారోహించిన అమ్మవారిని దర్శింపఁజేయుటలో దివ్య చకోరిక కృతకృత్యయైనది. 'అద్యతనమ్' అను శబ్దమున **అదభక్షణే** అను ధాతువు నుండి నిష్పన్న మొనర్చబడిన అద్య శబ్దము భోగకాల మాత్రావసానభోగాయతన శరీరమును బోధించును. సారాంశమేమనగా సార్వకాలికమైన సర్వావస్థాగతమైన జగము బాహ్యాభ్యంతర వర్తమానానుభవ స్థానమైన శరీరేంద్రియ మనో ద్వారముల అనుభవింపబడు చుండుటయే. క్రమప్రకాశిక ననుసరించి సార్వకాలిక జగము వాసనా రూపమున

బుద్ధి యందు ప్రతిఫలించిన జగమే వర్తమానకాలమున ఇంద్రియద్వారమున వైఖరీ శబ్దద్వారమున అమ్మవారిచేత ప్రకాశింపఁజేయఁబడుచున్నది.

**అవతారిక:–** పై శ్లోకమున అమ్మవారి చేతనే బాహ్యాంతర జగత్తు ప్రకాశింపఁ జేయబడునని చెప్పఁబడినది. ఈ శ్లోకమున శాంతత అను భూమిక కలుగనంత వఱకు ద్వైతజ్ఞానము నశించదని, ఆ భూమిక ఉదయించిన పిమ్మట ప్రద్వయ జ్ఞానమే మిగులునను ఆగమ విరుద్ధమైన అర్థము చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ యావదమ్బ! పురుషస్య శాన్తతా**
**సప్తమీ సకలభావవర్తినః।**
**తావదద్వయవిమర్శభిన్నతా**
**సార్వకాలికవిమర్శభావితా॥** 53

**ప్రతిపదార్థము:–** అమ్బ=అమ్మా, యావత్=ఎంతవఱకు, సకలభావవర్తినః=అన్ని భావములందుండు, పురుషస్య=పురుషునకు, సప్తమీ=ఏడవదైన, శాంతతా=శాంతత (అనుభూమిక ఉదయించదో), తావత్=అంతవఱకు, (సర్వభావ స) సార్వకాలిక విమర్శ భావితా=అన్ని భావముల విమర్శలవల్ల కలిగిన, అద్వయవిమర్శభిన్నతా= అద్వైతము యొక్క విమర్శలోని భిన్నత (ఉండును).

**తాత్పర్యము:–** అన్ని భావములలో వర్తించు పురుషునకు సప్తమమైన శాంతత అను భూమిక ఉదయించనంతవఱకు సార్వకాలికములు సార్వభావములు అయిన విమర్శభేదములు శమించవు.

**వివరణము:–**క్రమప్రకాశిక ననుసరించి మొదటి ఆఱు భూమికలలో భేదభావముల విమర్శములుండును. ఏడవ భూమికయందు పురుషుడు అభేద విమర్శ స్వరూపుడుగా ఉండును. సప్తధా ప్రాంత భూమిః ప్రజ్ఞా..... సప్తభూమయస్తు అనుసూత్రములలో చివఱి ఏడవ భూమికయైన ప్రజ్ఞ పంచవృత్తులలో అంతర్గతముగా వ్యాప్తమయి యుండును అని చెప్పఁబడినది. దివ్యచకోరిక ననుసరించి సకల భావవర్తినః అను సమాసములోని భావశబ్దమునకు అంతర్బాహ్యక్రియా వృత్తి గలవానికి అని ఒక అర్థము చెప్పబడినది. భావమనగా స్వప్నాదులలో భాసించు ప్రాతిభాసిక కర్మగాని వ్యావహారిక జగమునందలి కర్మగాని అగును.

బాహ్యాంతర కర్మల త్రిపుటులు అనగా కర్తృకర్మక్రియలు. ఇవి సాధారణముగా



కృదంత ప్రత్యయములచే బోధింపఁబడును. ధాత్వర్థము భావము అని చెప్పఁ బడుట కలదు మరియు కర్తృకర్మ క్రియలలో కర్తృ కర్మార్థమునకు భావార్థ తిజ్ ప్రత్యయము చేర్చబడినప్పుడు క్రియాపదముచే భావము బోధింపఁబడును. ముఖ్యముగా అకర్మక క్రియ ప్రయోగింపబడునప్పుడు కర్తృ ప్రాధాన్య వివక్షలేనప్పుడు ఆ క్రియా ప్రయోగము భావార్థక క్రియాప్రయోగము అని లేక భావేప్రయోగము అని చెప్పఁబడును. ఈ రెండు పథములయిన భావములు త్రిపుట్యంతర్గతములే.

భావవర్తి పురుషులలో కొందఱు సాంఖ్యులు. కొందఱు యోగులు నుందురు. వారికి సాంఖ్యమార్గ, యోగమార్గ గురువులు కుమారస్వామి మరియు శివుడు. బుద్ధి ఒకటి, కర్మేంద్రియములైదు. మొత్తము ఆఱు ఇంద్రియములు బహిర్గతములై నపుడు జరుగు క్రియ యోగమని, అంతర్గతములైనపుడు జరుగు క్రియ సాంఖ్యమని చెప్పఁబడును. వీనిలో యోగమున బయటికి పోవు వాగాదులు కర్మేంద్రియములే. కావున పంచాస్యుడైన శివుడు యోగమార్గ దేశికుడు. మనస్సే పఞ్చజ్ఞానేంద్రియ సహితమై ఆభ్యంతర క్రియ జరుపునపుడు అది మొత్తము జ్ఞాన మయముగా ఉండుటచేత ఆఱు జ్ఞానేంద్రియములు ఆఱు ముఖములుగా గల కుమారస్వామి సాంఖ్యమార్గ దేశికుడు. ఇట్టి సాంఖ్యయోగ మార్గ గురువు లిరువురు పురుషులే ఈ శ్లోకమున సకల భావవర్తులు అని విశేషింపఁబడినారు. వీరిలో శివరూపులు బహిఃక్రియారూపులు. సాంఖ్యులు అంతఃక్రియారూపులు. అంతః కర్మరూప సాంఖ్యదేశికుడు సంవత్సర (కాల) స్వరూపుడు. సంవత్సరమునందలి ఆఱు ఋతువులు ఆ సంవత్సరమునకు ఆఱు ముఖములు. కావున ఆ సంవత్సర పురుషుడు. షణ్ముఖుడుగా చెప్పఁబడవచ్చును. కావున షడృతు షడానన కాల పురుషుడు. అంతః క్రియా కర్తృపురుషుడునునైన సకల భావవర్తి జ్ఞానపరుడునైన పురుషుడును ఆత్మ రూపియే యగును.

ఆత్మ విస్మరణముచే కలిగిన అలజడులు ఒడిదుడుకులు మొదటి ఆఱు భూమికలలో శమించవు. సప్తమ భూమికలో ఆత్మ విస్మరణము లేకపోవుటచే సప్తమ భూమికయందవి శమించును. అట్టి స్థితిలో ఆ ఆత్మకు అంతఃపురుష స్థితి బహిః కాలరూపత ఏర్పడియుండును. ఆ పురుషకాల స్వరూపుడు కర్మేంద్రియ పఞ్చక నిర్వర్త్యయోగమునకు, అంతరింద్రియ నిర్వర్త్య సాంఖ్యమునకును షడృతువులకును అతీతుడుగనే ఉండును. అన్ని భూమికలలో సమానముగా

విహరించుచు శైవాద్వైతాతీత సిద్ధునకు పైన చెప్పబడిన సప్తమ భూమికయు భ్రాంతి రూపమే. వాగర్థ ప్రణవద్వయము నుపాసించువానికి అనుష్ఠాతృ పురుషుడు కాని, కాలరూపుడు కాని షడధ్వములకు భిన్నముగా అతీతుడున్నాడను భ్రాంతి ఆ సప్తమ భూమికలో ఉన్నను అన్ని భావములందు సమానముగా ఉండు పురుషునకు షడ్భావ వికిరణములలో వర్తించు ఉత్తమాధికారి సిద్ధునకు దుఃఖములే సుఖములు. సంసారమే మోక్షము. విషము కూడ అమృతమగును. 2) ఈ శ్లోకము యొక్క ఉత్తరార్ధమున అద్వయ విమర్శ భిన్నతా సార్వకాలిక విమర్శ భావితా అను రెండు సమాసములున్నవి. అద్వయ విమర్శ అనగా ద్వైతవిమర్శ భిన్నమైన అద్వయ విమర్శ మొకటి ఉన్నదను అపోహ కలుగును. కాని అద్వయ విమర్శమనగా ద్వైత విమర్శ విమర్శము. అది ద్వయ విమర్శ రూపము కాదు. కావున అది అద్వయ విమర్శ భిన్నత. దానియందుండును. ఆ + ద్వయ అని విభజించి అనుత్తరమైన అకారము యొక్క ద్వయవిమర్శము యొక్క భిన్నత అని ఆ సమాసము నకు మరొక అర్థము చెప్పఁబడినది.

యథార్థమునకు ఈ అద్వయ విమర్శభిన్నత అనునది సార్వకాలికము. కావున అది సార్వకాలిక విమర్శభావితా అని చెప్పబడదగినది. అట్టి సార్వకాలిక విమర్శ భావితయే అద్వయ విమర్శకునకుండును. అంతేకాని బాహ్యవస్తువుల భాసము లేకుండుట అను కృత్రిమ శాంతతకు విశేషముగా గొప్పతనమేమి. ఈ సిద్ధపురుషుని దృష్టిలో ఉండదు. ఈతని శాంతత షడధ్వాతీతము కాదు. షడధ్వా భిన్నము అనుటయే ఉచితము. శివాభిన్నుడైన ఈ పురుషునకు షడఙ్గకాత్మ విశ్రాంతి ఏర్పడినపుడు బాహ్య విమర్శ సమాప్తమగును.

**అవతారిక:–** పై శ్లోకమున సప్తమ భూమికలోని శాంతతయొక్క సత్యభ్రాంతి రూపములు మత భేదమున చెప్పఁబడినవి. ఈ శ్లోకమున ఏకకాలమున చిజ్జడముల భాసించుచుండగా సమాధియందు వృత్తి నిరోధమున జడము తొలగగా ప్రకాశించు చిత్తే అమ్మవారి స్వస్వరూపమని చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ అమ్బ! తజ్జడము (మ్బ) శన్తి భేదిభి**
**ర్యద్గుణైః స్ఫురదపోహ్యతే క్రమాత్।**
**చిత్తదాకృతినిరాకృతిస్తతో**
**భాతి యా సకృదసౌ త్వమేవ సా॥ 54**



**ప్రతిపదార్థము:–** అమ్బ=అమ్మా, భేదిభిః=భేదించునట్టి, గుణైః=గుణములతో (కూడినది), జడమ్=జడముగా, ఋశంతి=చెప్పుచున్నారు, స్ఫురత్=ప్రకాశించునది, యత్=ఏదో (జడము), తత్=అది, క్రమాత్=క్రమముగా, అపోహ్యతే=తొలగింపఁ బడును, తతః=పిమ్మట, నిరాకృతిః=ఆకారములేని, చిత్=చిత్తు, తదాకృతి నిరాకృతౌ =జడము ఆకారము యొక్క నిరాకరణము (కలుగగా), యా=ఏది, భాతి= ప్రకాశించుచున్నదో, సా=అది, త్వమ్ ఏవ=నీవే.

**తాత్పర్యము:–** గుణములు జడలక్షణములు. ఆ గుణాకృతియైన జడము సమాధి యందు తొలగింపఁబడగా మిగిలిన చిత్తు నీవే.

**వివరణము:–** క్రమప్రకాశిక ననుసరించి క్రమాత్ అను పదము సమాధ్యభ్యాస క్రమమును బోధించును. భేదిభిః అనుపదము గుణములలోని పరస్పరభేదమును చెప్పును. శ్లోకము నాల్గవపాదములోని **'భాతి యా సకృత్'** అనుపదము ఛాందోగ్యాష్ట మాధ్యాయ చతుర్థ ఖండమునందలి రెండవ మంత్ర పాదము 'సకృద్విభా తోహ్యైవైష బ్రహ్మలోకః' అను మంత్రపాఠముతో సామ్యము కలిగియున్నవి. సకృద్భాన మనగా ఆత్మరూపిణియైన చిత్తు యొక్క విభాతత్వము. ఇది ఆత్మ వస్తుస్వభావము వలన ఇతరాపోహనము వలన సిద్ధించును. పై ఛాందోగ్యమంత్ర పదముల తోడనే గౌడ పాదీయ మాండూక్యకారికాంత శాంత ప్రకరణమందలి ఎనుబది ఒకటవ శ్లోకమారంభింపఁబడినది. 2) దివ్యచకోరిక ననుసరించి క్రమాత్ అనగా విమర్శా భ్యాస క్రమము. గుణములనగా సత్త్వరజస్తమో గుణములు మాత్రమే కాక శమాది సద్గుణములు. కామక్రోధాది దుర్గుణములు. స్ఫురత్ అనగా అధికారము ననుసరించి భిన్నభిన్నముగా తోచు జగము. జాగ్రదవస్థయందు జడము చిత్తుచేతనే ప్రకాశింపఁ జేయఁబడును. చిత్తు కూడ ప్రకాశించుచునే జడమును ప్రకాశింపఁజేయును. కావున చిజ్జడములు రెండును ప్రకాశించుచున్నట్లనిపించును. సమాధి యందు జడము ప్రకాశించుట లేదు. కావున నేను జడరహితుడనను అహంకార ముండును. జాగ్రదవస్థయందలి షడధ్వములకు భిన్నుడనను అహంకారముండును. కామ క్రోధాద్యాసుర భావరహితుడను, సంశయరహితుడను ఇత్యాది విధమున స్వాధికారము ననుసరించిన జగదంశముల యొక్క అపోహనముండును. రజస్త మస్సత్త్వములు శమాదులు, కామక్రోధాదులు అన్నియు 'భేది' లక్షణము కలవియే. భేదధీః అను పాఠము నాశ్రయించి గుణముల అపోహనము లేకున్నను భేదబుద్ధి

నిషేధ మాత్రముండునని అర్థము చెప్పఁబడినది. పైన చెప్పఁబడిన శమాదులు స్ఫురించుట సత్త్వజగము, కామక్రోధాదులు స్ఫురించుట రాజసజగము శూన్య స్ఫురణము తమోజగము లేక వ్యావహారిక ప్రాతిభాసిక నిర్భాసాత్మక జగము త్రివిధము. ఈ త్రివిధజగము నా కంటె భిన్నము అను భేదబుద్ధి జడముగా శ్రుతులు చెప్పుచున్నవి అనుట జడమృశంతి అను పదముల అర్థముగా చెప్పఁబడినది. వాస్తవముగ జగము యొక్క అపోహనమనగా జగము భిన్నమను భేద బుద్ధినిషేధమే జడనిషేధముగా భావింపఁదగియున్నది. ఋశంతి అను క్రియా పదమునకు శ్లోకమున లేని కర్తృపదము శ్రుతులు లేక స్మృతులు లేక విమర్శకులు అను మూడు విధములైన అధ్యాహార పదములను సూచింపఁబడినవి. చిత్త్వనాకృతి నిరాకృతిః అనుపాఠము నాశ్రయించి అనాకృతి శబ్దమును అన + ఆకృతి అని విభజించి **అన ప్రాణనే** (చలనే) అను ధాతునిష్పన్నమైన అన శబ్దమునకు ప్రాణమను అర్థము ఏర్పడును. అనాకృతి శబ్దము ప్రాణస్పందమయత్వమని బోధించును. అనాకృతి నిరాకృతి శబ్దము ప్రాణస్పందమును వారించగా ఏర్పడిన సమాధిని బోధించును. అనాకృతి శబ్దము మరొక విధముగా ఆకారములేని అను అర్థమును బోధించును. అనాకృతి నిరాకృతి అనగా అకారము కలది అను అర్థము సిద్ధించును. చిదాకృతి నిరాకృతిః అను పాఠమున చిత్తు యొక్క ఆకృతివంటి ఆకృతి కలదని మరొక అర్థము చెప్పఁబడినది. ఇది చిద్వాసనామయ ప్రకృతి యొక్క నిరాకార చిదాకృతి సామ్యమును బోధించును అని మరొక విధముగా సమాధిదశ లోని నిరాకృతి స్వరూపము వివరింపఁబడినది. అసౌ శబ్దము అపరోక్షమైన ఆత్మకన్న భిన్నమైన పరోక్షమును బోధించును. అసౌ శబ్దము యొక్క రహస్యార్థమిట్లు చెప్పబడినది. విసర్గము యొక్క మరొక రూపము సకారము. అది విసర్గము వలె శక్తిని బోధించును. అట్లే తంత్రమున సౌః అనునది శక్తి (కూటమంత) బీజము అనుట ప్రసిద్ధమే. అసౌ శబ్దమునకు విసర్గ కల్పిత మంత్రమయ శరీరిణి అనియు సప్త భూమికా పిండమయి అనియు అర్థములు. అకారము శివుని అసౌ అను పదము శివాభిన్న శక్తిని బోధించును. కావున పరాబీజ మంత్ర వాగర్థ సామరస్య రూపిణి. సమాధి దశలోని శక్తి స్వరూప బోధకము అసౌ శబ్దము శివుని కూడ బోధించునను పక్షమున సమాధ్యవస్థలోని శివస్వరూపము కూడ నీవే అయి యున్నావు అను అర్థము లభించును. త్వయాసి సా అనుపాఠము నాశ్రయించి నీచేతనే సమాధ్యవస్థ సిద్ధించును. ఇచ్చట త్వయా అనగా అభిన్న నిమిత్తోపాదాన



రూపిణివైన నీచేత అని అర్థము. త్వయా అను పదమందలి తృతీయ విభక్తియు అభేదమును బోధించగా సమాధ్యవస్థలో భాసించు చిదాకృతి నీకంటె భిన్నము కాదు అను అర్థము చెప్పఁబడినది. తాంత్రిక శ్లోకములిందు ప్రమాణముగా ఉదహరింపఁబడినవి.

**విశ్వస్యైవ విశాలమ్మే శరీరం చాశ్నుతే శివః।**
**శాలామివ విశాలాం స్వమాదర్శే చ యథా గజః॥**

**అస్మిన్నేవ జగత్యంతః భవద్భక్తిమతా మిదమ్।**
**హర్ష ప్రకాశ బహులమన్యదేవ జగద్భవేత్॥**

సాధకునకు శివదృష్టి లేక శివానుభవము గలిగినప్పుడు విశ్వమునే తన విశాల శరీరముగా విశాల గృహముగాను పొందును. చిన్న అద్దమున విశాల జగమును చూచువానివలె అద్దము వంటి తనమనసున శరీరమున గృహమునుగా సర్వ విశ్వమును పొందనగును. భగవద్భక్తి గలవానికి ఈ జగమే ప్రకాశ బహుల మగును. ఈ శ్లోకములో చిద్వాసనా మయమైన ప్రపంచమును శివయోగులు దర్శించు ప్రకారము చెప్పఁబడినది.

**అవతారిక:–** పై శ్లోకమున జాగ్రదవస్థలో సర్వప్రపఞ్చనిషేధపూర్వ చిన్మాత్ర శేషత్వ రూప సమాధ్యనుభావము చెప్పఁబడినది. ఈ శ్లోకమున మొత్తము జాగ్రదవస్థను నిషేధించినప్పుడు శూన్యత్వప్రసఙ్గమేర్పడునను శంక కలుగగా దానికి జడమాత్ర నిషేధమే సమాధియందుండునను సమాధానము చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ జాడ్యమమ్బ! జగతో నిసర్గతో**
**యత్పరాప్రభృతి భాతి భేదతః।**
**త్వం తు జాడ్యపరిపన్థినీ స్మృతా**
**యా విభాసి సకృదర్ధమణ్డపే॥** **55**

**ప్రతిపదార్థము:–** అమ్బ=తల్లీ, నిసర్గతః=స్వాభావికముగ, యత్=ఏ, జగతః=జగము యొక్క, జాడ్యమ్=జడత్వము, పరాప్రభృతి=పరావాక్కు మొదలుగ, భేదతః=భిన్న భిన్నముగ, భాతి=ప్రకాశించునో, సకృత్=ఒకసారి, అర్ధమండలే=అర్ధమండలమున, విభాసి=ప్రకాశించునో, సా=ఆ, త్వమ్=నీవు, జాడ్యపరిపన్థినీ=జాడ్య విరోధినివిగా, స్మృతా =చెప్పఁబడినావు.

**తాత్పర్యము:–** స్వాభావికముగ జగము (పరమొదలుగాగలది) యొక్క జాడ్యమునకు నీవు పరిపన్థినివి. అర్థ మండలమున జాడ్యము భిన్నభిన్నముగా ప్రకాశించగా నీవు అభిన్నముగా ప్రకాశించెదవు.

**వివరణము:–** క్రమప్రకాశిక ననుసరించి జగమునకు జాడ్యము స్వాభావికము. జగమునకు ఆరమ్భమున పరావాక్కు జనించినది. కావున జగము పరాప్రభృతి అని విశేషింపఁబడినది. ఇట్టి పరాప్రభృతిక జగము జడము అని చెప్పుటకు హేతువేమనగా అది భిన్నభిన్నముగా ప్రకాశింపఁజేయబడుటయే. ప్రపఞ్చము యొక్క జడత్వము స్వాభావికమనుటకు హేతువేమనగా అది ప్రకాశింపఁజేయబడ దగుటయే. దీనిని ప్రకాశింపజేయు చిత్తు మాత్రము జడము కారాదా! అను ప్రశ్నకు చిత్తైనచో అది స్వప్రకాశము కావలెననుటయే హేతువు. స్వప్రకాశము కానిది పరప్రకాశము కూడ కాజాలదు. ఆ చిత్తుచే ప్రకాశింపఁజేయబడు జగము ప్రకాశ్యము. ప్రకాశము దాని స్వరూపము కాదు. చిత్తు తాను ప్రకాశించుచునే జడమును ప్రకాశింపఁజేయును. అర్థమండలమున లేక అర్థమండపమున చిజ్జడములు రెండు ఉన్నను అందు చిత్తే సత్యము నిత్యమును. పరిశేష న్యాయమున జడము అనిత్యము. అసత్యము. మరియు జడము భిన్నముగా గోచరించునది. చిత్తునందైక్యము మాత్రమే ఉండును. భేదము గోచరింపదు. ప్రకాశకమైన చిత్తుచేత జగత్తుతోపాటు తద్భేదమును గోచరించపఁజేయబడుచున్నది. ఒకవేళ చిత్తుకు స్వగత భేదమున్నచో అదియు గోచరము కావలెను గదా! స్వేతర జీవులు భిన్నులుగా భావింపబడినను వానిలో చైతన్యము ప్రకాశ్యము కాజాలదు. ఇది లోకానుభవ విరుద్ధము కూడ. జీవులు భిన్నులుగా కనఁబడుటకు వారి శరీరముల భేదమే (అనేకత్వమే) కారణము కాని చిత్తు భిన్న మగుట కారణము కాదు. చిత్తునందు భేదము లేదు ఉండదు. ఇతర జీవులలో ప్రమేయమైన చైతన్యము భిన్నమని అంగీకరించినచో అనుమేయత ఉండుటచేతనే అది స్వప్రకాశముకాదని జడము మాత్రమే ప్రకాశ్య మగునను నియమము ననుసరించి అది చైతన్యాభాసమే అని చెప్పవలసియున్నది. కావున చిద్రూపిణియైన అమ్మవారు జాడ్యపరిపన్థిని. కావుననే అర్థ సమూహమున ఆమె ప్రకాశించినప్పుడు జాడ్యము (తొలగకపోయినను) అది ప్రకాశితమగును.

2) దివ్యచకోరిక ననుసరించి అర్థములయొక్క మండపము అర్థ మండపము.



అర్థములనగా ద్రవ్యజాతి గుణక్రియలు. మరియు అభిధేయములు. అభిధేయము లనగా శబ్దమునందలి అభిధాశక్తి ద్వారమున బోధ్యములు. అర్థము లనగా ధర్మార్థకామమోక్షరూపములైన పురుషార్థములును వాని మండపము అర్థ మండపము అని మరియొక అర్థము చెప్పబడినది. అర్థమండలే అనుపాఠము ననుసరించి అర్థములనగా అయిదు పురుషార్థములు. పైన చెప్పబడిన నాలుగు పురుషార్థములకు కైవల్యము చేర్చబడగా పురుషార్థపఞ్చకమేర్పడును. పురుషార్థముల చతుష్ట్వ పంచత్వములు రెండు చెప్పబడినవి.

పరాప్రభృతి పదము పరాపశ్యన్తీ మధ్యమా వైఖరీ అను చతుర్విధ వాక్కు లను బోధించును. సృష్టిస్థితిలయకృత్యత్రయమును పశ్యన్త్యాది రూపమున నిర్వహించు పరాశక్తియే పశ్యన్త్యాదులకు ఆది. కావున పరాప్రభృతి అని జగమునకు విశేషణముగా ప్రయోగింపఁబడినది. అర్థ సృష్టికి ముందు శబ్ద సృష్టి. శబ్ద సృష్టికి ముందు పరాశబ్ద సృష్టి. అది ప్రథమము కావున పరాప్రభృతికము అను విశేషణము శబ్దార్థములు సృష్టములని ఆ శబ్దము బోధించును. మరియు పరాప్రభృతి అను సమాసములోని పరాశబ్దము జన్మరహితమైన శివాభిన్న పరాశక్తిని బోధించును. ఆ పరాశక్తి చిద్వాసనా వాసిత. ఈ పరాశక్తియు పరావాగ్రూపిణియే కాని పరావాగ భిన్న పరాశక్తిని పరాశబ్దము బోధించును.

పరచిద్వాసనామయి అని వెనుక చెప్పబడినది అట్టి పరచిత్తుకన్న భిన్నమై సర్వభేద వ్యవహారము నిర్వహించుశక్తి. ఆమె చిత్తని చెప్పబడక చిద్వాసనావాసిత అని చెప్పబడుట, చిత్తని చెప్పబడుటయు నను రెండువిధములైన వ్యవహారములు శాక్త గ్రంథములలో కాననగును. నిసర్గతః అనుపాఠమును స్వీకరించి జాడ్యభేదము సహజము, స్వభావజన్యము అని అర్థము చెప్పఁబడినది. నిపూర్వక సర్గ శబ్దము భేదించుట అను క్రియను బోధించునని చెప్పఁబడినది. భేదము క్రియాజన్యమనుట ఇట్లు చెప్పబడుటలోని పరమార్థము. సకృత్ శబ్దము ఏక ప్రయత్నమును బోధించును. చిత్తు ప్రకాశించినచో ప్రయత్నాంతర మక్కఱలేదని చెప్పుటకే సకృత్ ప్రయోగము చేయబడినది. అనగా చిత్తు అభేదరూపమున స్ఫురించుననుట భావార్థము. నిసర్గతః అనుపదమునకు పూర్వార్ధ ఉత్తరార్ధములలోనికి పునరుక్తితో అన్వయించి ఎట్లు జాడ్యమున భేదము నైసర్గికమో అట్లే చిత్తున అభేదము నైసర్గికము అని చెప్పుట సముచితమని చెప్పబడినది.

దివ్యచకోరికననుసరించి – జడభేదము చిదభేదము నైసర్గికములగుచో తు శబ్దము పూర్వపక్ష వ్యావృత్తి ద్యోతకము కాజాలదు. తు శబ్దము పూర్వపక్ష వ్యావర్తకమని చెప్పవలసివచ్చినచో జడభేదము నైసర్గికమే కాని చిదభేదము నైసర్గికము కాదు. అనగా అనైసర్గికము అని రెంటికి భేదము ప్రస్తావింపవలసి యుండును. జగజ్జాడ్య భానము భేద ప్రయుక్తమగు నైసర్గికమగుచో చిద్భావము అభేద ప్రయుక్తము అగుటయు నైసర్గికమే అని చెప్పవలసియుండును. లేదా నైసర్గిక జగద్భేదజాడ్యభానము వలె చిదభేద భానము కూడ అనైసర్గికమే ఏలకారాదు. ఇక్కడ మరి ఒక ప్రశ్నమేర్పడును. జగద్భేదము నైసర్గిక జాడ్య ప్రయుక్తమా లేక నైసర్గిక జగద్భేదము జాడ్యప్రయుక్తమా అనునది ఆ ప్రశ్నము. ఈ ప్రశ్నములో భేదము ప్రయోజకమగుచో జాడ్యము ప్రయోజ్యమగును. జాడ్యము ప్రయోజక మగుచో భేదము ప్రయోజ్యమగును. అట్లే చిత్త్వము భేద ప్రయోజకమా, అభేదము చిత్త్వప్రయోజమా అను ప్రశ్నమును ప్రయోజ్య ప్రయోజక భావమునందలి సంశయము నుండి పుట్టినదే. అట్లే జడభేద భానము నైసర్గికమని, చిదభేదము అనైసర్గికమనియేల చెప్పరాదు? అట్లు చెప్పినచో భేదమునకు పారమార్థికత అభేదమునకు వ్యావహారికతయు నేర్పడును. కావున దానిచేత భేదవాదమును అనుగ్రహింపబడినట్లగును అను ఆశంక సరియైనది కాదు. జగములోని భేదము కేవల జాడ్య ప్రయుక్తము మాత్రమే కాదు. అట్లే జగములోని జాడ్యము భేద ప్రయుక్తము మాత్రమే కాదు. నిసర్గ సకృత్పదముల వలన – దీనిలో కాలభేదము మానభేదమును భాసించుచున్నవి. అదిగాక జగము యొక్క భావాభావములే జాడ్యచిద్భానములకు గాని,భేదాభేదములకు గాని ప్రయోజకములు అని తెలియును. అందుచేత అర్ధ మండపమున జాడ్యపరిపన్థిని ఉన్మనీనాద విమర్శాత్మికయైన ఆమె ప్రకాశించుచున్న దని స్మృతులలో చెప్పబడుచున్నది. పరాప్రభృతి జగములోని భేదజాడ్యములు నైసర్గికములు. నిసర్గమనగా నితాంతికాల సర్గము. అది అనేకసార్లు ప్రకాశించును అని అర్థము. అసకృత్ అనగా అనేక పర్యాయములు భేదభానము అనగా ప్రకాశించుట కాల సత్తమాత్ర సమనియతము. కావున జడ స్వభావమగుటచే ఆపైన కూడ చిన్మయసాక్షియొక్క జడచిద్భేదాభేదానుభవము, స్మృత్యధీనమే అను ఆశయముతో స్మృతా అను శబ్దము ప్రయోగింపఁబడినది.

సమాధి నిద్రలలో కాలసత్త నశించినను ఇంతకాలము ఏ నేను సమాపాతుడను,



నిద్రితుడను అయియుంటినో ఆ నేనే ఇప్పుడు ఆ అవస్థను కాలమును స్మరించు చున్నాను అను ప్రతిబుద్ధుడు స్మరించుటయే సంభవింపకుండెడిది. మరియు జగద్భేదమువలె చిదభేదము కూడ నైసర్గికా నైసర్గికములని అంగీకరించిన వాగర్థములవలె వాని భేదాభేదములును అన్యోన్య సాపేక్షములని చెప్పు తాంత్రికులకు అది అలంకారమే. ఎందుకనగా భేదాభేదములు వాగర్థములు కాని అధిష్ఠాన చైతన్యమును స్పృశించవు గదా!

**అవతారిక:–** క్రమప్రకాశిక ననుసరించి – పై శ్లోకమున జడ భేదము చిదభేదము నైసర్గికములని చెప్పబడినది. ఈ శ్లోకమున వాగర్థసామరస్యమున నాథ నవక త్రిపుటియందు వ్యవహార లోపము జగదనిత్య ప్రసక్తి సకల దుఃఖహారిత్వ ఫలమును ప్రదర్శించుచు ఆ స్థితిలో స్వాభేద నియమముననుసరించి జగజ్జీవేశ్వరులనాదాభిన్న విసర్గత్రయ రూపతను గాని బిందుత్రయరూపతనుకాని సిద్ధాంతించుట చెప్పఁ బడుచున్నది.

**శ్లో॥ విశ్వమేతదితి యాऽహమిత్యసౌ**
**నామరూపవిరహేణ నిశ్చితా।**
**సా త్వమమ్బ! న బిభర్షి భాస్యతాం**
**భాత్మనో యదసి ధర్మ ఈశితుః॥ 56**

**ప్రతిపదార్థము:–** అమ్బ=అమ్మా, యా=ఏది, విశ్వమ్=విశ్వము, ఏతత్=ఇది, అసౌ= ఇది, ఇతి=అని, నిశ్చితా=నిశ్చయించబడినదో, సా త్వమ్=ఆ నీవు, నామరూప విరహేణ=నామరూపముల అభావమున, (అజడా=జడముకానిదిగా,) భాస్యతామ్= ప్రకాశ్యతను, బిభర్షి=ధరించెదవు, భాత్మనః=ప్రకాశ స్వరూపుడైన, ఈశితుః= ఈశ్వరునకు, ధర్మః=ధర్మము, అసి=అగుదువు.

**తాత్పర్యము:–** విశ్వము నామరూపయుతమని ఈశ్వరప్రకాశ్యమని నిశ్చయము గలదానవై దానిని భరించెదవు. కాని వాస్తవమునకు నామరూప విరహమున ఈశ్వరుని ధర్మమైన చిచ్ఛక్తివే.

**వివరణము:–** జాగ్రత్స్వప్న సుషుప్తులలో స్థూలసూక్ష్మకారణజగద్రూపణివైన నీవు తురీయావస్థలో నామరూపరహితవైన చిచ్ఛక్తి ధర్మముగానే ఉందువు. నీవు ధర్మస్వరూపిణివైన ధర్మియైన పరమేశ్వరునకు భిన్నవు కాజాలవు. అగ్ని ఎట్లు

వేడి, వెలుగు అనుధర్మములకు భిన్నముగా ఉండదో అట్లే ఈశ్వరుడును చిచ్ఛక్తి ధర్మ స్వరూపిణివైన నీ కన్న వేరుగా ఉండజాలడు. క్రింది అవస్థలలో జాగ్రత్స్వప్న సుషుప్తులలో జాడ్యముతో కలసి యున్న నీవు తురీయావస్థలో జాడ్యపరిపన్థినిగానే జాడ్య విరోధినివిగానే ఉన్నావు. జాడ్య పరిపన్థిత అనగా జాడ్యాభావమే, భాస్యత అనగా ప్రకాశ్యత. అదియే జాడ్యము. నీవు ప్రకాశ స్వరూపుడైన ఈశ్వరుని శక్తిగా ప్రకాశరూపురాలవే, భారూపవేగాని భాస్యరూపవు కావు. 2) దివ్యచకోరిక ననుసరించి – ఏతత్ అను శబ్దము చేతితో చూపబడిన వస్తువును సూచించును. వాగర్థనాదన వకాత్మకము అయి క్షిత్యాది కాల శివాన్తము భువన సమూహాత్మకము నైన విశ్వము ఏతత్ అని నిర్దేశింపఁబడినది. అణు నిర్మితమైన విశ్వము ఆణవ విసర్గమని చెప్పబడును. వర్ణపద మన్త్ర కలాతత్త్వ భువనములను షడధ్వయుక్తమైన విశ్వము శాక్త విసర్గమనఁబడును. అట్లే చిత్త విశ్రాంతి లక్షణము శాంభవ విసర్గము.

ఈ మూడు విసర్గములు విశ్వరూపములు అహమాత్మకములును. విశ్వమే నేను అని భావించువారు కొందరు. ఇది విశ్వమని తనకు భిన్నముగా భావించువారు కొందఱు. మొదటి తరగతి వారికి జగమంతయు అహమ్ పదార్థము. రెండవ తరగతి వారికి జగము తనకన్న భిన్నము. కొందఱికి జాగ్రదవస్థలో విశ్వమేతత్ ఈ విశ్వము అన్నట్లు విశ్వము గోచరమగును. స్వప్నావస్థలో విశ్వమునకు తనకు భేదము అస్పష్టముగానుండును. నిద్రలో విశ్వము మొత్తమును తనలో లీనమొనర్చు కొన్న చిత్తమే ఆత్మయందు ప్రలయమునందును అనగా ప్రలీనమగును.

శాంభవవిసర్గవిలాస స్వరూపుడను మంత్రవాగర్థ నాద స్వరూపుడను అని అహమ్ పదమున కర్థములు చెప్పబడినవి. అసౌ పదము అస్ఔ అని విభజించినచో చిత్త సంబోధ్య లక్షణ ప్రాణస్పన్ద శాక్త విసర్గవిలాసమైన పరామన్త్ర వాగర్థ లక్షణుడు జీవుడు, జీవునాశ్రయించిన శక్తి అను అర్థములభించును. నామరూప రహితము అనగా నామరూపముల విడచునది అని అర్థము. వాక్కు దానిశక్తి రూప పదార్థము. ఇట్లు అసౌ అను పదము జీవేశ్వరోభయ శక్తుల బోధించును.

సాధారణముగా సాంఖ్యుల ప్రకృతి శాక్తేయులశక్తి ఒకటే అని సామాన్య విద్వాంసులు భావిస్తారు. వారి దృష్టిలో ప్రకృతి త్రిగుణ, లోహిత శుక్ల కృశష్ణామ్ అను శ్రుతిలో లోహిత శుక్ల కృష్ణ వర్ణములు క్రమముగా రజస్సత్త్వతమస్సులకు ప్రతి నిధులుగా పేర్కొనఁబడినవి. కాని ఇట ఉన్మనీభావావస్థలో శక్తిగా త్రిగుణముల



లోని సత్త్వగుణాధిక్యము నాశ్రయించియుండును. నిద్రలో తమో గుణాధిక్యము నాశ్రయించి యుండును. అట్టి స్థితిలో ప్రకృతిలో ఈ పరిణమించిన పదార్థములలో నామ రూపములుండవు. శ్లోకమున నామరూపములులేని చిద్రూపత్వము శక్తికి (శ్లోకమున) చెప్పఁబడినది. ఆ దశలో ఆ శక్తి ప్రకృతిస్వరూపిణి అనుట అనుచితమని గమనింపవలసియుండును. నామరూపములు లేకపోవుటచే శక్తి అహమాత్మికగా లేక చిన్మాత్రగానుండునని నామరూప విరహముచేత నిశ్చయింపఁబడియుండును. నిశ్చితాః అను బహువచన పాఠమున వాక్కు కాని వాక్కులోని శబ్దశక్తిగాని, ఆణవ శాక్త శాంభవ విసర్గములు వాని సమష్టి విలాసరూపమును బిందుత్రయ చతుష్టయాత్మక వాగర్థత్రసరేణువులు మాతృకాస్వర ఖండానుసారము నిశ్చయింపఁ బడినవి అని చెప్పవలెను.

పరబిన్దువు కారణబిన్దువు కార్యబిన్దువు అని బిన్దువులు మూడు. వీని సమష్టి కామకల భాస్వతామ్ అనుపాఠము ననుసరించి ప్రకాశ స్వభావమును 'నబిభర్షి' నీవు భరించవు. భాస్వతామ్ అనుపాఠమును ప్రకాశ్యతను నీవు భరించవు అని అర్థములు లభించును. ఈశితుః అనుపదమునకు కాలరూప శివుడను అర్థము చెప్పబడినది. కామకాలావిలాసమున ఈశుడు ప్రకాశమాత్ర తనుః అని చెప్పబడి నట్లు ఈ శ్లోకమున ఆతడు భాత్మ అని చెప్పబడినది. ప్రకాశరూపుని ధర్మము ప్రకాశ్యతను ధరించుట అనుచితము కదా! భాస్వతాం నబిభర్షి అనుపాఠము ననుసరించి శివునివలె ప్రకాశ ధర్మిత్వమును నీకు లేదని అర్థము లభించును. ఇట్లు మరొక విధముగా కూడ ఈ శ్లోకము వ్యాఖ్యానించబడినది. విశ్వమేతదితియా అనుపదములు ప్రత్యక్షముగా (హస్త) నిర్దేశ్య విశ్వమిదియను బుద్ధి అని అర్థమును 'యోహమిత్యసౌ' అనుపదములు నేనను ఇది ఏదో అది అను అభిమానమును బోధించును. దర్శపూర్ణమాసప్రకరణమున **'దేవాః పితరో పితరోదేవా యోహమస్మి ససన్ యజే, యస్యాస్మి నాయంతరేమి స్వమ్మ ఇష్టగ్ం స్వం దత్తం స్వ పూర్తాగ్ సగ్ం శ్రాన్త సగ్ం హుతం తస్యమేగ్ని రుపద్రష్టా వాయురుపశ్రోతా ఆదిత్యో నను఼ఖ్యాతా ద్యౌః పితా, పృథివీ మాతా ప్రజాపతిర్బన్ధుర్య ఏవాస్మి ససన్ యజే' –** దేవతలే పితరులు పితరులే దేవతలు. నేనెవడనోవాడనే అయి యజించెదను. ఎవనివాడనో వానిలోనికి పోను. నా ఇష్ట దత్త పూర్త శ్రాన్త హుతములకు అగ్ని ఉపద్రష్ట, వాయువు ఉపశ్రోత, ఆదిత్యుడు అనుఖ్యాత, ఆకాశము తండ్రి, పృథివి

తల్లి, ప్రజాపతి బంధువు ఎవడనో వాడనే అయి యజించెదను అను శ్రుతి ననుసరించి నామరూప వృత్త్యభిమానము యొక్క మిథ్యాత్త్వము అవగతమగుచున్నది.

**'యోహమస్మి బ్రహ్మాహమస్మి అహమస్మి బ్రహ్మాహమస్మి అహమేవాహమ్మాం జుహోమి'** – నేనెవడనైయున్నానో ఆ బ్రహ్మమునే నేను. నేనెవడనైయున్నానో ఆ బ్రహ్మను నేనే. నేను నేనే నన్ను హుతము చేయుచున్నాను అను శ్రుతి హోతృర్నామ రూప భేదమును నిరాకరించుచున్నది. పై శ్రుతుల వలన నామరూప నిరహము చిత్తునకు నిశ్చయింపఁబడినది. నిశ్చితాః అను బహువచన పాఠమున ఈ విశ్వము, నేను, నాది అను అభిమానములు మిథ్యలని నిశ్చితములు అను అర్థము లభించును. అమ్మవారు బుద్ధ్యభిమానోభయరూపిణియైనచో భాస్వతామ్ (పాఠాంతరము) ప్రకాశ స్వభావముల భరించదు. అట్లే భ్రాన్త్యభ్రాన్త్యుభయాత్మకత్వము సాధకులలో వారివారి అధికారము ననుసరించి ఆమెకు ఏర్పడును. ఈ రెండు పద్ధతులలోను ఆమెకు సాక్షి (భాస్వతామ్) భాస్వత్వమున్నను బాహ్యఘటవాటాదుల వంటి భాస్యత్వము మాత్రము చిద్రూపిణి అనుటవలన ఏర్పడదు. 'భాస్వతామ్' అను పాఠమున ప్రకాశ స్వభావధర్మిత్వమును భరించవు అను అర్థము లభించును. చిన్మయి ప్రకృతియైన అమ్మవారు ప్రకాశ విమర్శరూపిణి (ఇచటి ప్రకృతి సాంఖ్యుల ప్రకృతికాదు)

భాత్మనః ఈశితుః అనుపదములు ప్రకాశైక స్వరూపుడు అంతర్బహిర్నియామకుడైన ఈశ్వరుని బోధించును. ధర్మః అసి అనుపదములు, యత్=ఎందు వలననగా నీవు ధర్మమవుగాదా అను అర్థమును బోధించును. శక్తి ఈశ్వరునకు ధర్మమనగా విమర్శ రూపిణియైన శక్తి ఈశిత లీనమైనప్పుడు విమర్శము, విమర్శము లీనమైనచో ప్రకాశము, ప్రకాశించును. ఇంకను స్పష్టముగా చెప్పవలెనన్న అంతర్విమర్శమున్నప్పుడు బహిః ప్రకాశము బహిర్విమర్శమున్నప్పుడు అంతః ప్రకాశమును విరాజిల్లును. పరసంవిద్రూపిణియైన శక్తికి సచ్చిదానంద శివునకు (ఆత్మకు) ధర్మధర్మిభావమున్నను భేదములేదు. ధర్మికి ధర్మములేనిచో ధర్మిత్వము సిద్ధించదు. శివునకు ధర్మిత్వములేనిచో శక్తి ధర్మమగుటయు సంభవించదు. ఆ శక్తికి మాయ (అవిద్య) విద్య, ధర్మ, నామరూపాదిక, ద్వయ ఇత్యాదులు పర్యాయములు. విశ్వమహమ్ (నేను విశ్వమును), అహమసౌ నేను ఇది (ఈ సంపదను) అను వ్యవహారముండునేకాని అనుభవముండదు. ఆ వస్తువును కొందఱు తుచ్ఛమని కొందఱు అనిర్వచనీయమని కొందఱు వాస్తవమని చెప్పుదురు. తుచ్ఛమని



శ్రౌతు(జ్ఞాను)లు అనిర్వాచ్యమని తార్కికులు,వాస్తవమని లౌకికులు వ్యవహరించెదరు. ఎవరెట్లు చెప్పినను వారు శక్తినే వ్యవహరించుచున్నారనుట మఱువరానిది.

విశిష్టాద్వైత భాగవతాది యుక్తి ప్రధాన వాదములు కూడ శ్రౌతాద్వైతత్వ ప్రాప్తి సాధన భక్తి పర్యవసాయులే అని తాత్త్వికులు అభిప్రాయపడెదరు. **ప్రసరంతి చోద్యాని జగద్వస్తుత్వ వాదిషు నచోదనీయం మాయయాం తస్యాశ్చాద్వైతరూపతః** (జగద్వస్తుత్వవాదులలో చోద్యములు ప్రసరించును. బ్రహ్మకు అనన్యమగుటచే మాయ చోదనీయము కాదు.)

**అవతారిక:–** పై శ్లోకమున శాక్తాద్వైత సిద్ధాంతము ననుసరించి ఈశధర్మముగా ఉన్మనీభావావస్థలో చిన్మయరూపిణిగా ఉన్న శక్తి ప్రతిపాదింపఁబడినది. విశిష్టాద్వైత సిద్ధాంతములలో వలె జగద్గత జడ జడభేదము జగజ్జీవ భేదమునంగీకరించక పోయినచో జగన్నాశమున సర్వనాశ ప్రసంగమో, శూన్యవాద ప్రసంగా ప్రసంగమో మాధ్యమిక క్షణిక విజ్ఞానవాద ప్రసంగమో దాపురించును గదా! అదిగాక బుభుత్సుబుద్ధుల అధికార భేదము ననుసరించి స్వాత్మాభిన్నోన్మన్యవస్థలో నాదనవక వాగర్థ షడధ్వాత ద్వాదశాంత మహాబిందువున నాదస్వరూపమునందే తటస్థేశ్వర కారణకత్వాజాత సృష్టవాదము సిద్ధాన్తీకరింపఁబడినందున మాధ్యమిక వాద ప్రవేశముగాని తదనుకరణముగాని ఈ ఆగమోపనిషన్మతమున సంభవించదని ఈ శ్లోకమున చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ భావదృక్స్మృతివియుక్తమీశ్వరే**
**శూన్యరత్నమవలమ్బ్య పుద్గలమ్।**
**నిర్ణిరుక్తికమిదం జగత్ స్థితం**
**చిల్లయోర్ధ్వగపథాన్న తత్తథా॥** 57

**ప్రతిపదార్థము:–** భావదృక్=భావములను చూచు, స్మృతివియుక్తమ్=(స్వస్వరూప) స్మృతిలేని, పుద్గలమ్=అణుప్రాయుడైన, శూన్యరత్నమ్=శూన్యరత్నమైనవానిని (జీవుని), అవలమ్బ్య=ఆశ్రయించి, ఇదమ్=ఇది, నిర్నిరుక్తకమ్=అనిర్వచనీయమైన, జగత్=జగము, ఈశ్వరే=ఈశ్వరునందు, స్థితమ్=ఉన్న, చిల్లయోర్ధ్వగపథాత్=చిత్తు నందులయించుట వలన, ఊర్ధ్వమునకు పోవు మార్గము వలన, పుద్గలమ్=సూక్ష్మ మైన, తమ్=వానిని, ప్రాప్య=పొంది, తత్=అది, తథా=అట్లే, నరః=జీవుడు, న=కాదా.

**తాత్పర్యము:–** జీవునాశ్రయించిన ఈ జగము ఈశ్వరునియందున్నది. కాని ఆతని వలె సత్తనికాని, శూన్యమువలె అసత్తనికాని నిర్వచింపరానిది. జీవుడు అట్టివాడు కాకున్నను అట్టిదేయైన శరీరము ఆ జీవునవలంబించియుండును.

**వివరణము:–** చిద్గగనచంద్రిక ననుసరించి భావుడనగా అకారాది వర్ణసమామ్నాయ మును సృజించు శివుడు. ఆతనికి సంబంధించినది భావము. సృష్ట్యాది కృత్యపంచకము వాగర్థములు, షఢ్వములు. వీనితో కూడిన శివ సంసారము. అది నాదమునందు కనబడును. కావున దానిని చూచువాడు భావదృక్ అనఁ బడును. విశ్వమయాత్మ స్మృతి శబ్దార్థము. అదిలేనిది శ్రుతివివిక్తము. శూన్యరత్నమనగా ఊర్ధ్వాధోమధ్య శూన్యములు. మూడు. వీని నెఱుగువాడు (గురువు) శూన్యరత్నముగా తంత్రములలో చెప్పఁబడినది. సామాన్యజీవుడు మాన్యప్రాయుడు శూన్యరత్నమనియు క్వచిత్కముగా వ్యవహరింపఁబడును.

మరొకవిధముగా శూన్య రత్నమనగా జపకాలమున అనుసంధేయమైనది. శూన్యషట్కము. ఇది అధ్వషట్కము. విషువత్సప్తకమువలె జపాంగముగ అనుసంధేయము. శ్రీవిద్యా పంచదశియందు మూడు హ్రీంకారములున్నవి. వానిలో మూడవ హ్రీంకారము యొక్క 1) రేఫాకారమున, 2) బిందువున, 3) రోధినియందు, 4) నాదాంతమున, 5) వ్యాపికయందు నెమలి పింఛములోని చంద్రికాకారము గలవిగా శూన్యషట్కములు (ఉన్మనియందలి మహాశూన్యము కలిపి) అని వరివస్యా రహస్యమున చెప్పఁబడినది. ఈ ఆఱు శూన్యములు రత్నముల వంటివి. ఉన్మనీ నాదమున ఉన్నవి కావున ఉన్మనీనాదము శూన్యరత్నమని చెప్పఁబడినది. బౌద్ధ వాఙ్మయ ప్రసిద్ధ పుద్గల శబ్దమీశ్లోకమున ప్రయోగింపఁబడినది. అణువు బౌద్ధవాఙ్మయ ప్రయోగముల ననుసరించి పుద్గలమనగా అణువు పుంభావమును జార్చునది అని వ్యుత్పత్తి. సూక్ష్మమైన ఇట్టి నాదనవకము నవలంబించి సాక్షిభాస్యమగుటచే కనఁ బడు వాగర్థాత్మకమైన జగము నిర్నిరుక్తికమ్ అనగా అనిర్వచనీయము (నిరుక్తిలేనిది) శబ్దార్థతత్త్వమును నిర్వచించుటకు వీలుకానిది. స్వప్నము సాక్షిభాస్యమని వేదాంతులు చెప్పెదరు.

క్రమప్రకాశిక ననుసరించి భావదృక్పదము జీవుని భోక్తృత్వమును సూచించును. స్మృతి వియక్తమ్ అనుపదము జీవునికి స్వస్వరూప జ్ఞానము లేకపోవుటను చెప్పును. పుద్గలమనగా నింపఁబడి జారవిడచుకొనునది అని



వ్యుత్పత్తినాశ్రయించి శరీరము అను అర్థములు బోధ్యములు. ప్రత్యభిజ్ఞాహృదయ ప్రమాణము ఆ అర్థసూత్రముననుసరించి శూన్యశబ్దము మాయామయ ప్రమాత యైన జీవుని బోధించును. అయినను ఆ జీవుడు జడాజగత్తున శ్రేష్ఠుడు కావున రత్నముగా చెప్పఁబడినాడు. జీవుడు భోక్తగా శరీరము నాశ్రయించక తప్పదు. శరీరము భోగాయతనముగాదా! ఈశ్వరుని (యందు) శరీరము వంటి విశ్వము అనిర్వచనీయముగానే యుండును. చిత్తునందు జగము లయించును. కావున కారణముగా నుండును. కావున జగమువలె అనిర్వాచ్యము కాదు.

**అవతారిక:–** పై శ్లోకమున ఈశ్వరుని యందు జగము జీవునందు శరీరము అనిర్వచనీయముగా నున్నను చిత్తుమాత్రమట్టిది కాదని చెప్పఁబడినది. ఈశ్లోకమున భారూపేశ్వర చైతన్యమున జగము నిమజ్జితమైయున్నదని చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ శాన్తతాం భజదనాశ్రితం పదం**
**శక్తిమాత్రజగదేకసద్మ యత్।**
**నిర్మలజ్వలనశౌచవజ్జగ**
**త్తత్ర హి త్విషి నిమజ్జితం త్వయా॥** **58**

**ప్రతిపదార్థము:–**తత్=ఆ,జగత్=జగము, త్వయా=నీచేత, నిమజ్జితమ్=ముంచివేయఁ బడినది, తత్=అందువలన, నిర్మల జ్వలనశౌచవత్=స్వచ్ఛమైన అగ్నివంటి పవిత్రత గలదైనది, శక్తి మాత్రజగదేకసద్మ=శక్తి మయ జగత్తే ముఖ్యనివాసమైన, యత్=ఏదియో, తత్=అది, శాన్తతామ్=శాన్తతను, భజత్=పొందుచున్నదై, అనాశ్రితమ్=ఆశ్రితముకాని, పదమ్=పదము.

**తాత్పర్యము:–**ఈశ్వరపదము సర్వాశ్రయమగుటచే దానికి మరొక ఆశ్రయముండదు. జగము ఆయన చిచ్ఛక్తి రూపమే కావున దాని కాయన ఆశ్రయము కాక తప్పదు. మొత్తము జగము నశించిన పిదప ఆతని చిచ్ఛక్తి రూపిణియైన అమ్మవారిచేత ఉన్మనీనాదానుసంధాన తత్పరుడైన యోగి, నిర్మలాగ్నివలె స్వచ్ఛముగానే భాసించును.

**వివరణము:–** చిద్గగనచంద్రిక ననుసరించి – అనాశ్రితమ్ అను శబ్దమును అన+ ఆశ్రితమ్ అని విభజించి అన అనగా (**అనప్రాణనే (చలనౌ)** అను ధాతువు ననుసరించి) ప్రాణస్పందము దాని నాశ్రయించినది అనాశ్రితమ్ అని చెప్పబడును. ఏకాశీతి (81) పదములలో మొదటిది శివతత్త్వము జగత్తునకు ఆ తత్త్వము ఇల్లు,

శక్తియే జగత్తు అని శక్తి మాత్ర జగత్ అను సమాసము బోధించును. మాత్ర శబ్దమునకు శబ్దాది మాత్రలు (అయిదు పంచకము) అని మరొక అర్థము. ఒకటి రెండు మూడు నాలుగు మాత్రలు గల రజ్ఞ ప్లుతాది ఛందములు అను నాదావయవ కాలములు అను మరొక అర్థమును చెప్పఁబడినవి. శక్తి మాత్ర పదము మాత్రల శక్తులను అర్థమును కూడ బోధించును. జగము శబ్దాది మాత్ర పంచకమయము. రంగప్లుతాది కాలావయవ కాలమయము అని శక్తి మాత్ర జగత్ అను సమాసము నకు మరొక అర్థము చెప్పబడినది. అట్టి జగత్తు ముఖ్య నివాసముగా గలది శివతత్త్వమని మొత్తము రెండవపాదము బోధించును. అట్టి శివతత్త్వము అను కాంతి యందు అమ్మవారిచేత నిమజ్జితమైయున్నట్లు ఉన్మనీ నాదానుసంధాన యోగికి కనఁబడును. నిర్మల జ్వలన శౌచవత్ అను సమాసము అట్టి యోగికి మలమునపహరించు సంకర్షణ అను పేరుగల అగ్నిచేత శుద్ధమైనదా అన్నట్లు కనఁబడును అను ఉత్ప్రేక్షను బోధించును. ఒక కంసాలి మలమును తొలగించుటకు బంగారము నగ్నియందు కాల్చుచున్నప్పుడెట్లు బంగారము శుద్ధముగా కనిపించునో అట్లే ప్రలయాగ్ని దగ్ధమగుచున్న జగము శుద్ధముగా ఉన్మనీ నాదయోగికి కనిపించును.కాల్చబడినబంగారముతోటి ఔపమ్యము ఆ ఉత్ప్రేక్షచేత వ్యంగ్యమగును. జ్ఞానాగ్నిచేత ఆణవాది మలములు తొలగిన జగము ఆ యోగికి శుద్ధముగా కనిపించును అని భావము. చిదగ్నికి ఆశౌచము స్వతస్సిద్ధము. కావున నిర్మల జ్వలనశౌచవత్ అను సమాసము వత్ ప్రత్యయాంతముగా భావించి నిర్మలాగ్ని స్వచ్ఛత కలది అను మరొక అర్థము కూడ చెప్పఁబడినది. అమ్మవారి చిదగ్ని శక్తియందుంచబడిన లోకము అట్టి స్వచ్ఛతను పొందును. హి అను అవ్యయము హేత్వర్థక నిపాతము. అమ్మవారు జగమును శివచిదగ్ని జ్వలనమునముంచివేయుట హేతువుగా అట్టి శుద్ధత ఆ సమయమున జగమున కేర్పడినదని భావము. అట్లు చేసిన చిచ్ఛక్తియైన అమ్మవారు శాన్తభావమునొంది శాంతశివునందేకరూపయై యుండును అని శాంతతాం భజత్ అను పదములు బోధించును. అమ్మవారు శివరూపమునొందియుండును. కావున జగన్నాశమున మాధ్యమికాది మతాంతర మందలి సర్వనాశ స్థితి ఇది కాదని, ఇది శాక్తాద్వైత స్థితి అని సిద్ధాంత మీ శ్లోకమున ప్రతిపాదింపఁబడినది. ఇందు మాధ్యమిక శూన్యవాద మందలి దోషములేవియు వర్తించవు.



**అవతారిక:–** పై శ్లోకమున ఉన్మనీ నాదానుసంధాన సమయమున జగము చిన్మయముగా యోగి దర్శించుట చెప్పబడినది. ఈ శ్లోకమున అట్టి యోగసిద్ధుల అభిముఖమునందిన అర్థములన్నియు చిత్ ప్రకాశమయములైయుండుటచే వారు కామరహిత పూర్ణకామస్థితినందుట చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ సిద్ధశక్తిమయభాతృభాసన**
**వ్యాప్తిభావ ఉపయుక్ప్రకాశతామ్।**
**యోఽయమర్థనికర స్త్వదన్తికే (మంబికే)**
**త్వత్ప్రమాత్రభిముఖం తనోష్యసౌ॥ 59**

**ప్రతిపదార్థము:–** సిద్ధశక్తిమయ భాతృ భాసన వ్యాప్తి భావే=సిద్ధశక్తిమయులైన ప్రమాతల (ప్రకాశకుల) ప్రకాశము యొక్క వ్యాప్తి భావమునందు, ఉపయుక్= ఉపయోగించుచు, ప్రకాశతామ్ యత్=ఏది ప్రకాశతను (పొందునో), యః=ఏ, అయమ్=ఈ, అర్థనికరః=అర్థ సమూహము, త్వదన్తికే=నీ సమీపమున, త్వత్=నీ వలన, ప్రమాత్రభిముఖమ్=ప్రమాతల తదభిముఖముగా, అసౌ=ఇది, తనోషి= విస్తరింపఁజేసెదవు.

**తాత్పర్యము:–** సిద్ధశక్తులైన వారి ప్రకాశము ఎంత మేర వ్యాప్తినందునో అంతవఱకు ఉన్న అర్థ సమూహమంతయు వారికభిముఖమగునట్లు దాని ప్రకాశ స్వభావమును విస్తరింపఁజేసెదవు.

**వివరణము:–** దివ్యచకోరిక ననుసరించి అమ్బికే అనుపాఠమునకు బదులు త్వదంతికే అనుపాఠము నాశ్రయించి శబ్దస్పర్శాది గుణవిషయరూప పదార్థ సమూహమును లేక ఘటపటాది ద్రవ్యరూప పదార్థ సమూహము లేక ధర్మాది చతుః పురుషార్థ సమూహము అర్థనికరము.సిద్ధులు శక్తిమయులు. వారి జ్ఞానక్రియాశక్తి సామరస్యము విప్రకృష్టదేశమునందలి విప్రకృష్టకాలమునందలి పదార్థమందు గూడ తమ ప్రకాశమును వ్యాపింపఁజేయగలరు. ఈ వ్యాప్తి క్రియాశక్తి సిద్ధిరూపము. అట్లుగాక ఆ వస్తువులు వారికి స్వయముగా ప్రకాశితములగునో అదివారి జ్ఞానశక్తి సిద్ధికి ఉపయోగించును. సిద్ధశక్తిమయ భాతృ భాసనా వ్యాప్తి భావః అని విభజించి ఒక అర్థము చెప్పబడినది. సిద్ధశక్తిమయ భాతృభాసన వ్యాప్తి భావే అని సప్తమ్యంతముగా విభజించి ప్రకాశతామ్ ఉపయుక్ అని అన్వయించియు పై అర్థము చెప్పికొన వచ్చును. ప్రకాశతామ్ అను పాఠాంతరమును

స్వీకరించి ప్రకాశత అనగా స్వయం ప్రకాశత. దానిని గూర్చి శక్తిమయులైన సిద్ధులైన ప్రమాతల భాసనా వ్యాప్తిచేత భాతము అనగా ప్రకాశింపఁజేయబడినది ఏదో (ఎందువలననో) అది స్వయం ప్రకాశతను గూర్చి ఉపయోగించినది అనుచు అందువలన చిత్త ప్రబోధ ప్రధానమైన శక్తి సర్గ విలాస శాబ్దనికరాత్మక ప్రత్యక్ష పరామంత్ర వాగ్రూపిణి, చిత్తప్రలయ ప్రధాన శాంభవ విసర్గ విలాస పరోక్ష పరామంత్రార్థ ఘటపటాది పదాభి ధేయార్థ రూపిణి, పరోక్షాపరోక్ష చతుర్విత పురుషార్థ రూపిణి అని అసౌ పదమునకు మూడర్థములు చెప్పఁబడినవి. భిన్నముగా భాసించు వాగర్థనికరమును అభిన్నముగా విస్తరింపఁజేసెదవు అని భావము చెప్పఁబడినది. క్రమప్రకాశిక ప్రకాశతామ్ అను పదమును ప్రకాశించుగాక అను అర్థమున లోట్ క్రియగా గూడా భావించినది. యోగులు కాని వారికి విషయములన జీవుల అదృష్ట సాహాయ్యమున శక్తియే అనగా ప్రకృతే భాస్యములు (భోగములు)గా చేయుననుట సాంఖ్యశాస్త్ర వ్యవహార సిద్ధమైన అంశమే. సిద్ధులకు అట్టి అదృష్టము అధికమై ఉండుటచే భోగాధిక్యము చెప్పినది. ఈ మాత్రముచేతనే వారిని సిద్ధులని వ్యవహరించుటలో విశేషములేదు.

**అవతారిక:–** పై శ్లోకమున సాంఖ్య ప్రకృతి అదృష్ట కారణకములైన భోగములను ప్రమాత్రభిముఖములచేయుట ఆత్మానుసంధానపరసిద్ధులకు ఇచ్ఛామాత్రమున చిచ్ఛక్తి భోగముల సమకూర్చుటయు మతభేదమున చెప్పఁబడినది. ఈ శ్లోకమున పురుషాభిధేయుడైన శివుడు వానిని భోగించుట చెప్పఁబడుచున్నది. ధామ ప్రకాశచక్ర స్వరూపము చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ ద్రష్టృతా జగతి యత్ప్రకాశనే**
**యశ్చ నిశ్చయవిధౌ ప్రమాతృతా।**
**గ్రాహకత్వమపి నిశ్చితగ్రహే**
**వేత్త్యతః స తవ వృత్తిపోషితః॥ 60**

**ప్రతిపదార్థము:–** యత్ ప్రకాశనే=ఎవరి ప్రకాశమున, జగతి=జగద్విషయకమైన, ద్రష్టృతా=ద్రష్టృత (దృశ్యతా=దృశ్యత్వము), యత్(యః)చ=ఏది, నిశ్చయవిధౌ=నిశ్చయ విధానమున, ప్రమాతృతా=ప్రమాతృత, నిశ్చితగ్రహే=నిశ్చయజ్ఞాన విషయకమైన, గ్రాహకత్వమ్అపి=గ్రాహకత్వము గూడ, వేత్తి=తెలిసికొనునో, అతః=అందువలన, సః=అది, తవ=నీ యొక్క, వృత్తిపోషితః=వృత్తులచే పోషించబడినది.



**తాత్పర్యము:–** ప్రకాశకము శివ స్వరూపము. దానిచేత జగములోని చేతనులకు ద్రష్టృత, జడములకు దృశ్యత కలుగును. విషయములను యథాతథముగా నిశ్చయించు విధానమున ప్రమాతృత(యథార్థ జ్ఞాతృత)యేర్పడును. నిశ్చయజ్ఞానము కలిగిన పిదప అతనికి గ్రాహకత్వము ఏర్పడును. సాక్షిరూపమున ఆగ్రాహకత్వమును కూడ ఆతడెఱుగును. నీ వృత్తులచే ప్రమాతృత లేక ప్రమాతృకత్వము పోషింపఁబడినది అగును.

**వివరణము:–** యత్ప్రకాశనే అనుపాఠము దోషమని యాప్రకాశనే అనునది సాధు పాఠము కావచ్చును. యశ్చ అనుపాఠమునకు బదులు (యత్‌చ) యచ్చ అను పాఠము నంగీకరించినది. దివ్యచకోరిక దాని ననుసరించి జగత్ అను శబ్దము గమ్ ధాతు నిష్పన్నము (గచ్ఛతీతిజగత్) గా చెప్పినది. దానివలన జగత్ అనగా గతి (జ్ఞానము) కలది. అనగా జీవునందు అను అర్థము సిద్ధించును. జీవుడనగా ప్రాణముకలవాడు. ప్రాణమునకు గతి సహజము. అట్లు చూచినను జగత్ శబ్దము గతిమత్పదార్థమునే అనగా జీవునే బోధించును అనుట ఉపపన్నమే. ప్రకాశన శబ్దము ఇంద్రియ సహకారమున విషయముల ప్రకాశింపఁజేయుట అను అర్థమును బోధించును. 'యశ్చ' అనుపాఠమునకు యత్‌చ అను పాఠము నంగీకరించియు సామాన్యేనపుంసకమ్ అను వ్యాకరణ నియమము ననుసరించి విశేషణ విశేష్యముల లింగభేదము దోషముకాదని సమర్థింపఁబడినది. దృశ్యతా అనుపాఠము నంగీకరించి ఆ పదమునకు అంతర్బహిరింద్రియ దృగ్విషయత అను అర్థము చెప్పఁబడినది.

నిశ్చయవిధౌ అను సమాసమునకు బుద్ధి నిశ్చయాత్మకము కావున నిశ్చయాత్మక బుద్ధి వ్యాపారమున అను అర్థము చెప్పఁబడినది. విషయమున్నదను నిశ్చయాత్మక బుద్ధి వ్యాపారములేక నిశ్చిత బుద్ధి విషయక వ్యాపార రూపకర్మేంద్రియ ప్రవృత్తియందును అను రెండు అర్థములు చెప్పఁబడినవి. ప్రకాశనే అను పదము అంతర్బహిరింద్రియములు తమ విషయముల గ్రహించు వ్యాపారమున అను అర్థమును బోధించును. ప్రమాతృతా అను శబ్దమునకు నిశ్చయజ్ఞానమునుపొందుట అను ఆభ్యంతర వ్యాపారము కలిగియుండుట అను అర్థము చెప్పఁబడినది. ప్రమాతృకా అనుపాఠమున ప్రకృష్టవర్ణమాల అని ఆ పదమునకర్థము లేక బుద్ధివృత్తిఅని మరొక అర్థము చెప్పఁబడినవి. నిశ్చితగ్రహే అనగా నిశ్చిత విషయ సంబంధిజ్ఞానేంద్రియ వ్యాపారముల విషయము స్వీకరించు కర్మేంద్రియ

వ్యాపారమునందును అని అర్థము చెప్పఁబడినది. గ్రాహకత్వము కూడ బుద్ధి కర్మేంద్రియోభయ వ్యాపారములైన విషయజ్ఞానాదానముల బోధించును. గ్రాహకురాలు కూడ అమ్మవారే అను అర్థము చెప్పఁబడినది. గ్రాహకుడైన శివునకు నీవభిన్నవను భావమును పై అర్థములు బోధించును. ప్రకృష్ట వర్ణమాలా రూపిణివైన నీవే శివునుద్దేశించిగాని, జీవునుద్దేశించిగాని చెప్పుదువు. శాక్త విసర్గ వర్ణమాలా రూపిణివైన నీవు ఆణవశాంభవ విసర్గముల మధ్య ఆ శివుని గూర్చి చెప్పెదవు. అందువలననే నీ వృత్తులచేతనే శివుడు పోషింపఁబడుచున్నాడు. పరావాగ్దేవతవైన నీ వలన చెప్పుట వినుట అను బహిరంతర్వ్యాపారములచేత కలిగిన పోషణము గలవాడతడు. పూర్వశ్లోకమునందు చెప్పఁబడిన ప్రమాతయే శివుడు. వేదవిద్యచేత లభించు **విద్ (జ్ఞానలాభయోః)** అను ధాతువు వలన నిష్పన్నమైన వేదశబ్దము విషయజ్ఞాన, విషయప్రాప్తి అను రెండర్థములు వేద శబ్దమున నేర్పడియున్నవి.

గజ వృషభ చిత్రపట (వస్త్ర) చిద్వాకత్వమున గజవృషభభేద పరిగణన న్యాయమున కర్మేంద్రియ వ్యాపారమున పొందువాడు జ్ఞానేంద్రియ వ్యాపారమున తెలిసికొనువాడు ప్రమాత అగుచున్నాడు. సంహరించు కాలమునను సాత్త్వికుడైన జీవుడు సర్వమును గ్రహించుచునే ఉండును. స్వారాజ్యమను మరొక పేరుగల ఉన్మనీనాదానుభవముగల యోగి అనుభవమున తాను రాజై ఇంద్రియములు రాజపుత్రులైన చిన్మయానుభవ మీ శ్లోకమందలి ప్రకాశనముగా గమనింపఁదగినది. నాదనవకమయాత్మ త్రిపుటీ షడ్వర్గషుంగాత్మక అష్టాదశ స్వరసంఖ్యచేత, పంచత్రిక (15) + సమష్టి (16) షోడశసంఖ్యచే ఏక ద్వి త్రి చతుర్వర్గాద్యాత్మక యథా సంభవ పరామర్శచేత స్వతోరాజన రంజనాత్మక ప్రకాశరశ్మిచక్రమయత్వముచేత స్వరాజ్య ప్రణేత అగుచున్నాడు. ఆత్మజగము జీవజడాత్మకము. కావున ద్రష్టత దృశ్యత రెండును జగమున ఉండును. అను ఉద్దేశ్యముతో ద్రష్టృతాపాఠమునకు దృశ్యతా అను పాఠాంతరమును సమర్థింపఁబడినది. గ్రహమనగా జ్ఞానము. నిశ్చితగ్రహమనగా సత్తుగానిశ్చితమైన వస్తువు యొక్క గ్రహము. అట్టి వృత్తిజ్ఞానము తనదిగా భావించువాడు ప్రమాత లేక నేను ప్రమాతనను ఆంతరంగిక బుద్ధి వ్యాపారము ప్రమాత వ్యాపారముగా భావించి ఆ ఆంతరంగిక వ్యాపారము ప్రమాతృత అని చెప్పబడినది. అందుచేత కర్మేంద్రియ వ్యాపారమైన ఉపాదానము (గ్రహణము) కూడ జీవగతముగా భావించి జీవునందు గ్రహకత్వము కూడ



ఏర్పడుచున్నది. నిశ్చిత గ్రహము జ్ఞానేంద్రియ వ్యాపారమైన గ్రహణము, కర్మేంద్రియ వ్యాపారరూపమైన గ్రహణము రెండును నిశ్చిత గ్రహే అను సమాసములోని గ్రహశబ్దార్థములు. ప్రకృష్ట వర్ణమాతృకా రూపిణియైన అమ్మవారు జీవునుద్దేశించి గాని, శివునుద్దేశించిగాని, చెప్పునను అర్థము చెప్పబడినది. చెప్పుట వర్ణమాలచేతనే సాధ్యము కావున ప్రమాతృకా అనగా చెప్పునది అను అర్థము సిద్ధించును.

**అవతారిక:–** పై శ్లోకమున అమ్మవారి ద్రష్టృత దృశ్యత అను రెండు రూపములు చెప్పఁబడినవి. ఈ శ్లోకమున మనోబుద్ధ్యహంకారములతో కూడిన పది (జ్ఞానకర్మ) ఇంద్రియములు మొత్తము పదమూడు ఇంద్రియములందుండు **అహంత** గ్రహణా గ్రహణముల నియంత్రియైన అమ్మవారి అంశమే అని వివరింపఁబడుచున్నది.

**శ్లో॥ ఆస్థిత స్సదసదర్థమణ్డలం**
**ధీమనోక్షవపురస్మితామయః (యమ్)।**
**య స్త్రయోదశవిధః స్వతన్త్రతా**
**తద్ద్వయోప్యహమసౌ తవాంశకః॥** 61

**ప్రతిపదార్థము:–** సదసదర్థమండలమ్=సత్తులైన అసత్తులైన అర్థములయొక్క సమూహమును, ఆస్థితః=ఆశ్రయించిన, ధీమనోక్షవపుః=బుద్ధి, మనస్సు, ఇంద్రియములు శరీరముగా గల, అస్మితామయః=అహంకారమయమైన, యః= ఏ, త్రయోదశవిధః=పదమూడు విధములైన, స్వతంత్రతా=స్వాతంత్ర్యము, తద్ద్వయోః =ఆ రెండు గ్రహణాగ్రహణములు, అహమ్=నేను, అసౌ=వీడు(శివుడు), తవ= నీయొక్క, అంశకః=అంశమువంటిది.

**తాత్పర్యము:–** బుద్ధి మనస్సు (అంతరింద్రియములు) అక్ష (జ్ఞానకర్మేంద్రియ)ములు విషయములున్నప్పుడు వానిని గ్రహించుటకు లేనప్పుడు గ్రహించకుండుటకు స్వతంత్రవైన నీయొక్క అంశములు. ఆ సదసదార్థముల యొక్క సమూహమును దానిని గ్రహించు పదమూడు ఇంద్రియముల సమూహము ద్వారమున జీవుడు గ్రహించును కాని ఆతడు చేయు ఆపని అమ్మవారివలననే జరుగును కావున జీవునకు స్వతంత్రత లేదు.

**వివరణము:–** 1) సంకల్ప వికల్పరూప మనస్సు, నిశ్చయాత్మకబుద్ధి ఇవి రెండు అంతరింద్రియములు. అద్వైతమతమున వీనికి చిత్తాహంకారములు కలిపి అంతః

కరణ చతుష్టయమని పేర్కొనఁబడినది. **యోగశ్చిత్తవృత్తి నిరోధః** అని యోగ సూత్రమున చెప్పఁబడిన అంతఃకరణ చతుష్టయములోనిదిగా సాంఖ్య సిద్ధాంతమును సర్వథా అంగీకరించు యోగదర్శనమున చిత్తము పేర్కొనఁబడినను చతుర్వింశతి తత్త్వములలో అది చేర్చబడకుండుట ఒక విచిత్రము. అది అట్లుండనీ. సాంఖ్యయోగ దర్శనముల పరిణామవాదమును భంగ్యంతరముగా అంగీకరించు శాక్తాద్వైతమున మనోవృత్తులు బుద్ధివృత్తులు విడిగా పేర్కొనఁబడినను చిత్తవృత్తులు విడిగా పేర్కొనఁ బడినట్లు కనిపించదు. అంతఃకరణ వృత్తులన్నిటి నిరోధమే చిత్తవృత్తి నిరోధశబ్దము నందలి చిత్తవృత్తి శబ్దార్థముగా అంగీకరించక తప్పదు. 2) ఈ శ్లోకమున పై రెండు మనోబుద్ధులతోపాటు అస్మిత అనునది పేర్కొనఁబడినది. అస్మి అను పదము అహమర్థకమైన అవ్యయము. కావున అస్మితా పదము అహంత అను అర్థము నిచ్చును. 3) క్రమప్రకాశిక ననుసరించి సత్ అను శబ్దము వ్యావహారిక సత్యములైన గంగాజలాదులను గాని, రూపముగల పృథివ్యప్తేజోభూతముల మూడింటినిగాని బోధించును. అసత్ శబ్దము మరుమరీచికాది భ్రాంతవస్తువులనుగాని, రూపములేని వాయ్వ్యాకాశములనుగాని బోధించును. సత్తులు అసత్తులునైన అర్థముల యొక్క మండలమును గ్రహించుటకు జ్ఞానేంద్రియములను వానిని స్వీకరించుట మొదలగు కర్మల చేయుటకు కర్మేంద్రియములును ఉపయోగించుటలో సాధారణ జీవులకు స్వాతంత్ర్యము లేదు. అమ్మవారికి పూర్ణ స్వాతంత్ర్యము ఉన్నది. ఆ ఇంద్రియములు ఆయా విషయముల గ్రహించు ప్రవృత్తిమానుట అను నివృత్తిలో అమ్మవారు స్వతంత్రయే. జీవులకు అదృష్టవేగమున, ఒక్కొక్కప్పుడు బలవత్ప్రవృత్తి అనగా ఇష్టములేకున్నను గ్రహించుట స్వీకరించుటయు అను ప్రవృత్తి గాని గ్రహించకుండుట స్వీకరించకపోవుట అను నివృత్తిగాని జరుగుచుండును. అమ్మవారి అనుగ్రహముచేత యోగులకే అర్థములు ఇచ్ఛామాత్రమున సన్నిధాపితము లగునని పూర్వశ్లోకమున చెప్పఁబడినది. 4) అస్మిత అహంత అని చెప్పుకొంటిమి. ఆ అహంత ధీమనోక్ష వస్తువు. అనగా ఇంద్రియమయ శరీరమునందు నేను అను బుద్ధిని కలిగియుండుట. అట్లు అట్టి బుద్ధి కలిగించునది అహంకారము లేక అహంత. అదికూడ ఇంద్రియమై అంతఃకరణ చతుష్టయమున స్థానమును పొందినది. కావున అమ్మ ఇంద్రియమయ శరీరమున అహంతచేరియేయున్నది. ఆత్మసాక్షియైనను ఆత్మకు ఆయా విషయముల గ్రహణాగ్రహణములలో ఆయనకు స్వాతంత్ర్య మున్నట్లు కనిపించును. వాస్తవమునకు అమ్మవారిదే ఆ స్వాతంత్ర్యము.



5) ఈ త్రయోదశ విధేంద్రియ ప్రవృత్తి నివృత్తి స్వాతంత్ర్యము అమ్మవారిదే అని చెప్పుకొన్నాము. ఈ ఇంద్రియములు ఆమె అంశములు అని చెప్పవలెను. కాని అమ్మవారు పూర్ణరూపిణి కావున పూర్ణమున అంశములున్నవని చెప్పినచో ఆ పూర్ణత అపరిమితత్వమును కోల్పోవును. కావున శ్లోకమున అంశకః అని చెప్పఁబడినది. అంశము వంటివే అవి అని ఆ శబ్దము బోధించును. అసౌ అను పదము అహమ్ అను జ్ఞానమునకు విషయమునకు విషయమైన శివుని బోధించును. స్వతంత్రత అమ్మవారి ధర్మమైనను అంశము అని చెప్పకపోవుట, అంశమువంటిదని చెప్పుట శివ ధర్మి శక్తి ధర్మోభయమునకు అభేదము కారణము.

శక్తియే భోగ్యవస్తుసృష్టి ద్వారమున పరమపురుషుడైన జీవుడుగామారిన శివునందు ఆయా వస్తువుల అనుభవముల వలన కలుగు ఆనందమును కలిగించును. కావున సృష్టి స్థితులలో శివానందమూర్తి ప్రకాశించును. ప్రలయమున జగమును చిదంబరమున లీనమొనరించునపుడు ఆ శివుడే పరమపురుషుడగును. అప్పుడతడభేద సంస్కృతిమయుడుగా ప్రకాశించును. స్వానందమయుడు కాడు. ఇట్లు శివునకు కూడ ఆనందమును సంపాదించు స్వాతంత్ర్యశక్తి అమ్మవారే. కావున స్వాతంత్ర్యము శక్తి (అమ్మవారే) యొక్క ధర్మమే అగుచున్నది. శివునకు అట్టి స్వాతంత్ర్యము శివునందు అమ్మవారు ఆతనిలో లీనమై అనగా ఆతడు అంతర్లీన విమర్శుడైనప్పుడు తప్ప ఊహకందదు.

దివ్యచకోరిక ననుసరించి పూర్వశ్లోకమందు సూచింపఁబడిన త్రిపుటి త్రయనాదనవక సమష్టిధామమయ ప్రకాశ చక్రము యొక్క శాక్త శాంభవానుత్తర విసర్గ త్రయ సమష్టవిలాసాత్మక సదసద్వాగర్థ మండలమును అనుభవించుటలో శివునకు స్వాతంత్ర్యము చెప్పిన అమ్మవారు ఆయనకు అంశమగును. అమ్మవారికి స్వాతంత్ర్యమును చెప్పిన శివుడే ఆమెకు అంశము అగును.

1) శాంభవాణవ విసర్గములలో ఒకడైన ముఖ్యప్రాణమయ శివుడు మనోబుద్ధీంద్రియమయ శరీరము నాశ్రయించి సదసదర్థమండలముల కారణమైన అహంకారము నాశ్రయించి ఆణవవిసర్గ (జీవసర్గ) విలాసరూపము నధిష్ఠించిన వాడు. అనగా జీవత్వముపొందిన శివుడు బుద్ధియందహంతచే నిశ్చయించుచున్నాను అని మనస్సునందహంతచే సంకల్పించుచున్నాను,వికల్పించుచున్నాను, ఇంద్రియము లందహంతచే చూచుచున్నాను, వాసనచూచుచున్నాను, తాకుచున్నాను, తీసికొను

చున్నాను, నడచుచున్నాను, మలాది విసర్జమొనరించుచున్నాను, (వపువునందహంత చేత పొట్టివాడను, పొడుగువాడను), ఆనందమును భోగించుచున్నాను. ఇత్యాద్యను భవముల నొందును. ధీమనోక్షవపురస్మితామ్ + అయమ్ అను ద్వితీయ పాదమును గురించి పై అర్థము చెప్పబడినది. పై అస్మితయే సదసదర్థమండలమునకు మూలకారణము. తదనుభవమునకును అదియే ఆవశ్యకము.

ఆణవ విసర్గ (జీవసర్గ) విలాసియైన శివుడు బుద్ధి ప్రధానకర్మేంద్రియ శరీరమును నేనును, మనః ప్రధాన జ్ఞానేంద్రియ శరీరమునేనని మొత్తము జ్ఞాన కర్మేంద్రియములు విధించువాడు కావున ఆతడు దశవిధిః అని చెప్పఁబడినాడు అని దశవిధిః అనుపాఠమునాశ్రయించి అర్థముచెప్పఁబడినది. సదసదర్థమండలము కూడ క్రమప్రకాశికలో చెప్పఁబడినవిధముగా వ్యావహారిక సత్పదార్థ భూతభూత పంచకము, అసత్పదార్థభూతములైన ప్రాతిభాసిక పంచభూతములు మొత్తము పది అని విభజింపఁబడినందున (విధింపఁబడినందున) దశవిధి అని చెప్పఁబడ వచ్చును.

'యత్ త్రయోదశ విధః' అనుపాఠము నాశ్రయించి ధీమనోక్షవపురస్మితా (మనోబుద్ధీంద్రియములందలి అహంత) తదర్థముల యొక్క మండలము అను రెండును త్రయోదశ విధములగుచున్నవి. ధీమనోక్షవపురస్మితామ్ అను సమాసము నందలి చివరి వపు, అస్మితను క్రమముగా ధీ-మనో-అక్ష అను మూడింటితో అన్వయించి ధీవపురస్మిత, మనోవపురస్మిత, అక్షవపురస్మిత అని అస్మితను మూడు విధములుగా విభజించియు అర్థము చెప్పఁబడినది. మహాబిందువున అభిన్నములైన పదమూడు విధములైన ఆణవ విసర్గాత్మకుడే ప్రాణమయశివుడు అనియు పై సమాసము వ్యంజించును.

ప్రాణసూర్య ఇహ చిద్విషట్కలః ధీమనోక్షములు (1+1+10=12) కళలుగాగల ప్రాణ సూర్యుడు రచయితచేత చెప్పబడబోవుచున్నాడు గావున అహంతతో కలిపి త్రయో+దశ విధ కలలు కలవాడుగా ఇట చెప్పఁబడినాడు. యత్రయాదశవిధః అనుపాఠము ననుసరించి వెనుక చెప్పఁబడిన విధముగా సదర్థపంచకము అసదర్థపంచకము అని అర్థమండలము దశవిధి అని చెప్పఁ బడినది. అట్లే బుద్ధియందలి అస్మిత, మనస్సునందలి అస్మిత అర్థమండల పంచకవిషయకము కావున ఆ అస్మితయు దశవిధి అని చెప్పఁబడినది. అట్లే



స్వతంత్రతా తద్వయో అనుపదములను స్వతంత్రతా+అతద్వయః అని విభజించి స్వతంత్రతా అతంత్రతా అను రెండును త్రయోదశ విధములని చెప్పవచ్చును.

చిత్త ప్రలయరూప శాంభవ విసర్గమున శివుడు అతద్వయోపి అనగా జ్ఞానకర్మేంద్రియములులేనివాడు అని అతద్వయపదమునకు మరొక అర్థము చెప్పవచ్చును. చిత్తప్రబోధత్మక శాక్తానుత్తర విసర్గవిలాసమున అ ఇ ఉ ఋ ౡ ఏ ఐ ఓ ఔ అను మాహేశ్వర వర్ణమాలలో మూలస్వరము లేదు. బింద్వాదినాదనవమున మూలానుత్తరాకారాత్మకమైన ఉభయవిలాసమునందును అకారమునందలి ఆ రెండు విలాసములు లేనివాడు అని అతద్వయ శబ్దార్థము చెప్పఁబడినది. స్వతంత్రతా అతద్వయమనగా స్వతంత్రతా సిద్ధములైన శాంభవశాక్త విసర్గ విలాసములు రెండు కలవాడు అని మరొక అర్థము చెప్పఁబడినది. అహమ్ అను శాంభవ విసర్గ విలాసము నాద ప్రధానము. అసౌ అని శాక్తానుత్తర విసర్గవిలాసము శాబ్దబిందు ప్రధానము. నాదనవాత్మకయైన అమ్మవారి అంశము శివుడు. నాదరూపమునగాని వాగర్థశబ్దరూపమునగాని ఆణవ భావము విడువని విలాసము ధర్మముగాగల తదంశము శివుడు.

తవాధికః అనుపాఠము నాశ్రయించి శాంభవ విసర్గవిలాసనాదరూపమున శాక్తానుత్తర విసర్గవిలాస వాగర్థసామరస్య రూపమునగాని అహమేవాసౌ అనిగాని అసావహమితి అనిగాని ఆణవ భావమును విడచినవాడై ఉన్మనీభావమును పొందిన మహాప్రాణనాద భావముగలవాడు శివుడు భర్తగావున నీకు అధికుడు అనగా పూజ్యుడు అను అర్థము చెప్పఁబడినది.

**అవతారిక: –** పై శ్లోకమున అమ్మవారి వలన శివునకు జ్ఞానకర్మేంద్రియ ద్వారమున నేర్పడిన ఉభయవిధ గ్రహణములు చెప్పఁబడినవి. ఈ శ్లోకమున సృష్టిస్థితిదశలలో శివుని ఆనందమూర్తిత్వము ప్రలయమందలి సంప్లుతిమయత్వము సమాధి యందు నిరంజనానందమయత్వమును అమ్మవారి వలననే కలుగునని చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ తత్తదర్థమయభోగ్యలక్షణా**
**నష్టమూర్తిరయముత్తమః పుమాన్।**
**అర్పణేన జగతశ్చిదమ్బరే**
**భాతి సంప్లుతిమయశ్శివే! తవ॥ 62**

**ప్రతిపదార్థము:–** శివే=ఓ శివా, తత్తదర్థమయభోగ్యలక్షణానందమూర్తిః=ఆయా అర్థముల భోగ్యము లక్షణముగా గల, ఉత్తమః=ఉత్తముడైన, అయమ్=ఈ, పుమాన్= పురుషుడు, (అథ అపి=అయినను (శివుడు),) చిదమ్బరే=చిద్గగనమున, జగతః =జగము (భోగ్యము) యొక్క, తవ=నీయొక్క, అర్పణేన=అర్పణమున, సంహృతి మయః=సంహారమూర్తి (ఆవరణమూర్తి), భాతి=ప్రకాశించును.

**తాత్పర్యము:–** సృష్టిస్థితులలో విషయ భోగమున ఆనందమూర్తియైన శివుడే సంహృతి మయుడై ప్రలయమున భాసించును. ఇదంతయు నీ యొక్క అర్పణమే. దానివలన ఆతడుత్తముడై వెలయుచున్నాడు.

**వివరణము:–** క్రమప్రకాశిక ననుసరించి సృష్టిస్థితికాలములలో విషయముల భోగించునపుడు కలుగు విషయసుఖము జీవునకు కలుగును. విషయోప సంహారమున ఆతడు నిద్రితుడై ఉండును. లేక మరణమునను ఆతడే దీర్ఘనిద్రితుడని చెప్పఁబడును. అట్లే శివుడు తనలోని జగములను బయటికి క్రక్కినపుడు అనగా సృజించినపుడు, ఆ తరువాత స్థితికాలమునను విషయముల స్వస్వరూపము(ల)నే అనుభవించుటచేత ఆనందమూర్తిగానే ఉండుటచే ఆతడు ఉత్తమ పురుషుడనఁ బడును. ఆ శివుడు తనలోని శక్తివలననే జగమును సృజించి కాపాడుచున్నాడు. కావున ఆతనికి కలుగు స్రష్టృతభోక్తృత్వ(రక్షకత్వ)ములు శక్తి సమర్పణలే. తత్సంహార కత్వమును శక్తి కల్పితమే కావున అవన్నియు శివచేత శివునకర్పించిన భోగములే. అర్పణ శబ్దమునకు జ్ఞాని దృష్టిలో ప్రవిలాపనమనియు అర్థము చెప్పఁబడినది.

దివ్యచకోరిక ననుసరించి పై శ్లోకమున ఆణవశాక్త విసర్గములలో అమ్మవారిచేత జీవునకు విషయభోగమును అందించబడునని చెప్పఁబడినది. ఈ శ్లోకమున శాంభవానుత్తర విసర్గమున ఆమె సర్వజగత్తును చిన్మయముగా నొనరించునని ఆయన సంహృతిమయుడుగా ద్వాదశాంత మున్మనీ మహాబిందువున ప్రకాశచక్రస్వభావమున అభిన్నానందమూర్తి. చక్రమయపురుషోత్తమత్వమును అమ్మవారే అందించునని చెప్పఁబడుచున్నది. 2) అయమ్ అను పదము ఆణవ విసర్గ సాధకుని బోధించును. తత్తదర్థమయ శబ్దమునకు ఆయా అర్థములనిచ్చు శబ్దములు అను అర్థము చెప్పఁబడినది. 1) తత్తదర్థములు అనగా ఆయా అర్థములు. అనగా వాచ్యార్థములు. లక్ష్యార్థములు. తాత్పర్యార్థములు. అయ అనగా ప్రతిపాద్యతా



భావసంబంధమున చేరునవి. కావున శబ్దములు తత్తదర్థ మయములు అని ఒక అర్థము చెప్పఁబడినది. 2) తత్తదర్థములు అనగా ఆయా విషయములు, అవి భోగ్యములుగా చేసికొను లక్షణము ఆనందమూర్తియైన ఆత్మకున్నది. కావున ఆత్మ తత్తదర్థ భోగ్యలక్షణముగల ఆనందమూర్తి. తత్తదర్థమయ శబ్దములు శ్రవణేంద్రియ ద్వారమున భోగ్యములే కావున ఆ శబ్దములచేత ప్రతిపాదింపఁబడు అర్థములు కూడ భోగ్యములే కావునను వానిని భోగ్యములుగా చేసికొను లక్షణమా ఆనంద మూర్తికున్నది. నాదానందనిమగ్న ప్రాణమయునకు కూడ పై విశేషణము వర్తించును.

విద్యానంద సామ్రాజ్యమున తత్తదర్థబోధక శబ్దములచే తెలియబడు ప్రాకృతములైన ఆకలి దప్పుల నివర్తింపఁజేయు భోగ్యవస్తువులు కూడ అధికారము ననుసరించి భక్తి, జ్ఞాన వైరాగ్యములకు హేతువులగుటచే ఆభ్యంతర తృప్తులగుట చేతను ఆతడు తత్తదర్థమయ భోగలక్షణానందమూర్తి యగుచున్నాడు. అదిగాక తత్తదర్థములనగా ఆయా పురుషార్థములని మరొక అర్థము చెప్పఁబడినది. సాధారణముగా ధర్మార్థకామములు మూడు పురుషార్థములు త్రివర్గము అని దానికి మోక్షమును కలిపి చతుర్వర్గము అని చెప్పఁబడును. సంసారు (త్రివర్గములకోరు వారు) లీ లోకమున త్రివర్గార్థులే. మోక్షమును కోరువారిలో పెక్కురు ఉభయభ్రష్టులే అగుదురు. మోక్షమును మాత్రమే కోరువారు క్వాచిత్కముగా ఒకరో ఇద్దరో ఉందురు. పశుపక్ష్యాది జీవులు ధర్మమును అర్థమును కోరనే కోరరు. తత్తుల్యులైన మానవులు మాత్రము ధర్మమును కోరకున్నను పశుపక్ష్యాదులును కోరని అర్థము కోరుచు దానికై యత్నించుచుందురు. ఇట్లు పురుషార్థములు భోగ్యములై ఉండు లక్షణము తత్తదర్థమయ భోగ్య లక్షణము అని చెప్పఁబడును.

తత్తదర్థమయభోగలక్షణానందమూర్తి అనుపాఠము నాశ్రయించి ఆ పురుషార్థముల భోగమే లక్షణముగాగల ఆనందమూర్తులు (ఆత్మలు) కొన్ని ఉండును. అట్టి పురుషార్థము భోగలక్షణముగా గల ఆనందమే స్వరూపముగాగల ఆత్మలు గలవారు తత్తదర్థమయ భోగలక్షణానందమూర్తులని చెప్పఁబడును. ఇట్లు పురుషార్థమును కోరువాడే ఉత్తమః పుమాన్ – ఉత్తమ పురుషుడు అని శ్లోకమున చెప్పఁబడినది. అట్టి ఉత్తమ పురుషుడు తమస్సు నుండి లేక విశ్వము నుండి ఉత్ =పైకివెళ్ళినవారిలో (మోక్షకాములలో) శ్రేష్ఠుడు కావున ఆతడు ఉత్తముడు.

విశ్వోత్తీర్ణుడు ఉద్గత తమస్కుడునయిన ఆ పురుషుడు నాదమయుడు. కావున ఆతనిని అక్షరపురుషుడుగా శ్రీమద్భగవద్గీత ప్రశంసించినది. ఉన్మనీ మహానంద మూర్తియైన ఆతడు శైవానందమూర్తి. ఆతడు ఆ మహానందమునకు సాక్షిగా ఉండుననుట కూడ దాదాపు చెప్పఁబడినట్లే. కావున అతడు గ్రంథి భేద రహితుడని స్పష్టమగుచున్నది. ఇచ్ఛార్థిక **వశ (కాన్తే)** ధాతువు నుండి వర్ణ వ్యత్యయమున నిష్పన్నమైన శివశబ్దము విపరీతేచ్ఛారూపిణియైన అమ్మవారిని బోధించును. సంసరించు ఇచ్ఛలో శివుడు జీవుడు కాగా తద్విపరీతేచ్ఛతో అనగా సంసారమును తొలగించుకొను ఇచ్ఛతో జీవుడు శివుడగును. అట్లు అగుటకు విపరీతేచ్ఛారూపిణి యైన అమ్మవారే హేతువు. ఆ అమ్మవారు జీవుని సంహృతిమయునిగా చేయును. సంహృతిమ్+అయ అను విభాగమున సంహృతిమయ శబ్దము జగత్సంహారకాల మందలి ఆత్మను బోధించును. అప్పుడాతడు ఎక్కడ ఉండును. జగములేదుగదా అను ప్రశ్నకు అమ్మవారు ఆ జీవుని జగత్సంహార పూర్వకముగా చిదమ్బరమున అర్పించినది. అని 'తవ అర్పణేన' అనుపదములు బోధించును. తిరిగి సృష్టించు వాడుగా ప్రకాశించును అని భాతి అనుక్రియ బోధించును. లేక శాంభవ విసర్గమున శివానుభూతి కలుగగా ప్రకాశించును అనియు బోధించును. జగమునందలి జడాజడ వస్తువులు భూతాకారమున లీనమైనట్లు విద్వద్భోగ్యవస్తువులు భోగకాలిక దహరాకాశమున విలయమగుననుట నాదోపాస్తి విద్యారహస్యము. తతః అనుపాఠమునకు బదులు తవ అనుపాఠము నాశ్రయించి నీయొక్క సంహృతి మయానందమయ చిదాకాశమున ప్రకాశించునను అర్థము చెప్పఁబడినది.

**అవతారిక:–** పై శ్లోకమున విశ్వమున సంసరించువారి కదృష్టానుసారి భోగ్యమును విశ్వోత్తీర్ణులయిన వారి ఆనందస్వరూప భోగమును అమ్మవారు అర్పించునని చెప్పఁ బడినది. ఈ శ్లోకమున నాదోపాసనవలన పొందఁబడిన నాదానందమూర్తి లక్షణ శరీరముగల ఉత్తమ పురుషునకు నకులీశపాశుపతాది శైవశాస్త్ర మర్యాదతో మాతృకా వర్గాష్టకాభిన్న కల్పిత వాగర్థపుర్యష్టక వాగర్థ వ్యవహారలోపములేనిదని అమ్మవారి సర్వజ్ఞత చెప్పఁబడుచున్నది. జీవ, దేవ, పశుభావ భేదము కూడ చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ అష్టధా స్ఫురతి యా పురీ శివే!**
**సూక్ష్మభావముపగమ్య లైఙ్గికమ్।**
**తజ్జపౌ(తజ్జుపో)ష్ట కృతచిత్తవృత్తయో**
**వాసనాస్త్వదుదరస్థితే పశౌ॥** **63**



**ప్రతిపదార్థము:–**శివే=ఓ శివా,యా=ఏ, పురీ=పురి, అష్టధా=ఎనిమిది విధములుగా, లైంగికమ్=లింగశరీరగతముగా, సూక్ష్మభావమ్=సూక్ష్మతను, అపగమ్య=పొంది, స్ఫురతి=స్ఫురించునో, తజ్జపౌష్టకృత చిత్తవృత్తయః=ఆపుర్యష్టకము నుండి పుట్టిన, పుష్టికాధారములైన వానిచే పుష్పములుగా చేయఁబడిన చిత్తవృత్తులు గల, వాసనాః =వాసనలు, త్వదుదరస్థితే=నీ ఉదరమందున్న, పశౌ=పశువునందు (ఉండును.)

**తాత్పర్యము:–** ఎనిమిది విధములుగా ఉన్న పుర్యష్టకము సూక్ష్మభావమునొంది లింగశరీరమున చేరి పుర్యష్టకముచే జనించి పోషింపఁబడిన వాసనలుగ నీ ఉదరమున లేక ఉరమున ఉన్న పశువున ఉన్నవి గదా!

**వివరణము:–** క్రమప్రకాశిక ననుసరించి సూక్ష్మ (లింగశరీరమున చిత్తవృత్తుల నుండి వాసనలు పుట్టి పోషింపఁబడు చుండును. అట్టి వాసనలు నీ పొట్టలోని లేక నీ ఎదలోని సర్వజీవులందుండును. కావున నీవు సర్వజ్ఞవగుచున్నావు. దివ్యచకోరిక ననుసరించి శివే శబ్దము అమ్మవారి సంబోధనముగా గాని శివ శబ్దము యొక్క సప్తమ్యంతముగా గాని స్వీకరింపవచ్చును. సంబోధనముగా స్వీకరించినపుడు ఓ శివా అని, సప్తమ్యంతముగా స్వీకరించినపుడు శివునందు అను అర్థములేర్పడును. లింగశరీర సంబంధి సూక్ష్మభావమునొందిన వాసనలు అంతఃకరణ వృత్తులవలన కలిగినవై ఆ అంతఃకరణముననే పోషించఁబడు చుండును. స్థూలపంచభూతములు (భూజలాగ్ని వాయ్వాకాశములు) సూక్ష్మ భూతముల (శబ్దస్పర్శరూపరసగంధతన్మాత్రల నుండి సృష్టిక్రమమున ఏర్పడినట్లే లయక్రమమున స్థూలభూతములు సూక్ష్మభూతములుగా మారును. అట్లే అగ్ని, సూర్య సోమమండలత్రయము స్థూలము. ఈ ద్వివిధ స్థూలములలో పంచ భూతములు సూక్ష్మరూపిణివైన నీ శబ్దాదులనుండి ఏర్పడినవి. స్థూలమండల త్రయము నీ చిత్ప్రాణదేహకారణకము చిత్ప్రాణ దేహములు మూడుపంచభూతములు కలసి పుర్యష్టక మనఁబడునని, ఒక విధముగా, చితి, చిత్తము, చైత్యము, చేతనలు రెండు, జీవుడు, ప్రాణము, శరీరము అనునవి పుర్యష్టకమని మరొకవిధముగా చెప్పఁబడినవి. మరొక విధముగా (1) పంచకర్మేంద్రియములు (2) పంచ జ్ఞానేంద్రియములు (3) ప్రాణాది పంచకము (4) ఆకాశాది పంచభూతములు, (5) బుద్ధ్యాద్యంతఃకరణ చతుష్టయము (6) కామము (7) కర్మము (8) అవిద్య అని పుర్యష్టకము చెప్పఁబడినది. పుర్యష్టక సహితమైన అమ్మవారి లింగ శరీరమే

జగత్కారణము. విశ్వమయమైన బాహ్య ప్రకృతి ఏ అమ్మవారి సూక్ష్మశరీరమున లీనమగునో, ఆ అమ్మవారి సూక్ష్మశరీరము లింగమని చెప్పఁబడును. లిం+గం అను రెండు పదములలో మొదటి పదము బాహ్య ప్రకృతిని లీనమొనరించు కొనునది. రెండవది ఆధ్యాత్మిక ప్రకృతిచేత పొందఁబడినది అను అర్థముల నిచ్చునది. అమ్మవారి సూక్ష్మశరీరము కావున ఆ అమ్మవారి శరీరము లింగమని చెప్పఁబడుననుట పై వాక్యముల భావము. అట్టి అమ్మవారి లైంగిక సూక్ష్మభావమునందు ననుట శ్లోకములోని రెండవ పాదము యొక్క అర్థము.

2) పురి అర్థమయి, శబ్దమయి, నాదబ్రహ్మమయి. మొదటిదిస్థూలమయి, రెండవది సూక్ష్మము. మూడవది కారణరూపము. ఈ మూడును స్థూలోపాధి, సూక్ష్మోపాధి, కారణోపాధి అను పేర్లుగలవై ఆత్మనావరించి యుండును. ఈ మూడింటి సమష్టియైన పురి ఎనిమిది విధములుగా ప్రకాశించును అనుట శ్లోకము లోని మొదటి పాదము యొక్క అర్థము. ఈ మూడింటి సమష్టియైన పురియే ఈ శ్లోకమున కవిచే వివక్షితమని అభిజ్ఞాన శాకుంతల నాటక నాందీ శ్లోకమునందలి ప్రత్యక్షాభిః అను తను విశేషణము స్పష్టము చేయుచున్నది. కేవల సూక్ష్మ పురి ప్రత్యక్షము అని చెప్పరానిది గదా!

తజ్జపోష్టకృత చిత్తవృత్తయః అనునది మూడవ పాదము మొదటి రెండు పదములకు న 'ష్ట' కు 'ష్ఠ' అను పాఠాంతరమున్నది. తజ్జప + ఓష్ఠ + కృత చిత్త వృత్తయః అను విధముగా విభజించి ఇట్లు అర్థము చెప్పఁబడినది. తజ్జపమనగా శబ్దవర్ణక్రమము. ఓష్ఠకృత అనగా ఓష్ఠచాలన శిక్షణము చేయబడినవి. వర్ణమాలా క్రమమున ఎనిమిది వర్గములున్నవి.

**అ వర్గము - అచ్చులన్నిటితో కూడినది. దీనికి అధిదేవత బ్రాహ్మి.**
**క వర్గము - క ఖ గ ఘ ఙ లతో కూడినది. దీనికధిదేవత మాహేశ్వరి.**
**చ వర్గము - చ ఛ జ ఝ ఞ లతో కూడినది. దీనికధిదేవత కౌమారి.**
**ట వర్గము - ట ఠ డ ఢ ణ లతో కూడినది. దీనికధిదేవత వైష్ణవి.**
**త వర్గము - త థ ద ధ న లతో కూడినది. దీనికధిదేవత వారాహి.**
**ప వర్గము - ప ఫ బ భ మ లతో కూడినది. దీనికధిదేవత ఇంద్రాణి.**
**య వర్గము- య ర ల వ లతో కూడినది. దీనికధిదేవత చాముండి.**
**శ వర్గము - శ ష స హ లతో కూడినది. దీనికధిదేవత లక్ష్మి.**



పై ఎనిమిది వర్గములు పైన చెప్పబడిన పుర్యష్టకము లేక మూర్త్యష్టకము యొక్క శాబ్దమయ రూపము. పై అష్టవర్గముల యొక్క జపమే తజ్జప అను సమాసారంభ పదము యొక్క అర్థము. ఈ వర్ణములనెట్లు ఉచ్చరించవలెనో గురువు పెదవులు కదిలించి శిష్యులకు శిక్షణనిచ్చుటయే ఓష్ఠకృత అను శబ్దము యొక్క అర్థము. (పై వర్ణములకు వాచ్యార్థములకు సంబంధించిన చిత్తవృత్తులు నశించినను వాని వాసనలు మిగిలియుండును.) తజ్జ అనగా ఆ వాసనల వలన జనించిన (ఎనిమిది విధములైన ప్రాణమనో జ్ఞానమూర్తి త్రయ త్రివృత్తులచే వర్ణించఁబడిన సూక్ష్మపురి నుండి పుట్టిన) అని, పౌష్టమనగా పుష్టి భావమని లేక పుష్టి హేతుక కర్మము అని తజ్జపౌష్టి(ష్ఠ) అను సమాసమును రెండు విధములుగా విభజించి అర్థము చెప్పఁబడినది.

ఇట్లు చిత్తవృత్తులను గురువులు ఉపదేశించుటచే శిష్యులలో కలుగును అని కృతశబ్దము యొక్క అర్థము చెప్పఁబడినది. తజ్జుషోష్టకృత చిత్త వృత్తయః అను పాఠాంతరమును స్వీకరించి తత్ అనగా ఆ మాతృకలోని అష్టవర్గములను సూక్ష్మపురిని, జుషః అనగా సంతోషపెట్టునవి, అష్ట అనగా ఘృణ, శంక, భయము, లజ్జ, జుగుప్స, కులము, జాతి, శీలము అను ఎనిమిది విధములుగా, కృత=చేయ బడిన చిత్తవృత్తులు (అంతఃకరణవృత్తులు) అని అర్థము చెప్పఁబడినది. పై అష్టమాతృకా నిర్మిత వాగర్థ సంబంధ చిత్తవృత్తులుగా తదధిదేవతలకు సంబంధించిన చిత్తవృత్తులుగాని అనేక జన్మలనుండి లేక ఈ జన్మము యొక్క ఆరంభము నుండి అనుస్యూతములైన చిత్తవృత్తుల వాసనలు అమ్మవారి ఉదరమున లేక ఉరమున నున్నవి. వాసనాస్తదురసి అనుపాఠము నంగీకరించి అష్టపదార్థ యుక్త సమష్టియైన ఈశ్వరుని ఉరమున నున్న పశువునందు వెలయుచుండునని అర్థము చెప్పఁ బడినది. వేనిలో ప్రత్యగాత్మ వసించునో, వేనిచేత ప్రత్యగాత్మ వాసితమగునో అవి వాసనలు అని వాసనా శబ్దము యొక్క వ్యుత్పత్తి చెప్పఁబడినది. అష్ట పదార్థయుక్త పురి సమాసోక్తి చ్ఛాయలో స్త్రీగా భావింపఁబడినపుడు ఆ పురి యొక్క ఎద అను నామాంతరముగల మనస్సునందున్న లేక ప్రతిబింబించి యుండిన చిదాభాసుడు ఆమె ఎద (ఱొమ్ము) పై ఆడుకొను శిశువువంటివాడను అర్థము ఇట ధ్వనించు చున్నది. విశ్వగతుడైన జీవునియందే పశువాసనలు ఉండునని కాని విశ్వోత్తీర్ణుడైన ఈశ్వరునందుగాని తురీయాత్మయందుండవని పశు శబ్దము వ్యంజించును.

పూర్వ్యాష్టకాత్మ ప్రకృతి యొక్క వాఙ్మయము ఉరమని, అర్థ సమూహము ఉదరమని ఒడుపుగా రెండు పాఠములు రచయితచే సమర్థింపఁబడినవి. యజ్ఞ వేది వాస్తు (అర్థ) మండప రూపుడైన (యజ్ఞ) పశువునందే ఉండును. గాని పరశివునందుండ వని మరొక విధముగా చెప్పఁబడినది. **అభధ్నన్ పురుషం పశుమ్** ఇత్యాది శ్రుతి దీనికి ప్రమాణమని వ్యాఖ్యాత అభిప్రాయము కావచ్చును. దేహేంద్రియ పోషణమాత్ర పర్యవసన్నములైన చిత్తవృత్తులే పశువాసనా రూపమున రూఢములగుననుట ఫలితార్థము. అందుచేతనే తంత్రాంతరమున విజ్ఞాన కేవల, ప్రలయకేవల, (ప్రలయాకల) సకల రూప త్రివిధ జీవులు పశువులుగా చెప్పఁబడిరి. వీరిలో విజ్ఞాన కేవలుడు మలయుక్తుడు. ప్రలయ కేవలుడు (ప్రలయ కలుడు) మలకర్మ యుక్తుడు. విజ్ఞాన కేవలుడు మలమాయాకర్మ యుక్తుడు. విజ్ఞాన కేవలుడు సమాప్త కలుషుడు, అసమాప్తకలుషుడు అని రెండు విధములుగా ఉండును. సమాప్త కలుషుని శివుడనుగ్రహించి ఎనమండుగురిని విశ్వేశులుగా నియమించును. సప్తకోటి మంత్రములనుగా అసమాప్తకలుషుల నొనరించును. (అనగా వారి శరీరములు సప్తకోటి మహామంత్రమయములుగా నుండును.)

తైత్తిరీయ సంహిత ద్వితీయకాండ ప్రథమ ప్రపాఠక చతుర్థానువాకము మొదలు నవమానువాకము వఱకు గల భాగమున **సప్తగ్రామ్యాః పశవస్సప్తారణ్యా స్సప్త ఛందాగ్ంసి,యే గ్రామ్యాః పశవో విశ్వరూపాః య ఆరణ్యాః పశవో విశ్వరూపాః, సప్తగ్రామ్యా ఓషధయః సప్తారణ్యాః సప్తచ్ఛందాగ్ంసి** మొదలైన మంత్రములు, అట్లే భవిష్యోత్తర పురాణమున తుర్యఖండమున 19వ అధ్యాయమున 53వ శ్లోకము మొదలు పశుత్వము నిరసింపదగినదే అని చెప్పఁబడినది. యజ్ఞమేర్య పశువు జన్మాంతరమున బ్రహ్మజ్ఞానము ద్వారా బ్రహ్మత్వము పొందునని చెప్పఁబడినది. చతుర్దశ స్వరాభిన్న చతుర్దశ సంఖ్యాకములైన విద్యలు భువనములు మొదలగువానికి, శబ్ద స్పర్శాద్యపఞ్చీకృత వాగర్థ శరీరులైన విద్య మంత్రాది వాగర్థ శబ్దాభిమానులైన అజ్ఞానదేవులు పఞ్చీకృత పాఞ్చభౌతిక శరీరాభిమానులకు వలె గ్రామ్యారణ్య పశుజాతి భేదమున ఏడేసి సంఖ్యగల పశుజాతి యజ్ఞ మధ్య పశుత్వము గలదైనది.

భవిష్యోత్తర పురాణమున **యస్య బుద్ధిస్స వై బ్రహ్మాఽహంకారో యస్య వై శివః** అని యజ్ఞ పురుషునకును పశుత్వము చెప్పఁబడినది. చూడుడు. **హింసాయజ్ఞైశ్చ భగవాంత్స వై తృప్తిమవాప్నుయాత్** (హింసా యజ్ఞములచేత స్తవములచేతను భగవానుడు తృప్తినొందును). **సచేద్యజ్ఞ పశుర్వహో బ్రహ్మాభూయాయ కల్పతే** (ఆ యజ్ఞపశువు బ్రహ్మ భూయమున కర్థమగును). పశుత్వము మంత్ర దీక్షాదులచేతను ఆలభ్యమగును. ఆచార్యమూర్తిస్థ శక్తి పాతాపరపర్యాయ దీక్షా సంస్కారములు **జననం జీవనం చైవ తాడనం బోధనం తథా, అభిషేకోఽథ విమలీకరణాప్యాయనే పునః, తర్పణం దీపనం గుప్తిర్దశైతా మంత్ర సంస్క్రియాః** (జననం జీవనము తాడనము బోధనము అభిషేకము విమలీకరణము ఆప్యాయనము తర్పణము దీపనము గుప్తి అనునవి పది మంత్ర సంస్కారములు) చెప్పఁబడియున్నవి.



శారదాతిలకాదులలో తాంత్రిక మంత్రసంస్కారము చెప్పఁబడినది. శైవాగమమున **'పరిపక్వమలానేతాను త్పాదనహేతుశక్తిపాతేన, యో జయతి పరే తత్త్వే సదీక్షయాచార్యమూర్తి స్థః'** (పరిపక్వలనుద్ధరించుట హేతువైన శక్తి పాతమున గురువు (శిష్యులు) బ్రహ్మలాగు యోజింపఁజేయును. ఆచార్యమూర్తిస్థ మైనదా దీక్ష) అని చెప్పఁబడినది. తంత్రలోకములలో గురువు **తస్యాణోః పాశజాలం వ్యపోహతి** ఆ జీవుని పాశజలమును తొలగించును. దీక్షచేతనే రెండు తంత్ర మంత్ర సిద్ధులు సిద్ధించును,విడిగా సిద్ధించవు అనియు చెప్పఁబడినది. ఉచ్చార్యమాణ మంత్రములు తెలియబడవు. మోహితులైన దేవగంధర్వులును మిథ్యాజ్ఞానగర్వితులై యుందురు. చెరుకుగడ మాధుర్యమువలె మంత్రమాధుర్యము హృదయగతమై యుండును.

ఆననమున మంత్రోచ్చార లక్షణముండును. ఇత్యాది విషయ విస్తరము గ్రంథాంతరములలో చూడదగినది. ఈవిధముగా అనివార్యముగా జీవులందుండు పశుత్వము యజ్ఞాది కర్మల ద్వారమున గాని తొలగించదగినది. అప్పుడా పశుప్రాయ జీవులందలి పాశవ వాసనలు తొలగి వారు కృతార్థులగుదురు. అమ్మవారు సర్వజీవులను తన వాగర్థమయ శరీరమున ధరించియుండును. వారికి పశుత్వము తొలగుసమయమాసన్నమయినప్పుడు ఉదరమునందలి (గర్భిణిగానున్నప్పుడు) పిదప ఉరమున పశుభావముననున్న వారిని యథోచితముగ రక్షించుననుట ఉర ఉదర శబ్దముల ద్వారమున ధ్వనింపఁజేయఁబడినవి.

**అవతారిక:–** పై శ్లోకమున పుర్యష్టకమందలి మనోబుద్ధ్యహంకారములు అపఞ్చీకృత

భూతములు లింగ శరీరగతానుభవముల వాసనలతో మోక్ష పర్యంతము స్యూతములగుట చెప్పఁబడినది. ఈ శ్లోకమున అంగ శరీరము విశ్రమించు సంవృతి (నిద్ర) మయ శరీరము భక్షకమని, లింగము యొక్క స్థూల భావాపత్తి రూపమైన విరాట్ఛరీరము భక్ష్యమని చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ సర్గసంహృ (వృ) తిశరీరయోర్ద్వయో**
**ర్భక్ష్యభక్షకపదస్థయోస్తయోః।**
**అన్తరేవమహమాస్థితశ్శివే!**
**ధీమనోక్షవపురర్పితం త్వయా॥ 64**

**ప్రతిపదార్థము:–** శివే=ఓ శివా, భక్ష్యభక్షక పదస్థయోః=భక్ష్య భక్షక పదములందున్న, తయోః=ఆ, సర్గ సంవృతి శరీరయోర్ద్వయోః=స్థూలకారణ శరీరముల యొక్క పైన, అంతః=లోపల, ఏవమ్=ఇట్లు, అహమ్=ఆత్మ, త్వయా=నీచేత, అర్పితమ్=అర్పింపఁబడిన, ధీమనోక్షవపుః=మనోబుద్ధీంద్రియమయమైన శరీరము, అర్పితమ్=అర్పితమైన దానిని, ఆస్థితః=ఆశ్రయించియుండును.

**తాత్పర్యము:–**సర్గ (స్థూల) శరీరము భక్ష్యము, సంవృతి (కారణ) శరీరము భక్షకము. ఈ రెంటి నడుమ మనోబుద్ధీంద్రియమయమైన మనోబుద్ధీంద్రియ ప్రధానమైన అంగశరీరము నీచే అర్పింపఁబడగా దాని నాశ్రయించి ఆత్మ యున్నాడు.

**వివరణము:–** 1) క్రమప్రకాశిక ననుసరించి సర్గ శరీరము స్థూల పఞ్చభూతమయమైన శరీరము జాగ్రదవస్థా ప్రధానము. వ్యష్టి స్థూల శరీరమునభిమానించు ఆత్మ విశ్వుడు. సమష్టి స్థూల శరీరమునాశ్రయించు ఆత్మ వైశ్వానరుడు లేక విరాట్టు అనఁబడును. సంవృతి అనగా ఆవరణము. నిద్ర, కారణ శరీరము. దీని వ్యష్టి నభిమానించు ఆత్మ ప్రాజ్ఞుడనఁబడును. దాని సమష్టినభిమానించు ఆత్మ అవ్యాకృతుడనఁబడును. వ్యష్టులు జీవరూపులు. సమష్టులీశ్వరరూపులు. నిద్రలో స్థూల శరీరము అనుభవింపఁబడదు. అనగా అది నిద్ర లేక సంవృతి చేత మ్రింగబడినది. కావున ఆ సంవృతి భక్షక శరీరము మ్రింగఁబడినది. సర్గశరీరము కావున అది భక్ష్య శరీరము. వీని మధ్యన మనోబుద్ధీంద్రియ ప్రధానమైన సూక్ష్మశరీరమమ్మవారిచే అర్పింపఁబడగా దానినాశ్రయించి ఆత్మ (ఈశ్వరుడు లేక జీవుడు) ఉండును.

దివ్యచకోరిక ననుసరించి నాదనవక, వాగర్థ, షడధ్వమార్గభేదముననున్న



శైవ, జైవ, పాశుక సంసారములో పరస్పరము భక్ష్యములు, భక్షకములు ఐనవి. సృష్టి – సంహార క్రియామయ శరీరములు వెనుక చెప్పఁబడిన సిద్ధ మంత్రములకు తాదాత్మ్యమో అభేదమో ఏదో ఒక సంబంధముండును. సర్గశరీరము స్రష్టృ కార్యము. సంవృతి శరీరము సంహర్తృ / తిరోధాతృకార్యము. వీని మధ్యన అంతస్సాక్షిచే భాస్యమైన బహిరింద్రియ వేద్యమైన అనుభూత శాక్త శామ్భవాన్యతర ఉన్మనీ నాద నవకానందమూర్తి జీవసంసారమునొందగా విశ్రాంతి లక్షణమైన ఆణవ విసర్గ పురుష శ్రేష్ఠునకు కృత్యపంచకమునొనర్ప సమర్థమైన వెనుక చెప్పఁబడిన ధీమనోక్ష మయమైన సూక్ష్మశరీరము ఉన్మనీనాదనవక రూపిణివైన నీ చేతనే అనుగ్రహింపఁబడినది అని శ్లోకము యొక్క తాత్పర్యము.

2) శివే అను పదము అమ్మవారి సంబోధనముగా గాని అవిద్య నాశ్రయించి జీవుడైన శివునియందు అను అర్థమున శివశబ్దముయొక్క సప్తమ్యేక వచనాంతముగా గాని గ్రహింపఁదగినది. సర్గసంహృతి శరీరయోః అనుపాఠము నాశ్రయించి – సర్గశరీరమనగా, సంహృతి శరీరమనగా చిత్త ప్రలయ లక్షణ శాంభవ విసర్గాత్మకము అని అర్థము చెప్పబడినది.

ఉన్మనీనాద వాగర్థరూపిణి షడధ్వ ప్రకృతివియైన నీచేత ధీమనోక్ష శరీరము అర్పింపబడిన భేదవాసనచే ఉరమునగాని ఉదరమునగాని ఉన్న పశు పతుల సమముగానే ధీమనోక్షములు శరీరమర్పింపబడినందున నీకు పక్షపాతము లేదు అని ఈ శ్లోకమున వ్యంజింపఁబడుచున్నది.

**అవతారిక:–** పై శ్లోకమున సర్గసంవృతి (సంహృతి) శరీరముల భక్ష్య భక్షకత్వము తన్మధ్యగత సూక్ష్మ శరీరమమ్మవారిచే అర్పింపఁబడినదని చెప్పఁబడినది. ఈ శ్లోకమున అర్పింపఁబడిన సూక్ష్మశరీరమందలి ఇంద్రియములు రాజైన జీవుని పుత్రులని చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ రాజనాత్ప్రకృతిరఞ్జనాచ్చ మాం**
**రాజసంజ్ఞమనుబోధకర్మణోః।**
**షట్త్వయా పృథగమీ ప్రవర్తకాః**
**పుత్రభావమధిరోపితాశ్శివే॥ 65**

**ప్రతిపదార్థము:–** శివే=ఓ శివా!, రాజనాత్=ప్రకాశించుటవలన, ప్రకృతిరంజనాత్=

ప్రకృతిని రంజింపఁజేయుటవలన, రాజసంజ్ఞమ్=రాజు అను పేరుగల, అనుబోధ కర్మణోః=అనురూప జ్ఞాన కర్మలయందు, ప్రవర్తకాః=ప్రవర్తింపఁజేయు, అమీ=ఇవి, పుత్రభావమ్=పుత్రభావమును, అధిరోపితాః=ఆరోపింపఁజేయఁబడినవి.

**వివరణము:-** క్రమప్రకాశిక ననుసరించి రాజనాత్ అను పదమునకు స్వపర ప్రకాశనము వలన అని అర్థము చెప్పఁబడినది. జీవాత్మకు స్వప్రకాశకమున్నది. కావున జీవుడు రాజసంజ్ఞగలవాడు. ప్రకృతి రంజనము అనగా ప్రజలను రంజింపజేయుట రాజ ధర్మముగా లోకమున అంగీకరింపఁబడియున్నది. జీవుడు కూడ బుద్ధి సన్నికృష్టములైన శబ్దాదివిషయములను ప్రకాశింపఁజేయును. కావున జీవునకు రాజధర్మమేర్పడియున్నది. ఇంతేగాక జడములైన ఇంద్రియములను గూడ ప్రకాశింపఁజేయువాడు. రాజు తన ఆంతరంగికాధికారుల సాయమున ప్రజలను రంజింపఁజేయును. ముందుగా కొందఱ నధికారులుగా నియమించి వారిని ప్రకాశించునట్లుగా వారు ఇతరుల రంజింపఁజేయునట్లుగా సిద్ధపరచి వారి ద్వారమున ప్రజలను రంజింపఁజేయునట్లు, జీవుడు ముందుగా ఇంద్రియములకు తన ప్రకాశముచే ప్రకాశకత్వమును కలిగించి ఆతర్వాత విషయములైన శబ్ద స్పర్శాదులను అనుభవించును. అందువలన స్వపరప్రకాశకుడైన జీవునకు రాజసంజ్ఞ ఉచితమగుచున్నది.

జ్ఞానకర్మలందు మనస్సు ద్వారా జ్ఞాన కర్మేంద్రియము జీవునకు ప్రవర్తింపఁ జేయునవి ఇంద్రియములు. రాజపుత్రులెట్లు రాజు యొక్క ప్రవర్తనములో సాయపడుదురో అట్లే ఇంద్రియములు అమ్మవారిచేత జీవునికి ప్రవర్తనసహాయులుగా పుత్రులవలె సాయపడుగాక అని వానికి పుత్ర భావమారోపించినది. అమ్మవారు తల్లి కొడుకుమీది వాత్సల్యమున ఆతనికి సహాయకుల నియమించి కొడుకు సుఖించుట కవకాశమిచ్చునో అట్లే అమ్మవారు జీవునకు సహకరించు జ్ఞాన కర్మలందు ఆతని ప్రవర్తింపఁజేయు జ్ఞానకర్మేంద్రియముల నియమించినది. అంతేగాక మీరు రాజపుత్రులు అని వారికి అధికమైన గౌరవమును కూడ కల్పించినది. జీవుడు మనస్సు ద్వారా ఇంద్రియములు విషయములందు ప్రవర్తింపఁ జేయును. ఆ పది ఇంద్రియములు (జ్ఞానేంద్రియములైదు కర్మేంద్రియములైదు) తమ తమ విషయములందు ప్రవర్తించును. జ్ఞానేంద్రియములు మనస్సహితములై **మనష్షష్ఠానీంద్రియాణి** అను సూక్తి ననుసరించి మనస్సు అను జ్ఞానేంద్రియముతో



కలసి జ్ఞానేంద్రియములు ఆఱు అగుచున్నవి. అట్లే కర్మేంద్రియములును ప్రవర్తింపఁ జేయును. గావున మనస్సుతో కలిపి కర్మేంద్రియములును ఆఱు అగుచున్నవి. మనస్సు ఉభయేంద్రియమని మనస్మృతిలో చెప్పఁబడినది. శ్లోకములోని షట్ అనుపదము ఉభయేంద్రియములాఱు అని తెలుపును.

దివ్యచకోరిక ననుసరించి పై శ్లోకమున పాశుపతాది శైవతంత్రముల ద్వారమున జీవుని పశుత్వము వర్ణించఁబడినది. వైదికముగా కూడ జీవుని పశుత్వమును చెప్పదలచి ఈ శ్లోకమున జీవుని రాజత్వము ఇంద్రియముల తత్పరివారత్వము వర్ణింపఁబడుచున్నది. రాజువంటి ఆత్మ విశ్వోత్తీర్ణము కర్మ జ్ఞానేంద్రియ(చక్ర)ముల క్రియాజ్ఞానమయ (సర్వాఙ్గములు క్రత్వర్థములు కావున) వానికి వేదమున యజ్ఞపశుత్వము శ్రుతులలో వర్ణింపఁబడినది. పశుపతి అన్ని చక్రములకు రాజు. ఇంద్రియాదులు పరివారము పరివారములోని రాజమండలము నకు వలె ఇంద్రియతతకి రాజపుత్ర సంజ్ఞలని చెప్పఁబడుచున్నది. సాధారణముగా రాజు తన పుత్రలనే సామంతరాజులుగా నియమించును.

ప్రకాశానందమూర్తిమయ సమష్టి బృందచక్రరాజ వర్ణనకు బీజముగా ఈ శ్లోకము భాసించుచున్నది. **'రాజృ(రంజనదీప్త్యోః)** అను ధాతువు నుండి నిష్పన్న మైనది రాజశబ్దము. ఉన్మనీనాదమున (ముఖ్యప్రాణ రూపమున) స్వయముగా ప్రకాశించుటవలన వాగర్థరూప ప్రకృతిని నాద ప్రకృతిని రంజింపఁజేయుట వలన ఈ శ్లోకము మహేశ్వరుడు రాజు అని చెప్పును. సాధారణముగ విద్యలు పదునాలుగు అని చెప్పఁబడును. అవి నాలుగు వేదములు, ఆరు వేదాంగములు (11) మీమాంస, (12) న్యాయము, (13) పురాణము, (14) ధర్మశాస్త్రము అనునవి ఆయుర్వేదాదులు నాలుగు కలసి విద్యలు పదునెనిమిది అనుట కూడ గలదు. చతుర్దశ భువనముల ప్రకృతులైన వాగ్రూపములు. వీని రంజనము ప్రకృతి రంజనమే. వానిలో **ఇతి వేదాస్త్రయీ** అను సూక్తి ననుసరించి వేదములు మూడుగా విభజించినపుడు విద్యల సంఖ్య పదమూడగును. మహేశ్వర సూత్రములలోని తొలినాలుగు సూత్రము లలో పదుకొండు అచ్చులు చెప్పఁబడినవి. వానికి బింద్వనుస్వారములు కలుపగా వాని సంఖ్య (13) పదమూడగును. ఈ పదమూడు స్వరములు ప్రకృతి స్వరములు. వీని రంజనము వలనను నాదప్రాణస్పందాత్మకుడైన మహేశునకు రాజత్వ మన్వర్థమగును. ప్రకృతి అనగా నాద ప్రకృతి. ఆ ప్రకృతి

రంజనమునను మహేశునకు రాజత్వ, మన్వర్థము. వాగర్థ త్రిపుటికిని త్రిగుణ ప్రకృతికి త్రివృత్తైన ఓంకారము ఇందలి వర్ణత్రయమునకు రచయిత తనను అభిన్నునిగా భావించి మామ్ అని ఈ శ్లోకమున చెప్పుకొన్నాడు. కావున 'మామ్' అనుపదము ఆత్మను అను అర్థమునిచ్చును. 'మామ్' అను నన్ననుసరించి అనగా (నా) ఆత్మను అనుసరించి అని అర్థము. బోధకర్మలనగా వెనుక చెప్పఁబడిన సాంఖ్యయోగ మార్గములు ఆ జ్ఞానకర్మలకు విడివిడిగా ప్రవర్తకత ఉన్నది.

వెనుక **దేశకాల కలనేత్యాది** శ్లోకమున అధ్యారోపాపవాదముల ప్రవృత్తి నివృత్తి మార్గములు పరస్పర విరుద్ధములైన ఈ మార్గముల భేదమున విడివిడిగా ప్రవర్తకము మరియు నివర్తకమునైనవి. మనస్సహిత కర్మేంద్రియ షట్కము బుద్ధి సహిత జ్ఞానేంద్రియ షట్కమును వాగర్థజననాది కృత్య పఞ్చకాత్మకమైన కర్మయందు ప్రవర్తించు క్రియాత్మ మనస్సహిత జ్ఞానేంద్రియ షట్కము జ్ఞానమార్గ పుత్ర విభావమును బుద్ధిసహిత కర్మేంద్రియషట్కము కర్మమార్గ పుత్రభావమును అధిరోహితములు. అపిరోపితా అనుపాఠమును స్వీకరించి బ్రహ్మాది సిద్ధ పఞ్చక వామాది శక్తి పఞ్చకము అను రెండింటికి అభిన్నమైన ఉన్మనీనాదాత్మక భావము పూర్వ శ్లోకోక్త పశుపతి భావము మాత్రమే గాక రాజ-రాజపుత్ర భావమును కూడ కలవీ ఇంద్రియములు అని అపి శబ్దముచే తెలియఁబడును.

లౌకిక సామ్రాట్టు ఏ రాజ్యమున తన పుత్రులనెట్లు స్థాపించునో అట్లు అధ్యాత్మ సామ్రాజ్యమున ఆత్మ యౌవన రాజ్యమునొందిన ఈ ఇంద్రియముల స్థాపించి పాలించును. పున్నామ నరకమున బడకుండ కాపాడు పుత్రులవలె ఆత్మ పదమునివి కాపాడును. కావున వీనికి పుత్రత్వము చెప్పఁబడినది. అనగా పూర్వ శ్లోకమున చెప్పఁబడిన పశుభావ నరకము నుండి ఉద్ధరించి కాపాడినందున వీనికి పుత్రభావమారోపింపఁబడినది. లేక ప్రాప్తింపఁజేయఁబడినది. ఈ పుత్ర భావము శాక్తానుత్తర విసర్గ వాగర్థనాద ప్రకృతియైన అమ్మవారిచేతనే కలిగించ బడినదని వేరుగా చెప్పనక్కఱలేదు.

**తత్పుత్రా రాజపుత్రాఃస్యురింద్రియాణి షడేవ హి**(మహేశుడు రాజు కావున ఆరింద్రియములు మహేశుని పుత్రులు. కావున రాజపుత్రులగుదురు) అని మహార్థ మంజరీ పరిమలమునను చెప్పఁబడినది. యోగమార్గమున బుద్ధిసహిత కర్మేంద్రియములు సాధికారములు మనస్సహిత జ్ఞానేంద్రియములు నిరధికారములు



సాధికారత అనగా కర్మచేయుట. నిరధికారత అనగా కర్మచేయకపోవుట అని స్పష్టముగా తెలిసికొనవచ్చును. ముక్తులకు జగద్వ్యాపార వర్జమైన ఈశసమత్వ ముండును. జగద్వ్యాపారమనగా శాక్తదృష్టిలో కృత్య పఞ్చకము. అనగా జడజగమును సృజించుట పాలించుట మొదలగు బాహ్య వ్యాపారార్హత ఉండదు. కాని ఆంతరవ్యాపారమైన వాగర్థ సృష్ట్యాది విద్యామయ కృత్య పఞ్చకమున అర్హత లేదనరాదు. ఎందుకనగా అందే ఈ ముక్తుని సంకల్పమున పితరులు వచ్చి చేరుదురని చెప్పినదానికి విరోధము కాకూడదు గదా! అట్లే తంత్రమున ఉన్మనీనాదాను సంధానపరునకు జడజగత్సృష్ట్యాది కృత్యపఞ్చకమున అధికారము లేకున్నను వాగర్థ సృష్ట్యాది కృత్యపఞ్చకమున అధికారము లేదనరాదు. ఈ అధికారములేనిచో గురువులచే శిష్యులను శిక్షింపఁబడు అవకాశముండదు. విద్యా సంతానాభివృద్ధియునుండదు. ద్వాదశాంత నాదకల్పమైన మనోన్మనీ బిందు శరీరముగల శివాభావాపన్నులకు వాగర్థ విద్యామయకృత్య పఞ్చకాధికారమున్నదని చెప్పుటకీ వివరణ ముద్దిష్టమైనది.

సాధారణముగ యోగమనగా పాతఞ్జల యోగమని, సాంఖ్యమనగా కపిల సంఖ్యమని లోకమున రూఢిగలదు. కాని ఈ మార్గములు అర్ధవైదికములు. లేక స్మార్తములు మాత్రమే. కావున కొంతవరకే ఉపయోగించును. కాని పూర్తిగా ఉపయోగించవు. కొంతవఱకు వైదిక క్రియా మార్గమున ఉపయోగపడును. మరియు దయానందాద్యాధునికులచే చెప్పఁబడిన సాంఖ్యయోగములవలె పాఞ్చభౌతిక ప్రకృతి యందును విశ్రమించునట్టివికావు. ఆధ్యాత్మిక రాజ విద్యా రాజగుహ్య యోగాపర నామకమైన వైదిక విద్యారాజవిశుద్ధ మార్గములు. కావున అవైదికములే. కావున తిరస్కరింపఁబడినవిగా భావింపఁదగినవి. వైదిక విద్యారాజ మార్గమున గురు శిష్య భావాత్మక బ్రహ్మభావము త్రయామార్గ ప్రమేయము. రాజ ప్రకృత్యాత్మక క్షాత్ర భావము షడధ్వమార్గ ప్రమేయము. పశుపద్యాత్మక వైశ్యభావము తాంత్రిక విద్యాంతర ప్రమేయము సేవ్యసేవక మూర్తిమయ శూద్రభావము భాషామయ ప్రబన్ధ ప్రమేయమునైన చతుర్విధ వాగర్థ ప్రమేయమంతయు ఆత్మమాత్ర విశ్రాంతమే ఐనను వైదిక బ్రహ్మభావాపత్తి మార్గమునకు సాక్షాత్తుగాగాక పరంపరగా మాత్రమే ఉపయోగించును. అయినను శిష్యాఘబుద్ధి వైశారద్యమునకై పై ప్రమేయమంతయు గురువుల ద్వారా విస్తరింపఁజేయఁబడినది.

**అవతారిక:–** పై శ్లోకమున ఇంద్రియముల రాజపుత్ర భావారోపము శక్త్యనుగ్రహము అని చెప్పఁబడినది. ఈ శ్లోకమున కాదిశక్తి మత (కాలీ శక్తి మత) సిద్ధ మండలమున నుండిన అమ్మ యొక్క 'జ్ఞాన కర్మలందు జీవుని ప్రవర్తింపఁజేయు' అనుగ్రహము చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ (ఊః)ఔర్ధ్వ వాహమయ బిన్దులక్షణః (ం)**
**ప్రాణసూర్య ఇహ చిద్ద్విషట్కలః।**
**తత్కళాధరతనుర్గురుక్రమే**
**త్వం ప్రకాశతను సిద్ధమణ్డలమ్॥ 66**

**ప్రతిపదార్థము:–** ఊర్ధ్వవాహమయ బిన్దులక్షణమ్ (ః)=ఊర్ధ్వవాహ వికార (చితిశక్తి పరిణామ) ప్రాణ (పరిణామ భూతము). అపరబిన్దువు స్వరూపముగాగల, చిద్ద్విషట్కలః=చిద్రూపములైన ద్వాదశకలలుకల, ప్రాణసూర్యః=సూర్యాత్మక ప్రాణము, (కించ=మరియు), తత్కలాధరతనుః=ఆతని కలల ధరించు సోముడు శరీరముగా గల, ఇహ=ఈ, గురుక్రమే=గురుక్రమమున, ప్రకాశతను=ప్రకాశమే శరీరముగా గల, సిద్ధమణ్డలమ్=సిద్ధమండలమును, త్వమ్ఏవ=నీవే.

**తాత్పర్యము:–** ఊర్ధ్వవాహము నుండి రూపొందిన బిందు స్వరూపిణివి, చిద్రూపము లైన పన్నెండు కలలు గల సూర్యుడు, సోముడును, ప్రకాశము శరీరముగా గల సిద్ధమండలమును నీవే అయియున్నావు.

**వివరణము:–** దివ్యచకోరిక ననుసరించి మనోబుద్ధి సహిత జ్ఞానకర్మేంద్రియ షట్కములు ప్రాకృతములు అప్రాకృతములు స్వరవర్ణములునైన వైదిక సాంఖ్య యోగ పరామర్శ వర్త్మలైన ప్రసరణ ప్రతిసంచరణ సంప్రదాయ ప్రవర్తక పరౌఘ మహౌఘ దివ్యసిద్ధమానవ శిష్యౌఘమను పేరుగల గురుషట్క మిథున రూపాత్మ కాళీకాల పరశివ మిథునాత్మకము త్రయోదశ రశ్మి రూపమును, పఞ్చవాహ మహార్థ క్రమరూప బృందచక్రముయొక్క బీజము, నాదనవకముల యొక్క గురుపుష్ట సంకోచ క్రమమునకుపయోగించు ద్వాదశాంత మహాబిన్దు విశ్రాంతితో ద్వాదశాదిత్య మయాత్మ సంపద్విస్మృతి అను పేరుగల నష్టసంతతిత్వదోషరాహిత్యమున వాగర్థ మయ శివసంసార వృక్షమూలము నిరూపించుచున్న సూర్యుడు ప్రాణము, చంద్రుడు అపానము, ఊర్ధ్వవాహనుడు అధోముఖుడు వహ్ని బిన్దు మయ నాదమూర్తి చక్రము



నను అగ్నిషోమకలా విపర్యయమును సూచించును అగ్నీషోమ నాదమూర్తి మయ ప్రకాశచక్రము యొక్క సిద్ధౌఘ గురుమండలాత్మకత ఈ శ్లోకమున వివరింపఁ బడుచున్నది.

2) ఔర్ధ్వవాహమయ బిన్దు లక్షణమనగా స్వరవర్ణనాద క్రమమున అ ఇ ఉ (ణ్) ఋ ఌ క్ ఏ ఓ ఙ్ అను మూడు సూత్రములలోని ఏడు స్వరములు క వర్గము, చ వర్గము, ట వర్గము, త వర్గము, ప వర్గము, య వర్గము, శ వర్గము అను వీనికి మూల భూతములైనవి. వీనిలో యకారాదులు క్షాంతములు విసర్గాంతములు అగ్నికలలు, కకారాదులు భాంతములు సూర్యకలలు, అకారాదులు సోమకలలు. వీని మూలములునైన అగ్ని సూర్య సోమ బిన్దువుల లక్షించునవి. ఔర్ధ్వవాహమయ బిన్దులక్షణ అనిచెప్పఁబడును. ఆ మూడు బిన్దువులతో కూడినది ప్రణవస్వరము(ఓం). నాదమూర్తిమయ చక్రము పై బిన్దువులు లక్షణములుగా గలది అగ్ని ఊర్ధ్వగతిగలది సూర్యసోములు తిరశ్చీగతులు గలవారు, అధోవహనము (గతి) గలది అపాన వృత్తి అగ్ని ఊర్ధ్వనాథోగతిగల ప్రాణవృత్తి రూపుడు. సూర్యుడు తిరశ్చీన గతిగల వ్యానవృత్తి రూపుడు. సోముడు అధోగతిగల అపానవృత్తి రూపుడు. ప్రాణవృత్తిమయము వహ్నిబిందువు. శ్లోక ప్రథమపాదమున చెప్పఁబడినది. నాద మయమూర్తి చక్రమనియు చెప్పవచ్చును.

పూర్వము చెప్పఁబడిన చిన్మయ జ్ఞానకర్మేంద్రియ షట్కద్వయమనగా పన్నెండు జ్ఞానకర్మేంద్రియములు చిద్ద్విషట్కల అని విభజించి, చిత్తు ద్విషట్కమును గ్రహించునదని అర్థము చెప్పఁబడినది. ప్రాణసూర్యుడు ఔర్ధ్వవాహ ప్రాణబిన్దుకమైన అగ్నిమూర్తి చక్రములు అను ప్రకాశ చక్రము స్వరూపముగాగలవాడు ప్రాణసూర్యుడే అని అర్థము. తత్కలాధరతనోః=అను పాఠమునాశ్రయించి ఆపమునకు తత్కలాః =అగ్నిసూర్యకలలను ధరించు తనువుగలవానియొక్క అని అర్థము. క్రమముగా శుక్ల పక్షము పున్నమ వరకు విస్తరింపఁజేయును. కృష్ణపక్షమున క్షీణింపఁజేయును అందువలన అగ్ని సూర్యకలల ధరించువాడు సోముడు పదునారు స్వరములన్నియు చంద్రకలలే అనుట వ్యావహారికము. తత్కలాధారుడైన చంద్రునియొక్క అని గాని ఆ చంద్రుడు శరీరముగాగల అమ్మవారి యొక్క అనిగాని, ఆ పదమునకు అర్థము చెప్పవచ్చును. గురుక్రమే తత్కలా + అధరతను అని విభజించి తత్కలలను సూర్యుడుగా తిరస్కరించు రాత్రి తుల్యమైన అమావాస్యయందు క్షీణింపఁజేయువాడు

అనగా కృష్ణప్రతిపద మొదలు శుక్ల ప్రతిపద వఱకు **ప్రథమాం పిబతే వహ్నిః ద్వితీయాం పిబతే రవిః** ఇత్యాది ప్రకారమున క్షీణింపఁజేయువాడు అని అర్థము చెప్పఁబడినది.

**అగ్నిర్ వా వాదిత్యస్సాయమ్ ప్రవిశరతి** (అగ్నిని సూర్యుడు సాయము ప్రవేశించును.) **ఉద్యంతం వా వాదిత్య మగ్నేరనుసమారోహతి** (ఉదయించు సూర్యునితో పాటు అగ్ని పైకెక్కును) అను శ్రుతి ననుసరించి అగ్ని సూర్య కల శాస్త్రానుభవసిద్ధమగుటచే దొక్కటే మూర్తికల. తన్మూర్తి కలారూపిణివైన నీవు ప్రకాశతను సిద్ధమండలమ్ **'స్వయం ప్రకాశతే చ'** అను విధమున వివరింపఁ బడినది. స్వ స్వరూపము కావున స్వ ప్రకాశతను అని చెప్పఁబడినది. సిద్ధ మండలమున కదివిశేషణము. షడధ్వాభిన్న షడ్భావ వికారరూపమున క్షీణించునది. తరువాత సిద్ధులనుగా కాలక్రమమున దేవీమాన సిద్ధమండలరూపమున సిద్ధింపఁ జేయునది అని సప్రకాశతనుసిద్ధమండలమ్ అను సమాసమునకర్థము చెప్పఁ బడినది. సిద్ధిమండలమ్ అనుపాఠమును స్వీకరించి ప్రకాశతను శబ్దమునకు ప్రకాశ చక్రము అని అర్థము. అదియే సిద్ధిమండలము. అణిమ మొదలైన అష్టసిద్ధుల సర్వత్రిఖండ ముద్రాశక్తి వఱకు గల త్రైలోక్యమోహనమను పేరుగల భాను మండలము ప్రకాశ చక్రరూపము గావున మొదట పూజింపఁదగినదానవు నీవే అని భావము. మండల త్రయాత్మకమైన స్రోతస్త్రయమున అధోవమననాద లక్షణాపాన నాదమున యథేచ్ఛముగా త్రివృత్ప్రాణ వాఙ్మయాగ్ని బిందురూపము త్రివృత్ప్రాణ మయ సర్వోత్కృష్ట ద్వాదశాన్తపర్యన్తనాదాత్మకత్వము దేహమయ ప్రకాశ చంద్రసూర్య తదుభయ కలాధరత్వము కూడ ఉన్నదని సిద్ధించినది. దేహ మయ ప్రకాశ శివ చంద్రునకు ఉభయవికలాధరత్వమును సిద్ధించినది.

చరణము పాదమను పర్యాయములుగల 'షోడశి' కాల పురుషచన్ద్రుని కలల సమూహము పూర్వ శ్లోకమున విప్పఁబడిన సూర్యమకుట పదాది సకల ఖగోళధారకమగుటచేత శివశక్తి సదాశివాది కలాన్తము.

తత్త్వసప్తకమును సృజించు వామేశి అనఁబడు కాలి శబ్దార్థ కాల రూపత్వము. కాశ్యపుడను నామముగల అష్టమసూర్యుడు కాలసూర్యుడు కావున పరశివకాల రూపత్వమును అరుణ ప్రపాఠకమున తైత్తిరీయారణ్యక ఖండమున చెప్పఁబడినది.



భగవద్గీతలో **నక్షత్రాణామహం శశీ** అని ప్రాజాపత్యాభిజిన్నక్షత్రాత్మకత్వము చెప్పఁబడినది. శామ్భవ బిందువు కామకాల స్వరూప భావనయందు అగ్నీషోమాత్మక విసర్గబిందు ద్వయము దేవతా స్థూలరూపము. అది అమ్మవారి కుచద్వయ రూపముగా అనుస్వారాత్మకమిశ్ర సూర్యబిందువు ముఖముగా కూడ పరశురామ కల్ప సూత్రమున చెప్పఁబడినది. ప్రకాశానందమూర్తిమయ వాగర్థ చక్రిత్రియోపాసన యందు వాగర్థ పూర్ణానుస్వారబింద్వాత్మరూపమున అగ్నీషోమవాగర్థ వికార బిందువుల మధ్య సోమబిందువునకు నాదచక్రాభిన్నముగ మధ్య స్థితియేర్పడును.

మూర్తి చక్రము ఆగ్నేయబిన్దువు సకల పాశవద్వైత సంసార మృత్యు దాహకము. విలయాధిష్ఠానము శాంభవ విసర్గ విలాసము కావున చివఱకు నివేశించుట వలన సిద్ధించును. ఈ ఉపాసనా ప్రకాశ భేద రహస్యము ప్రకాశింపఁజేయుట సర్వయంత్ర సిద్ధాంతప్రమేయమని కూడ సూచింపఁబడినది. పరార్థాహంకారము కామకలాధో భాగము. అది అధోవహన నాదరూపము. అపాన సోమమయము. మనోబుద్ధి యుతదరేంద్రియములు కూడ ద్వాదశ సంఖ్యా విశ్రాంతములగుటచే కృత్యనాశము చేత వాసనాకాశము కూడ కాగానుష్ట సంతతిత్వమేర్పడును. కాలీకాల యుగలాత్మక బాహ్య భౌతిక కాలస్వరూపమున చాంద్రసౌరాది వ్యావహారిక కాలమాన సిద్ధమాన సంఖ్యయందును త్రయోదశ రూపము కూడ ఉన్నది.

**అవతారిక:–** పై శ్లోకమున అమ్మవారు ప్రాణసూర్యరూప అని చెప్పఁబడినది. ఈ శ్లోకమున అపానసోముని ఆనంతాత్మషోడశకలాకర్తృత్వము చెప్పఁబడుచున్నది.

దివ్యచకోరిక ననుసరించి పై శ్లోకమున అగ్నీషోమమూర్తి కలలతో కలిపి ద్వాదశకలాత్మక చిన్మయోర్ధ్వవాహ బిన్దులక్షణమైన నాదనవక సమష్టిమయ ముఖ్య ప్రాణసూర్యుడు ప్రకాశచక్రముగా వర్ణింపఁబడినాడు. ఈ శ్లోకమున అధోవహన నాదలక్షణమైన మనోమయాపానసోమమండలము తద్భోగ్య విగ్రహము చెప్పఁ బడుచున్నది. అనగా వెనుక చెప్పఁబడిన పదునాఱు స్వరములు కాలనిత్యా రూపములుగా చెప్పుటచే అది (సోమమండలము) ఆనందామయ చక్ర రూపమని చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ యస్త్వధోవహన నాదలక్షణోఽ**
**పాన సోమ ఇహ భోగ్యవిగ్రహః।**

**తస్య షోడశకలాః కృతాస్త్వయా**
**నన్ద(నాద)చక్రతనవో గురుక్రమే॥** 67

**ప్రతిపదార్థము:–** అధోవహన లక్షణః=అధోవహన నాదలక్షణముగాగల, అపాన సోమః=అపానచంద్రుడు, ఇహ=ఇచట, భోగ్యవిగ్రహః=అనుభవింపఁదగిన శరీరము, తస్య=దా(వా)ని యొక్క, షోడశకలాః=పదునాఱు కలలు, గురుక్రమే=గురు క్రమమున, త్వయా=నీచేత, నాదచక్రతనవః=నాదచక్రతనువు(లు)గా, కృతాః=చేయ బడినవి.

**తాత్పర్యము:–** అధోవహన నాదలక్షణమైన అపానసోముడు ఇచట భోగ్యము. ఆతని షోడశకలలు నీచేత గురుక్రమమున నాదచక్రతనువులుగా చేయఁబడినవి.

**వివరణము:–** క్రమప్రకాశిక ననుసరించి ఓ అమ్మా! ఎవడైతే ఊర్ధ్వవాహమయ బిందువైన ప్రాణ సూర్యునికంటే విలక్షణుడైన భోగ్యవిగ్రహుడు అనగా తెలిసికొన దగిన (జ్ఞేయ) అధోవహననాదలక్షణుడైన అనగా అధోవాహమయ నాదరూపుడు అపానసోముడో అతనికి గురుక్రమమున ఆనందచక్రమయ తనువులు విమర్శ రూపములుగా అమ్మవారిచే చేయఁబడినవి. మహానయ ప్రకాశమున ఆఱవ ఉదయమున విమర్శము చంద్ర ప్రసరానందమయచక్రమనియు చెప్పఁబడినది. ఆ సోముని షోడశ కలలు నీతో చేయఁబడినవని చెప్పుటచేత ఇతరులు చేయలేని మహాకార్యము నొనర్చినవని అమ్మవారి స్తుతి ఈ శ్లోకమున చేయఁబడినదని స్పష్టము. అపానసోముని భోగ్యవిగ్రహత్వము తంత్రాలోకమున 'చంద్రకలలు సూర్యరశ్ములలో చేరినవే ఐనందును, చంద్రుడనగా భోగ్యమునకంటె భోక్తృయైన మాతకంటె వేరుకాదు. ఒకే తత్త్వము భోక్తృభోగ్యభావమున రెండు విధములుగా వ్యవస్థితమైయున్నది. ఘటమునందలి భోగ్యత స్వభోగ్యత కాదు. అది మాతృభోగ్యమే. ఘటాదికము భోగ్యమని చెప్పఁబడుచున్నది. పై వివరణ మందు మాతయనగా ప్రమాత అని భావించవలెను. జ్ఞేయమనగా జ్ఞాతయొక్క విశ్రాంతిరూపమే. జ్ఞేయత్వమనుట సారము. ఉద్దేశ్యవిధేయభావభేదమున మరొక విధముగా ఈశ్లోకమున వ్యాఖ్యానించ వచ్చును. అపానసోముని షోడశకలలని చెప్పఁబడు ఆనందచక్రమయ విమర్శ రూపములుగా చేయఁబడినవి. అని, లేక ఆతని ఆనంద చక్రతనువులే పంచదశ కలలు అయినను అవి పదునాఱుగా చేయఁబడినవి. ఈ



శ్లోకమున కృతాః అను పదముతో అన్వయించి విశేష్యములేని విశేషణములేవి అను అంశమున మూడు ప్రకారముల వ్యాఖ్యచేయఁబడును.

1) ఆనంద చక్రతనవః షోడశకలాః కృతాః

2) షోడశ కలాః ఆనంద చక్ర తనవః కృతాః

3) ఆనంద చక్రతనవః కలాః షోడశకృతాః – మొదటిదానిలో ఆనంద చక్రతనువులు ఉద్దేశ్యములు. షోడశ కలాః కలతాః అనునది విధేయము. రెండవ దానిలో షోడశకలాః అనునది ఉద్దేశ్యము. ఆనంద చక్రతనవః కృతాః అనునది విధేయము. మూడవ దానిలో ఆనంద చక్రతనవః కలాః అనునది ఉద్దేశ్యము. షోడశకృతాః అనునది విధేయము. ప్రాణసూర్యుని ద్వాదశకలలు ప్రాణము యొక్క ద్వాదశకలలు (మనోబుద్ధులు దశేంద్రియములు) సూర్యుని ద్వాదశ కలలు **(తపిని, తాపిని, ధూమ, మరీచి, జ్వాలిని, రుచి, సుషుమ్న, భోగద, విశ్వ, బోధిని, ధారిణి, క్షమ)** మరొక విధముగా ప్రాణకలలు ద్వాదశాఙ్గులగతి రూపములైనవి. హృదయ ప్రదేశము నుండి ద్వాదశాఙ్గుల పరిమితములైన ప్రాణమార్గములోని భాగములు.

అపాన సోముని పదునైదు కలలు తృటి రూపము షోడశికల శక్తిరూప అనపాయ (నశించనిది). దివ్యచకోరిక ననుసరించి ఇహ అనగా రాజన రంజన సామరస్యాత్మకమైన వెనుకటి సాంఖ్యమార్గమున గాని యోగమార్గమునగాని ఉన్న గురుక్రమవిషయమున అని ఒక అర్థము. ప్రకాశచక్రము పైన గణింపఁబడిన పర్యౌఘ మహౌఘ దివ్యౌఘ గురుక్రమమున లేక సిద్ధమానవ శిష్యౌఘ త్రయాత్మక వశిష్టవిమర్శౌఘ త్రయాత్మక గురుక్రమమున అను మరొక అర్థము చెప్పఁబడినది. యః అను శబ్దము తు శబ్దబలమున వెనుక చెప్పఁబడిన దానిని విడచి పూర్వప్రకాశ చక్రమున ఔర్ధ్వావాహమయ బిన్దు లక్షణమైన ప్రాణసూర్యుడు కాక అధోవహన నాదలక్షణుడైన అపానసోముడు అని అర్థము చెప్పవలెను. **అన(చలనే)** అను ధాతువునుండి పూర్వ ప్రకృష్ట చలనాత్మక ముఖ్యాత్మ యొక్క చలన ప్రకర్షమన అప్రచ్యుత స్వరూపుడగుటచే తత్స్వరూపమాత్ర విశ్రాంతిలక్షణమైన దాని నుండి లేక ప్రస్తుతము స్పందమాత్ర స్వరూపము నుండి ప్రచ్యుతము కావున అపగత చలనాత్మకుడు అపానసోముడని (అప+అన) అపా శబ్దములోని అప అను ఉపసర్గముచేత ధ్వనింపఁబడు అర్థము.

అధోవహన నాదలక్షణమైన అపానసోముడు భోగ్య విగ్రహరూపుడు. మనో

మయాంతరాత్మయందు **చంద్రమా మనసో జాతః** అను శ్రుతి చేత మనోమయ శరీరుడగుటచే విలక్షుడు లక్షణమాన్యమైన విశిష్ట లక్షణమైన మనోమయ శరీరమని పూర్వార్ధము యొక్క అర్థము. తరువాత క్రియాశక్తి రూపమున పరిణత జ్ఞానశక్తి కల అని ఒక అర్థము. జ్ఞానశక్తి రూపమున పరిణమించిన క్రియాశక్తికల అని మరొక అర్థము. ఎట్లైనను క్రియామయ భోగ్య శరీరమే అపాన సోమునిది అని గ్రహింపవలెను. ఈ లోకమున అపాన సోముడు భోగ్యహవీరూపుడు. పరలోకమున దేవతలకు అన్నమైనవాడు. రెండు విధములుగా కూడ అపానసోముడు అన్న రూపుడే. శాక్త శామ్భవానుత్తర విసర్గ ప్రాధాన్యమున పంచదశ తిథిద్వయాది కాల ప్రాణానృతర త్రివృత్పంచవాహ శరీరమునను వృద్ధిక్షయాల ననుభవించి తదుభయ సామరస్య రూపమున విశ్వోత్తీర్ణుడు కూడ నగు అధోవహన నాద లక్షణాపాన సోమునకు భోగ్యవిగ్రహత్వ మేర్పడును. ఇట్లు జ్ఞాన క్రియాయుత కర్తృకార్య క్రియాపంచవాహమయ భోగ్య విగ్రహమువలె అధోవహననాదలక్షణ సోముడును ఉండును.

ఆనంద చక్రతనవః ఆనంద చక్రమనగా సర్వానంద మయచక్రము (బైన్దవ చక్రము) ను విస్తరింపఁజేయునవి లేక సప్త స్రోతోమయ (వాగర్థ) నాద రూపమున క్షీణింపఁజేయునవి అని రెండు విధములుగ ఆ సమాసము వివరింపఁబడినది. జ్ఞాన క్రియామయ ప్రధాన వాగర్థ షడధ్వ త్రిపుటీనాద ప్రకృతివైన నీ చేత **'తదాత్మానగ్గం స్వయమకురుత తస్మాత్తత్సుకృత ముచ్యత ఇతి, యద్వై తత్సు కృతమ్, రసో వై సః రసగ్గం హ్యేవాయం లబ్ధ్వానందీ భవతి' కోహ్యేవాన్యత్ కః ప్రాణ్యాత్,యదేష ఆకాశ ఆనందో న స్యాత్,ఏషహ్యేవానందయాతి'** అని కలాపదము పదాఱు కలల చెప్పినది. కామేశ్వర్యాది మహా నిత్యాంత తిథ్యాది కాలశక్తి బోధకము అనుత్తరాకారాది విసర్గాంతః షోడశ స్వరూపములు అనగా అకారము మొదలు విసర్గ వఱకుగల పదాఱు అచ్చులు అనియు కలాపదము బోధించును. మనః కలలు అని మరియొక అర్థమును బోధించును. కృతాస్త్వయా అనుపాఠమునకు బదులు కృతాత్యయా అనుపాఠమును స్వీకరించి కృతాత్యయానంద చక్రతనవః అను సమాసము కృతః అనగా క్షీణింపఁబడిన అత్యయః నాశముగలది అను మరొక అర్థము చెప్పఁబడినది.

**అవతారిక:–** పై శ్లోకములలో ప్రాణసూర్యుల అపానచంద్రుల ఐక్యము చెప్పఁ



బడినది. ఈ శ్లోకమున ప్రాణసూర్య దివసోదయ ప్రయోజకత్వము అపానసోముని రాత్ర్యుదయ ప్రయోజకత్వము చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ వాసరేశరజనీశయోః కళా**
**శ్చణ్డి యావదుదయం వితన్వతే।**
**తావదేవ దివసక్షపోదయ**
**స్త్వత్కృతః ప్రకటగుప్త విగ్రహః॥** 68

**ప్రతిపదార్థము:–** చణ్డి=ఓ కోపస్వభావము గలదానా!, యావత్=ఎంతకాలము, వాసరేశరజనీశయోః=సూర్యచంద్రులయొక్క, కలాః=కలలు, ఉదయమ్= ఉదయమును, వితన్వతే=చేయునో, తావదేవ=అంతకాలమే, ప్రకటగుప్త విగ్రహః =ప్రకాశగూఢ విగ్రహము కలవిగా దివసక్షపోదయః=దివారాత్రోదయము, కృతః =చేయఁబడినది, త్వత్=

**తాత్పర్యము:–** సూర్యకలోదయము విస్తరించునంతవఱకు ప్రకట విగ్రహమైన పగటి ఉదయము, చంద్రకలోదయము విస్తరించునంతవఱకు గూఢ విగ్రహమైన రాత్ర్యు దయము నీ చేత చేయఁబడుచుండును.

**వివరణము:–** క్రమప్రకాశిక ననుసరించి రాక్షసులు ఆగమశాస్త్రవిముఖులు మొదలైన రాజస్తమః ప్రధానుల పట్ల కోపముచూపు దేవికి చండీనామము సార్థకము. వాసరేశుడు (ప్రాణసూర్యుడు) ప్రాణ స్వరూపుడు. సూర్యకలల ఉదయము, చంద్ర కలల ఉదయము క్రమముగా దివారాత్ర్యుదయములకు ప్రయోజకములు. పగలు విశ్వమంతయు ప్రకటముగా ఉండును. అది కాలి స్వరూపిణి యొక్క ప్రకట విగ్రహము, రాత్రి, విశ్వము గుప్తమైయుండును. అది అమ్మవారి గూఢ విగ్రహము. ఇట్లు దివారాత్రములలో తన ప్రకట గూఢ విగ్రహములకు పగటిని రాత్రిని చేయు చుండును. సమాధియందు ప్రాణాపాన నిరోధముండును. కావున అపుడు ప్రాణాపాన కలల సామరస్యమేర్పడియుండును. ఆ సమాధిలో వేద్య వేదక స్వరూపులైన శక్తి శివులకు, బిందు నాదములకు సామరస్య (సామ) స్థితులుండును. ఈ స్థితియందు ప్రాణాపాన సామరస్య స్థితి అంతర్గతమైయుండును.

దివ్యచకోరిక ననుసరించి – పూర్వశ్లోకమున ఆనందమయ చక్ర స్వరూప విభూతి వ్యాఖ్యానింపఁబడినది. ఈ శ్లోకమున నాదమయ ప్రతీకోపాసనోపయోగమైన

నవవిధ కాలమాన స్వరూప సృష్ట్యాది కృత్య పఞ్చక పండితురాలైన మహాకాలియొక్క కాలసంకర్షణ వహ్నిమూర్తిమయ మహా చక్రమున ప్రకాశానంద కాలచక్ర ప్రవర్తక సూర్యచంద్రుల విద్యావిద్యామయ వాగర్థ వ్యావహారిక నేత్ర ద్వయాత్మకత అగ్ని యొక్క తృతీయ నేత్రత (పాఠభేదమున) స్పష్టము చేయబడుచున్నది. 2) కలా శబ్దము ప్రథమా బహువచనాంతముగా స్వీకరించిన దానిచేత సూచింపదగినది త్రైవర్ణిక భావాపన్న త్వదీయ నేత్రబిందు స్వరూపమునందుగాని, మండల త్రయాత్మకములైన సూర్యచంద్రాగ్నిస్వరూపమునందుగాని ఉన్న భేదకల్పన క్రోధము కలదానా! అని చండి అను సంబుద్ధి యొక్క తాత్పర్యము. కాల జ్ఞాన క్రియా నియామకులగు అమ్మవారి నేత్రములైన సూర్యచంద్రుల కలలు దివారాత్ర ప్రయోజకములు. దివారాత్రము మానభేదము ననుసరించి అనేక విధములుగా నున్నట్టివి. మానములు తొమ్మిది. 1) బ్రాహ్మము, 2) దివ్యము, 3) పిత్ర్యము, 4) ప్రాజాపత్యము, 5) గురు (బృహస్పతి) సంబంధి, 6) సౌరము, 7) సావనము, 8) చాంద్రము, 9) ఆర్షము. శుక్ల కృష్ణపక్షముల నిర్ణాయకములు చాంద్రకలలనుట స్థూలదృష్టికి సరియైనదే. కాని వాస్తవమున అవి పన్నెండు సూర్యకలల చేతనే నియమింపఁబడును. మరియు ఒక్కొక్క తిథియందు పగలు, రాత్రిని నియమించు నవి పదునాఱు చంద్రకలలు ప్రకటగుప్త విగ్రహః పూర్వతర పూర్వశ్లోకములలో చెప్పఁబడిన ద్వాదశ తత్త్వాత్మిక సూర్యకలలు, షోడశతత్త్వాత్మిక చంద్రకలలు అమ్మవారి యొక్క ప్రకటగుప్త విగ్రహములు.

నీ వహ్ని మూర్తిమయ సంవత్సరము ప్రకాశచక్ర సంబంధ ద్వాదశ కలాతత్త్వ భావము వలన ప్రకటమని, మాసాది ప్రకటమని, మాసాంతమున గుప్తము అని ప్రకటగుప్త విగ్రహః అను సమాసమునకు ఒక అర్థము చెప్పఁబడినది. త్వదీయ కాలజ్ఞాన ప్రధానసోమనేత్ర విగ్రహము, అట్లే దినము వంటి తిథ్యాదియందు ప్రకటము, తిథ్యంతమున గుప్తమని మరొక అర్థము చెప్పఁబడినది. ఏ తిథిని పొంది సూర్యుడుదయించునో, ఆ తిథి శ్రౌతస్మార్తాది కర్మల విషయమున సకాల తిథి అను జ్యౌతిశ్శాస్త్ర నియమము ననుసరించి దేవి కాల క్రియా వ్యవహార సమర్థ ప్రాణ సూర్యమయ విగ్రహము గలది అని ఒక అర్థము.

**దివసక్షపో(యో)దయః–**

అమాంత వ్యావహారిక చాంద్రమాన సిద్ధములైన దివసములు క్షయములు.



పూర్ణిమాంత వ్యావహారిక బార్హస్పత్యమాన సిద్ధములు ఉదయములు. అమావాస్యగాని పూర్ణిమగాని చివరగల పన్నెండు మాసములు దివారాత్రులు అని ఒక అర్థము. **'సంవత్స ప్రతిమావై ద్వాదశ రాత్రయ'** అను వేదవాక్యము ననుసరించి అట్లే **'శుక్ల స్వప్నాయ భూతానాం చేశాయై కర్మణామహః'** అను మత్స్యపురాణవచనము ననుసరించియు, పితృదేవమానము లభిన్న స్థితివలన వర్షకల్పద్వాదశసంఖ్యాక చంద్రాహోరాత్రిరూపములు. అట్లే మూడు వందల అరువది సంఖ్యగల సావనాహోరాత్రి రూపములు ఇవి దివసక్షపా పదార్థములు. అట్లే దివసక్షయోదయ త్వత్కృత ప్రకటగుప్త విష్టపా అనుపాఠము గురించి ఇవి కలలకు విశేషణములు. వహ్నిమూర్తిమయ నేత్ర వ్యాఖ్యననుసరించి దక్షవామ నేత్రమధ్యకేంద్ర మందుండుటచే దదుభయ సృష్ట్యాది కృత్య పంచకములు కలవి. తృతీయాగ్ని నేత్ర మూర్తిమయ బ్రహ్మమూర్తి కలయని తాత్పర్యము. ఉదయమనగా ఆత్మోన్మేషము. దానిని గుర్తించి అగ్నిమూర్తి చక్రరూపిణియైన అమ్మవారిచేత ఎంతవరకు విస్తారము చేయఁనగునో అంతవరకు చేయఁబడినది. అనగా నీ చిన్మయ కృత్యపంచకమున నీవు నిమిత్తముగానున్నను నీ స్వరూపావ బోధము కొఱకు విస్తరింపఁబడినది అని అర్థము. ప్రకటగుప్తవిగ్రహ అనుపాఠమున స్వీకరించి ముప్పదియాఱు తత్త్వములు ప్రకటములు గుప్తములు అను విగ్రహములు. దేవిదివసక్షయోదయము బ్రహ్మీ సౌరాంత కల్పములలో బ్రహ్మదివసక్షయోదయము అని అర్థము. భువనము లను సృజించు నశింపఁజేయు బ్రహ్మయొక్క కల్పములు అమ్మవారికి నిమేషమాత్ర కాలములు కావున అట్టివెన్నో గడచిపోగా దేవిదివసక్షయో దయము కలుగు చుండును.

పంచబ్రహ్మలు నీ అవయవములు కావున నీ దినసక్షయోదయములే వారి దివసక్షయోదయములగును లేక బ్రహ్మాయువున కంటె పదిరెట్లు ఎక్కువ విష్ణువు యొక్క ఆయువు. విష్ణువు ఆయువునకన్న వేయిరెట్లు ఎక్కువ రుద్రుని ఆయువు. రుద్రుని ఆయువునకన్న లక్షరెట్లు ఎక్కువ ఈశ్వరుని ఆయువు. ఈశ్వరుని ఆయువున కన్న కోటి రెట్లు ఎక్కువ సదాశివుని ఆయువు. ఆయన ఆయువున సముద్రగుణముగా శివాశివుల దేహధారణము యొక్క కాలము.

**అవతారిక:–** పూర్వశ్లోకమున సూర్యచంద్ర కలాప్రయుక్తమైన దివారాత్ర్యుదయము అమ్మవారిచే చేయఁబడునని చెప్పఁబడినది. ఈ శ్లోకమున సమాధియందు

ప్రాణాపానముల సామరస్యము శివశక్తిబిందు సమవేద వేదకముల సామ్యస్థితి ఉండునని చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ దేవి! తద్ద్వయకలావిమిశ్రణాత్**
**సామరస్యపదమేతి యా స్థితిః।**
**బిన్దునాదసమవేద్యవేదకా**
**న్తర్గతా హి తవ మూర్తిరత్ర సా॥ 69**

**ప్రతిపదార్థము:–** దేవి=ఓ దేవి, తద్వయకలావిమిశ్రణాత్=ఆ రెండు విధములైన కలల విమిశ్రణమువలన, యా=ఏ, స్థితిః=స్థితి, సామరస్యపదమ్=సమరసత్వమును, ఏతి=పొందునో, బిందునాద సమవేద్య వేదకాంతర్గతాః=బిందునాదముల సమములైన వేద్య వేదకముల అంతర్గతమైనవి, తవ=నీ యొక్క, సా=ఆ స్థితి, అత్ర=ఇక్కడి మూర్తి (స్వరూపము) యందు (ఉన్నది).

**తాత్పర్యము:–** ఆ రెండు కలల విమిశ్రణమువలన ఏ స్థితి సామరస్యము నొందునో ఆ బిందునాదములతో సమములైన వేద్యవేదకములలోనున్న నీ ఆ స్థితి (మూర్తి స్వరూపము) నందున్నది.

**వివరణము:–** దివ్యచకోరిక ననుసరించి కాల సంకర్షిణి అను మహాకాలియొక్క ప్రమాణ పదాత్మక మూడవ నేత్రరూపమున వాసరేశ రజనీశమూర్తి కలల విపర్యయ స్వరూపమున ప్రమాతృ ప్రమేయ భావమున వ్యావహారిక కాలనేత్ర సముపాసనా మార్గమున తెలియదగిన రహస్యము ఈ శ్లోకమున చెప్పఁబడుచున్నది.

వాక్కు మనస్సు ప్రాణములు స్వరూపములుగాగల మండల త్రయమును ప్రకాశింపఁజేయునది. గావున అమ్మవారు దేవి అని సంబోధింపఁబడినది. **తద్వయ కలావిమిశ్రణాత్–** ఆ సూర్యచంద్రోదయ కలల యొక్క లేక పన్నెండు, పదునైదు తత్ కలల కలయిక చేత ఇరువదియేడు నక్షత్రమూర్తి రూపములకు మూలమైన మండల త్రయాభిన్న ప్రధానమూర్తి కల బ్రాహ్మము, ఇరువది యెనిమిదవది. అభిజిన్నక్షత్రాఖ్యసాధక చంద్రకలల భేద వివక్షతో ముప్పది తిథులు ద్వాదశ మాసకలలు కాని వానిని సంపాదించు మూర్తి కలల రెంటి యొక్క మిశ్రమైన విలక్షణ మేలనమే విమిశ్రణము. అగ్నిమూర్తికలతో బిందునాద సమవేద్యవేద కాంతర్గత జ్ఞానక్రియాపర పర్యాయములైన బిందునాద ద్వయరూపమున సమములు.



వేద్యవేదకములు అనగా ప్రమేయ ప్రమాతృరూపములైన సూర్యచంద్రులు వారిలోపలనున్న స్థితి. **'స్థితిః స్వరూపారోహిత్యం ప్రతిబింబవదేవ యత్ స్థితిర్నామ స్వరూపస్య తత్తద్రూపతయా ధృతిః–**(ప్రతిబింబమువలననే స్వరూపారోహిత్యము స్థితి. స్వరూపమే ఆయా రూపములుగా ఉండుట) బింబ ప్రతిబింబములలో నొక దానిని మూర్తిని ధరించు నైపుణ్యము స్థితి అనియు చెప్పవచ్చును. అట్టి స్థితిమండల ద్వయ మాధ్యస్థ్యము అనగా ప్రమాతయైన సూర్యమూర్తి రూపమున ప్రమేయమైన చంద్రమూర్తి రూపమున సమరస భావమును పొందును.

వాక్కు ఋగ్యజుస్సామాత్మికము. **'ప్రజాపతిం వై దేవాశ్శుక్రం పయో దుహన్ తదేభ్యో నవ్యభవత్, తదగ్ని ర్వ్యకరోత్ తాని శుక్రియాణి సామాన్య భవన్ తేషాం యో రసోత్యక్షరత్ తాని శుక్రమ్ యజూగ్ంష్యభవన్** (దేవతలు ప్రజాపతి నుండి శుక్రమును పితికిరి దేవతలకది కలుగక పోయెను. అగ్ని దానిని చేసెను. ఆ శుక్ర బిందువులు సామములయ్యెను. వాని రసమేది స్రవించెనో అది యజుస్సు లాయెను.) అను శుక్రీయమండల శ్రుతి ననుసరించి ప్రాణవాయు నాదరసాభిన్న వేద పురుషుడు వాఙ్మూర్తిమయుడు. ఆతనికి యజుస్సేశిరము, ఋక్కు దక్షిణపక్షము, సామముత్తర పక్షము, అను తైత్తిరీయ బ్రహ్మవల్లి దక్షిణోత్తర పక్షములైన ఋక్సామములు వాగర్థనాదముల మధ్య పదమునందుండుటచే శివశబ్దార్థ ప్రధాన రసభావాపత్తి రూపమైన సామరస్యము **శుక్రియాణాం వా ఏతాని శుక్రియాణి సామపయసం వా ఏతయోరన్యత్ దేవానా మన్యత్ పయః యద్గోః పయః తత్సామ్నః పయః, యదజాయై పయః, తద్దేవానాం పయః** (శుక్రియ బిందువులలోని పయస్సు ఋగ్యజుస్సామముల భిన్న భిన్నము సామపయస్సు గోవు యొక్క పయస్సు, అజ (మేక) యొక్క పయస్సు దేవతల యొక్క పయస్సు. ఇందలి గో శబ్దము సారస్వత నాద పయోరసము ప్రధానము అని సూచించును.

ఇట్లే ప్రాణమనః త్రిపుటుల నాదమూర్తి స్థితి సామరస్యము యోజించు కొనఁదగినది. అన్నిచోట్ల వాగర్థమునకు పేరుగల నాదనాథుల మిథునము యొక్క సామరస్యమే మూర్తి తత్త్వరూపము.

తద్వయకలావిమిశ్రణా అనుపాఠమును స్వీకరించి అది స్థితికి విశేషణము అని చెప్పఁబడినది. ప్రమాత్రాది త్రిపుటి మధ్య కేంద్రమున అమ్మవారి మూర్తి సకల వేదశాస్త్ర ప్రసిద్ధమని సూచించుటకై హి అను నిహితము ప్రయోగింపఁ

బడినది. ఇదే నీ మూర్తి. ఇట్టిదాని సకల వేదశాస్త్రాది వాఙ్మనః ప్రకృతిక ప్రమాణ సమూహమంతయు సంవదించుచున్నది.

**అన్నమయం హి సోమ్యమనః అపోమయాః ప్రాణాస్తేజోమయీ వాక్** ఇత్యాది ఛాందోగ్య శ్రుత్యుక్త ప్రమాణక వాక్ప్రాణాన్న మనస్సు వేద్యవేదకా పరపర్యాయ ప్రమేయ ప్రమాతృభావ మధ్యస్థితిచేత త్రిపుటిమూర్తిత్వముగాని మూర్తి త్రిపుటిగాని సంపాదింపదగినది.

**అవతారిక:** – పై శ్లోకమున సమాధిగత సూర్యచంద్రాభిన్న ప్రాణాపాన సామరస్యము చెప్పఁబడినది. ఈ శ్లోకమున సబీజ సమాధియందు అన్న బాహ్య విషయముల భస్మీకరణమున ప్రలయవహ్నిరూపయైన ప్రాణాపానమండలముల గ్రహించిన ప్రాణ రూప ధామమున పదేడు విధములుగానైయున్న గురుక్రమము నాశ్రయించిన అమ్మవారి మూర్తి స్ఫురించును అని చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ లీఢభానుశశిమణ్డలా స్థితి**
**ర్లమ్బితా ప్రళయవహ్నినా త్వయా।**
**ప్రాణధామ్ని దశసప్తధా సతీ**
**మూర్తిరాశ్రితగురుక్రమా శివే॥** 70

**ప్రతిపదార్థము:** – శివే=ఓ శివా!, లీఢభానుశశిమణ్డలాస్థితిః=మ్రింగిన సూర్యచంద్ర మండలమైన స్థితి, ప్రలయవహ్నినా=ప్రలయాగ్ని వైన త్వయా=నీ చేత, లంభితా= పొందింపఁబడినది, ప్రాణధామ్ని=ప్రాణస్థానమున, దశసప్తధా సతీ=పదేడు విధములుగానున్న, (తవ=నీ యొక్క) మూర్తిః=మూర్తి, ఆశ్రితగురుక్రమా=గురు క్రమము నాశ్రయించినదై (ఉన్నది).

**తాత్పర్యము:** – సంబీజ సమాధియందు భూములైన అన్ని విషయముల గ్రహించు ప్రలయవహ్నివైన నీ చేత పొందింపఁబడిన ఆ స్థితి పదేడు విధములుగానున్న గురుక్రమము నాశ్రయించిన నీ మూర్తి ప్రకాశించును.

**వివరణము:** – క్రమప్రకాశిక ననుసరించి సంబీజ సమాధియందు బాహ్య విషయములన్నిటిని మ్రింగు ప్రలయవహ్నిస్థితిని అమ్మవారు ధరించియుండును. ధ్యాత యొక్క ప్రమాతృస్థానమున పదేడు విధములుగా గురుక్రమము నాశ్రయించిన అమ్మవారి మూర్తి స్ఫురించును. అయినను శ్రీరూపయైన అమ్మవారు, గిరిజా,



రతి, మహీమయ త్రి మూర్తులు, ప్రథమావరణమున; బుద్ధిరూపయైన అమ్మవారు సమృద్ధి, కాంతి, మదనావతి, మదద్రవా, ద్రావిణీ, వసుధారా, వసుమతి అను సప్తమూర్తులు, ద్వితీయావరణమున; బ్రహ్మరూపయైన అమ్మవారు మహేశ్వరి, కౌమారి, వైష్ణవి, వారాహి, మాహేంద్రి, చాముండా, మహాలక్ష్మి అను ఏడు మూర్తులు, చతుర్థావరణమున మొత్తము పదేడు మూర్తులు ధ్యాతకు గురుక్రమము నాశ్రయించి సాక్షాత్కరించును. ధ్యానావస్థయందు ప్రాణాపానముల బాహ్య విషయములు ప్రవిలాపించినందున గురుక్రమమునాశ్రయించిన పదేడు మూర్తులు ధ్యాతకు స్ఫురించును. సమాధి యందు నీ మూర్తి ప్రకాశముచేత స్వాశ్రిత పరానుకంపచేత అనుగ్రహించుచున్నావు.

దివ్యచకోరిక ననుసరించి ఇట్లు వేద్యవేదక ప్రకాశానంద చక్రరూపమున సూర్యచంద్రుల అంతర్గతమైన ఉన్మనీనాద నవకమహాకాళీ వహ్నిమూర్తియందు సంహారమునను మహాసంకర్షణాగ్నిమూర్తి విలాసముగల, నాదనవక స్వరవర్ణ సాంఖ్యయోగ సామరస్య ఖండచక్రమునను గురుక్రమ రూపమున మూర్తి చక్ర త్రిపుటీ స్థితి ఈ శ్లోకమున చెప్పఁబడుచున్నది. 2) 'శివే' అను సంబోధనము సాధకునియందున్న ఓ శివా! అను అర్థమును లేక ప్రలయవహ్నివైన నీ చేత సంకర్షణా ప్రలయప్రాణాగ్నిరూపిణియైన అమ్మవారిచేత పూర్ణవిద్యోదయపర్యంతము భానుమండలరూపమున వేద్యవేదక పరములైన అగ్నీషోమ శాక్త విసర్గ బిందు ద్వయాంతరాలమున ఉనికిచేత విద్యోదయానంతరమున ఆణవోన్మనీవిసర్గ మర్యాద చేత ఉదిత విద్యదార్ఢ్యము కొఱకు వేద్యవేదక పదాపన్నములైన సూర్యాగ్నుల మధ్య అభిజిత్సాదకలా చంద్రాఖ్య సోమమండలరూపమున, శాక్త విసర్గ మర్యాదచేతను ఉండి విద్యాదార్ఢ్యము కలిగిన తరువాత వ్యావహారిక మండలత్రయ సంహారేచ్ఛ చేత శాంభవ విసర్గ భావమున సనక్షత్రగోలాపర పర్యాయ ముఖ్య ప్రాణ సంకర్షణ వహ్నిమండల మూర్తిరూపమున, వ్యావహారిక త్రిపుటీ మండలము నాత్మలో ప్రవిలాపన మొనరించి తురీయ చిదగ్నిమూర్తి రూపమున భానుశశి మండలముల గ్రసించునట్టి స్థితి పొందింపఁబడినదని చెప్పఁబడినది.

లమ్బితా అనుపాఠము నాశ్రయించి, పైన చెప్పఁబడిన మూడవకంటి మూర్తి కలావిశేషణముగా చేయఁబడినది. భానుచంద్రమండలముల మ్రింగినది అని అర్థము చెప్పఁబడినది. స్థితి అనగ స్వరూపము నారోపించుట లేక తురీయ నికేత

స్థితి గల మూర్తి కల లమ్బితమైనది. పట్టుకొనఁబడినది. అనగా అవలంబించినది అని అర్థము.

ఆ స్థితియే మూర్తి కల ముఖ్య ప్రాణతేజమున పదేడు విధములైనది. ప్రాణాపానాది ముఖ్యప్రాణవృత్తి పఞ్చకము, నాగకుర్మా ద్యుపప్రాణివృత్తి పఞ్చకము కలసి పది, ఇంద్రియ పఞ్చకము, మనోబుద్ధులు రెండు, కలిపి మొత్తము పదేడు, లేక తంత్రములందు చెప్పఁబడిన పది వహ్నికలలు కాలి, కరాలి, వనోజవ, సులోహిత, సుధూమ్రవర్ణా, స్ఫులింగిని, లీలాయమాన అను అగ్ని యొక్క ఏడు జిహ్వలు (వీనికే హిరణ్యాకనకా ఇత్యాది నామములు కూడ కలవు) కలిపి పదేడు.

మహార్థమంజరీ పరిమలమున వహ్నిమూర్తి చక్రవర్ణనమున కృష్ణ యజుర్వేదమున ప్రాజాపత్య మూర్తి వర్ణన ప్రస్తారమున తైత్తిరీయ సంహిత ప్రథమ కాండ షష్ఠ ప్రపాఠకమున ఏకాదశానువాకమున **'యో వై సప్తదశం ప్రజాపతిం యజ్ఞ మన్వాయత్తం వేద', ఆశ్రావయ (4), అస్తుశ్రౌషట్ (4), యజ (2), యేయజామహే (5), వషట్ (2)** వీని అక్షర సంఖ్య మొత్తము పదేడు.

చతురక్షరమైన **'ఆశ్రావయ'** అ ఇ ఉ ణ్ ప్రత్యాహార రూపమున, సర్గ అస్తు శ్రౌషట్ చతురక్షరము, తదీయదీర్ఘ స్వరత్రికయుత,విసర్గ షడధ్వపరామర్శమున యజ అని ద్వ్యక్షరముచే సంధి స్వరాన్యతరయుగమున, **'యే యజామహే'** అను పంచాక్షరము ఋ ౠ ఌ ౡ (షణ్ఢ స్వరములు) చే ఆణవార్ధ బిందుయుత ద్వ్యక్షరమున వషట్ అనునది సూచ్యము **ఏష వై సప్తదశః ప్రజాపతిః** ఇత్యాది వాక్య విశేషమున సప్తదశాత్మకత ప్రజాపతియందు ఉక్తము. బీజయోని విధిభేదిత క్రియాశక్తిమయ మాతృకావర్ణకదంబము, దానికి మూలమైన స్వరఖండమునకు మూలస్వరషోడశ స్వర కదంబమున, **షోడశకలో వై పురుషః** అని చెప్పఁబడిన వాఙ్మయ పురుష స్వరూపమున ఆణవ విసర్గానుస్వార యోగాభిసంధిచేత, అనుత్తర శాక్త విసర్గావయవాగ్నీషోమబిందు........... ఛందోవీర్య అను పర్యాయముగల శబ్ద బ్రహ్మమే సమష్టివాఙ్మయ ప్రాజాపత్య పురుషమూర్తి సంకేతము.. నాదమయవాగర్థప్రాణధామ్నమున స్వరమయ నాదనవకమున వాగర్థ షడధ్వ త్రిపుటీ మహా పఞ్చార్థ క్రమ వ్యష్టి సమష్టి ప్రకారముననను సప్తదశవిధ అగుచున్నది. వాగర్థ ప్రాణనాద సామరస్యాత్మికయైన నీ ముఖ్యవహ్నిమూర్తి గురు క్రమము నాశ్రయించిన



అనుత్తర ధామ సంవిద్వర్ణ క్రమము మూడింటియందు గురుక్రమము నాశ్రయించినది. ఇదియే సకల వాగర్థ సామరస్యాత్మక మండల త్రయ పరామర్శ ప్రథమ సూత్రాత్మరూపమున ఒక విధముగా, నాదనవకాభిన్న స్వరనవక బోధక సూత్ర చతుష్టయ రూపమున మరొకవిధముగా, నాలుగు విధములుగా చతుర్దశ భువనాత్మక మహేశ్వర చతుర్దశ సూత్రకదంబరూపమున చెప్పఁబడినది.

**అవతారిక:–** పై శ్లోకమున అమ్మ ప్రలయవహ్నిరూపమున సూర్యచంద్రమండలము మ్రింగునట్టి స్థితి గురుక్రమమున పదేడు మూర్తులు కలదని చెప్పఁబడినది. ఈ శ్లోకమున మహాశక్తి బోధమున సంహృతి స్థితి విసృష్టి శక్తులు సుషుప్తి స్వప్న జాగ్రద్దశాత్రయమున నున్నను నిర్బజసమాధియందు ధామత్రయాదులనుండి లేచి తుర్యాచిన్మహాశక్తియందు లీనమగునని చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ ఇష్టబోధకృతశక్తయస్త్వయా**
**సంహృతిస్థితివిసృష్టిసద్మసు**
**తుర్యచిత్పదమయుః ప్రసారితా**
**స్సుప్తితః ప్రభృతి ధామసు త్రిషు॥** 71

**ప్రతిపదార్థము:–** శివే=ఓ శివా!, ఇష్టబోధకృత శక్తయః=ఇష్టమైన జ్ఞానము కొఱకై చేయఁబడిన శక్తులు, త్వయా=నీ చేత, సంసృతిస్థితి విసృష్టిసద్మసు=సంహార స్థితి విసర్గ అను స్థానములైన, త్రిషు=మూడు, సుప్తితః ప్రభృతి ధామసు= నిద్ర మొదలు కొన్న ధామములందు, ప్రసారితః=ప్రసరింపఁజేయఁబడినను, తుర్యచిత్పదమ్=నాల్గవ నిర్బజ సమాధిరూప చిత్పదమును, అయుః=పొందినవి.

**తాత్పర్యము:–** సృష్టి స్థితి సంహారములు జాగ్రత్స్వప్న సుషుప్తులతో పోల్చదగినవి. అవి సాధకునిచేత జ్ఞానము కొఱకై సాధింపఁబడిన శక్తులు నిర్బజ సమాధి దశయందు తురీయస్థితియందు చిత్తున లీనమగును. (ప్రాచీనసాధకానుభవ వర్ణనము).

**వివరణము:–** దివ్యచకోరిక ననుసరించి కాల సంకర్షిణి అనఁబడు చిదగ్నిమూర్తి చక్ర గురుక్రమమును వివేకించిన దాని కామకలావిభూతి ఆ కామకల కాల్యభేదము తెలియును. ఆమె నేత్ర త్రయాత్మక మండల త్రయము తేజోబన్నాత్మకము తేజోజల భూములు అను భూతత్రయముతోడను అభిన్నము.

సంవిత్క్రమమున దాని స్వరూపమయిన తురీయస్థానమునందే గ్రహింపఁదగును. ఇచ్ఛాజ్ఞాన క్రియా సంవిత్క్రమ ప్రసారమును ఈ శ్లోకమున చెప్పఁబడుచున్నది. 2) సంహృతి, స్థితి, సృష్టులు నిద్రాస్వప్నజాగ్రద్దశలుగా గూడ భావింపఁబడును. సిద్ధులు వీనియందు స్వేచ్ఛతో లీనమగుదురు. అను వ్యుత్పత్తి ననుసరించి సద్మ శబ్దము సిద్ధుల విశ్రాంతి స్థానములను బోధించును. సంహారాది కృత్యత్రయాధికారము ఈశ్వరేచ్ఛకు విరోధము లేకుండ వారి కుండుననియు శ్లోక తాత్పర్యము. ఇష్టబోధక కృత శక్తయః – త్రిషు అనుట వలన – మొదట విద్యా విద్యాన్యతర సంహార క్రమము వారి ఇచ్ఛకు విషయమని ఇష్టశబ్దము బోధించును. బోధమనగా ఆయా విషయములకు సంబంధించిన జ్ఞానము. కృతమ్ అనగా వానికి అనుకూలమైన కర్మము. ఈ మూడు శక్తులు బాహ్య క్రియా సృష్టిరూపములు. వారి శక్తి అనగా సామర్థ్యము అది అలక్ష్యము. వెనుక చెప్పఁబడిన ప్రకాశాది చక్ర త్రయమున పరౌఘ మహౌఘ దివ్యౌఘ గురుక్రమ త్రిపుటి నవక సమష్టి అని త్వయా అనుపదమున కర్థము చెప్పఁబడినది.

సృష్టిస్థితి ప్రధానద్వాదశ షోడశ కలాభిన్న ప్రకాశానంద చక్రముల గురు క్రమముననను మిగిలిన మానవ సిద్ధౌఘాది చతుష్టయ గుర్వౌఘ సమష్టి మహాబిందు రూపము. అది పదమూడవది లేక సప్తదశియైన అమ్మవారిచేత అని త్వయా పదమున కర్థము మరొకవిధముగా కూడ చెప్పఁబడినది.

ఉచ్ఛ్వాస నిశ్వాస రూప వృత్తులతో వీనియందూదెదరు (ధమంతి) అను వ్యుత్పత్తి ననుసరించి ధామసు అనుపదము సుప్తి స్వప్న జాగ్రద్దశల మూడింటి యందును ఉచ్ఛ్వాస నిశ్వాసరూప వాయువృత్తులుండును. కావున ఆ మూడు దశలను బోధించును. అంతర్బాహ్యేంద్రియములు కర్మవాసనలచేత (ధమ్యతే) పూరింపఁబడును. అను మరొక వ్యుత్పత్తి ననుసరించి కర్మవాసనాపూరము కల పై మూడు కారణ సూక్ష్మ శరీరములను కూడ ధామసు అనుపదము బోధించును.

సుప్తిస్వప్నజాగ్రద్దశలు జడములు. చిన్మయములు అని రెండు విధములుగా నుండును. ఇవి అన్నియు తుర్యచిత్పదము చేత ప్రసారితములు.

సంహార క్రమమున తుర్యచిత్పదము నాదాంతనాదనవక శక్తి రూపము నను తదర్థమునందునను విస్తరించినది అని ప్రసారితా శబ్దము యొక్క అర్థము



చెప్పఁబడినది. సృష్టి క్రమమున ద్వాదశాంత మహాబిందువు మొదలు కామకలాంత గణనచే ఇష్టకామకలా చక్రత్రయాభిన్న లిపిత్రయ నిర్మాణ విషయకమైన బోధలు త్రివిధలిపి వాసనా రూపములుగా కృతములు అనగా చేయఁబడినవి. వాని బాహ్య వ్యాపార సామర్థ్యాలంబమున అంతర్వాసనా సంహృత రూపములన్నియు కలిపి పన్నెండు త్రయోదశ వ్యక్తి నిర్మాణ ద్వాదశాంత మహాబిందు రూపము. తుర్య చిత్పదమయ ప్రసారితా అను పాఠాంతరము నాశ్రయించి తుర్య చిత్పదమనగా నాల్గవదైన చిత్తు అనఁబడు పదము – మయ అనగా ఆత్మానందము, తుర్య చిత్పదము అను ఆత్మానంద సుఖముచేత ప్రసారితమైనది అని తుర్యచిత్పద ప్రసారితా అను సమాసమునకు అర్థము చెప్పఁబడినది. ఇట్లు జడ ప్రపంచమునకు పఞ్చవాహ మహార్థరూపనము మొదట సిద్ధౌఘ రూపిణియైన అమ్మవారిచేత పూర్వానుభూత సౌషుప్తానందమున ఇచ్ఛవలె పూర్వానుభూత జడ వైషయకానందేచ్ఛయు కలుగును. ఆ తరువాత మానవౌఘ రూప మానవరూపమున స్వప్నావస్థ యందువలె దానిని పొందు ఉపాయమును తెలియఁబడును. శిష్యౌఘ రూపిణియైన అమ్మచేత కర్మను అనుష్ఠింపఁజేయుట ద్వారా సాధకుడును గురుదాసుడుగాఁ జేయఁబడును. కావున సిద్ధమానవ శిష్యౌఘాఖ్య గురు పఙ్క్తిక్రమము బహిర్ముఖ సాధక వర్గమునందుండును. ఆ రెండు క్రమములమధ్య కేంద్రమున నుండు శ్రీ కామకల అనఁబడు కాలి భుక్తి ముక్తులును గురుక్రమము నాశ్రయించిన మూర్తి అగును. అదియే దివ్యౌఘము మొదలు శిష్యౌఘము వఱకు గల నాలుగు ఓఘముల రూపము అమ్మవారిదే. మహౌఘాంత ప్రకాశ చక్ర ద్వాదశాంతరశ్మి విశ్రాంతయైనచో ప్రకాశానందముల చక్ర గురుచక్రరూపిణియు అమ్మవారే. ద్వాదశమున గురు క్రమ విచ్ఛేదమున నష్ట సంతతి కలుగును.

**అవతారిక:–** పై శ్లోకమున చిన్మయ పదమందు సర్వావస్థా విలీనత చెప్పఁబడినది. ఈ శ్లోకమున మరొకవిధముగా నిర్బజ సమాధియందలి పై స్థితియే ప్రకారాంతరమున వర్ణింపబడుచున్నది. దివ్యచకోరిక ననుసరించి కామకలారూప తురీయపదరూప అయిన కాలియే అనాఖ్యా కాలీకాల తురీయ పదము కూడ అగునని చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ మేయమాతృమితిలక్షణం కులం**
**ప్రా (ప్తి) న్తతో వ్రజతి యత్ర విశ్రమమ్।**

**తత్పదం తవ తురీయమమ్బికే**
**యన్మహద్భి రనుపాఖ్యమిష్యతే॥** **72**

**ప్రతిపదార్థము:–** మేయ మాతృ (న) మితి లక్షణమ్=మేయము మాత (మానము) మితి అను లక్షణములుగల, కులమ్=కులము, ప్రాప్తితః=పొందింపఁబడినదై, యత్ర =ఎచట, విశ్రమమ్=విశ్రాంతిని, వ్రజతి=పొందునో, అమ్బికే=అమ్మా, యత్=ఏది, మహద్భిః=మహాత్ములచేత, అనుపాఖ్యమ్=అనాఖ్యముగా, ఇష్యతే=అంగీకరింపఁ బడునో, తత్=అది, తవ=నీ యొక్క, తురీయమ్=నాల్గవదైన, పదమ్=పదము.

**తాత్పర్యము:–**మేయమాతృ మాన మితి రూప లక్షణమైన కులమెచట విశ్రమించునో, దేనిని పెద్దలు అనుపాఖ్యమని చెప్పెదరో అదే నీ నాల్గవపదమమ్మా!

**వివరణము:–** క్రమప్రకాశిక ననుసరించి ప్రాంతతః అనుపాఠము ననుసరించి అన్నిటికి చివరిది తురీయపదము కావున తురీయ పదమునకు ప్రాంతతః అను పదము విశేషణముగా చెప్పఁబడినది. అనుపాఖ్యమ్ అను పదమునకు అవర్ణనీయము వాచామగోచరము అని అర్థము చెప్పఁబడినది.

దివ్యచకోరిక ననుసరించి, కులమ్ అనగా సజాతీయముల సమూహము. మేయమాతృమితులు **మాఙ్ మానే** అను ధాతు నిష్పన్నతారూప సాజాత్యము కలవి కావున అవి కులమని చెప్పదగినవే. మాతృపదమునకు బదులు మాన అను పాఠాంతరము స్వీకరించి ఆ పదమునకు ప్రమాణము అని అర్థము చెప్పఁబడినది. సశక్తిక బ్రహ్మవిష్ణురుద్రగ్రంథిత్రయముతో కూడిన మూలాధారాద్యాజ్ఞా పర్యంతము లైన ఆఱు చక్రములు కులమనుట శాక్తతంత్ర వ్యవహారము. ప్రాంతతః అనగా మాతృమానమేయమితులు లేక అంత్య పవర్గపంచ మహావర్ణములు కావున అది ప్రకృష్ట (ఓష్ఠ్యతా) సామీప్యమని భావించి, ప్రాంతతః అను పదమునకు ప్రకృష్ట సామీప్యము కలవి కావున అవి కులమని వ్యవహరింపఁదగినవి అని డొంకతిరుగుడు అర్థము చెప్పఁబడినది. తరువాత మేయమాతృ (మాన) మితులు ప్రశబ్దమునకు మొదట చేర్చి ప్రమాణస్థానమున కాని ప్రమాతృస్థానమున గాని కులము విశ్రమించును. గావున మాతృమాన పాఠములు రెండును సమర్థింపఁ బడినవి. కులము దివ్యమహా పరౌఘాఖ్యకరణ గుర్వోఘస్థానమున విశ్రమించును అని విశ్రమం వ్రజతి అను పదముల భావము. ప్రాప్తితో వ్రజతి అను



పాఠమునాశ్రయించి మేయమాతృమితి లక్షణ కులము పరమ ప్రమాతృ కులమగును. దాని మొదట ప్రయొక్క ఆప్తితః ఉండుట వలన అని పదమును విభజించి అర్థము చెప్పఁబడినది. ప్రాంతతః అనుపాఠము నాశ్రయించినను ప్రాప్తితః అనుపాఠము నాశ్రయించినను ఆ కులము ప్రమాతృకులమగుటయే ప్రయోజన మని తాత్పర్యము. మహద్భిః అనుపదముచే మహౌఘమునకు చెందిన గురువులచే ఆది సిద్ధనాథాదులనే అని కాని హృదయ చంద్రికాదులతో చెప్పఁబడిన గురుక్రమ వంశీయులైన పెద్దలచేత అనిగాని అర్థము లభించును. అనుపాఖ్య శబ్దమును అన్ + ఉపాఖ్య అని విభజించి ప్రాణస్పంద మాత్రోపనామకము ఇచ్ఛావాగర్థ రూపము విషయముగా చేయఁబడును. కావున ఆ తురీయ పదము అనుపాఖ్యమనఁ బడినది. మహోబ్ధి అనుపాఠము నాశ్రయించి వెనుక చెప్పఁబడిన తమోగుణరహిత మైన శివ చిత్పయోనిధి అని అర్థమునకును గుణముగ వ్యాఖ్యానింపఁదగినది. అనుపాఖ్యమ్ అనగా ప్రాణస్పందమాత్రోపరామకముగా వాగర్థరూపాత్మకముగా నీ నీనాల్గవ పదమును పెద్దలు అనుభవించినారని భావము.

**అవతారిక:–** పై శ్లోకమున అమ్మవారి తురీయ పదమనుపాఖ్యమని చెప్పఁబడినది. ఈ శ్లోకమున ఆ పదమును పొందుటకు మార్గమైన ఉపాసనము చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ చారరావచరుభిర్విభేదితై**
**ర్ముద్రయా చ యదుపాసనం తవ।**
**తద్వశే న భజతే పరమ్పరాం**
**తావకీ క్రమతయా స్ఫుటాకృతిః॥** **73**

**ప్రతిపదార్థము:–** విభేదితైః=విభేదము నొందిన, చారరావచరుభిః=చారరావ చరువుల చేత, ముద్రయాచ=ముద్రచేతను,తవ=నీయొక్క, యత్=ఏ, ఉపాసనమ్=ఉపాసనము (ఉన్నదో), తద్వశే=తద్వశమున, పరమ్పరామ్=పరమ్పరను, న భజతే=పొందదు, క్రమతయా=క్రమతారూపమున, స్థిరీకృతిః=స్థిరీకరణము (స్ఫుటాకృతిః=స్పష్టమైన ఆకృతి), తావకీ=అంతవఱకు (కుండునదే).

**తాత్పర్యము:–** చారరావచరు ముద్రలచే జరుపఁబడు అమ్మవారి ఉపాసనము తుర్యపదమునకు లోపలనే గురు పరమ్పరనాశ్రయించి క్రమతారూపమున స్థిరీ కృతి లేక స్ఫుటాకృతిగలదైయుండును.

**వివరణము:-** క్రమప్రకాశిక ననుసరించి యోగశాస్త్రమునందువలె ఆగమ శాస్త్రమును నాలుగు పాదములుగలది. హానము, హానోపాయము, హేయము, హేయహేతువు అను నాలుగుపాదములతో యోగశాస్త్రము చతుష్పాదమైనట్లే ఆగమ శాస్త్రము చర్యా, విద్యా, యోగ, క్రియా పాద చతుష్టయముచే చతుష్పాదమగు చున్నది.

చర్య అన్నను (ఆ) చారమన్నను ఒక్కటే. అదే ఆయా భూమిక విశేషములైన చక్ర చరీ రూపమునొందిన సంస్థాన విశేషమున పూజింపఁబడిన స్వరూప ప్రథోన్మీలనము కొఱకు చర్యాక్రమమున గూడ క్రమార్థము ఉపాసింపఁదగినది.

విద్య అన్నను నాదమన్నను ఒక్కటే. **'నాదః' స్వాత్మపరామ్పర్శా శేషతా తద్విలోపనాత్'** అను తంత్రాలోకసూత్రమున తత్పదార్థము అనాత్మవసువర్గము యొక్క విలోపనమున స్వాత్మ పరామర్శశేషత, నాదమాత్ర రూపమగుటచే నాదము స్వాత్మపరామర్శము. జ్ఞానరూపవిద్యయే.

యోగమన్నను చరువన్నను ఒక్కటే. నిర్జజసమాధియందు శక్తి స్వరూపమున ఆత్మను కులేశనానుదైన పరశివునందు సమర్పించును. భోక్తృ విశేష మశేష తృప్తిని పొందనిచో కులేలానునకు దేవిచే స్వదేహము చరువుగా నివేదించఁబడును అని మహానయ ప్రకాశము చతుర్థోదయమున చెప్పఁబడినది. క్రియయు ముద్రయు నొక్కటే యోగినీ యౌవన నవ చక్ర నిరూపణ సందర్భమున క్రియాశక్తి విశ్వమోదనము వలన ద్రావణము వలన ముద్ర అని చెప్పఁబడినది. ఇట్లు సారరావ చరుముద్రా (చర్యావిద్యాయోగ క్రియా) రూపములైన నాలుగు భిన్న ప్రకార క్రమములచేత అమ్మవారి ఉపాసనము ఆగమశాస్త్ర ప్రసిద్ధము. ఆ నాలుగు ఉపాసనలతో అమ్మవారి యొక్క ఆకృతి స్పష్టము (స్ఫుటము). 2) ఓ కాల కర్షిణీ! విభేదములుగల సారరావ చరుముద్రలచే నీ ఉపాసనము క్రమము అనియు స్పష్టము. అట్టి నీ ఆకృతి (స్వరూపము) గురు పరమ్పరను సంప్రదాయమును పొందును. చర్యాదులందు గురుశిష్య పరంపరగా అనుష్ఠింపఁబడు ఉపాసనలతో నీ ఆకృతి భిన్నాభిన్నము అనగా నీవే భిన్నాభిన్నవుగానుందువు. ఇట్లు చెప్పఁబడిన వ్యభిచరింపఁబడిన వాగర్థ స్పందమాత్ర నామరూపాత్మకమైన ఆమె ప్రాణస్పన్ద నాదమను పేరుగల తురీయపదమే సాంఖ్యయోగ త్రిపుటీమార్గ సంప్రదాయ



భేదమున ముద్రాత్రిపుటీ మాత్ర ప్రభేదమున త్రిపాద్ ఏకపాద్విభూతి దృష్టలతో గురుసమ్ప్రదాయ పరమ్పరను పొందునని ఈ శ్లోకమున చెప్పఁబడుచున్నది.

3) గురు, శాస్త్ర, శిష్య నామ పరాగ్ ఊర్ధ్వస్రోతోమయ గురు సమ్ప్రదాయ భేదమున సిద్ధమానవ శేషతా పరపర్యాయ తిర్యక్స్రోతోమయ గుర్వోఘ క్రమ సంప్రదాయ భేదమున విశేషముగా సంఘాత భేదమున చారరావ చరువులు భిన్న భిన్నములు. చారరావ చరుశబ్దములు గూఢచార న్యాయమున (1) ప్రమాత్రాది ముఖ్యాత్మ త్రిపుటియే కవిచేత వివక్షితము. లేక 2) **చరభక్షణే** అను ధాతువున నిష్పన్న చార శబ్దమును భోక్తృభావబోధకము. **రు** అనే ధాతువు నుండి నిష్పన్న రావ శబ్దము వక్తృవాక్యాది కర్తృక్రియా వ్యాపార బోధకము.

చరధాతు నిష్పన్న చరు శబ్దము **చర్యతే క్రియాకలాపః** అను వ్యుత్పత్తి ననుసరించి కార్యకర్తృభావ బోధకము. బాహ్యాడంబర క్రియా కలాపమును పై మూడు పదములు కలిపి బోధించును. చారమనగా సమయాచారము. రావమనగా వాగ్విమర్శము. చరువనగా ప్రథమ ద్వితీయాది తంత్రాగమ సంప్రదాయ సిద్ధ పదార్థ పంచక ద్రవ్య సమూహము. లేక చారమనగా రామానుజపూర్ణ ప్రజ్ఞ నకులీశ పాశుపదాతి సంసార దర్శన త్రికప్రమేయము సమయాచార మనఁబడును. రావ మనగా శైవప్రత్యభిజ్ఞా రసేశ్వరాది రసాయనిక (రాసేశ్వర) దర్శన త్రిక ప్రమేయము. (కర్మ) చరువనగా కాణాదక్ష పాదజైమిన్యాది దర్శన ప్రమేయభూత కర్తృ (చైతన్యాత్మ) వ్యాపారము.

4) శారీరక స్వరూపానుభవ వచన కర్మానుష్ఠానాత్మక వ్యావహారిక సచ్చిదానంద త్రిపుటీమయ బ్రహ్మాది త్రైవర్ణిక కులధర్మములు చారరావ చరు శబ్దార్థములు. ముద్ర అనగా మానసిక వాసనా భూమికాభేద భిన్నమైన ఆనంద విశేషమును ఇచ్చునది లేక తీసికొనుఁనది. ఆయా ఆనందముల అనుభవకాలిక కృతి విశేషము పాణిని సాంఖ్య పాతఞ్జలాది దార్శనిక (త్రిక) ప్రమేయ భోక్తృ భావస్ఫోరక స్ఫోటా పరపర్యాయము లేక బాహ్యాకృతి మాత్రలిఙ్గము అయినను బ్రాహ్మణ్యాది త్రైవర్ణిక జ్ఞాన క్రియామాత్ర స్ఫోరకమైనది. తురీయ, దేహేంద్రియ సఙ్ఘాతమాత్ర విశ్రాంత బాహ్య చిహ్నమని ముద్రా శబ్దార్థ విచార ఫలితార్థము. ఇట్టి ముద్రచేతను నీయే యుపాసనము గలదో దాని ఇచ్చుచేతగాని ప్రభుత్వము చేతగాని గురు పరమ్పర ఆశ్రయింపఁబడుచుండును.

తావక క్రియ అనుపాఠము నాశ్రయించి నీక్రమము అని అర్థము చెప్పఁబడినది. సృష్ట్యాది భాసాంతకత్వ పఞ్చక విస్తృతిరూపమైన పఞ్చార్ధ మహాక్రమము క్రమశబ్దార్థము. సృష్ట్యాదితిరోధానాపర పర్యాయ అనాఖ్యాపర్యంత చతురర్ధ మహాక్రమము క్రమ శబ్దార్థము. చిజ్జడ పరపర్యాయ విద్యా విద్యాన్యతర సృష్ట్యాది సంహారాంత త్ర్యర్థమహాక్రమము క్రమ శబ్దార్థము. అట్టి క్రమమును చేరునది అని క్రమ గతా శబ్దార్థము చెప్పఁబడినది.

స్థిరీకృతిః=అస్థిరము స్థిరముగా చేయఁబడుట అనగా అచలముగా చేయఁబడు ప్రాకృతిక ప్రాణస్పన్దాఖ్య హృదయోద్యోగ రూపిణి. లేక నిషాదపఞ్చమ పఞ్చజన మానవ హృదయోద్యోగ రూపిణి లేక చాతుర్వర్ణ్య త్రైవర్ణికాది హృదయోద్యోగ రూపిణియైన కృతి స్థిరీకృతి అని వివరింపఁబడినది.

పరమ్పర అనగా పరౌఘము మొదలు దివ్యౌఘము వఱకుగల ఊర్ధ్వస్రోతో గురు సంప్రదాయ రూపమైనది. ఋగ్వేదాది సకల స్మార్త తంత్రాగమ సంప్రదాయ పరావిద్యామాతృక యొక్క చారరావాద్యుపాసనా క్రమ పారంపర్య నిర్ణయము భిన్న భిన్నముగానుండును. పరవిద్యా మాతృక మంత్రము మొదట అనుత్తర తంత్రాగమ సంప్రదాయమున నాదబిన్దు లిపి భేదమున మాతృక సంగ్రహముగా త్రివిధము. హాదికాదివిద్యా భేదమున ప్రత్యేకము ద్వివిధముగానుండును. మొత్తము మాతృక ఆఱు విధములు. ప్రాణస్వర వర్ణాదిగా వేదాఙ్గ శిక్షలో చెప్పఁబడినవి. స్వాయంభువ కాలరశ్మిమయ వృందచక్ర బ్రాహ్మీమాతృకతో పాటు సప్తవిధములైన మాతృకలివియే.

అమ్బాదులేత్యాది కృత్తికేష్టకాది మంత్రమున చెప్పఁబడిన ఆఱుగాని, ఏడుగాని కృత్తికలు అనుట వైదికాంగీకారము కూడ కలదు. అనుత్తరామ్నాయ ప్రసిద్ధమైన లోపాముద్రాది విద్యాకామకలా పారమ్పర్య క్రమమున హాదికాది సాధనమున అక్షాంతకామకలా స్వరూపమును మతభేదమున అనంతవిధయైనను అనుత్తరౌఘౌఘ క్రమ పారంపర్యమున సృష్టి సంహారణాఖ్య భాసాక్రమ శబ్దితమైనది. నష్టార్ధ చతుష్కావభాసాది నిర్వికల్పకమేయావ భాసాంత వక్ష్యమాణ లక్షణ విపరీత కృత్యపఞ్చక శబ్దితముగాని ఒకే విధమని భావించినపుడు పారమ్పర్య క్రమభేదము లేదు. తావక క్రమాతయా స్ఫుటాకృతి అనుపాఠము నాశ్రయించి ఉపాసనమే (విభేదితచారరావ చరుముద్రలరూపమున) నీ తురీయ పరసంబంధిగానుండునదే తురీయ పదాయత్తమగుటచేత ఇచ్ఛతేత, ప్రభుత్వమున తావన్మాత్ర క్రమమగుట



చేత త్వదీయ పఞ్చార్ధ మహాక్రమాది త్ర్యర్థమహాక్రమము పర్యంతముగానున్న గురు క్రమరూపముననున్న స్ఫుటాకృతి చర్మ చక్షురేంద్రియ వేద్యము. పరాపర కాలీకాల రూపిణివైన నిన్ను చేర్చునది ఉపాసనమే అనుట తాత్పర్యము.

**అవతారిక:–** పై శ్లోకమున చతుర్విధోపాసనము తురీయపద హేతువుగా చెప్పఁబడినది. ఈ శ్లోకమున వాక్చతుష్టయ రూపిణియైన అమ్మవారు ప్రకాశ సుఖబిందు చక్రములందు పూజ్య అని చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ మఙ్గలే త్వమసి వాక్చతుష్టయే**
**యా పరా స్ఫురతి మూర్తిమణ్డలే।**
**సా ప్రకాశసుఖబృన్దచక్రభా**
**నాదబిన్దులిపిమూర్తిరిజ్యసే॥** 74

**ప్రతిపదార్థము:–** మఙ్గలే=ఓ మఙ్గలా, వాక్చతుష్టయే=చతుర్విధవాక్కులందు, మూర్తి మండలే=మూర్తి మణ్డలమునను, యా=ఏ, పరా=పర, స్ఫురతి=స్ఫురించునో, ప్రకాశ సుఖబృందచక్రభా=ప్రకాశానంద బృంద చక్రములందున్న, నాదబిన్దు లిపి మూర్తిః =నాద బిన్దులిపు సేవిగా, ఇజ్యసే=యజింపఁబడుచున్న, సా=ఆమె, త్వమ్=నీవు, అసి=అగు చున్నావు.

**తాత్పర్యము:–** వాక్చతుష్టయమున మూర్తిమండలమున పరగా స్ఫురించునట్టి నీవే నాదబిన్దులిప్యాకృతులు గలదానివై ప్రకాశానందబృంద చక్రములందు పూజింపఁబడుచున్నావు.

**వివరణము:–** క్రమప్రకాశిక ననుసరించి శక్తిమండలమున మఙ్గల అనుపేరుగల పరాశక్తి ప్రధానశక్తి ఆమె ప్రకాశచక్రమున నాదమూర్తిగా ఆనందచక్రమున బిన్దుమూర్తిగా, వృంద చక్రమున లిపిమూర్తిగా అమ్మవారు ఉపాసింపఁబడును. నాదమూర్తి పశ్యంతి, బిన్దుమూర్తి మధ్యమ, లిపిమూర్తి వైఖరి ఇట్లు మనసున ధ్యానింపఁబడుచు పూజింపఁబడుచుండును. యన్త్రబీజ రూపవైఖరి యన్త్ర చక్రాదు లందు బాహ్యోపచారములతో పూజింపఁబడును.

దివ్యచకోరిక ననుసరించి త్రిచతుః పఞ్చార్ధ మహానాదమయ గురు సమ్ప్రదాయ మహాక్రమములలో చతుర్ధ గురుక్రమమున పుష్పసఙ్కోచ క్రమమున చెప్పఁబడిన ద్వాదశమున నష్టసంతతిత్వ దోష నివృత్తి ద్వారమున నీతసంతతి

కలాధ్యప్రాప్తి ద్వారమున, పరమ ప్రమేయ, స్పర్శస్ఫోట పర్యంత వాగర్థమూర్తి పరమప్రమేయ వాగర్థ నాద త్రిపుటిమయ యథార్థ ప్రకృతిని **విమర్శో బిన్దు నాదౌచ 'స్ఫోటశ్శబ్దశ్చ వాక్క్రమః'** (విమర్శము, బిన్దువు, నాదము, స్ఫోటము, శబ్దము అననది వాక్క్రమము) అని పఞ్చవాహమయ పరమ ప్రమాతృ భూత శబ్ద ప్రకృతిని వైదిక క్రత్వర్థ వాగర్థ మూర్తియందు పద్మిన్యాది హస్తినీ పర్యంత కామశాస్త్రోక్త తాంత్రిక త్రైవర్ణిక పురుషార్థమూర్తి యందును ప్రమాణ పద మూర్త్యష్టక రూపయగు మూర్తి ప్రకృతియందును వైదిక తాంత్రిక జ్ఞానక్రియాయాగయోగ సామరస్య ద్వారమున ధామ సంవిద్వర్ణ క్రమముల ప్రకాశానందమూర్తిమయ వృందచక్రరూపమున నాద బిన్దులిపిమూర్తి కలాచాతుర్విధ్యమున అమ్మవారి ఇజ్యాయోగ్యత ఈ శ్లోకమున చెప్పఁబడుచున్నది. 2) మఙ్గలే అనుపదము మూర్తి మండపే అనుపదమునకు విశేషణముగా పుంలింగసప్తమ్యేక వచనాంతముగా భావించి అన్వయింపవచ్చును. లేక అమ్మవారిని సంబుద్ధిగా విశేష్యముగా కూడ అన్వయింపవచ్చును. విమర్శ శరీరరూపమున సర్వమఙ్గలాకారము గల ఓ మహాకాళీ! అని మఙ్గలే అను సంబుద్ధి యొక్క అర్థము. లేక మూర్తి మండపమునకు విశేషణముగా మంగలాకారముగల పరా పశ్యంతీ మధ్యమా వైఖరీ రూప చతుష్టయమునందు అట్లే మూర్తి మండపము నందును నీవు విమర్శరూపిణివి అను అర్థము చెప్పఁబడినది. శబ్దరూపముగా వాక్చతుష్టయమున, అర్థరూపముగా మూర్తిమండపమున, శబ్దార్థరూపముగా సామరస్య విమర్శ రూపిణిగా మంగలవే అను భావమేర్పడును.

మూర్తి మండపే అనుపాఠమును ఆశ్రయించి మండలరూపమున నున్న మూర్తి సమూహము నందు అను అర్థము చెప్పఁబడినది. మూర్తి మండలమనగా పద్మినీ చిత్రిణ్యాది రూపముననున్నట్టి స్త్రీమండలము పరా. అనగా పరావాక్కు. పద్మినీ జాతికి చెందిన స్త్రీ. వైఖరీ వాక్కుగాని, హస్తినా జాతికి చెందిన స్త్రీగాని కామశాస్త్రోక్తస్వీయా, పరకీయా, సామాన్యా నాయికాత్రయమును మూర్తి మండల శబ్దార్థములు. పరాశబ్దము పరకీయ నాయిక అను అర్థమును ధ్వనింపఁజేయును. స్ఫురతి అను క్రియచేత భేదస్ఫురణము, అభేద స్ఫురణము భేదాభేద స్ఫురణము అను మూడర్థములు లభించును. విమర్శ వేలయందు స్వాభేదమున ప్రకాశించును.

వైఖరి కూడ స్వీయ వర్గాష్టక జననిగా ఇతరుల శ్రోత్రేంద్రియగ్రాహ్య మగుటచే పరగా (సర్వోత్కృష్టగా) ప్రకాశించును. వైఖరి పరకీయ కూడా. తన శ్రోత్రేంద్రియము



చేత గూడ గ్రాహ్యగాదా! తన విషయమగుటచేత వైఖరి సర్వోత్కృష్టగా స్ఫురించును. మూర్తి మండల పక్షమునను పరా పద్మినీ (మూర్తి) శ్రేష్ఠగా స్ఫురించును. హస్తినీమూర్తి అస్వజాతి పురుషోపయోగిని కావున ఆమె కూడ పరగా (సర్వోత్కృష్టగా) స్ఫురించును. పరకీయయైన వైదిక నియోగాద్యుభయ సమ్మత సంభోగమున కన్యగా మన్వాది స్మృతులందు వర్ణింపఁబడినందున ఆ హస్తిని పరగా (సర్వోత్కృష్టగా) స్ఫురించును. ఇట్లు పరా శబ్దబోధ్య పరకీయ నాయికయు ఆయా సందర్భము లందును సర్వోత్కృష్టయే అగును. పద్మినివలె ఆమె నియోగాది ద్వారమున కీలక ప్రతిష్ఠహేతువగుచున్నది. అట్లే చిత్రిణ్యాదులును పరగా సర్వోత్కృష్టగా స్ఫురించుటలో వింతలేదు. మొత్తము మీద సర్వ స్త్రీ మూర్తి మండలమునందును పరయే స్ఫురించును.

**'అష్టాచక్రా నవద్వారా'** ఇత్యాది శ్రుత్యుక్త పద్మములు గలది గావున అమ్మవారు పద్మినియే యగుచున్నది. ఇట్లే వైఖరి కూడ పైన చెప్పిన విధముగా పరయే యగుచున్నది. అట్లే మధ్యమా పశ్యంతులు గూడ ఒక్కొక్కప్పుడు పరగా సర్వోత్కృష్టముగా స్ఫురింపఁబడు నవకాశము కలదు. కావున వాక్చతుష్టయము నందంతటను పరయే స్ఫురించుచున్నది. అనుట శ్లోక ప్రథమార్థ భావము.

ప్రకాశముఖ బృంద చక్రభా అనుపాఠాంతరము స్వీకరించి ప్రకాశ చక్రమును ముఖమున అనగా ఆరంభమున కలది కావున ప్రకాశానందమూర్తి మయ చక్రము కూడ ప్రకాశముఖమూర్తి చక్రము యొక్క కాంతి వంటి కాంతి గలది అనియు అర్థము చెప్పఁబడినది. పరావాక్కునకుగాని, వైఖరీ వాక్కునకుగాని ఆమె ప్రకాశ చక్రముఖరూపిణియై మొత్తము ప్రకాశానంద మూర్తి కాంతివంటి కాంతిగలదైయుండును. ప్రకాశముఖబృన్దచక్రగా అనుపాఠమును స్వీకరించి ప్రకాశ రూపమైన సుఖబృన్ద చక్రము చక్రపరముగా సంభవింపఁబడిన విషయానంద సమూహమును, ఆమెయే ప్రకాశింపఁజేయును. ఆనందరూపిణియై ప్రకాశించును. మహార్థమఞ్జరీ పరిమలమున వివరింపఁబడినట్లు అయిదు విధములైన రశ్మి స్కంధాత్మక బృన్దచక్రము కూడ, ఈ మూడవపాదమున కర్థముగా స్వీకరింపఁ వచ్చును. దానిని చేరునది గావున అమ్మవారు ప్రకాశసుఖబృన్దచక్రగా అని చెప్పఁ బడును. అమ్మవారు తన ప్రకాశముఖమునగాని, గురుభర్త్రాది ముఖ ప్రకాశ రూపమున గాని ప్రకాశించుచు సుఖమును వర్ధింపఁజేయును. అనగా పెంచును.

గావున రెండు పాఠములును సమర్థనీయములే అగుచున్నవి. అట్టి వృన్దచక్రము జీవచక్ర (సమూహమే) అగుచున్నది. జీవచక్రమునకు కాంతిరూపమున చేరునది, గావున అమ్మవారు ప్రకాశముఖయు, ప్రకాశసుఖయునై జీవచక్రమును చేరుచున్నది.

**నాదబిన్దులిపి మూర్తిః –** నాదమనగా బహిర్ముఖ ప్రమాతృనాదస్థానీయ వ్యక్త బిన్దురూపము, బిన్దువు అనగా విమర్శము. ప్రమాణ పదమును పొందిన వివక్ష. పశ్యన్తీ మధ్యమాన్యతర వ్యక్తావ్యక్త ధ్వని రూపము. లిపి అనగా ప్రమేయ కామ కలాత్మక స్ఫోటము. పై నాదబిన్దులిపుల సమష్టియైన చతుర్థమూర్తి రూపగా పూజింపఁబడుచున్నది. అని నాల్గవ పాదముయొక్క అర్థము.

ఇష్యసే అనుపాఠము నాశ్రయించి యజి ధాతుసంప్రసారణము (అనగా యకారమునకు ఇకారము వచ్చుట) వలన ఏర్పడిన ఇష్యసే అను క్రియ యజింపఁ బడగలవు. అను అర్థము నిచ్చును.**ఇష ఇచ్ఛాయామ్** అను ధాతువు నుండి ఏర్పడిన ఇష్యసే అను క్రియ కోరబడగలవు అను అర్థమునిచ్చును. ఆనందమే కోరబడును. కావున ఆనందరూపిణివి అను అర్థము వచ్చును. ప్రత్యక్షముగా నున్నదానిని ద్వేషించుట, పరోక్షముగా నున్నదానిని ప్రేమించుట అప్పుడప్పుడు లోకమున సహజముగా కానవచ్చును. గుప్తభాషిత మర్యాదతో అమ్మవారు కోరబడుచున్నదనగా కొందఱు పరోక్ష ప్రత్యక్ష రూపములతో నేదోయొకదానిని ప్రేమించుట, ద్వేషించుట లోక సహజము గావున అమ్మవారు ప్రియ అయినట్లు ద్వేష్యయనగుచున్నది. వాస్తవమున ఆమె స్వాత్మరూపిణిగా సర్వదా సర్వులచే ప్రేమింపఁబడుచునే యుండు ననుట ఇష్యసే పదము నుండి లభించు వ్యంగ్యార్థము.

**వైఖరీ హస్తినీ జ్ఞేయా స్థూలా యస్మాద్వరాననే**
**యయేదం ధార్యతే సర్వం బ్రహ్మాండ పరిమండలమ్**
**వర్గాష్టకే చ దేవేశి సూతే దిగ్గజ సంజ్ఞకమ్**
**తేనేయం కరిణీ ప్రోక్తా మధ్యమా శంఖినీ భవేత్**
**శంఖినీ తు యథాభద్రే విశుద్ధా పాపవర్జితా**
**సర్వదేవప్రియా సా హి శాన్తి సౌభాగ్య శోభితా**
**తథా వనస్పతి గతా మధ్యమా వాగ్వరాననే**
**చిత్రిణీ వల్లరీ దేవీ మహాదోష వినాశినీ**
**యస్యాః ఫలం వరారోహే శివశక్తిమయం సదా**



**శివశక్తిమయం దేవి ప్రాణిమాత్రం జగత్రయమ్**
**తేషు సర్వేషు పశ్యన్తీ జీవేషు పరమాశ్రయా**
**పరబ్రహ్మణి సంలీనా పరా వాక్పరమేశ్వరీ**
**తాం దూతీం తత్ర సంపూజ్య సమాధి కుసుమైశ్శుచిః**
**పద్మినీ తు పరాజ్ఞేయా హంసస్వచ్ఛన్దచారిణీ**
**హంసోద్వయేన పద్మం హి త్యక్త్వా సంకోచ మాదిజే**
**వికాసయతి సౌభాగ్యం తథా వస్తు ప్రకాశతః**
**పరా ప్రకాశయతి పద్మినీత్వమతో భవేత్**
**తస్యా దేహే వరారోహే కలాః పూజ్యాస్తు షోడశ**

(వైఖరి హస్తినీగా తెలియదగినది. అందువలన అది స్థూలమని చెప్పఁ బడును. విశ్వమంతయు దానిచే నింపఁబడియున్నది. దిగ్గజములను పేరుగల వర్గాష్టకమును ఇది సృజించును. అందుచే కరిణి (హస్తిని) అని చెప్పఁబడినది. మధ్యమా శంఖినియని చెప్పఁబడినది. ఇది సర్వదేవ ప్రియ పాప వివర్జిత శాన్తి సౌభాగ్య శోభిత, ఈ మధ్యమ వనస్పతిగతయై యుండును. చిత్రిణి వల్లరి దీని ఫలము శివశక్తిమయము. ఈ ఫలముతో పోల్చినపుడు జగమంతయు అణువంత విలువయు చేయదు. ఈ త్రివిధ వాక్కులందు పశ్యంతి జీవులలోని వరము నాశ్రయించియుండి పరబ్రహ్మయందు లీనమగును. పరబ్రహ్మయందు బాగుగా లీనయైన పరావాక్కు పరమేశ్వరియే. సమాధి కుసుమములతో దూతియైన ఆ పరను పూజించవలెను. పద్మినిగా తెలిసికొనఁదగిన ఆపర పద్మిని కావున హంసలస్వచ్ఛందచారము కలిగి యుండును. సంకోచమును విడచి ఆపర దూతి (జీవశివ) హంసద్వయము ప్రకాశించుచుండును. వస్తువుయొక్క యథార్థ ప్రకాశము వలన ఆ రెండు హంసల సౌభాగ్యమును పొందియున్నది గదా! ఆమె పద్మినీత్వము పర ప్రకాశ్యయగు చుండును. పద్మిని కలలవలె ఆమె కలలు పదాఱు పూజింపఁ దగినవి.) పై శ్లోకముల ననుసరించి చతుర్విధ వాక్కులు పద్మిన్యాది చతుర్విధ శృంగార నాయికలుగా అభేద భావనము చెప్పఁబడినదని స్పష్టమగును. శృంగారాభివ్యక్తితో కూడిన ఈ అభేద ప్రతిపాదనము అధోజగమున విహరించు ఆస్తికులకు ఉపాసనమందాసక్తి కలిగించుటయే ప్రయోజనముగా గలది అని గ్రహింపఁదగినది.



**(ద్వితీయ విమర్శ సమాప్తము)**

ద్వితీయ విమర్శాంతమున ఈ క్రింది శ్లోకము కనcబడుచున్నది.

**అవతారిక:–** పై శ్లోకమున అమ్మవారి ప్రకాశానంద చక్రపూజ్యత చెప్పcబడినది.

**శ్లో॥ ఆదిమాన్తిమ గృహీత వర్ణరా**
**జ్ఞ్యాత్మికాహమితి యా స్వతః ప్రథా।**
**మన్త్రవీర్యమితి సాధితాగమై**
**స్తన్మయో గురురసి త్వమమ్బికే॥** 75

**ప్రతిపదార్థము:–** అమ్బికే=అమ్మా, ఆదిమాన్తిమ గృహీతవర్ణరాజ్ఞ్యాత్మికా=మొదటి చివఱి వర్ణముల రాణియైన, అహమ్=అహమ్ అను, యా=ఏ, స్వతఃప్రథా=స్వయం ప్రకాశిక, ఆగమైః=ఆగమములలో, మన్త్రవీర్యమ్ ఇతి=మన్త్రవీర్యము అని, (యైః =ఎవరిచేత,) సాధితా=సాధింపcబడినదో, తన్మయాః=వారుగా ఉన్న, గురుః =గురువు, త్వమ్=నీవు, అసి=అగుదువు.

**తాత్పర్యము:–** మొదటి చివరి వర్ణములు కలిసి స్వయం ప్రకాశాత్మను బోధించు అహమ్ అను మంత్రము యొక్క వీర్యముగా ఏ గురువులు సాధించినారో ఆ గురుమూర్తిగానే ఆ అమ్మ ప్రకాశించుచున్నది.

**వివరణము:–** దివ్యచకోరిక ననుసరించి జ్ఞానక్రియదూతీయాగ సామరస్యమును సప్రమాణముగా నిరూపించి బ్రహ్మీనారాయణీ మాహేశ్వర్యాద్యక్షర సమామ్నాయ వ్యవహృత నవాక్షమాతృకకు సాధారణము ఐన అహమ్ యొక్క (రమా) కాలి యొక్క త్రిపుటి షధ్వ సప్తస్రోతాది వర్గ వర్ణస్వరూప క్రమ ప్రకాశమునందు ఆయా ప్రత్యాహార క్రమ సిద్ధ గౌరీమూర్తి మయమైన మన్త్రవీర్యమని చెప్పcబడిన శివశాక్త భేదము కూడ సాధించబడుచున్నదని ఈ శ్లోకమున చెప్పcబడుచున్నది.

ఆదిమాన్తిమ గృహీత వర్ణరాజ్ఞ్యాత్మికాహమ్– అ ఆదిగా, మకారము అన్తముగా గ్రహింపcబడిన అహమ్ అను వర్ణములచే గ్రహింపcబడిన ఆత్మ స్వయం ప్రకాశము. కావున ద్వితీయ పాదాంతమున స్వయం ప్రథా అని ప్రయోగింపcబడినది. శామ్భవ విసర్గ కార్య మకారావసానకమైన స్వతః గృహీత=గృహముగా చేసికొనcబడిన – అనగా అమ్మవారి మొదటి ఇల్లు 'అ' అను మంత్రము, చివరి ఇల్లు మకారము. ఈ అర్థము చెప్పcబడినందున పుట్టింటి నుండి భర్త యింటికి చేరిన రాణి వంటిది అమ్మవారు అని పై సమాసము వ్యంజించుచున్నది.



గృహమనగా వాగర్థ రూపొపాధి. ఆమెకు సంబంధము తాదాత్మ్యము. మొదట అమ్మవారు కలాస్వరూపిణిగా అనుత్తరాకార స్వరవర్గవర్ణాన్యతమ రూపము అనుట ఆదిమ పదార్థము. శాక్తవిసర్గబిన్దు ద్వయాత్మకమైన దానికి కార్యమైన **శ ష స హ** అను సూత్రమందలి శాంభవ విసర్గోపహితము సూత్రమందలి హకారముగాని అంతిమశబ్దార్థము.

వర్ణరాశికి (వర్ణములకు) అహమ్ ఆ గృహము. అక్షమంత గృహము.

మ కారము, హ కారము లేక నాద వ్యంజకము. అకారాది అం వరకు పంచదశి. అకారాది – అః పర షోడశి ఐన స్వరగతములు. ఆగమములు అనగా శాస్త్రములు. మన్త్రవీర్యమనగా స్వరూపముగా శాసించునది. గురువనగా గౌరీమూర్తివి నీవు. అమాకలాదులందు కాల నీదృక్ఛేదము తోడనే సిద్ధించును.

## ద్వితీయ విమర్శః సమాప్తః

**శ్రీః**



## శ్లోకానుక్రమణికా





# దోర్బల విశ్వనాథశర్మ గారి
## వ్యాఖ్యాన గ్రంథములు

1. మూకపంచశతి
   - a) ఆర్యాశతకమ్-సారోల్లాసినీ వ్యాఖ్యా - రూ. 25-00
   - b) కటాక్షశతకమ్-సారోల్లాసినీ వ్యాఖ్యా - 15-00
   - c) మందస్మితశతకమ్-సారోల్లాసినీ వ్యాఖ్యా - 15-00
   - d) స్తుతి శతకమ్-సారోల్లాసినీ వ్యాఖ్యా - 30-00
   - e) పాదారవిన్దశతకమ్-సారోల్లాసినీ వ్యాఖ్యా - 25-00
2. శివమీడేస్తవః-హర్షిణీ వ్యాఖ్యా - 8-00
3. శ్రీహలాయుధ శివస్తోత్రమ్-డమరుక వ్యాఖ్యా - 20-00
4. చణ్డీశతకమ్-ప్రసాదినీ వ్యాఖ్యా - 30-00
5. హరిమీడేస్తవః-మచర్చికా వ్యాఖ్యా - 20-00
6. పరశమ్భుమహిమ్నః స్తోత్రమ్-శివప్రియ వ్యాఖ్యా - 40-00
7. అమరుక శతకము-మనసిజ వ్యాఖ్యా - 20-00
8. శ్రీ సోమనాథ భాష్యమ్-పరిష్కరణ - 25-00
9. శ్రీ శివకర్ణామృతస్తోత్రమ్-1వ భాగము ఆస్వాదినీ వ్యాఖ్యా - 30-00
   శ్రీ శివకర్ణామృతస్తోత్రమ్-2వ భాగము ఆస్వాదినీ వ్యాఖ్యా - 30-00
   శ్రీ శివకర్ణామృతస్తోత్రమ్-3వ భాగము ఆస్వాదినీ వ్యాఖ్యా - 30-00
10. ఏకశ్లోకరామాయణమ్ - మోహనరూపావ్యాఖ్యా - 20-00
11. భాగవత చతుఃశ్లోకీ - మన్త్రవ్యాఖ్యా - 20-00
12. శ్రీ శివమహిమ్నః స్తోత్రమ్ - విభూతివ్యాఖ్యా - 15-00
13. **చిద్గగనచన్ద్రికా - విశ్వలహరీవ్యాఖ్యా**
    తృతీయ చతుర్థవిమర్శౌ - త్వరలో

SREEH

ONNAMASSIVAAYA

# CIDGAGANACANDRIKAA

**Mahaakavi Kaalidaasa Viracitaa**

**PRATHAMA DVITEEYA VIMARSAU**




**Viswalaharee Vyakhyaa**

**(Andhra Pratipadaartha Taatparya Viseshamulu)**

**Dorbala Viswanaathasarmaa**




**Publishers**

**SADHANA GRANDHA MANDALI, TENALI**


శ్రీః

ఓన్నమశ్శివాయ

# చిద్గగనచన్ద్రికా

మహాకవి కాళిదాస విరచితా

(ప్రథమ ద్వితీయ విమర్శౌ)




విశ్వలహరీ వ్యాఖ్యా

(ఆంధ్ర ప్రతిపదార్థ–తాత్పర్య–విశేషములు)

దోర్బల విశ్వనాథశర్మా




ప్రకాశకులు

సాధన గ్రంథ మండలి, తెనాలి